# లియొ టాల్‌స్టాయ్

# కోసక్కులు



"టాల్‌స్టాయ్ అంటే సమస్త ప్రపంచం... ఈ మనిషి నిజంగా గొప్ప పని చేశాడు: ఒక శతాబ్దపు అనుభవాన్నంతటినీ ఆయన సమీక్షించాడు. ఈ సమీక్షను ఆశ్చర్యకరమైన నిజాయితీతోనూ శక్తితోనూ సౌందర్యంతోనూ ప్రసాదించాడు."

మక్సీమ్ గోర్కీ

"....'కోసక్కులు' టాల్‌స్టాయ్ ఉత్తమ లాలిత్యభరిత నవల, ఆయన యౌవన గీతం, కాకసస్‌కి చెందిన కావ్యం. దేదీప్యమానమైన ఆకాశపు ఎదురుగా రూపుదాల్చిన హిమాన్విత పర్వతాల మహోన్నత సౌందర్యం నవలంతా నిండిపోతుంది. టాల్‌స్టాయ్ మేధ తొలిసారిగా పుష్పించిన సాటిలేని కృతి యిది."

రొమేన్ రొలాన్

అనువాదం: ఆర్వియార్

Л. Н. Толстой
КАЗАКИ
*На языке телугу*

L. Tolstoi
*The Cossacks*
In Telugu



సోవియట్ యూనియన్‌లో ముద్రింపబడింది

Т $\frac{70301-167}{031(01)-82}$ 711—82 4702010100

ИБ № 10496

# ముందుమాట

20వ శతాబ్దపు తొలిప్రాంతాల్లో లియో టాల్‌స్టాయ్‌తో పరిచయమైనప్పుడు ఆయన విస్తృత అంతర్జాతీయ సంబంధాలతోటీ, మహా రచయితగా వున్న బహుళ ప్రచారంతోటీ, ప్రఖ్యాతితోటీ, పలుకుబడితోటీ శ్రామిక రచయిత మక్సీమ్ గోర్కీ ముగ్ధుడయ్యాడు.

''ప్రపంచమంతా, భూఖండమంతా ఆయనకేసి చూస్తోంది! ప్రతి చోటునుంచీ – చైనానుంచి, ఇండియానుంచి, అమెరికానుంచి, జీవన నాడులు ఆయన్ని పెనవేసుకుని వున్నాయి. ఆయన ఆత్మ శాశ్వతంగా లందరికీ చెందుతుంది'' అని గోర్కీ రాశాడు.

టాల్‌స్టాయ్ నవలలు ''యుద్ధమూ – శాంతీ,'' ''ఆన్నా కరేనినా,'' ''రిసరెక్షన్'' ఆయనకి ప్రపంచపు గుర్తింపునీ, ప్రఖ్యాతినీ తెచ్చాయి.

''యీయన అద్భుతమైన అనంత వైవిధ్యపూరితుడు'' అని గోర్కీ ఆయన్ని గురించి రాసిందేమీ యాదృచ్ఛికంగా కాదు. టాల్‌స్టాయ్‌ని నవలా రచయితగానే కాకుండా, కథకుడుగా, నాటక రచయితగా, ప్రచారకునిగా కళాసాహిత్య విమర్శకునిగా, పిల్లల రచయితగా బోధకునిగా, అన్నిటినీ మించి వ్యక్తిగా జీవించి కృషిచేసిన మహనీయునిగా మనం దృష్టిలో వుంచుకోవాలి. తత్వశాస్త్ర, సాంఘికశాస్త్ర, చారిత్రక, న్యాయ శాస్త్ర, సౌందర్యశాస్త్ర, నీతిశాస్త్ర తదితర జ్ఞానరంగాల సమస్యల పట్ల ఆయన నిరంతర ఆసక్తి కనబరచేవాడు.

టాల్‌స్టాయ్ తన నిజమైన నాయకుడు గతంలోనూ, యిప్పుడూ, రాబోయే కాలంలోనూ కూడా సత్యమేనని తన తొలి రచనల్లో చాటి, తన ముఖ్య కర్తవ్యం జీవితాన్ని సత్యపూరితంగా వర్ణించడమేనని భావించాడు.

వాస్తవానికి సన్నిహితంగా వుండే, ప్రజలకి నూతనమైన ప్రధాన మైనదేదో వెల్లడి చేసే సమకాలీన కళే సర్వదా నిజమైన కళ అని ఆయన విశ్వసించాడు. కళ ప్రజలకి జీవితాన్ని ''చూడ్డం, అర్థం చేసుకోవడం, అనుభూతం చేసుకోవడం'' బోధిస్తుంది. అందుకనే, దానికి సంసిద్ధం చెయ్యడం కోసమే కళాకారుడు జీవితాన్ని గురించి గాఢంగా తెలుసుకుని వుండాల్సింది. వాస్తవానికి విధేయంగా వుండాలంటే కళాకారుడు ''తను చూసిందీ, అనుభవించిందీ మాత్రమే'' వర్ణించాలని ఆయన విశ్వసించాడు.

''కోసక్కులు'' (1863) నవల టాల్‌స్టాయ్ వ్యక్తిగత అనుభవం మీద ఆధారపడింది.

1851లో యిరవై రెండు సంవత్సరాల వయసున్న టాల్‌స్టాయ్ తన అన్న నికొలాయ్‌తో కాకసస్‌కి వచ్చాడు. స్తారొగ్లదోవ్‌స్కయా కోసక్ గ్రామంలో, పర్వతాలలో పుట్టిన టెరెక్ నది యెడమ ఒడ్డున, నికొలాయ్ ఆఫీసరుగా పని చేసిన ఫిరంగి దళం యుద్ధశ్రేణి చేరింది.

టాల్‌స్టాయ్ స్తారొగ్లదోవ్‌స్కయా గ్రామంలో దాదాపు మూడేళ్లు వున్నాడు. కాకసస్‌కి తన ధైర్యాన్ని పరీక్షించుకోడానికీ, యుద్ధమంటే స్వయంగా చూడ్డానికీ ఆయన వచ్చాడు. అలా అని టాల్‌స్టాయ్ తనే చెప్పుకున్నాడు.

కాకసస్‌కి వున్న ఘనమైన ప్రకృతీ, దీనికి సంపూర్ణ అనుసారంగా జీవిస్తున్న కోసక్కులూ భూబానిసత్వపీడన యెరుగని, సాహసికులైన స్వేచ్ఛా పిపాసగల, సౌందర్యవంతులైన ప్రజలు – అదీ స్తారొగ్లదోవ్

స్కయా గ్రామానికి వచ్చిన యువ టాల్‌స్టాయ్‌ని సమ్మోహితుణ్ణి చేసింది.

"కోసక్కులు" నవల నాయకుడు ద్మిత్రి ఒలేనిన్ యువ కులీనుడు, బహు విధాలుగా రచయిత స్వీయజీవిత ప్రతిబింబం. అతను ప్రభువం శీకుల సమాజాన్ని విమర్శించి నిందించడమే కాదు, సామాన్య జనానికి చేరువగావడానికీ, వాళ్లల్లా బతకడానికీ, ఆ సమాజంతో తెగతెంపులు చేసుకోడానిక్కూడా అతను సంసిద్ధుడే.

కాని ఆ కోసక్ గ్రామం ఒలేనిన్‌ని కలుపుకోలేదు. అతను పరాయి వాడుగా పరదేశిగానే వుండిపోయాడు. నవలా నాయకుడు రచయిత తోటి యీ విషయంలో యెక్కువగా విభేదించాడని చెప్పాలి. రచయిత ఆ గ్రామస్థులతోటి చాలా చక్కని సంబంధాలు పెట్టుకున్నాడు. ఆయన స్తారోగ్లదోవ్స్కయాలో గడిపిన కాలాన్ని వాళ్లు చాలా కాలం మరిచిపోలేదు.

తనకి కాకసస్ జీవిత సౌతశాల అని ఆనాటి ఒక ఉత్తరంలో టాల్‌స్టాయ్ రాశాడు. తన సైనికోద్యోగాన్ని మరోచోట కొనసాగించ డానికి వెడుతూ ఆయన తన "డైరీ"లో రాసుకున్నాడు: "నేను కాకసస్‌ని ప్రేమించ నారంభించాను... చాలా గాఢంగా. యీ నేల చాలా మంచిది. వింత కవితాత్మక ధోరణిలో యిది రెండు బహువిరుద్ధమైన వాటిని మిళితం చేసుకుంది – యుద్ధమూ, స్వాతంత్ర్యమూ."

తన నూతన పరిచయాలంటే టాల్‌స్టాయ్ యెంత యిష్టపడ్డా డంటే వాటిని గురించి ఒక కావ్యం రాద్దామనుకున్నాడు. కాని యెన్నో కవితాత్మక రూపాలూ, కొన్ని పాత పాటలూ ప్రవేశపెట్టి వచనానికే మారాడు.

టాల్‌స్టాయ్ తొలి సృజనాత్మక యత్నంలో "కోసక్కులు" స్థానాన్ని ఎంచుతూ రొమేన్ రొలాన్ యిలా రాశాడు:

"'కోసక్కులు' టాల్‌స్టాయ్ ఉత్తమ లాలిత్య భరితమైన నవల,

ఆయన యౌవన గీతం, కాకసస్‌కి చెందిన కావ్యం. జేగీయ మానమైన ఆకాశపు టెదురుగా రూపుదాల్చిన హిమాన్విత పర్వతాల మహోన్నత సౌందర్యం నవలంతా నిండిపోతుంది. టాల్‌స్టాయ్ మేధ తొలిసారిగా పుష్పించిన సాటిలేని కృతి యింది.''

కె. ఎస్. లోమునోవ్



# కోసక్కులు

1852 నాటి

కాకేసియన్ నవల

1

మాస్కో సద్దుమణిగింది. ఆ శీతాకాలపు వీధుల్లో చాలా అరుదుగా చక్రాల చప్పుడు వినిపిస్తుంది. కిటికీల్లో దీపాలూ లేవు, వీధి లాంతర్లూ లేవు. జోగుతూ వుండే నగరంమీదికి చర్చి గోపురాల గంటల చప్పుడు తెల్లవారిందని గుర్తుచేస్తూ వస్తోంది. వీధులు ఖాళీగా వున్నాయి. అడపాదడపా ఆ యిసుకనీ, యిసుకతో కలిసే మంచునీ దున్నుకుంటూ పోయేది ఓ స్లెడ్జిబండి. ఆ తోలేవాడు వీధిమొగ చేరగానే యింకో బేరంకోసం చూస్తూ కునుకు తీస్తాడు. ఓ ముసలావిడ చర్చికి పోతూ అలా వెడుతుంది. చర్చిలో ఓ పద్ధతి లేకుండా పేర్చిన కొవ్వొత్తులు అప్పటికే యెర్రగా వెలుగుతూ వుంటాయి. ఆ కాంతి అక్కడి బొమ్మల బంగారుపూత చట్రాలమీద ప్రతిఫలిస్తూ వుంటుంది. శీతాకాలపు దీర్ఘ రాత్రి గడిచాక పనివాళ్లు అప్పటికే లేచి పనుల్లోకి పోతున్నారు.

కాని పెద్దమనుషులకి మాత్రం అది యింకా సాయంత్రమే.

షెవల్యే రెస్టారెంట్ కంతల్లోంచి దీపాలు — యీ వేళప్పుడు చట్టసమ్మతం కాకపోయినా — యింకా కనిపిస్తూనే వున్నాయి. గుమ్మం దగ్గర ఓ బండీ, కొన్ని స్లెడ్జి బళ్లూ ఒకదాని దగ్గరగా ఒకటి

వున్నాయి. మూడు గుర్రాల మజిలీస్లెడ్జ్ కూడా ఒకటి వుంది. ఆ వాకిలి కావలివాడు చలికి ముడుచుకుపోయి, కప్పేసుకుని యింటిమూల వెనక నక్కినట్టు వుంది.

''యేమిటీ సోది అంతా'' అనుకున్నాడు వెయిటర్, ముఖమంతా పీక్కుపోయి, హాల్లో కూర్చుని. ''నేను పనిలో వున్నప్పుడెప్పుడూ యిలాగే యేడుస్తుంది.''

ఆనుకుని వున్న గదిలో కాంతివంతంగా దీపాలు వెలుగుతున్నాయి. అక్కణ్ణుంచి ముగ్గురు యువకుల గొంతుకలు వినిపిస్తున్నాయి. ఆ గదిలోని బల్లమీద రాత్రిభోజనం, వైన్ అవశేషాలు వున్నాయి. చక్కగా దుస్తులు వేసుకున్న పొట్టి సాదా మనిషి ఒకడు నిష్క్రమించడానికి తయారుగా వున్న తన మిత్రుని కేసి దయాన్వితమైన అలిసిపోయిన కళ్లతో చూస్తూ కూర్చున్నాడు. పొడగరి అయిన యింకొకడు, తన గడియారం 'కీ'తో ఆడుకుంటూ బల్ల పక్క సోఫామీద పడుకున్నాడు. ఆ బల్లమీద ఖాళీ సీసాలు వున్నాయి. కొత్త గొర్రెతోలు కోటు తొడుక్కున్న మూడోవాడు అటూ యిటూ పచారుచేస్తూ వున్నాడు. జాగ్రత్తగా గోళ్లు శుభ్రంచేసిన, గట్టిగా మందంగా వున్న తన వేళ్ల మధ్య, బాదం కాయలని బద్దలుకొట్టడానికి మధ్యమధ్యన ఆగుతూవున్నాడు. దేనికేసో అస్తమానూ చిరునవ్వు నవ్వుతూనే వున్నాడు. అతని ముఖమూ కళ్ళూ కళకళ లాడుతున్నాయి. ఆవేశంతో మాట్లాడుతూ చేతులూ తలా ఆడిస్తూనే వున్నాడు. కాని అతననుకున్న మాటలురావడం లేదని తెలుస్తూనే వుంది. ఆ వచ్చే మాటలేనా అతని మనసులో వున్నదంతా చెప్పడానికి చాలటంలేదు.

''సరే, యిప్పుడు చెప్పెయ్యగలను,'' అన్నాడా ప్రయాణీకుడు. ''నన్ను నేను సమర్ధించుకోవడం లేదు. కాని నువ్వు కనీసం నన్ను నేను అర్థం చేసుకున్నట్టు అర్థం చేసుకోవాలనీ, ఆ సంగతిని మామూలు మనుషుల్లాగా చవకబారుగా, అసభ్యంగా చూడవద్దనీ కోరుతున్నాను.

నేనామెను సరిగా చూడలేదంటావా?'' తనకేసి దయాన్వితమైన కళ్లతో చూస్తూ వున్న మనిషికేసి తిరిగి అన్నాడతను.

''ఆఁ! నీదే తప్పు,'' అన్నాడా రెండో మనిషి, అతని చూపు యింకా దయగా, యింకా అలిసిపోయినట్టు వుంది.

''అలా యెందుకంటున్నావో నాకు తెలుసు,'' ఆ ప్రయాణీకుడు అన్నాడు. ''ప్రేమించబడ్డం ప్రేమించడమంత ఆనందకరమైన సంగతే నని, దాన్ని ఒకసారి సాధిస్తే యావజ్జీవిత కాలానికీ అది తృప్తి నిస్తుందనీ అనుకుంటున్నావు నువ్వు.''

''అవును, నాయనా, అది తృప్తినిస్తుంది, అంతకంటే యెక్కువే యిస్తుంది'' ఆ పొట్టి సాదా మనిషి కళ్లు చికిలిస్తూ అన్నాడు.

''ఒక మనిషి ప్రేమించడం కూడా యెందుకు చెయ్యకూడదు?'' తన మిత్రుడికేసి జాలిగా చూస్తున్నట్టు చూస్తూ సాలోచనగా అన్నాడా ప్రయాణీకుడు. ''ఒకడు యెందుకు ప్రేమించకూడదు? ప్రేమ రాదు. అబ్బే, ప్రేమించబడ్డం దురదృష్టం. దురదృష్టం యెందుకంటే నువ్వు పొందినదాన్ని తిరిగి యివ్వనప్పుడూ, యివ్వలేనప్పుడూ నువ్వు తప్పు చేసినట్టు బాధపడతావు. ఓరి భగవంతుడా'' అని అతను చెయ్యి వూపాడు. ''యివన్నీ హేతుబద్ధంగా జరిగితే యెంత బాగుంటుంది! కాని యిదంతా తలకిందులుగా వుంటుంది, మనమీద ఆధారపడదు. దానికి యెలాతోస్తే అలా వస్తుంది. అక్కడికి నేనా ప్రేమను దొంగిలించినట్టు! నువ్వూ అలాగే అనుకుంటున్నావు. కాదనద్దు, నువ్వలాగే అనుకుంటూ వుండాలి! కాని నేను నా జీవితంలో చేసిన చాలా తెలివితక్కువ, అసహ్యకరమైన వాటన్నింటిలోకీ, నేను పశ్చాత్తాప పడనిదీ, పడలేనిదీ యిదొకటి అంటే నువ్వు నమ్ముతావా? అది మొదలైనప్పుడు గాని, ఆతర్వాత గాని నేను ఆమెని మోసంచెయ్య లేదు, నన్ను మోసం చేసుకోలేదు. ఆఖరికి నాకూ ప్రేమ కలిగిందను కున్నానంతే; ఆతర్వాత నాకు తెలియకుండానే నన్ను నేను మోసం

చేసుకుంటున్నానని గ్రహించాను. అలా ప్రేమించడం అసాధ్యం అని గ్రహించాను. ఆతర్వాత ప్రేమించలేకపోయాను, కాని ఆమె ప్రేమిస్తూనే వుంది. నేను ప్రేమించలేకపోవడం నా తప్పా, నేనేం చెయ్యాలి?''

''సరే, యేమైతేనేం, అదంతా అయిపోయిందిప్పుడు!'' అన్నాడతని మిత్రుడు, మెలుకువగా వుండటానికి చుట్ట ముట్టిస్తూ. ''యింతకీ నువ్వెప్పుడూ ప్రేమించలేదు, ప్రేమంటే యేమిటో నీకు తెలీదు!''

గొర్రెతోలు కోటు తొడుకున్న మనిషి మళ్లీ మాట్లాడబోయి తలమీద చేతులు పెట్టుకున్నాడు. కాని యేం చెప్పదలుచుకున్నాడో చెప్పలేకపోయాడు.

''యెన్నడూ ప్రేమించలేదూ!... అవును పూర్తిగా నిజమే. నేనెప్పుడూ ప్రేమించలేదు! కాని యేమైనా నాకు ప్రేమించాలనే కోరిక వుంది. అంతకంటే బలమైన కోరిక యేదీ వుండబోదు! కాని, అయితే, అసలు అలాంటి ప్రేమ వుంటుందా? యెప్పటికీ అసంపూర్తిగా యేదో వుండిపోతుంది. ఆఁ, సరే! మాట్లాడ్డంవల్ల యేమిటి లాభం! నేను బతుకంతా కంపుచేసుకున్నాను! కాని యేమైనా అదంతా అయిపోయిందిప్పుడు; నువ్వన్నదే పూర్తిగా నిజం. ఒక కొత్త జీవితం ఆరంభిస్తున్నట్టుగా వుంది నాకు.''

''మళ్లీ దాన్నీ కంపుచేస్తావ్ నువ్వు'' సోఫామీద గడియారం 'కీ'తో ఆడుకుంటూ పడుకున్న మనిషి అన్నాడు. కాని బాటసారి అతను చెప్పింది వినలేదు.

''నాకు బాధగా వుంది, అయినా వెళ్లిపోడానికి సంతోషంగా వుంది. యెందుకు బాధగా వుందో నాకు తెలియదు'' అన్నాడతను.

ప్రయాణీకుడు తనని గురించి మాట్లాడుకుంటూ పోతూనే వున్నాడు, అది అతనికి ఆసక్తికరంగా వున్నంతగా వాళ్లకి లేదని గమనించకుండానే. ఆవేశంలో వున్నప్పుడున్నంత అహంభావం మనిషికి మరెప్పుడూ వుండదు. అలాంటి సందర్భాల్లో భూమ్మీద యేదీ తనకంటే అద్భుతమైందీ, ఆసక్తికరమైందీ లేనట్లే అతని కనిపిస్తుంది.

"ద్మీత్రియ్ అంద్రేయెవిచ్! బండివాడు యిక ఆగడు!" గ్రేతోలు కోటు తొడుక్కుని, తలకి రుమాలు చుట్టుకున్న పడుచు పరిచారకుడొకడు గదిలోకి వస్తూ అన్నాడు. "గుర్రాలు పదకొండు గంటలనుంచీ నుంచునే వున్నాయి. యిప్పుడు నాలుగైంది."

ద్మీత్రియ్ అంద్రేయెవిచ్ తన సేవకుడు వస్యూష కేసి చూశాడు. వస్యూష తలనున్న రుమాలూ, అతని కంబళీ, బొచ్చు బూటులూ, నిద్ర మగతగా వున్న ముఖమూ, తన యజమానిని ఒక కొత్త శ్రమా, కష్టమూ, చురుకుదనమూ గల జీవితానికి ఆహ్వానిస్తున్నట్టుగా వున్నాయి.

"నిజమే, సెలవ్" అన్నాడతను, పెట్టుకోకుండా వదిలేసిన కోటు కొక్కెంకోసం తడుముకుంటూ.

బండివాడికి యింకొంచెం ముట్టచెప్పచ్చులే అని సలహా యిచ్చినా, అతను టోపీ పెట్టుకుని గదిమధ్యలో నుంచున్నాడు. స్నేహితులంతా ఒకసారి ముద్దుపెట్టుకున్నారు, మరోక సారి ముద్దు పెట్టుకున్నారు, యింకో క్షణం ఆగి మళ్లీ ముద్దుపెట్టుకున్నారు. ప్రయాణీకుడు బల్ల దగ్గరికి వెళ్ళాడు. యింకో గ్లాసు ఖాళీచేశాడు. అప్పుడు ఆ పొట్టి సాదా మనిషి చెయ్యి పట్టుకుని సిగ్గుపడిపోయాడు.

"బాగుంది, అయినా నేను మనసు విప్పి మాట్లాడతాను... నీతో తప్పకుండా నిర్మొహమాటంగా వుంటాను, యెందుకంటే నువ్వంటే నాకు యిష్టం. నువ్వు ఆమెని ప్రేమిస్తున్నావు — నేనెప్పుడూ అలా అనుకునేవాణ్ణి — నువ్వు ప్రేమించడంలేదా?"

"వూఁ" అన్నాడతను యింకా సుకుమారంగా చిరునవ్వు నవ్వుతూనే.

"అయితే...."

"మీరేం అనుకోకపోతే సర్, దీపాలు ఆర్పెయ్యమని నాకు పురమాయింపు వచ్చిందండీ" అన్నాడు నిద్రమత్తు వెయిటర్. అతను సంభాషణలోని ఆఖరు ముక్క విన్నాడు. పెద్దమనుషులు యెప్పుడూ అదే అదే పదేపదే మాట్లాడుకుంటారేమా అని విస్తుపోతూ విన్నాడు.

''నేను బిల్లు యెవరి పేర రాయనండీ? మీ పేరా, సర్'' అన్నాడ తను యెవర్ని సంబోధించాలో తెలిసినట్టుగా, పొడుగాటతని కేసి తిరుగుతూ.

''ఆఁ, యెంత?'' అన్నాడు పొడుగాటి మనిషి.

''యిరవై ఆరు రూబుళ్లండి.''

పొడుగాటి మనిషి ఒక క్షణం ఆలోచించాడు. కాని యేం అన్లేదు. బిల్లు జేబులో పెట్టుకున్నాడు.

మిగిలిన యిద్దరూ మాట్లాడుకుంటూనే వున్నారు.

''సెలవ్, నువ్వు గొప్పవాడివి'' అన్నాడు పొట్టి పొదా మనిషి శాంతమైన కళ్లతో.

యిద్దరి కళ్లల్లోనూ నీళ్లు తిరిగాయి. వాళ్లు గుమ్మంలోకి వచ్చారు.

''ఓ, సరేగాని'' అన్నాడు ప్రయాణీకుడు సిగ్గుపడుతూ పొడుగాటి మనిషి కేసి తిరిగి. ''నువ్వు షెవల్యే బిల్లు చెల్లించేసి, నాకు రాసి తెలియపరుస్తావా?''

''సరవాలేదు, సరవాలేదు'' అన్నాడు పొడుగాటి మనిషి, చేతి తొడుగులు పైకి లాక్కుంటూ. ''నువ్వంటే నాకెంత అసూయ!'' గుమ్మం దాటి వాళ్లు బయటికి రాగానే హఠాత్తుగా అన్నాడు.

ప్రయాణీకుడు తన స్లెడ్జి బండి యెక్కాడు. కోటు కప్పుకున్నాడు. ''సరే, రా, అయితే!'' అన్నాడు స్లెడ్జి బండిలో, తనని చూసి అసూయపడుతున్నానన్న వాడికి చోటు చెయ్యడానికి, కొంచెం జరిగాడు కూడానూ. అతని కంఠం వణికింది.

''సెలవ్, మిత్రా! దేవుడి దయవల్ల నువ్వు....'' అన్నాడా పొడగరి. కాని అతడి ఒక్క కోరికా యేమిటంటే అవతలివాడు తొందరగా వెళ్లిపోవాలని, అంచేత అతను వాక్యం పూర్తిచెయ్యలేదు.

వాళ్లు ఒక నిముషం నిశ్శబ్దంగా వున్నారు. అప్పుడు యెవరో

అన్నారు "సెంప్" అని. ఓ గొంతుక అరిచింది: "పోనీ." బండివాడు గుర్రాల్ని అదిలించాడు.

"పోనియ్, ఎలిజార్" స్నేహితుల్లో ఒకడు కేకేశాడు. బండివాడూ, స్లెడ్జ్ తోలేవాళ్లూ తోలడం మొదలెట్టారు, "క్చ్, క్చ్" మని రెక్క వేసి నాలికలు మడతపెట్టి అరుస్తూ, కళ్లేలు లాగుతూ. చలికి బిగిసిపోయిన చక్రాలు మంచుమీద కిర్రుమని చప్పుడు చేశాయి.

"భలేవాడు, ఆ ఒలేనిన్. కాని యేం ఆలోచన కాకసస్‌కి కేడెట్‌గా వెళ్లడం! యేం యిస్తే వెళతాన్నేను..." అన్నాడు మిత్రుల్లో ఒకడు. "రేపు క్లబ్‌లో భోంచేస్తావా?" అని అడిగాడు.

"వూఁ!"

వాళ్లు విడిపోయారు.

ప్రయాణీకునికి వెచ్చగా అనిపించింది. బొచ్చుకోటు మరీ వేడిగా వున్నట్టనిపించింది. స్లెడ్జి బండి కింద భాగంలో కూర్చుని కోటు వదులుచేసుకున్నాడు. మూడు బొచ్చు గుర్రాలు ఒక చీకటి వీధిలో నుంచి యింకో చీకటి వీధిలోకి, అతను ముందెప్పుడూ చూసి యెరగని యిళ్లని దాటుకుంటూ, బండిని లాక్కుపోయాయి. దూరపు ప్రయాణాలు చేసే వాళ్లే ఆ వీధుల గుండా వెడతారేమో ననిపించింది ఒలేనిన్‌కి. చుట్టూతా అంతా చీకటిగా, నిశ్శబ్దంగా, జడంగా వుంది. కాని అతని గుండె నిండా జ్ఞాపకాలు, ప్రేమ, విచారం, అణిచిపెట్టుకున్న కన్నీళ్ల మధురానుభూతి.

## 2

"నాకు వాళ్లంటే యిష్టం, చాలా యిష్టం.... భలేవాళ్లు!... బాగుంది!" మళ్లీ మళ్లీ అనుకుంటూనే వున్నాడతను. యేడుపు తెచ్చుకోడానికి తయారయాడు. కాని తను యెందుకు యేడవాలను

కున్నాడో, ఆ భలేవాళ్లెవరో, యెవరంటే తనకంత యిష్టమో — అతనికి పూర్తిగా తెలీదు. అడపాదడపా ఓ యింటి కేసి చూసేవాడు. దాన్నెందుకు చిత్రంగా కట్టేరోనని విస్తుపోయేవాడు. తన కంటే యెంతో తేడాగా వున్న బండివాడూ, పన్యూషా అంతదగ్గరగా కూర్చు న్నారెందుకోననీ, వాళ్లకీ, తనతోబాటుగా ఆ బిగిసిపోయిన దారిలో పక్క గుర్రాల లాగుడికి కుదుపూ హైరానా యెందుకోననీ ఆశ్చర్య పోయేవాడు కాసేపు. ''భలే.... చాలా యిష్టం! బాగుంది.... భేషుగ్గా వుంది'' యింకోసారి అనుకున్నాడు కూడానూ. అలా యెందుకన్నానా అని ఆశ్చర్యపోయాడు. ''తస్సాగొయ్యా, నేను బాగా తాగానేమిటి?'' ఓ జత వైన్ సీసాలు తాగాడతను. కాని ఒలేనిన్ మీద యీ ప్రభావం చూపించింది ఆ వైన్ ఒకటే కాదు. అతని ప్రయాణమప్పుడు ఆత్మీయంగా, సిగ్గుగా (అతను నమ్మినట్టు) అప్రయత్నంగా తనకి చెప్పిన స్నేహపూర్వకమైన మాటలన్నీ జ్ఞాపకం చేసుకున్నాడు. కరచాల నాలూ, చూపులూ, నిశ్శబ్ద క్షణాలూ, అతను బండి యెక్కినప్పుడు ''సెలవ్, మిత్యా'' అన్న కంఠధ్వనీ గుర్తుచేసుకున్నాడు. తన ఉద్దేశ పూర్వక నిష్కాపట్యం గుర్తుచేసుకున్నాడు. అదంతా కూడా అతన్ని కదిలించే సందర్భంగానే వుంది. మిత్రులూ బంధువులూనే కాదు, తనంటే ఉదాసీనంగా వుండేవాళ్లే కాదు, తనంటే యిష్టపడని వాళ్లు కూడా తన ప్రయాణమప్పుడు తనంటే యిష్టం కలవాళ్లైనట్టూ, తనని క్షమించడానికి అంగీకరించినట్టూ కనిపించింది, చనిపోయేటప్పుడు గాని, పాపనివేదనం చేసేటప్పుడు గాని మనుషులు చేసినట్టు. ''బహుశా కాకసస్‌నుండి నేను తిరిగి రాను'' అనుకున్నాడు. తన స్నేహితుల్నీ, వాళ్లతోబాటుగా యింకోకళ్లనీ ప్రేమించినట్టనిపించింది. తన కోసమే అతను బాధపడ్డాడు. అతని హృదయాన్ని అంత కదిలించేసి, పైకెత్తేసి అలవాటు మానసిక స్థితికి తీసుకురావడానికీ, తత్ఫలితంగా వాటంతటవే పెదాలమీదకి పొంగివస్తున్న అర్థరహితమైన మాటలు అతను అణుచు

కోలేకపోవడానికి కారణం తన స్నేహితులపట్ల ప్రేమ కాదు; ఒక స్త్రీపట్ల ప్రేమా కాదు (అతనింతవరకూ ప్రేమించనే లేదు). తనపట్ల ప్రేమే, తన మనసులో వున్న మంచి అంతటికీ (ఆ క్షణంలో అతనికి అనిపించింది తన మనసులో మంచితప్ప యింకేమీ లేదని) పూర్తి ఆశావహమైన ప్రేమ, గాఢమైన యౌవన ప్రేమ అతన్ని యేడవడానికీ, పొంతన లేని మాటలు గొణగడానికీ ఒత్తిడి చేసింది.

యూనివర్సిటీ చదువు పూర్తిచెయ్యని యువకుడు ఒలేనిన్. యెక్కడా పనిచెయ్యలేదు (ప్రభుత్వ కార్యాలయంలోనో, యెక్కడో వొక నామ మాత్రపు ఉద్యోగం మాత్రమే వుంది). తన ఐశ్వర్యంలో సగం దుబారా చేసేశాడు. యేమీ చెయ్యకుండానే చివరకు యే వృత్తీ యెంచుకోకుండానే యిరవై నాలుగేళ్లు వచ్చేశాయి. మాస్కో సంఘంలో "యువకుడు" అని పిలిచేలాంటివాడు అతను.

చిన్నతనంలో తల్లిదండ్రులని పోగొట్టుకున్న 1840ం నాటి ధనిక రష్యన్ యువకులు మాత్రమే వుండగలిగినట్టుగా, అతను పద్దెనిమిదవ యేటనే స్వేచ్ఛాయుతుడు అయ్యాడు. భౌతికమైనవిగాని, నైతికమైనవి గాని యే బంధనాలూ అతనికి లేవు. యిష్టం వచ్చినట్టు చెయ్య గలిగాడు, అతనికి అవసరమైంది యేదీ లేదు. అతను దేనికీ కట్టుబడిందీ లేదు. కుటుంబంగాని, పితృదేశంగాని, మతంగాని, కొరతగాని అతనికి లేవు. దేన్నీ అతను నమ్మలేదు, దేన్నీ అంగీకరించలేదు. దేన్నీ అతను నమ్మకపోయినా అతను చిరుబుర్రులాడే యువకుడూ కాదు, లేకపోతే సుఖాలంటే వెక్కసమైనవాడూ కాదు, చికాకు పుట్టించేవాడూ కాదు. కాని తద్భిన్నంగా అస్తమానూ యేదో ఒక ప్రభావానికి లొంగిపోతూనే వుండేవాడు. ప్రేమ అనేది యేదీ లేదనే నిర్ణయానికి అతను వచ్చేశాడు కాని ఆకర్షణీయంగా వుండే పడుచు పిల్ల కనబడితే అతని హృదయం పొంగిపోయేది. గౌరవాలూ, అధికారాలూ చెత్తవని యెప్పుడో తెలుసు కున్నాడు. అయినా విందునాట్యాలు జరిగినప్పుడు సెర్గేయ్ రాకు

మారుడు నచ్చి మంచిగా, మర్యాదగా మాట్లాడితే సంబరపడకుండా వుండలేకపోయేవాడు. కాని తన స్వేచ్ఛకి పరిమితులు కలిగించనంతవరకూ మాత్రమే క్షణికమైన ఉద్రేకాలకి లొంగిపోయేవాడు. దేని ప్రభావానికేనా లొంగిపోయీ పోగానే శ్రమా, జీవితంలోని క్షుద్రమైన యాతనా, దానిద్వారా కలుగుతాయని గుర్తువచ్చేది. తనను ఆకర్షించిన ఆ అనుభూతినుంచీ, ఆచరణనుంచీ విముక్తుడవడానికీ, స్వేచ్ఛని తిరిగి పొందడానికీ అప్రయత్నంగానే త్వరపడేవాడు. ఆ రకంగా సాంఘిక జీవితంతోటీ, ఉద్యోగంతోటీ, వ్యవసాయంతోటీ, సంగీతంతోటీ — దానికి ఒకప్పుడు జీవితం ధారపోద్దామనుకునేవాడు — ఆఖరికి తను విశ్వసించని స్త్రీల ప్రేమలతోటీ ప్రయోగాలు చేశాడు. జీవితంలో ఒకసారే లభించే యువశక్తిని, మేధాశక్తికాదు, అనుభూతికాదు, విద్యకాదు, కాని మానవుడు తన యిష్టంవచ్చినట్లు తనని తను తయారుచేసుకునే శక్తినిచ్చే — ఆ మాటకొస్తే అతనికలా అనిపించేది — యీ విశ్వాన్నే తన యిష్టం వచ్చినట్లు తయారుచేసే శక్తినిచ్చే ఆకస్మికమైన ఉరవడిని దేనికి అంకితం చెయ్యాలా అని అతను ఆలోచన చేసేవాడు: అది కళకా, శాస్త్రానికా, స్త్రీ ప్రేమకా, లేకపోతే ఉపయోగంలోకి వచ్చే కార్యాచరణకా? చాలా మంది యీ ప్రేరణ లేకుండా వుంటారు, నిజమే. జీవితంలో అడుగెట్టగానే వచ్చిన మొదటి కాడికింద మెడలు పెట్టేస్తారు, యిక జీవితాంతం దానికిందే నీతిగా శ్రమిస్తారు. కాని ఒలేనిన్ ఆ సర్వశక్తివంతుడైన యౌవనదేవుడి ఉనికిని, ఒక కాంక్షగా, భావంగా పూర్తిగా మారిపోవాలనే ఆ సామర్థ్యాన్ని, కోరుకుని చెయ్యాలనే ఆ సామర్థ్యపు ఉనికిని, యెందుకో యెక్కడికో తెలియకుండానే అడుగందని అగాధంలోకి దుడుగ్గా పడిపోవాలనే సామర్థ్యపు ఉనికిని యెంతో గాఢంగా గుర్తించాడు. ఆ గుర్తింపుని తనలోనే వుంచుకున్నాడు, దాన్ని గురించి గర్వపడేవాడు. దాన్ని తెలుసుకోకుండానే దాని ద్వారా ఆనందం పొందాడు. ఆ క్షణం దాకా తనకి తనంటేనే యెంతో ప్రేమ, అలా ప్రేమించు

కోకుండా వుండలేకపోయాడు. యెందుకంటే తన వల్ల మంచి తప్ప యేమీ జరగదని అతని నమ్మకం. ఆశాభంగం చెందడానికి అతనికి అవకాశమూ రాలేదు. గత దోషాలని గుర్తించిన యువకునిలాగా అది అసలైంది కాదనీ, ముందు జరిగిపోయిందంతా యాదృచ్ఛికమూ, అముఖ్యమూననీ, అప్పటి దాకా నిజంగా జీవించడానికి తను ప్రయత్నించలేదు, కాని, యిప్పుడు, మాస్కోనుంచి తన నిష్క్రమణంతోటి ఒక కొత్త జీవితం ఆరంభమౌతోంది — గతకాలపు దోషాలూ, పశ్చాత్తాపాలూ లేని, బహుశా ఆనందం తప్ప మరేమీ వుండబోని జీవితం ఆరంభమౌతోందని అనుకునే సంతోషకరమైన మానసిక స్థితిలో మాస్కో వదలగానే వున్నాడతను.

దూరప్రయాణాల్లో యెప్పుడూ యిలాగే వుంటుంది. మొదటి రెండు మూడు మజిలీలూ దాటేదాకా వదిలిపెట్టివచ్చిన స్థలాన్ని గురించే వూహలు సాగుతాయి. కాని దారిలో మరుసటి రోజు కాగానే ప్రయాణపు గమ్యానికి యెగురుతాయి. అక్కడ గాలిలో మేడలు కట్టడం మొదలెడతాయి. ఒలేనిన్‌కి అలానే జరిగింది.

పట్టణం వదిలిపెట్టగానే మంచుకప్పిన పొలాల కేసి చూశాడు. వాటి మధ్య ఒంటరిగా వున్నందుకు సంతోషపడ్డాడు. గొర్రెతోలు కోటు కప్పేసుకుని స్లెడ్జ్ బండిలో పడుకున్నాడు. కలత లేకుండా వున్నాడు. మగతలోకి జారిపోయాడు. స్నేహితులతోటి యెడబాటు అతన్ని గాఢంగా కదిలించివేసింది. మాస్కోలో గడిపిన గత శీతాకాలపు జ్ఞాపకాలూ, గతం తాలూకు దృశ్యాలూ అస్పష్టమైన ఆలోచనలతోటీ, విచారాలతోటీ పెనవేసుకుపోయి, అతని భావనలో అనుకోకుండా ప్రత్యక్షమయ్యాయి.

తనకి వీడ్కోలు చెప్పిన మిత్రుణ్ణీ, వాళ్లు మాట్లాడుకుంటూ వుండిన అమ్మాయితో అతని సంబంధాల గురించీ గుర్తుచేసుకున్నాడు. ఆ పిల్ల స్థితిమంతురాలు. "నన్ను ప్రేమించిందని తెలిసీ ఆమెని అతనెలా ప్రేమించాడు?" అనుకున్నాడు. మనసులో చెడ్డ అనుమానాలు దూసుకుపోయాయి. "బాగా ఆలోచిస్తే మనుషుల్లో అవినీతి చాలా

వుంది.'' అప్పుడతనికో ప్రశ్న యెదురైంది: ''కాని నిజంగా నేనెప్పుడూ ప్రేమించకుండా యెలా వున్నాను? ప్రతీవాడూ నేను ప్రేమించలేదనే అంటున్నాడు. నేనేమైనా మానవధర్మానికి విపరీతమా?'' తన తీవ్ర వ్యామోహాలు గుర్తుచేసుకోవడం మొదలెట్టాడు. తనకి వయసు వచ్చింతర్వాత నాగరిక పరిధిలోకి అడుగెట్టడం గుర్తుచేసుకున్నాడు. తన మిత్రుని చెల్లెల్నీ, దీపం వెలుగుతూ వుండే బల్ల దగ్గర, ఆవిడ వేళ్ళు అల్లిక పనిలో వుంటే, ఆ దీపం వాటినీ, ఆవిడ ముఖంలోని ముచ్చటైన పృదువైన కింది భాగాన్నీ కాంతివంతం చేస్తూవుంటే ఆవిడతోటి తను గడిపిన యెన్నో సాయంత్రాలనీ గుర్తుచేసుకున్నాడు. తమ సంభాషణలని గుర్తుచేసుకున్నాడు. అవి, తెగూ తెంపూ లేకుండా అలా సాగుతూనే వుండేవి. ఆ పరిస్థితిలోని యిబ్బందీ, నిర్బంధమూ, ఆ నిర్బంధంమీద తిరుగుబాటు చెయ్యాలనే మధ్యమధ్యని తన కోరికా గుర్తుచేసుకున్నాడు. యేదో కంఠం యెప్పుడూ గుసగుసలాడేది: ''అది కాదిది, అది కాదిది'' అని. అదే నిజమైంది. తర్వాత ఓ విందునాట్యంలో అందమైన ''డి-''తో నృత్యం చేసిన మజార్కా* గుర్తుచేసుకున్నాడు. ''ఆ రాత్రి యెంత ప్రేమలో వున్నాను, యెంత ఆనందంగా! ఆ మర్నాడు నిద్రనుంచి లేచాక యింకా స్వేచ్ఛగా వున్నట్టనిపించి యెంత బాధపడ్డాను, చిరాకుపడ్డాను! ప్రేమ వచ్చి నా కాళ్ళూ చేతులూ యెందుకు కట్టెయ్యదు? లేదు, ప్రేమ లాంటిదేమీ లేదు! ఆ పొరుగావిడ దుబ్రోవిన్‌కీ, మార్షల్‌కీ** చెప్పినట్టుగానే నాకు చెబుతూ

---

* యేడెనిమిది జతల స్త్రీ, పురుషులు సంగీతానికి అనుగుణంగా చేసేనాట్యం. — అను.

** జార్ రష్యాలో కులీనులు తమ ప్రయోజనాలు కాపాడ్డానికి ప్రతి జిల్లాలోనూ, ప్రతి రాష్ట్రంలోనూ తమ ప్రతినిధుల్ని యెన్నుకునేవారు. ఆ ప్రతినిధుల్ని 'మార్షల్'లు అనేవారు. — అను.

వుండేది, తను నక్షత్రాల్ని ప్రేమిస్తున్నానని. ఆనీడా అలాంటి దేదో కాదూ,'' అనుకున్నాడు. యిప్పుడతనికి పల్లెటూళ్లో వ్యవసాయం మనసులో మెదిలింది. ఆ జ్ఞాపకాలలో కూడా సంతోషంగా తలచుకోదాని కేమీ లేవు. ''నా వచ్చెయ్యడం గురించి చెప్పుకోడానికి వాళ్లకెక్కువేమేనా వుంటుందా?'' అనిపించిందతని బుర్రలో; కాని ఆ ''వాళ్లు'' యెవరో అతనికి పూర్తిగా తెలీదు. ఆ తర్వాత అతను కుంగిపోతూ, అసందర్భంగా గొణిగేటట్టు చేసిన ఆలోచన వచ్చింది. అది దర్జీ కపేల్, అతనికి తనింకా బాకీ వున్న ఆరు వందల ఏభై ఎనిమిది రూబుళ్ల జ్ఞాపకం. అతన్ని ఒక సంవత్సరం ఆగమని తను ప్రాధేయపడిన మాటలు, ఆ దర్జీ ముఖంమీద కనిపించిన కలవరం, హతాశా గుర్తుచేసుకున్నాడు. ''ఓరి భగవంతుడా, భగవంతుడా!'' మళ్లీ మళ్లీ అన్నాడు, కుంగి పోయాడు, ఆ అసహ్యమైన ఆలోచనని పారదోల ప్రయత్నిస్తూ. ''అయినా యెప్పనుకున్నా, ఆమె నన్ను ప్రేమించింది,'' వీడ్కోలు భోజనాల దగ్గర తాను ముచ్చటించుకున్న అమ్మాయిని గురించి అనుకున్నాడు. ''అవును, ఆమెని పెళ్లి చేసుకునివుంటే యేమీ రుణపడి వుండేవాణ్ణే కాదు. యిప్పటికేమో నేను వసీల్యెవ్‌కి రుణపడి వున్నాను.'' ఆవిషని అప్పుడే వదిలాక క్లబ్బులో వసీల్యెవ్‌తో తను ఆడిన ఆఖరు రాత్రి గుర్తు తెచ్చుకున్నాడు. మరో ఆట కోసం తను చిన్నబోయేటట్టు ప్రాధేయపడ్డమూ, వసీల్యెవ్ నిర్దాక్షిణ్యమైన నిరాకరణా గుర్తుకు వచ్చాయి. ''ఒక్క యేడాది పొదుపుగా వుంటే వాళ్లందరికీ సారెయ్యొచ్చు, వీళ్ల దుంపతెగ!...'' యీ ధైర్యం యెంత చెప్పుకున్నా యింకా బాకీ వున్న అప్పులూ, వాటి తారీకులూ, యెప్పటికి వాటిని తీర్చెయ్యగలిగేదీ మళ్లీ లెక్కేసుకోవడం మొదలెట్టాడు. ''మరి నేను మోరెల్‌కే కాదు, షెవాల్యేకి కూడా కొంత బాకీ వుంటాను'' అనుకున్నాడు, పెద్ద మొత్తం బాకీపడ్డ రాత్రిని గుర్తుచేసుకుంటూ. పీటర్స్‌బుర్గ్‌నుంచి వచ్చిన చక్రవర్తి సైనికోద్యోగి సష్కా ''బి—'', రాకుమారుడు

''ద – '', యింకా ఆ అట్టహాసంగా వుండే ముసలాయన – వాళ్లెవరో జిప్సీలతో యేర్పాటు చేసిన పానజాతర గుర్తుకు వచ్చింది. ''ఆ పెద్ద మనుషులంత ఆత్మతృప్తిగా యెలా వుంటారో?'' అనుకున్నాడు. ''తమతో కలవడమే సుహృద్భాగ్యమని యితరులు భావించాలని అనుకునే వీళ్లకు, అలాంటి ముతా యేర్పాటుచేసుకునే హక్కు యేం వుంది? వాళ్లు చక్రవర్తికి సన్నిహితం కాబట్టా? వాళ్లు అవతల వాళ్లని యెంత వెధవలకింద పోకిరీలకింద జమకడతారో చూస్తే అసహ్యం వేస్తుంది! యేమైనా అందుకు భిన్నంగా నేను వాళ్లకి చూపించాను, నాకు వాళ్లతో ఆత్మీయంగా వుండే కోరిక లేదని. యేమైనా మా జమీ మేనేజరు ఆశ్చర్యపోతాడు కర్నలూ, చక్రవర్తి సైనికోద్యోగీ అయిన సష్కా ''బి – ''లాంటి వాడితో నేను పరిచయంగా వున్నానంటే! నిజమే, ఆవేళ యెవరూ నేను తాగినంత తాగలేదు. ఆ జిప్సీలకి కొత్త పాట నేర్పాను. అందరూ విన్నారు. నేను యెన్ని వెధవ పనులేనా చేసి వుండచ్చుగాని మంచివాణ్నే'' అని కూడా అనుకున్నాడు.

ఉదయం అయేసరికి మూడో మజిలీ దగ్గరున్నాడు. టీ తాగాడు. వన్యూష్కకి మూటలూ పెట్టెలూ లాగడానికి సాయంచేసాడు. శాంతంగా, నిశ్చలంగా చింతలేకుండా వాటి మధ్య కూర్చున్నాడు. తన సామాను లన్నీ యెక్కడున్నాయో, యెంత డబ్బు వుందో, యెక్కడ వుందో, తన పాస్‌పోర్ట్, గుర్రాలకి ఫర్మానా, చావడి సుంకం కాగితాలూ యెక్కడ పెట్టుకున్నాడో గుర్తుంది. అన్నీ యెంత బాగా అమిరాయంటే అతను ఉల్లాసంగా వున్నాడు. అతని ముందున్న దూరప్రయాణమంతా ఒక విహార యాత్ర పరుచుకున్నట్టు వుంది.

ఆ ఉదయమూ, మధ్యాహ్నమూ అంతా యెన్ని కోసులు తను ప్రయాణం చేసాడో, తర్వాత మజిలీకి యెన్ని వున్నాయో, మొదటి పట్టణానికి యెన్ని కోసులో, తను భోజనం చేసే చోటికి యెన్నో, తను టీ తాగే చోటికి యెన్నో, స్తావ్రొపోల్‌కి యెన్నో మొత్తం ప్రయా

ణంలో యెన్నో వంతు అయిందో అంతా గుణించుకుంటూనే వున్నాడు. యెంత డబ్బు తన దగ్గరుందో, యెంత మిగులుతుందో, తన అప్పులు తీరడానికి యెంత అవసరమో, తన ఆదాయంలో ప్రతి నెలా యెంత భాగంలో యెంత తను ఖర్చుపెట్టబోతాడో కూడా గుణించుకుంటూనే వున్నాడు. సాయంత్రానికి, టీ తర్వాత, స్ట్రావాపెల్‌కి యింకా మొత్తం ప్రయాణంలో పదకొండింట యేడువంతులుందని లెక్కేసుకున్నాడు. తన అప్పులకి యేణ్ణాళ్ళ పొదుపూ, ఎనిమిదింట వొక వంతు తన ఆస్తీ అవసరమవుతాయని గుణించుకున్నాడు. అలా మనసు తేలిక పర్చుకున్నాక, కప్పుకుని, స్లెడ్జ్‌లో పడుకుని మళ్ళీ కునుకు తీసాడు. అతని వూహ భవిష్యత్తుమీదకి మళ్ళింది: కాకసస్ కేసి. అతని భవిష్యత్ కలలన్నీ అమలాత్ బెక్ లాంటి వీరులతోటి, సర్కేషియన్ మహిళలతోటి, పర్వతాలతోటి, కొండచరియలతోటి, తీవ్రమైన వడిగల యేర్లతోటి, ప్రమాదాలతోటి ముడిపడి వున్నాయి. యివన్నీ కూడా అస్పష్టంగా మసకగా వున్నాయి. కాని కీర్తికాంక్ష, మృత్యు ప్రమాదమూ ఆ భవిష్యత్‌మీద ఆసక్తినిచ్చాయి. అందర్నీ ఆశ్చర్య చకితుల్ని చేసే అనిదంపూర్వ సాహసంతోటీ, శక్తితోటీ అతను అసంఖ్యాకంగా కొండవాళ్ళని చంపేసి లొంగదీసుకున్నాడిప్పుడు. మరో క్షణంలో తనూ ఓ కొండవాడే, వాళ్ళతోబాటుగా, రష్యన్లకి వ్యతిరేకంగా, వాళ్ళ స్వాతంత్ర్యాన్ని రక్షిస్తున్నాడు. దేన్నైనా కచ్చితమైన దాన్ని అతను వూహించగానే పరిచయమైన మాస్కో వ్యక్తులు రంగం మీద ప్రత్యక్షమయ్యేవారు. సష్కా “బి—” రష్యన్ల మధ్యనో కొండ వాళ్ళ మధ్యనో తనకి వ్యతిరేకంగా పోరాడుతూ ప్రత్యక్షమయ్యేవాడు. ఆఖరికి దర్జీ కపేల్ కూడా ఓ వింతపద్ధతిలో విజేత విజయంలో భాగం పంచుకునేవాడు. వీటన్నిటి మధ్యా అతను తన పూర్వపు అవమానాలూ, బలహీనతలూ, తప్పులూ గుర్తుచేసుకున్నా ఆ జ్ఞాపకం అంత యిబ్బందికరంగా లేదు. ఆ కొండల్లో, జలపాతాల్లో, చక్కని

సర్కేషియన్స్‌లో, ప్రమాదాల్లో అలాంటి తప్పులు తిరిగి రావనేది స్పష్టం. ఒకసారి తను పూర్తిగా పాపనివేదన చేసుకున్నాక, అంతటితో అదంతా అయిపోయినట్టే. మరొక్క దృశ్యం, అన్నిటికంటే మధుర మైంది, ఆ యువకుడి ప్రతి భవిష్యత్ భావనలోనూ కలిసిపోయింది వుంది – ఒక స్త్రీ దృశ్యం. అక్కడ, ఆ కొండల్లో, ఆమె సర్కేషియన్ బానిసలాగా అతని భావనకి తట్టింది. చక్కని విగ్రహం, పొడవాటి జుట్టు, అణకువగా వుండే నిగూఢమైన కళ్ళూ. కొండల్లో యేకాంతమైన యిల్లు వూహించుకున్నాడు, ఆ గుమ్మంలో ఆమె తన కోసం నిరీక్షిస్తూ వుంటుంది, అతనూ అలిసిపోయి దుమ్ముకొట్టుకుని, రక్తంతో, కీర్తితో, ఆమె వద్దకి తిరిగి వస్తాడు. ఆమె ముద్దులూ, భుజాలూ, మధురమైన కంఠం, అణకువగా వుండే తత్వం అతను యెరుగును. ఆమె మనోహరంగా వుంటుంది, కాని చదువు లేదు, నాగరికం లేదు, మోటు. శీతాకాలపు దీర్ఘరాత్రుల్లో ఆమె చదువు మొదలెడతాడు. ఆమె తెలివైంది, బుద్ధిశాలినీ. త్వరగానే అవసర మైనంత జ్ఞానాన్ని సంపాదించేస్తుంది. ఎందుక్కాదు? ఆమె సునాయా సంగా పరాయి దేశ భాషలు నేర్చుకుంటుంది, ఫ్రెంచి భాషలోని ఉద్గ్రంథాలని చదివేస్తుంది, అర్థంచేసుకుంటుంది; ఉదాహరణకి 'నాటర్ డామ్ ది పారిస్' తప్పకుండా ఆమెని అలరిస్తుంది. ఆమె ఫ్రెంచ్ మాట్లాడగలదు కూడానూ. అతిథుల గదిలో ఉన్నత వంశీకుల పై తరగతి ఆడవాళ్ళకంటే ఎక్కువ సహజమైన హుందా చూపిస్తుంది. ఆమె పాడగలదు, సునాయాసంగా, బింకంగా, ఆవేశవంతంగా.... ''సరే, యేమిటీ చెత్తంతా!'' అనుకున్నాడు. యీపాటికి యింకో మజిలీ స్థానంచేరారు. అతను యింకో బండిలోకి మారి, మామూళ్ళు యివ్వాల్సివచ్చింది. మళ్ళీ అతని వూహలు అతను వదిలేసిన ''చెత్త'' కోసం వెదకడం మొదలెట్టాయి. మళ్ళీ చక్కని సర్కేషియన్లూ, కీర్తీ, రష్యాకి తను తిరిగి రావడమూ, అందమైన భార్య, సైనికోద్యోగం

వ్యూహాల్లో ముందు నిలిచాయి. "కాని ప్రేమ అనేదేం లేదు" అను కున్నాడు. "కీర్తి అనేదంతా చెత్త. కాని ఆరు వందల ఏభై ఎనిమిది రూబుళ్లా?... నా జీవిత కాలానికి సరిపడేదానికంటే యెక్కువ ఐశ్వర్యం తెచ్చే జయించిన భూభాగమా? అంత సంపదా నాకు నేనే వుంచేసుకోవడం బాగోదు, దాన్ని నేను పంచిపెట్టాలి. కాని యెవరికి? సరే, ఆరు వందల ఏభై ఎనిమిది రూబుళ్లా కపేల్‌కి, అప్పుడు చూద్దాం...." చాలా అస్పష్టమైన దృశ్యాలు మనసుని కమ్ముకున్నాయి. వన్యూష గొంతూ, స్లెడ్జి ఆగడమూ అతని యౌవనపు ఆరోగ్యవంతమైన కునికి పాటుని వదిలించాయి. పెద్ద గమనం లేకుండానే యింకో బండిలోకి మారి ప్రయాణం సాగించాడు.

మర్నాడు ఉదయమూ ప్రతిదీ అలాగే జరుగుతుంది: అదే రకం స్థావరాలూ, టీ తాగడాలూ, అదే గుర్రపు తోక దునిచి, వన్యూషతో అవే మాటలూ, అవే అస్పష్టమైన కలలూ, మగత, అదే అలిసిపోయిన శుభ్రమైన రాత్రి నిద్ర.

## 3

మధ్య రష్యానుంచి ఒలేనిన్ యెంత దూరం ప్రయాణం చేస్తే అతని జ్ఞాపకాలు అంత వెనకబడిపోయాయి. కాకసస్ సమీపించే కొద్దీ అతని హృదయం తేలికపడింది. "నేను దూరంగా వుండిపోతాను ఎప్పటికీ, మళ్లీ సంఘంలో కనిపించడానికి తిరిగిరాను" అనే ఆలోచన అడపాదడపా అతనికి వచ్చింది. "నేను యిక్కడ చూసే మనుషులు మనుషులు కారు. యెవరూ నన్ను యెరగరు. నేను గడిపిన మాస్కో సమాజంలోకి వాళ్లలో ఒఖ్ఖళ్లూ ప్రవేశించలేరు, నా గతాన్ని గురించి తెలుసుకోలేదు. ఆ సమాజంలో యెవళ్లకీ నేను

యీ ప్రజల మధ్య జతుకుతూ యేం చేస్తున్నదీ తెలీదు.'' తన గతం నుంచి పూర్తిగా స్వేచ్ఛ పొందిన అనుభూతి, దారిలో తను కలుసుకున్న ఆ అనాగరికుల మధ్యలో అతనికి వచ్చింది. తన మాస్కో పరిచయాల అర్థంలో వాళ్లని అతను ''మనుషులుగా'' భావించలేదు. జనం యెంత మోటుగా యెంత తక్కువ నాగరికతా చిహ్నాలతో వుంటే, అతనికి అంత యెక్కువ స్వేచ్ఛగా వున్నట్టనిపించింది. స్త్రావొపొల్ అతన్ని యిబ్బంది పెట్టింది. ఆ పేర్ల బోర్డులు, వాటిలో కొన్ని ఫ్రెంచిలో వున్నవీ, బళ్లల్లో మహిళలూ, చౌకులో గుర్రబ్బళ్లూ, పొడుగాటి టోపీ పెట్టుకుని పొడుగాటి కోటు తొడుక్కుని విశాలమైన వీధుల్లో దారంట పొయ్యేవాణ్ణీ తేరిపార చూసే పెద్దమనిషీ, అతన్ని మహా యిబ్బంది పెట్టారు. ''బహుశా యీ మనుషులకి నా పరిచయస్థులు యెవరేనా తెలుసుంటారు'' అనుకున్నాడు. మళ్లీ క్లబ్బూ, దర్జీ, పేకలు, సమాజం గుర్తుకు తెచ్చుకున్నాడు.... కాని స్త్రావొపొల్ తర్వాత ప్రతిదీ తృప్తిగా వుంది – అనాగరికంగా, అందంగా, శౌర్యంగా; మరి ఒలేనిన్ యింకా యింకా సంబరపడ్డాడు. కోసక్‌లందరూ, బండి వాళ్లూ, మజిలీ స్టేషన్ మాస్టర్లూ, సాదా జనంలా కనిపించారు. వాళ్లతో తను తుళ్లుతూ పేలుతూ వుండచ్చు, వాళ్లు యే తరగతికి చెందిందీ చూడకుండానే. తనకి తెలియకుండానే ఒలేనిన్ అభిమానించిన మానవజాతికి వాళ్లంతా చెందిన వాళ్లు; వాళ్లంతా అతన్ని ఆదరంగానే చూశారు.

దోన్ కోసక్ ప్రాంతంలో అతని స్లెడ్జి బండిని చక్రాల బండికి మార్చుకున్నాడు. స్త్రావొపొల్ దాటాక యెంత వెచ్చగా అయిందంటే ఒలేనిన్ గొర్రెతోలు కోటు లేకుండానే ప్రయాణం చేశాడు. అప్పుడే వసంత రుతువు – అనుకోకుండా ఆనందదాయకమైన వసంతం ఒలేనిన్‌కి. అప్పుడే అతన్ని రాత్రిళ్లు కోసక్ గ్రామాలు వదల నివ్వడంలేదు. సాయంత్రం ప్రయాణం చెయ్యడం ప్రమాదమని వాళ్లు అన్నారు.

వస్యూష కలవరపడేవాడు. వాళ్ళు మూడు గుర్రాలబండిలో తూటాలు నింపిన తుపాకీ తీసికెళ్లేవాళ్లు. ఒలేనిన్ యింకా సంతోషంగా వున్నాడు. ఓ మజిలీవద్ద ఆ స్టేషన్ మాస్టరు చెప్పాడు యీమధ్యనే నడి రోడ్డుమీద భయంకరమైన హత్య జరిగిందని. ఆయుధాలున్న మనుషులు వాళ్లకి తగిలేవాళ్లు. ''అంచేత యిప్పుడు మొదలైందన్నమాట!'' అనుకున్నాడు ఒలేనిన్. యెన్నో సార్లు విన్న హిమపర్వతాలని దర్శించే ఆశతో వుండేవాడు. ఓ సాయంత్రం ఆ నోగాయ్ జాతి బండివాడు మేఘాలు కమ్మిన కొండల్ని కొరడాతో చూపించాడు. ఒలేనిన్ ఆత్రుతగా చూశాడు, కాని అది మబ్బుగా వుంది. కొండలు దాదాపు మేఘాల్లో కప్పడిపోయాయి. యేదో బూడిదరంగూ, తెలుపూ, వూలూ కనిపించాయి గానీ, యెంత ప్రయత్నించినా తాను యెంతో వినీ, చదివీ వున్న ఆ కొండల్లో యే అందమూ దర్శించలేక పోయాడు. కొండలూ, మేఘాలూ ఒక్క లాగే కనిపించాయి. తను యెన్నో సార్లు విన్న ఆ హిమశిఖరాల ప్రత్యేక సౌందర్యం తనకి నమ్మకం లేని బాఖ్* సంగీతం లాగా, స్త్రీలపట్ల ప్రేమలాగా కల్పనే ననిపించిందతనికి. అందుచేత ఆ పర్వతాల కోసం యెదురుచూడాలనే ఆశ వదులుకున్నాడు. కాని మర్నాడు ఉదయం ప్రభాత వాయువుకి మూడు గుర్రాలబండిలో లేచి నిర్లక్ష్యంగా కుడివేపు చూశాడు. ఆ ఉదయం నిర్మలినంగా వుంది. అతని మొదటి చూపుకే అనిపించినట్లుగా యిరవై అడుగుల దూరంలో అచ్చమైన తెల్లటి బ్రహ్మాండమైన ముద్దలు హఠాత్తుగా కనిపించాయి. వాటి శిఖరాల స్పష్టమైన కల్పనాతీతమైన బాహ్యరేఖలు సుదూరాకాశపు టంచులకి సూటిగా చెక్కిన చిత్రాల్లా వున్నట్లు

---

* బాఖ్, యోహన్ సెబస్ట్యాన్ (1685–1750) – సుప్రసిద్ధ జర్మన్ కంపోజర్. – సం.

కనిపించాయి. తనకీ, వాటికీ, ఆకాశానికీ మధ్య దూరమూ, ఆ పర్వతాల మహా ఔన్నత్యమూ గుర్తించగానే, ఆ సౌందర్యపు అపరిమితత్వం అనుకోగానే, అతనికదేదో కలో, భ్రమోనని భయమేసింది. మెలుకువ తెచ్చుకోవడం కోసం ఒకసారి కుదుపుకున్నాడు, గాని ఆ కొండలు యింకా అలానే వున్నాయి.

"యేమిటది? యేమిటది?" బండితోలేవాణ్ణి అడిగాడు.

"యేముందీ, పర్వతాలు" యేం పట్టనట్టు జవాబిచ్చేడు ఆ నోగాయ్ తోలేవాడు.

"నేనూ వాటి కేసే చాలా సేపట్నుంచీ చూస్తున్నాను. అద్భుతంగా లేవూ అవి? యింటి దగ్గర చెబితే యెవడూ నమ్మడు యీ విషయం" అన్నాడు వన్యూష.

ఆ నున్నటిదారిలో, ఆ మూడు గుర్రాలబండి వేగంతో, పర్వతాలు ఆకాశపు టంచుల్లో సరిగెడుతున్నట్టుగా అనిపించింది. వాటి గులాబీ శిఖరాలు ఉదయ సూర్యుని కాంతిలో మెరుస్తున్నాయి. మొట్టమొదట ఒలేనిన్ ఆ దృశ్యానికి చకితుడయ్యాడు. తర్వాత ఆనందపడ్డాడు. వల్లని యితర పర్వతాల వెనకనుండి కాకుండా, నేరుగా మైదానం నుంచి తిన్నగా పైకి లేచినట్టు దూరంగా జారిపోతూ వున్న ఆ హిమాన్విత పంక్తి కేసి యింకా యింకా యేకాగ్రంగా చూస్తూ కొంచెంకొంచెంగా ఆ సౌందర్యాన్ని ఆస్వాదించడం ఆఖరికి ఆ పర్వతాలని అనుభవించడం ఆరంభించాడు. ఆ క్షణంనుంచీ అతను చూసిందంతా తల పోసిందంతా, అనుభవించిందంతా ఒక కొత్త స్వభావం, పర్వతాల్లాగే దృఢమైన రాజస స్వభావం సంతరించుకుంది. మాస్కో స్మృతులన్నీ, అవమానం, పశ్చాత్తాపం, కాకసస్‌ని గురించిన అల్పమైన అతని కలలూ, మాయమైపోయాయి; మళ్లీ రాలేదు. "యిప్పుడది మొదలైంది" గంభీరమైన కంఠం అతనికి చెప్పినట్లనిపించింది. ఆ దారి, అప్పుడప్పుడే దృష్టి పథంలోకి వచ్చే ఆ టెరెక్, కొసక్కుల

గ్రామాలూ, ప్రజలూ యిక యెంత మాత్రమూ ఒక పరిహాసంగా కనిపించలేదు. ఆకాశం కేసి చూశాడు. పర్వతాలని గుర్తు చేసుకున్నాడు. తన కేసి చూసుకున్నాడు లేదా వన్యూష కేసి చూశాడు. మళ్లీ పర్వతాలు మనసులోకి వచ్చాయి.... యిద్దరు కోసక్కులు స్వారీ చేసుకుంటూ పక్కనుంచి వెళ్ళారు, వాళ్ల తుపాకీ ఒరలు వెనకాల లయబద్ధంగా వూగుతూ, వాళ్ల గుర్రాల తెల్లనీ, కొంచెం ఎర్రనీ కాళ్ళు గజిబిజిగా కలిసిపోతూ.... ఆ పర్వతాలు! దూరంలో టెరెక్ అవతల చెచెన్ వూళ్ళనుంచి పొగలేస్తుంది.... ఆ పర్వతాలు! ఉదయ సూర్యుడు వెల్గు సక్షగా చుట్టు తిరిగే టెరెక్‌మీద ప్రకాశిస్తాడు.... ఆ పర్వతాలు! పల్లెనుంచి యెద్దుబండి వస్తుంది. ఆడవాళ్లు, అందమైన పడుచు ఆడవాళ్లు, పక్కనుంచి వెడతారు.... ఆ పర్వతాలు! అబ్రెక్కులు* మైదానంమీద గుర్రాలని మెల్లిగా దౌడు తీయిస్తారు. యిక్కడ నేను వాళ్లంటే భయంలేకుండా వెడుతున్నాను! నాకు తుపాకీ వుంది, శక్తి వుంది, పడుచుదనం వుంది.... ఆ పర్వతాలు!

## 4

గ్రెబెన్ కోసక్ గ్రామాలు బారునా వున్న ఆ టెరెక్ పంక్తి భూభాగమంతా (సుమారుగా ముప్పై కోసులు) ఆ నేలకి సంబంధించి గాని, ప్రజలకి సంబంధించి గాని, స్వభావంలో ఒకలాగే వుంది. కోసక్కుల్ని కొండ జాతులనుంచి విడదీసే టెరెక్ నది, సమతలంగానూ విశాలంగానూ అయినా, యింకా బురదగా, వేగంగా ప్రవహిస్తోంది. యెప్పుడూ రెల్లులో నిండిన పల్లపు కుడి ఒడ్డున ధూసర వర్ణపు

---

* టెరెక్ నది రష్యన్ ఒడ్డుకు దొంగిలించడానికీ, కొల్లగొట్టడానికీ నది దాటివచ్చే శత్రు చెచెన్లు. — సం.

యిసకని చేరవేస్తూ వుంటుంది. వేళ్లు పాతుకుపోయిన యేళ్లనాటి ఓక్ చెట్లూ, చివికిపోతూవున్న ప్లేన్‌వృక్షాలూ లేత చిట్టడివీ వుండి, మరీ యెత్తు గాకపోయినా నిటారుగా వున్న యెడమ ఒడ్డుని కోసేస్తూ వుంటుంది. కుడి ఒడ్డున, యింకా కొంచెం అశాంతిగా వున్నా లొంగిపోయిన చెచెన్ గ్రామాలు వున్నాయి. యెడమ ఒడ్డున నదికి అర కోసెడు దూరంలో, ఒకదానికీ యింకో దానికీ మూడు, నాలుగు కోసుల వారతో వున్నాయి కోసక్ గ్రామాలు. పూర్వం రోజుల్లో చాలా గ్రామాలు టెరెక్ ఒడ్డునే వుండేవి; కాని టెరెక్ యేటి యేటికీ పర్వతాలకి ఉత్తరంగా తిరిగి ఒడ్డును కోసేసింది. యిప్పుడక్కడ పాత గ్రామాల శిథిలాలు, ఆ భేరీ, రేగుపళ్ల తోటల తోటీ, బూరుగుచెట్ల తోటీ, అడివి పళ్ల చెట్లతోటీ, అడివి తీగల తోటీ కమ్ముకుపోయాయి. యిప్పుడక్కడ యెవరూ వుండటంలేదు. లేళ్లూ, తోడేళ్లూ, కుందేళ్లూ అడివికోళ్ల లాంటివాటి జాడలు కనిపిస్తాయి. అవే యిప్పుడా ప్రాంతంలో సంచరించడానికి యిష్టపడేవి. వూరినుంచి వూరికి అడివిగుండా ఒక దారి పోతుంది, తుపాకీ గుండు దూసుకుపోయినట్టుగా. దారి పొడుగునా కోసక్ సైనిక చౌకీలూ, పహారావాళ్లున్న బురుజులూ వున్నాయి. యేడు నందల గజాల సారవంతమైన అడివినేల సన్నటి ముక్క మాత్రం కోసక్కులది. ఉత్తరానికి నోగాయ్ యిసుక దిబ్బలూ, మోజడక్ పచ్చిక మైదానాలూ మొదలు. అవి యెంతో ఉత్తరంగా విస్తరించుకుని టర్క్‌మన్, ఆస్త్రహన్, కిర్ఘిజ్, కజహ్ మైదానాల్లోకంటా యింకా అలా అలా, యెక్కడికో దేవుడికే తెలియాలి, పరుచుకుని వుంటాయి. దక్షిణం వైపున, టెరెక్‌కి అవతలగా, మహా చెచ్న్యా పర్వతాలూ, కోచ్‌కలికోవ్‌స్కీ వరస, నల్ల కొండలూ, యింకో వరసా, ఆఖరికి హిమపర్వతాలూనూ. వాటిని చూడగలగడమే కాని యెక్కిన వాళ్లు లేరు. యీ సారవంత మైన అడివి భాగంలో, పుష్ప ఫలసమన్వితమైన ప్రాంతంలో, యెప్ప

ట్సుంచో తెలియనంతటి కాలంగా శౌర్యవంతంగా, అందంగా వర్ధిల్లే పాత విశ్వాసాల* శాఖకి చెందిన రష్యన్ తెగ నివసించేది. వాళ్ళని గ్రెబెన్ కోసక్కులంటారు.

యెప్పుడో పూర్వం వాళ్ల పాత విశ్వాసాల పూర్వులు రష్యానుంచి పారిపోయారు. టెరెక్ అవతల, గ్రెబెన్ ప్రాంతపు చెచెన్ల మధ్య, మహా చెచ్‌న్యా అరణ్య పర్వతాల్లో స్థిరపడ్డారు. చెచెన్లతో కలిసివుంటూ ఆ కోసక్కులూ చెచెన్‌లూ పరస్పరం వివాహాలు చేసుకున్నారు. కొండ వాళ్ల ఆచారాలూ సంప్రదాయాలూ పాటించారు. అయినా వాళ్ళింకా పరిశుద్ధ రష్యన్ భాషనీ తమ పాత విశ్వాసాలనీ నిలుపుకున్నారు. వాళ్లలో యింకా ఓ సంప్రదాయం నిలిచివుంది. అది ప్రకటించే దేమిటంటే జార్ ఇవాన్ ది టెర్రిబుల్ టెరెక్‌కి వచ్చి, వీళ్ళ పెద్దలకి కబురెట్టి, రష్యాతో స్నేహంగా వుండమని వాళ్లకి ఉద్బోధించి తన అధికారం వాళ్లమీద రుద్దననీ, వాళ్ళు తమ విశ్వాసాలు వదులుకో నక్కర్లేదనీ వాగ్దానం చేసి నది పక్కనున్న భూమి వాళ్ల కిచ్చాట్ట. యిప్పటి కూడా కోసక్ కుటుంబాలు తమకు చెచెన్లతో సంబంధా లున్నాయంటాయి. స్వేచ్ఛ, విశ్రాంతి, యుద్ధం, కొల్లగొట్టడం — వీటిని ప్రేమించడం యింకా వాళ్ల ముఖ్య లక్షణాలు. రష్యా ప్రభావం తాలూకు ప్రతికూల పార్శ్వం మాత్రం స్పష్టంగా కనిపిస్తుంది — ఎన్నికలప్పుడు జోక్యం, చర్చి గంటలని లాక్కోడం, పల్లెల్లో వుంచిన సైన్యాలూ, లేదా పల్లెలగుండా కవాతు చెయ్యడం.

ఓ కోసక్కు తన గ్రామాన్ని రక్షించడానికని తన నెత్తిమీద కాపరం చేసే సైనికునిమీద కంటే, చుట్టపొగతో తన కొంపని

---

* 17వ శతాబ్దంలో రష్యన్ గ్రీక్ చర్చినుంచి విడిపోయిన శాఖల్ని సామాన్యంగా "పాత విశ్వాసాల" వాళ్లంటారు. — సం.

కచాడీ చేసే ఆ సైనికునిమీద కంటే జిగిత్* కొండవాడిమీద తక్కువ ద్వేషం చూపిస్తాడు, వాడు బహుశా తన సోదరుణ్ని చంపినవాడైనా సరే. తన శత్రువైన కొండవాణ్ని మన్నిస్తాడు, సైనికుణ్ని యేవగించుకుంటాడు. ఆ సైనికుడు అతని దృష్టిలో పరాయివాడూ, పీడించేవాడూనూ. నిజానికి కోసక్ దృష్టిలో రష్యన్ రైతు విదేశీయుడు, అనాగరికుడు, యేహ్యమైన జీవి. పల్లెల్లో వీధులు తిరిగి అమ్ముకునే వాళ్లలోనూ, కోసక్కులు యేవగించుకుంటూ "గాలిగాళ్లు" అని పిలిచే ఉక్రేయిన్ వలసవాళ్లలోనూ పై రకం మచ్చు చూస్తాడు. వాడికి చక్కగా ముస్తాబవడం అంటే సర్కేషియన్ లాగానని అర్థం. మంచి ఆయుధాలు కొండవాళ్ల దగ్గర్నుంచే సంపాదించవచ్చు. మంచి గుర్రాలూ వాళ్లనుంచే కొనచ్చు లేదా కొట్టెయ్యొచ్చు. చొరవగల కోసక్ యువకుడు తన తాతార్ పాండిత్యం ప్రదర్శించాలని యిష్టపడతాడు. తాగి తుళ్లేటప్పుడు తోటి కోసక్కులతో కూడా తాతార్‌లో మాట్లాడతాడు. యివెన్ని వున్నా యీ భూమ్మీద చిన్న భాగంలో విసిరేసినట్టుండి అర్థ అనాగరిక మహమ్మదీయ తెగలతోటీ, సైనికులతోటీ చుట్టుముట్టబడివున్న యీ చిన్ని క్రైస్తవ తెగ తను చాలా అభివృద్ధి చెందినట్టు భావిస్తుంది. కోసక్కులని తప్ప మరెవళ్లనీ మనుషులుగా గుర్తించదు. మరి ప్రతిదాన్నీ యేవగించుకుంటుంది. కోసక్కు తన కాలంలో చాలా భాగం సైనిక చౌకీల్లోనూ, యుద్ధంలోనూ, లేకపోతే వేటలో, చేపలు పట్టడంలో గడుపుతాడు. యింటిదగ్గర దాదాపుగా యేమీ పనిచెయ్యడు. యింటిదగ్గరుండడమే యేదో తప్పిదారి, అలా వున్నాడంటే యేదో ఆటవిడుపన్నమాట. కోసక్కులంతా తమ వైన్ తామే తయారు చేసుకుంటారు. తాగి మత్తెక్కడం అనేది ఒక లక్షణంగా కాదు

---

* కాకసస్‌లోని కొండవాళ్లల్లో, కోసక్కులలో సాహసికుల్ని జిగిత్‌లు అంటారు. కాని ఆ మాట ఆశ్వికి నైపుణ్యానికి సంబంధించింది. — సం.

ఒక ఆచారమే. అది పరిపూర్తి చెయ్యకపోతే స్వధర్మాన్ని త్యజించినట్టే భావిస్తారు. ఆడదంటే తన శ్రేయస్సు కోసం వున్న సాధనంగానే కోసక్కా చూస్తాడు; పెళ్ళికాని పిల్లలు మాత్రమే తమ సరదాలు చూసుకోవచ్చు. పెళ్ళయిన ఆడది పెళ్ళయిన నాటినుంచి ముసలితనందాకా భర్త కోసమే పనిచేయాలి. ప్రాచ్య దేశాల్లో మాదిరిగా అణకువ, శ్రమా ఆమెకి శాసిస్తాడు. ఈ దృష్టి ఫలితంగా స్త్రీలు దృఢంగా అభివృద్ధి చెందారు, శారీరకంగా మానసికంగా, ఉభయత్రా. వాళ్ళ — తూర్పు దేశాల్లో అన్ని చోట్లా వున్నట్లు — నామమాత్రంగా లొంగి వున్నా, పశ్చిమ దేశాల్లోని స్త్రీలకంటే కూడా కుటుంబ జీవితంలో చాలా యెక్కువ పలుకుబడీ ప్రాముఖ్యాలతోటి వుంటారు. బయటి జీవితంనుంచి వెలిగా వుండటం, భారమైన పురుష శ్రమకి అలవాటై పోవడం వాళ్ళకి యింట్లో యింకా యెక్కువ అధికారమూ ప్రాముఖ్యమూ యిచ్చాయి. సరాయి వాళ్ళ ముందు పెళ్ళాంతోటి ప్రేమగానూ, అవసరం లేకుండానూ మాట్లాడ్డం అనుచితంగా భావించే కోసక్కు, ఒంటిగా ఆవిడతో వున్నప్పుడు ఆవిడ ఆధిక్యాన్ని అప్రయత్నంగానే గుర్తిస్తాడు. అతని యిల్లూ పొలమూ, ఆ మాటకొస్తే మొత్తం అతని ఆస్తీ, ఆవిడ శ్రమ వల్లనే, జాగ్రత్త వల్లనే పోగయి లక్షణంగా వున్నాయి. శ్రమ చెయ్యడం కోసక్కుకి పరువు తక్కువనీ, నోగాయ్ పని వాళ్ళకీ, ఆడాళ్ళకీ చెల్లిందనీ దృఢంగా విశ్వసించినా తను వాడేదీ, ''నాది'' అని అనుకునేదీ అంతా కూడా ఆ శ్రమ ఫలితమనీ, అది తను బానిసగా చూసే ఆవిడదనీ (తల్లిదో, పెళ్ళాందో) తనకి వున్నదంతా వూడగొట్టే శక్తి ఆ స్త్రీకి వుందనీ యేదో అస్పష్టమైన మెలుకువతో వుంటాడు. యెప్పుడూ మగాళ్ళ భారమైన పనిచెయ్యడమూ, తమకి అప్పగించబడ్డ బాధ్యతలూ గ్రెబెన్ స్త్రీలకి ఒక విలక్షణమైన స్వాతంత్ర్యాన్నీ పురుషలక్షణాన్నీ యిచ్చాయి; వాళ్ళ శారీరక దారుఢ్యాన్నీ, వ్యవహార జ్ఞానాన్నీ, సంకల్పబలాన్నీ, దృఢత్వాన్నీ అద్భు

తంగా పెంపొందించాయి. చాలా సందర్భాల్లో మగవాళ్ళకంటే ఆడ వాళ్ళు యెక్కువ శక్తివంతంగా, తెలివిగా పరిణతి చెందినవాళ్ళుగా, అందంగా కనిపిస్తారు. గ్రెబెన్ స్త్రీల అందంలో కొట్టవచ్చినట్టు కనబడే లక్షణం యేమిటంటే స్వచ్ఛమైన సర్కేషియన్ తరహా ముఖమూ, ఉత్తర ప్రాంత స్త్రీలలాగా విశాలమైన దృఢమైన శరీర నిర్మాణమూ కలవడం. కోసక్ స్త్రీలు సర్కేషియన్ దుస్తులు ధరిస్తారు: తాతార్ గాగరా, బెష్మెత్,* మెత్తని చెప్పులు; కాని వాళ్ళు తమ రుమాళ్లని రష్యన్ పద్ధతిలో తలకి చుట్టూ కట్టుకుంటారు. బట్టల్లోనూ, యిళ్లని చక్క పెట్టుకోవడంలోనూ సొగసూ, శుభ్రం, లాలిత్యం వాళ్లకి ఒక ఆచారమూ అవసరమూనూ. పురుషులతోటి తమ సంబంధాల్లో ఆ స్త్రీలు, ముఖ్యంగా పెళ్లికాని పిల్లలు, పూర్తి స్వేచ్ఛ అనుభవిస్తారు.

నొవొమ్లిన్స్కయా గ్రామం గ్రెబెన్ కోసక్ ప్రాంతంలో గుండెకాయలా చూడబడుతుంది. మరెక్కడా లేనంతగా యిక్కడ పాతకాలపు గ్రెబెన్ ప్రజల ఆచారాలు నిలిచివున్నాయి. యిక్కడి స్త్రీలు యేనాటి నుంచో కాకసస్ అంతా తమ సౌందర్యానికి పేరు పొందిన వాళ్ళు. కోసక్కుల జీవనాధారం ద్రాక్ష తోటలనుంచీ, పళ్ళ తోటలనుంచీ, పుచ్చకాయల, గుమ్మడి కాయల తోటలనుంచీ, చేపలు పట్టడంనుంచీ, వేటనుంచీ, మొక్కజొన్నలూ, జొన్నలూ పండించడంనుంచీ యుద్ధంలో దోచుకునే దాన్నుంచీ లభిస్తుంది.

టెరెక్‌నుంచి ఒక కోసెడు దూరంలో వుంటుంది నొవొమ్లిన్స్కయా గ్రామం. మధ్యలో దట్టమైన అడవి. వూరి మధ్యలోనుంచి పోయే రోడ్డుకి ఒక పక్క నది; మరో పక్క ద్రాక్ష తోటలూ, పళ్ళ తోటలూ వాటికవతల నోగాయ్ మైదానాల యిసుక దిబ్బలు. వూరు చుట్టూతా

---

* చేతులున్న తాతార్ చొక్కా. — సం.

మట్టి ప్రాకారం, ముళ్లకంపల కంచె. వూళ్లోకి రావడానికి పెద్ద ద్వారం వుంది. అది స్తంభాలమీద నిలిచి రెల్లు కప్పుగా వేసిన పై భాగంతో వుంటుంది. దాని పక్కనే ఓ కొయ్య బండిమీద ఫిరంగి వుంటుంది, వికారంగా వున్న ఫిరంగి. యెప్పుడో పూర్వం కోసక్కులు దాన్ని స్వాధీనం చేసుకున్నారు. దాన్ని వో వంద యేళ్ల కాలంలో పేల్చివుండరు. యూనిఫామ్‌లో వున్న కోసక్ పహారావాడు, బాకుతోటీ, తుపాకీతోటీ ఒక్కొక్కప్పుడు ద్వారంపక్కన పహరా వుంటాడు. ఒక్కొక్కప్పుడు వుండడు. ఒక్కొక్కప్పుడు దారిన పోయే సైనిక ఆఫీసరుకి తుపాకీ ముందు వుంచుకొని వందనం చేస్తాడు, ఒక్కొక్కప్పుడు చెయ్యడు.

ద్వారం కప్పుకింద తెల్లటి బల్లమీద నల్లటి అక్షరాల్తో రాసి వుంటుంది: యిళ్లు 266; నివసించే పురుషులు 897; స్త్రీలు 1,012. కోసక్కుల యిళ్లన్నీ నేలకి రెండు మూడు అడుగుల యెత్తు రాట్లమీద కట్టబడివుంటాయి. జాగ్రత్తగా రెల్లులో కప్పివుంటాయి, చక్కగా మలిచిన త్రికోణాకారపు కురుమాళ్లతోటి వుంటాయి. కొత్తవి కాకపోయినా అవన్నీ కనీసం నిటారుగా, శుభ్రంగా, భిన్న ఆకారాల ముందు వసారాలతో వుంటాయి. దగ్గరసా యిరుగ్గా వుండవు. చుట్టుతా కావల సినంత జాగా వుంటుంది. అవన్నీ కూడా విశాలమైన వీధుల్లోనూ సందుల్లోనూ బొమ్మలు పెట్టినట్టు, అందంగా వుంటాయి. చాలా యిళ్ల పెద్ద కిటికీల ముందు, కంచెలకావల, ముదురాకుపచ్చ పోప్లార్, కసింద చెట్లు మృదువైన లేత పచ్చదనంతో, సువాసనల తెల్లని పువ్వుల్తో యిళ్ల కప్పులకంటే యెత్తుగా వుంటాయి. వాటి పక్కనే పెద్ద పసుపుపచ్చని పొద్దుతిరుగుడు పువ్వులూ, లతలూ, ద్రాక్ష తీగలూ వుంటాయి. విశాలమైన చౌకు బయలులో మూడు దుకాణాలున్నాయి. అక్కడ బట్టలూ, పొద్దుతిరుగుడు పువ్వుల విత్తనాలూ, గుమ్మడి కాయల విత్తనాలూ, చిక్కుళ్లూ, అల్లం బిస్కట్లూ అమ్ముతారు. రెజిమెంటల్ కమాండర్ నివాసం విశాలమైన కిటికీలతోటీ, చుట్టూతా

పొడుగైన కంచెతోటీ మిగతా యిళ్లకంటే యెత్తుగా, పెద్దగా పోప్లార్‌చెట్ల వరస వెనక వుంటుంది. సోమవారంనుంచి శనివారందాకా వుండే రోజుల్లో, ముఖ్యంగా వేసవిలో, వూరి వీధుల్లో యెవరూ కనిపించరు. కోసక్కులు చౌకీలో విధి నిర్వహిస్తూ వుంటారు లేకపోతే సైనిక దండయాత్రల్లో వుంటారు. ముసలాళ్లు చేపలు పడుతూనో, తోటల్లోనూ దొడ్లల్లోనూ ఆడవాళ్లకి సాయంచేస్తూనో వుంటారు. మరీ ముసలి తొక్కులూ, రోగగ్రస్తులూ, పిల్లలూ మాత్రమే యిళ్లదగ్గర వుండిపోతారు.

5

కాకసస్‌లో మాత్రమే కనిపించే అరుదైన సాయంత్రాల్లో అది ఒకటి. సూర్యుడు కొండల వెనక మునిగిపోయాడు కాని యింకా వెలుతురు వుంది. సాయంసంధ్య ఆకాశంలో మూడో వంతు వ్యాపించింది. దాని వెలుతుర్లో ఆ పర్వతాల పాండువర్ణ అపరిమితత్వం తీక్ష్ణంగా వివరమైంది. గాలి తగ్గిపోయింది. కదలికలేదు. చీమ చిటుక్కుమన్నా వినిపించేటట్టు వుంది. ఆ పర్వతాల నీడ మైదానంమీద యెంతో దూరం వ్యాపించింది. ఆ మైదానమూ, నది ఆవలి ఒడ్డూ, దారులూ అన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. అయితే, యెప్పుడేనా, గుర్రాలమీద స్వారీచేసే వాళ్లగపడితే, సైనిక చౌకీల్లోని కోసక్కులూ, చెచెన్ గ్రామాల్లో చెచెన్లూ సంభ్రమ, కుతూహలంతో పరీక్షగా చూసేవాళ్లు. యీ అనుమానాస్పద వ్యక్తులు యెవరై వుంటారా అని వూహించేవాళ్ళు.

రాత్రికాగానే ఒకళ్లనుంచి ఒకళ్లకి భయంవల్ల జనం యిళ్లలో గుమిగూడతారు. పశులూ జంతువులూ మానవుడంటే భయంలేక ఆ నిర్మానుష్యమైన ప్రాంతాల్లో సంచరిస్తూ వుంటాయి. రోజంతా ద్రాక్ష తీగలు కడుతూ వున్న ఆడవాళ్లు సూర్యాస్తమయానికి ముందే,

కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ త్వరగా వెళ్ళిపోతారు. ద్రాక్ష తోటలు కూడా చుట్టూతా వున్న ప్రాంతంలాగానే నిర్మానుష్యమైపోతాయి. కాని వూరు మాత్రం కళకళ్ళాడి పోతుంది. అన్ని వేపులనుంచీ నడుచుకుంటూ, స్వారీ చేసుకుంటూ, క్రిరుమనే బళ్లని తోలుకుంటూ జనం వూరి కేసి కదుల్తారు. ధూళి, దోమల మేఘాల్లో గుంపుగా చేరిన పశువుల్ని చేరుకోడానికి గాగరాలు పైకి దోపుకుని చేతుల్లో బెత్తాలతో హుషారుగా కబుర్లు చెప్పుకుంటూ గ్రామ ద్వారం దగ్గరికి పరిగెడతారు ఆడపిల్లలు. ఆ పశువులు మైదానంమీదనుంచి ఆ దుమ్మునీ, దోమల్నీ, తమతో తెస్తాయి. బలిసిన ఆవులూ, గేదెలూ వీధుల్లో అడ్డంగా నడుస్తాయి. రంగు బెష్మెత్‌లు తొడుక్కున్న కోసక్ స్త్రీలు వాటి మధ్యలో అటూ యిటూ వెడతారు. వాళ్ల హుషారైన కేకలూ, నవ్వులూ పశువుల అరుపుల్తో కలిసిపోయి వినిపిస్తాయి. గుర్రంమీద స్వారీ చేస్తూ సాయుధుడైన కోసక్కు ఒకడు, సెలవుమీద వచ్చి, ఓ యింటి ముందు దాకా వెళ్లి, పక్కకి వొంగి కిటికీమీద తడతాడు. యెవరోసన్నెప్పి చూడ్డానికి ఓ అందమైన పడుచు కిటికీదగ్గర ప్రత్యక్షమౌతుంది. యిక ఆ లాలించే, నవ్వే కంఠాలు వినిపిస్తాయి. చిరిగిన బట్టల్తో యెత్తైన చెక్కిళ్లతో వున్న నోగాయ్ కూలివాడు మైదానంనుంచి రెల్లు మోపు తెస్తాడు. క్రిరుమనే తన బండిని కోసక్ కెప్టెన్‌గారి విశాలమైన శుభ్రమైన ముంగిట్లోకి తిప్పుతాడు. తనూ యజమానీ ఒకళ్లతో ఒకళ్లు తాతార్‌లో అరుచుకుంటూ వుండగానే తలలు ఆడిస్తూ నుంచున్న యెద్దుల మెళ్లమీంచి కాడి యెత్తుతాడు. రోడ్డుమీద బురదగుంట వుంటుంది. దాన్ని ఆనుకుని వారనే వున్న కంచెని రాసుకుంటూపోతారు మనుషులు యేటేటా. గుంట దాటుతూ నెత్తిమీద కట్టెల మోపు పెట్టుకున్న చెప్పుల్లేని ఓ కోసక్ స్త్రీ లంగా పైకెత్తి పట్టుకుని, తెల్లని కాళ్లు కనిపిస్తూ వుండగా భారంగా వస్తుంది. వేటనుంచి తిరిగి వస్తూ వున్న కోసక్కు

ఒకడు, తన తుపాకీ ఆమె కేసి యెక్కుపెడుతూ, తమాషాకి అరుస్తాడు: ''యింకా పైకెత్తు, ముండకానా'' అని. ఆ ఆడమనిషి చటుక్కున లంగా వదిలేసి మోపు కింద పడేసుకుంటుంది. ఓ ముసలి కోసక్కు లాగులు పైకి ముడుచుకుని, నెరిసిన ఛాతీ పైకి కనిపించేటట్టు చేపలు పట్టి తిరిగి వస్తూ, వెండి చేపలున్న వల భుజంమీద వేసుకుని వుంటాడు. ఆ చేపలు గిలగిలా యింకా తన్నుకుంటూ వుంటాయి. అడ్డదారికొట్టేద్దామని పక్కవాడి విరిగిపోయిన కంచెమీదనుంచి యెక్కేస్తాడు, అలా చేస్తూ కోటు పట్టుకుంటాడు. ఒక ఆడమనిషి యెండిన కొమ్మని లాగుతూ వుంటుంది. యెక్కణ్ణో పక్కనుంచి గొడ్డలి చప్పుడు వినిపిస్తుంది. కోసక్ పిల్లలు యెక్కడ రోడ్డుమీద సాఫుగా వున్న చోటున్నా చేరి బొంగరాలు తిప్పుతూ కేరింతాలు కొడుతూ వుంటారు. అడ్డదారిన పోడానికి ఆడాళ్ళు కంచెలమీదనుంచి దాటేస్తారు. ప్రతీ యింటి పొగగొట్టంనుంచీ వాసనగల పిడకల పొగలేస్తూ వుంటుంది. ప్రతీ యింటి ఆవరణనుంచీ మాంచి సందడి వినిపిస్తూ వుంటుంది, రాబోయే రాత్రి నిశ్శబ్దాని కది సూచకం.

ఆశ్విక దళంలో కేతనధారి అయిన ఒక కోసక్ భార్య ఉలీత్క మిగతా ఆడవాళ్ళల్లాగానే ముంగిలి గేటుదాకా వెళ్తుంది. ఆవిడ భర్త ఉపాధ్యాయుడు కూడానూ. తన కూతురు మర్యాంకా రోడ్డుమీద తోలుకొస్తూ వున్న పశువుల కోసం చూస్తూ వుంటుంది. తడిక కంచె గేటు యింకా తెరిచీ తెరవకుండానే ఓ పెద్ద గేదె, మశక మేఘూ వృతమైపోయి, అరుచుకుంటూ పరిగెడుతూ దూసుకుని పోతుంది. బలిసిన ఆవులు నెమ్మదిగా దాన్ని అనుసరించి వస్తాయి. యజమాను రాల్ని తమ పెద్ద కళ్ళతో గుర్తించగానే తోకల్ని పక్కలకి ఆడిస్తాయి. పొందికైన అవయవ సౌష్ఠవంతో అందమైన మర్యాంకా గేటు దగ్గరికి వస్తుంది. బెత్తం అవతలికి విసిరేసి తటాల్న గేటు వేసేసి దూళ్ళని శాలలోనికి వేర్పాటు చేసి తోలడానికి చురుగ్గా పరిగెడు

తుంది. ''చెప్పులు తీసెయ్యవే, వెధవ ముండా! అవి చిల్లులు పడేట్టు అరిగిపోతాయక్కడ.'' అని అరుస్తుంది తల్లి. ''వెధవముండా'' అన్నందుకు మర్యాంకా బాధపడలేదు సరికదా అది ముద్దు పిలుపుగా తీసుకుని చిరునవ్వు నవ్వుతూ తన పని చేసుకుపోతుంది. తల చుట్టూతా కట్టుకున్న రుమాలు ఆమె ముఖాన్ని కప్పుతుంది. గులాబీ రంగు గాగరా, ఆకుపచ్చ బెష్మెత్ కట్టుకుంది. వాకిట్లోని పంచపాళీపాకలోకి పెద్ద బలిసిన పశువు వెనకాలే మాయమైపోతుంది. పాకలోనుంచి మృదువుగా బతిమాలుతూ గేదెతో మాట్లాడే మాటలు యువతలికి వినిపిస్తాయి: ''కదలకుండా నుంచోవూ? యేం, మా తల్లివి కదూ, రా, రా మరీ!'' కాసేపటికి ఆ పిల్లా, తల్లీ రెండు పెద్ద కడవల పాలు మోసుకెడుతూ పాకనుంచి వెలపలి యింట్లోకి వెడతారు, ఆ రోజు వచ్చిన పాలవి. వెలపలి యింటి పొగగొట్టంనుంచి పిడకల పల్చటి పొగమబ్బు లేస్తుంది. ఆ పాలని మీగడ ముద్ద చేస్తారు. ఆ పిల్ల మంట యెగసన దోస్తుంది. తల్లి గేటుదగ్గరికి వెడుతుంది. వూరిమీద మునిచీకటి పడింది. గాలి అంతా కూరల వాసనతోటీ, పశువుల వాసనతోటీ, పిడకల పొగ వాసనలోటీ నిండిపోయింది. మండే పీలికలు పుచ్చుకుని కోసక్ స్త్రీలు వీధులంట పరిగెడతారు. పాలు పితుకుతూ వుండే పశువుల బుసలూ, గడ్డి కొరకడం పెరళ్లలోంచి వినిపిస్తూ వుంటాయి. దొడ్లల్లోనూ వీధుల్లోనూ ఒకళ్లనొకళ్లు పిలుస్తూ ఆడవాళ్లా, పిల్లలా కంఠాలే వినిపిస్తూ వుంటాయి. పనిరోజుల్లో తాగుబోతుల గొంతులు వినిపించడం అరుదు.

ఒక కోసక్ భార్య పొడుగ్గా మగరాయుడిలాగా వుండే పెద్దావిడ, యెదరింటినుంచి ఉలీత్కా దగ్గరికి వస్తుంది. దీపం అడుగుతుంది. చేతిలో పీలిక పట్టుకుంది.

''ఏంవమ్మా పనయిపోయిందా?''

''పిల్లి పొయ్యి రాజేస్తోంది. నీకు నిప్పు కావాలా?'' అంటుంది ఉలీత్కా పొరుగావిడకి ఉపకారం చెయ్యగలుగుతున్నానన్న గొప్పతో.

యిద్దరూ యింట్లోకి వెడతారు. సున్నితమైన పనులకి అలవాటు పడని కాయగాచిన చేతులు వణుకుతూ విలువైన అగ్గిపెట్టె మూత తెరుస్తాయి. కాకసస్‌లో అదో అపురూపం.

''మీ ఆయనేడీ? బడిదగ్గరున్నాడా?'' ఆమె అడిగింది.

''ఆc! యెప్పుడూ పసిపిల్లలకి చెబుతూనే వుంటాడు. పండక్కొస్తానని రాశాడు'' అంది ఉలీత్కా.

''అవునతను తెలివైనవాడే. అదీ మంచిదేలే.''

''ఆc. యేదో!''

''మా లుకాష్కా సైనిక చౌకీలో వున్నాడు. వాళ్ళు వాణ్ణింటికి రానివ్వరు'' అందా వచ్చినావిడ, యిదంతా ఉలీత్కాకి యెప్పట్నుంచో తెలిసినా. ఆ వచ్చినావిడ తన లుకాష్కా గురించి మాట్లాడాలనుకొంది, యీమధ్యనే అతన్ని కోసక్ సైన్యంలోకి సంపింది. ఉలీత్కా కూతురు మర్యాంకాని తన కొడుక్కి చేసుకోవాలని ఆవిడ కోరిక.

''అయితే సైనిక చౌకీ దగ్గరున్నాడన్నమాట.''

''ఆc! వున్నాడు. పోయినసారి పండగప్పట్నుంచీ యింటికి రాలేదు. ఫోముష్కిన్ కిచ్చి వాడికి కొన్ని చొక్కాలు పంపాను మొన్న. తను బాగానే వున్నానంటాడు వాడు. పైవాళ్ళ కూడా నచ్చారట. వాళ్ళు మళ్ళీ అబ్రేక్‌లకోసం వెతుకుతున్నారంటాడు. లుకాష్కా హాయిగా వున్నాట్ట, వాడంటాడు.''

''ఏదో, దేవుడి దయవల్ల'' అంది కేతనధారి భార్య. ''ఉర్వన్ వాడికి తగ్గ పేరు.'' లుకాష్కాకి ఉర్వన్, అంటే పట్టుకునిలాగే వాడు, అని ముద్దు పేరు. నీళ్ళల్లోంచి, మునిగిపోయే కుర్రాణ్నొకణ్ణి యివతలికి లాగి రక్షించిన సాహసం వుంది కాబట్టి. ఉలీత్కా దాన్ని

వుద్దేశించి అంది, తను కూడా లుకాష్కా తల్లికి యిష్టంగా వుండే మాటలు చెప్పాలని కొంతా.

''దేవుడి దయవల్ల వాడు మంచి కొడుకే. మంచి ధైర్యం వున్న కుర్రాడు. ప్రతీవాళ్ళూ వాణ్ణి పొగుడుతారు'' అంది లుకాష్కా తల్లి. ''కాని నాకున్న కోరికల్లా వాడికి పెళ్లవడం. అప్పుడు నేను హాయిగా కన్ను మూస్తాను.''

''నిజమే, వూళ్లో బోలెడు మంది పడుచు పిల్లలు లేరూ?'' తన మోటు చేతుల్తో అగ్గిపెట్టె మూతపెడుతూ అంది గడసరి ఉలీత్కా.

''బోలెడు, బోలెడు'' లుకాష్కా తల్లి అంది, తల పంకిస్తూ. ''యిదిగో నీ కూతురుంది, మర్యాంకా. పిల్లంటే అదీ పిల్ల. అలాటి పిల్ల పరగణాలో యెక్కడేనా వుందా!''

లుకాష్కా తల్లి యే ఉద్దేశ్యంతో వుందో ఉలీత్కాకి తెలుసు. లుకాష్కా మంచి కోసక్ అని తెలిసినా ఆవిడ వూగిసలాడులోంది: మొదటిది తను కేతనధారి భార్య, స్థితిమంతురాలు. లుకాష్కా యేమో సామాన్య కోసక్, తండ్రిలేనివాడు. రెండోది తన కూతురి యెడబాటు ఆమె అప్పుడే కోరుకోవడం లేదు. అన్నిటికంటే ముఖ్యమైంది ఔచిత్యం.

''నిజమేలే, మర్యాంకా పెద్దదైతే అదీ పెళ్లీడు కొస్తుంది'' నిదానంగా అణుకువగా అంది.

''పెళ్లి పెద్దల్ని పంపుతాలే, పంపుతా! యేదీ ద్రాక్ష తోట అవనీ అప్పుడు మేం వచ్చి నీకు దణ్ణాలు పెడతాం. ఇల్యా వసీల్యెవిచ్‌కి కూడా దణ్ణాలు పెడతాం'' అంది లుకాష్కా తల్లి.

''ఇల్యా! సరే!'' కేతనధారి భార్య గొప్పగా అంది. ''నువ్వు మాట్లాడాల్సింది నాతో. అన్నీ ఆ శుభఘడియ వచ్చాకా.''

కేతనధారి భార్య మొహంలోని పరుషత్వం చూసి లుకాష్కా తల్లి యెక్కువేం చెప్పడానికీ అప్పుడే సమయం రాలేదని గ్రహించింది. పీరి

కని అగ్గిపుల్లతో వెలిగించుకుని లేస్తూ అంది: ''మమ్మల్ని కాదనకు. నువ్వేమన్నావో గుర్తుంచుకో. సరే, వస్తా, నిప్పురాజేసుకోవాలి.''

మండుతూ వున్న పీలికని తిప్పుతూ ఆవిడ రోడ్డు దాటుతూ వుండగా మర్యాంకా యెదురైంది. ఆ పిల్ల వందనం చేసింది.

''ఆహా! పిల్ల బంగారం కదూ. మంచి పనిమంతురాలు. అదీ పిల్ల. యింకా యెదగడమేమిటి? యీపాటికి పెళ్లయిపోవాలి, యేదో మంచి సంబంధానికి; లుకాష్కతో పెళ్లయి వుండాలి!'' అనుకుంది అందమైన ఆ పిల్లని చూసి.

కాని ఉలీత్కకున్న గొడవలు ఆవిడకున్నాయి. యేదో దీర్ఘంగా ఆలోచిస్తూ గుమ్మంలో కూర్చునే వుంది, పిల్ల పిలిచేదాకా.

## 6

ఆ గ్రామంలోని మగజనాభా అంతా వాళ్ల కాలాన్ని సైనిక దండ యాత్రల్లోనూ, సైనిక చౌకీల్లోనూ — లేకపోతే కోసక్కులన్నట్టు ''స్థావ రాల్లో'' — గడుపుతారు. సాయంత్రం వేళ టెరెక్ ఒడ్డునే వున్న నీజ్నె ప్రోతోచ్కీయ్ స్థావరం దగ్గర, కాపలా బురుజుమీద, ఆ పెద్దా విడలు ప్రస్తావించిన వ్యక్తి లుకాష్క ఉర్వన్ నుంచుని వున్నాడు. బురుజు కమ్ములమీదికి వంగి కళ్లు లగ్నం చేసి కాసేపు దూరంగా టెరెక్ అవతలికేసీ, కాసేపు కిందున్న కోసక్కులకేసీ, చూస్తూ అడపా దడపా వాళ్లతో యేదో మాట్లాడుతూ వున్నాడు. సూర్యుడప్పటికే వూలు మేఘాలపైన ప్రకాశించే హిమపంక్తిని చేరుకుంటున్నాడు. కొండల దిగువన అలల్లా కదిలే మేఘాలు నలనల్లగా మారిపోతున్నాయి. ఆ సాయంత్రపు స్వచ్ఛత గాలిలో కనిపిస్తోంది. యింకా స్థావరం దగ్గర వేడిగా వున్నా, ఒక చల్లదనం అడివినుంచి వస్తోంది. మాట్లాడే కోసక్కుల కంఠాలు ముందటికంటే యింకా బిగ్గరగా కంపిస్తున్నాయి,

గాలిలో తచ్చాడుతున్నట్లున్నాయి. టెరెక్ నదిలో వేగంగా కదిలే జేగురు రంగు నీళ్లు, కదలకుండా వున్న దాని గట్లతో స్పష్టంగా విభేదిస్తున్నాయి. నీళ్లు తగ్గి వెనక్కి పోవడం ఆరంభించాయి. అక్కడక్కడా తడి యిసుక గట్టుదగ్గరా, లోతులేని స్థలాల్లోనూ, బూడిద రంగుగా తళుక్కుమని మెరుస్తోంది. నదికి ఆవలిపక్క స్థావరానికి యెదురుగా నిర్మానుష్యమైంది; కురుచగా పెరిగే రెల్లు మాత్రం దూరంగా విస్తరించింది, పర్వతాలదాకా. ఆ పల్లం ఒడ్డున, కొంచెం ఓ పక్కగా చదును కప్పులూ గరాటాల్లాంటి పొగగొట్టాలూ వున్న చెచెన్ గ్రామపు మట్టి యిళ్లున్నాయి. బురుజుపై నుంచున్న కోసక్కు తీక్ష్ణమైన కళ్లు, ఆ ప్రశాంత గ్రామపు సాయంత్రపు పొగగుండా దూరానికి కనిపించే కదిలే యెరుపురంగూ, నీలం రంగూ దుస్తుల్లో చెచెన్ స్త్రీలని చూస్తూ వున్నాయి.

యే క్షణంలోనేనా అబ్రేక్కులు తాతార్ వేపునుంచి దాటి వచ్చి దాడి చేస్తారని కోసక్కులు కనిపెట్టుకుని వున్నారు, మరీ ముఖ్యంగా అది మే నెల కాబట్టీ, టెరెక్ పక్క అడవులు చొరబారి రావడానికి వీల్లేనంత దట్టంగా వున్నాయి కాబట్టీ, అశ్వికుడు దిగి దాటడానికి వీలైనంత తక్కువ లోతుగా నది వుంది కాబట్టీ. రెండు రోజుల ముందు రెజిమెంటల్ కమాండర్‌నుంచి ఒక పత్రం పట్టుకొచ్చాడో కోసక్కు. యెనమండుగురున్న దళం ఒకటి టెరెక్ దాటివచ్చే ఉద్దేశ్యంతో వున్నట్టు గూఢచారులద్వారా తెలిసినట్టూ, ప్రత్యేక జాగ్రత్త వహించాల్సిందని శాసిస్తున్నట్టూ అందులో వుంది. అయినా కూడా చౌకీ దగ్గర ప్రత్యేకమైన జాగ్రత్తలేమీ వహించడం లేదు. కోసక్కులు యింటి దగ్గరున్నట్టుగా, ఆయుధాల్లేకుండా, గుర్రాలకి జీనుల్లేకుండా తమ కాలాన్ని గడిపేస్తున్నారు, కొందరు చేపలు పడుతూ, కొందరు తాగుతూ, యింకొందరు వేటాడుతూ. విధి నిర్వహించే అశ్వికుడి గుర్రం మాత్రం జీనువేసి సిద్ధంగా వుంది. ఆ గుర్రం కాళ్లు బందం

వేసి వున్నాయి. అది అడివి దగ్గర గచ్చపొదల్లో గెంతుతూ వుంది. పహరావాడు మాత్రం తన సర్కేషియన్ కోటు తొడుక్కుని తుపాకీ, కత్తీ ధరించి వున్నాడు. బక్కపల్చగా, పొడుగ్గా, అసాధారణంగా పొడుగాటి వీపూ, చిన్న చేతులూ, చిన్న కాళ్ళూ వున్న అధికారి, బెష్మెత్‌కి బొత్తాల్లేకుండా, యింటి మట్టి అరుగుమీద కూర్చున్నాడు. అతని ముఖం అధికారులకుండే బద్ధకమైన విసుగెత్తిన కవళికల్తో వుంది. కళ్ళు మూసుకుని తల కాసేపు ఓ చేతిలోనూ, యింకాస్సేపు యింకో చేతిలోనూ సోమరితనంగా ఒరగేసుకున్నాడు. ఓ వయస్సు మళ్ళిన కోసక్కు ఒకడు ఒక్కతీరుగా సుళ్ళు తిరుగుతూ వున్న టెరెక్ నదిలో నీళ్ళకేసి బద్ధకంగా చూస్తూ, నదిపక్కనే చాచుకుని వున్నాడు. అతని గడ్డం వెడల్పుగా, నలుపూ తెలుపూ కలిసివుంది. నల్లటి తోలుపట్టీతో పటకా పెట్టిన చొక్కా తొడుక్కున్నాడు. మిగతా వాళ్ళు కూడా నది ఒడ్డున వేడి యిసకమీద వాలి యెండకి సొలిసిపోయి సగం వొంటిమీద బట్టల్లేకుండా, టెరెక్‌లో బట్టలు వుతుక్కుంటూ కళ్ళేలు అల్లు కుంటూ, కూని రాగాలు తీస్తూ వున్నారు. యెండకి నల్లబడిపోయిన చిక్కిన మొహం కోసక్కు ఒకడు ఆ యింటి దగ్గర పడుకున్నాడు. వాడు స్పష్టంగా చెడతాగాడు. వాడు పడుకున్న గోడకింద రెండు గంటల కితం నీడ వున్నా యిప్పుడు తీక్ష్ణమైన యేటవాలు సూర్య కిరణాలు పడుతున్నాయి.

బురుజుమీద నుంచున్న లుకాష్కా పొడుగ్గా అందంగా వున్న కుర్రాడు. యిరవై యేళ్ల ప్రాయం వుంటుంది. అచ్చం తల్లిలాగానే వుంటాడు. అతని ముఖమూ, ఆమాటకొస్తే మొత్తం శరీరసౌష్ఠవం, యౌవనంలోని పోకడలెన్ని వున్నా, మంచి శక్తిని సూచిస్తోంది, శారీరకంగానూ, నైతికంగానూ. అతను కోసక్కు సైన్యంలో యీమధ్యనే చేరినా అతని ముఖ కవళికల్నిబట్టీ, అతని వైఖరిలోని ప్రశాంత ధీమానిబట్టీ, అతను కోసక్కులకీ, సామాన్యంగా ఆయుధాలు ధరించే అలవాటు వున్న వాళ్లకీ

ప్రత్యేకంగా వుండే స్వాభిమానమూ, వీరోచితమైన నడతా, అప్పటికే సాధించినట్టు స్పష్టంగా కనిపిస్తుంది. అతను తను కోసక్కుననీ, సమర్థవంతుణ్ణనీ గ్రహించినట్టూ కనిపిస్తుంది. అతని విశాలమైన సర్కేషియన్ కోటు కొన్ని చోట్ల చిరిగింది. అతని టోపీ, చెచెన్ పద్ధతిలో నెత్తిమీద తల వెనకభాగాన వుంది. కాలికి తొడుక్కునే తోలు తొడుగు మోకాళ్ళకిందికి ముడిచివుంది. అతని దుస్తులు ఖరీదైనవి కాదు కాని చెచెన్ జిగిత్ అనుకరణగా ప్రత్యేకమైన కోసక్ ఉద్ధతిలో తొడుక్కున్నాడు. నిజమైన జిగిత్‌మీద వుండే ప్రతీదీ వదులుగా, చిరిగిపోయి, నిర్లక్ష్యంగా వుంటుంది, అతని ఆయుధాలు మాత్రమే ఖరీదైనవి. కాని యీ చిరిగిన బట్టలూ, ఆయుధాలూ ఒక టెక్కుగా, పద్ధతిగా జోడైన రీతిలో పటకాపిగించబడి వుంటాయి, వాటిలో దేన్నీ యెవడుపడితే వాడు పొందలేనట్టు. ఆ తీరే ఒక కోసక్కుకి గాని కొండవాడికి గాని కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. లుకాష్కులో యీ జిగిత్ పోలిక వుంది. చేతులు కత్తిమీద ఆన్చి, దాదాపు కళ్ళు నిమీలితంగా వున్నా, అతను దూరంగా వున్న యిళ్ళకేసి చూస్తూ వున్నాడు. విడివిడిగా చూస్తే అతని ఆకృతి లక్షణాలు సొంపుగా వుండవు. కాని అతని చక్కని ఆకృతి, నల్లని కనుబొమలున్న తెలివైన ముఖం చూసిన యెవరేనా అప్రయత్నంగా "యేం చక్కని మనిషి!" అంటారు.

"ఆ ఆడాళ్ళని చూడండి యెంతమంది వున్నారో ఆ వూళ్ళో, నడుస్తూ" అన్నాడు తీక్ష్ణమైన కంఠంతో, తన తెల్లటి మెరిసే పళ్ళు వూరికే కనిపించేటట్టు, యెవర్నీ ప్రత్యేకంగా ఉద్దేశించినట్టు కాకుండా.

కాని కింద పడుకున్న నజార్కా వెంటనే తలపైకెత్తి అన్నాడు:

"నీళ్ళ కోసం వెడుతూ వుంటారు."

"ఓ గుండు పేల్చి నేను వాళ్ళని బెదిరిస్తే! వాళ్ళు భయపడిపోరూ?" అన్నాడు లుకాష్క నవ్వుతూ.

"అంత దూరం వెళ్ళదు."

''ఏమిటీ? నాది యింకా అవతలికి పోతుంది. కొంచెం ఆగు. నేను వాళ్ల విందు వచ్చినప్పుడు గిరీఖాన్ దగ్గరకి వెడతాను. బూజా* తాగుతాను'' అన్నాడు లుకాష్క, చుట్టూచుతా ముసిరిన దోమల్ని కోపంగా తోలేస్తూ.

పొదల్లో అలికిడి యేదో ఆ కోసక్కుల దృష్టిని మళ్లించింది. పొడల వేట కుక్క ఒకటి నేల వాసన చూస్తూ, బొచ్చులేని తోకను ఆడిస్తూ సైనిక చౌకీ దగ్గరికి పరుగెత్తుకు వచ్చింది. అది తన పొరుగా యన, వేటగాడు యెరోష్క మామ కుక్క అని లుకాష్క గుర్తించాడు. వెంటనే కుక్కని అనుసరించి పొదలోనుంచి వేటగాడు తనే రావడం చూశాడు.

యెరోష్క మామ మంచులా తెల్లటి విశాలమైన గడ్డం, విశాలమైన భుజాలూ, ఛాతీ వున్న కోసక్ ఆజాను బాహువు. ఆ అడవిలో, అతనితో పోల్చడానికి యెవరూ లేనిచోట ప్రత్యేకంగా పొడగరి అని అనిపించడు. యెందుకంటే అతని బలిష్ఠమైన అవయవ పొందిక అతని యెత్తుకు తగినట్లు అంత అమరి వుంటుంది. చిరిగిన కోటు తొడుక్కున్నాడు. కాళ్లని కట్టేసిన పట్టీలమీద, బాగు చెయ్యని లేడి చర్మం చెప్పులు తాడుతో కట్టేసి తొడుక్కున్నాడు. తలమీద చిన్న తెల్లటి ముతక టోపీ, అడివికోళ్లని వేటాడేటప్పుడు వెనకాల దాంకోడానికి భుజంమీద ఒక తెర, గద్దలకి ఎరగా సంచీలో పెట్టనీ, చిన్న డేగనీ మోసుకెడతాడు. రెండో భుజంమీద అతను చంపిన బావురుపిల్లి తోలు దట్టీతో కట్టేసి వుంది. పటకాలో తుపాకీ గుళ్ళూ, మందుగుండూ, రొట్టే వున్న సంచీ దోపుకున్నాడు. దోమల్ని తోలుకోడానికి గుర్రపు తోక ఒకటి వుంది. పాత రక్తపు మరకలతో చిరిగిన ఒరలో పెద్ద

---

* ధాన్యంనుంచి తయారుచేసిన తాతారు బీరు. — సం.

బాకు, రెండు చంపిన అడివి కోళ్లు; సైనిక చౌకీ కేసి చూసి అతను ఆగాడు.

''ఏయ్! లియామ్'' అని కుక్కని పిలిచాడు. ఆ ధ్వని యెంత ఖంగుమని కంపింపింపచేసేటంటే దూరంగా అడివిలో ప్రతిధ్వనించింది. కోసక్కులు 'ఫ్లింటా' అని పిలిచే, బలంగా అదిమే తుపాకీ భుజంమీద వేసుకుని, టోపీ యెత్తాడు.

''యీవేళ బాగా గడించినర్రా?'' అన్నాడు కోసక్కులనుద్దేశించి, అదే హుషారైన బింకపు గొంతుకతో, సునాయాసంగా, కాని యెవర్నో అవతలి ఒడ్డునున్న వ్యక్తిని పిలుస్తున్నంత గట్టిగా.

''బాగానే, ఫరవాలేదు మామా!'' అన్ని వేపులనుంచీ హుషారుగా యువ కోసక్ కంఠాలు బదులు చెప్పాయి.

''మీరేం చూశారు, చెప్పండి. అసలేం జరిగిందీ యేమిటీ అంతా!'' అన్నాడు యెరోష్కా మామ, కోటు చేత్తోటి తన వెడల్పాటి యెర్రటి ముఖంమీద చెమటని తుడుచుకుంటూ.

''యీ ప్లేన్ చెట్టుమీద ఒక గద్ద వుంది, మామా. రాత్రవగానే గిరికీలు కొట్టడం మొదలెడుతుంది'' అన్నాడు నజార్కా, భుజమూ కాలూ కదుపుతూ, కనుసైగచేస్తూ.

''ఏంటీ? యిక్కడే?'' అన్నాడు ముసలాడు నమ్మలేనట్టు.

''అవును, మామా, నువ్వుండి చూడు'' అన్నాడు నజార్కా నవ్వుతూ.

మిగిలిన కోసక్కులు నవ్వడం మొదలెట్టారు. ఆ కొంటెవాడు యే గద్దనీ చూళ్లేదు. యెరోష్కా మామ వాళ్ల దగ్గరికి వచ్చినప్పుడు అక్కడి కోసక్కులకి అతన్ని అలా యేడిపించి ఆటపట్టించడం అలవాటు.

''ఫో, వెధవా, అస్తమానూ అబద్ధమాడ్డమే'' బురుజుమీదనుంచి లుకాష్కా అన్నాడు, నజార్కా కేసి.

నజార్కా వెంటనే వూరుకున్నాడు.

''సరే దాన్ని కనిపెట్టాలి, చూస్తాను'' అన్నాడా ముసలాడు. కోసక్కు

లందరికీ సరదావేసింది. ''అడివి పందులేమన్నా చూశారా మీరు? అడివి పందులు?''

''పందుల కోసం చూడ్డవాఁ!'' అన్నాడా అధికారి ముందుకి వంగి రెండు చేతుల్తోటీ వీపు గోక్కుంటూ, కాసేపు ఆటవిడుపు దొరి కిందన్న సంతోషంతో. ''వేం యిక్కడ వున్నది అ(బేక్కుల కోసం, పందుల కోసం కాదు! నువ్వేం వినలేదూ, మామా? విన్నావా?'' అన్నాడు, అనవసరంగా కళ్ళు లగ్నంచేసి తెల్లటి కుదురైన పళ్ళు యికిలిస్తూ.

''అ(బేక్కులా?'' అన్నాడు ముసలాడు. ''లేదు, నే చూళ్ళేదు. సరే గాని చిఖిర్* యేమన్నావుందా, కాస్త యివ్వండ(రా బాగా అలిసి పోయాను. యీ సారి మీకు మంచి మాంసం తెచ్చిపెడతాను, ఒట్టు! తప్పకుండా, వూఁ, కొంచెం చుక్క'' మళ్ళీ అడిగాడు.

''పర్లే, నువ్వు కాపుకాస్తావా?'' అడిగాడు అధికారి, ముసలాడు చెప్పింది విననట్టు.

''ఓ రా(త్రికి కాసలా కాస్తానన్నాగా? యేమో, పండక్కి దేవుడి దయవల్ల యేదో కొట్టకపోతానా! అప్పుడు మీకూ వాటా వుంటుంది. నిజంగానే, మీకూనూ'' బదులుచెప్పాడు యెరోష్క.

''మావాఁ! ఓయ్, మామోయ్!'' పైనుంచి ఒక్క ఉదుట్న అరి చాడు లుకాష్క, అందరి దృష్టి ఆకర్షిస్తూ. కోసక్కులంతా అతని కేసి చూశారు. ''నది యెగువ కెళ్ళు కొంచెం. అక్కడ మాంచి అడివి పందుల మంద వుంది. నేను కల్పించి చెప్పడం లేదు! నిన్న మా కోసక్కు ఒహడు ఒకదాన్ని చంపాడు. నిజం'' తుపాకీ సవరించు కుంటూ, తను పరిహాసం ఆట్టంలేదనే గొంతుకతో అన్నాడు.

---

* యింట్లో తయారు చేసుకునే కాకేసియన్ వైన్. — సం.

‘‘ఓరి ఓరి! లుకాష్కా ఉర్వన్, యిక్కడున్నావా!’’ అన్నాడు ముసలాడు పైకి చూస్తూ. ‘‘నువ్వు చెప్పే కోసక్కు యెక్కడ వేటాడాడు?’’

‘‘నన్ను చూళ్లేదా? నేను నీకెక్కడ అనతాను!’’ అన్నాడు లుకాష్కా. ‘‘యీ కందకం దగ్గరే’’ చాలా గంభీరంగా అన్నాడు తలపంకిస్తూ. ‘‘మేం కందకం పక్కనే పోతున్నాం, యేదో చిటచిట వినిపించేటప్పటికి. నా తుపాకీ యేమో ఒరలో వుంది. అప్పుడు ఇల్యా పేల్చాడు.... కాని నీకోచోటు చూపిస్తా; పెద్ద దూరంలేదు. కొంచెం తాళు. వాటి దార్లన్నీ నాకు తెలుసు.... మోసేవ్ మామా’’ అన్నాడతను అధికారికేసి తిరిగి నిబ్బరంగా, దాదాపు ఆజ్ఞాపిస్తున్నట్టు. ‘‘పహారావాణ్ణి మార్చే వేళ అయింది’’ అంటూ తుపాకీ భుజాన్న వేసుకుని కిందికి దిగడం మొదలెట్టాడు, అనుమతి కోసం ఆక్కుండానే.

‘‘కిందికి రా’’ అన్నాడు అధికారి లుకాష్కా బయల్దేరింతర్వాత. చుట్టూ చూశాడు. ‘‘యీ సారి నీ వంతా గూర్కా? పైకెళ్లు.... తస్సాగొయ్యా, మీ లుకాష్కా అసలైన వేటగాడు అయిపోయాడు’’ ముసలాడి కేసి తిరిగి అన్నాడు. ‘‘నీలాగే యెప్పుడూ తిరుగుతూ వుంటాడు, యెప్పుడూ యింటి దగ్గరుండడు. మొన్న ఓ అడివి పందిని కొట్టాడు.’’

## 7

సూర్యుడప్పటికే అస్తమించాడు. రాత్రి చీకట్లు అడివి అంచునుంచి వేగంగా విస్తరిస్తున్నాయి. ఆ కోసక్కులు సైనిక చౌకీ దగ్గర తమ పనులు ముగించుకుని మకాం దగ్గర రాత్రి భోజనాలకి పోగయారు. ఆ ముసలాడు మాత్రం గద్దకోసం చూస్తూ, డేగ కాలుకి కట్టిన తాడు లాగుతూ ప్లేన్ చెట్టు దగ్గర వుండిపోయాడు. కానీ గద్ద ఒకటి నిజంగా అక్కడ పొంచి కూర్చున్నా ఎర లన్నుకుపోవడానికి యిష్టం కనబర్చలేదు. లుకాష్కా పాట తర్వాత పాట పాడుకుంటూ

దట్టంగా వున్న గచ్చపొదల్లో, అడవికోళ్ళని పట్టడానికి వలలు అమరుస్తున్నాడు. పొడుగాటి ఆకారం, పెద్ద చేతులూ అయినా ప్రతీ పనీ, సున్నితమైందైనా మోటుదైనా, లుకాష్కా వేళ్ళకి నలిగిందే.

"ఓయ్, లుకా!" దగ్గరున్న పొదనుంచి వచ్చింది, గింగురుమనే తీక్ష్ణమైన నజార్కా కంఠం. "కోసక్కులు భోజనానికి లోపలికి పోయారు." గచ్చపొదల మధ్యనుంచి దారి చేసుకుంటూ, చంకలో బతికున్న అడివి కోడిని పట్టుకుని కాలిబాటమీదకి వూడి పడ్డాడు నజార్కా.

"ఓరోరి!" అన్నాడు లుకాష్కా పాటను మధ్యలో వదిలేసి. "అడివి కోడిని యెక్కడ సంపాదించావు? నా వలలో దేమో!"

నజార్కా లుకాష్కా యీడువాడే. అతను పోయిన వసంతకాలంనుంచే సైన్యంలో వున్నాడు. సాదాగా, బక్కపల్చగా, చిన్నగా వుంటాడు. చెవులు గింగురుమనే కీచు కంఠం. వాళ్ళిద్దరూ యిరుగుపొరుగువాళ్ళు, స్నేహితులు. తాతార్‌లాగా కాళ్ళు మడం వేసి వలలు సర్దుకుంటూ గడ్డిమీద కూర్చున్నాడు లుకాష్కా.

"యెవరిదో నాకు తెలీదు – నీదేనేమో ననుకుంటా."

"గొయ్యికవతల ప్లేన్ చెట్టు దగ్గరుందా? అయితే నాదే. నేను రాత్రి వలలు పన్నాను."

లుకాష్కా లేచి పట్టుబడిన అడివికోడిని పరిశీలనగా చూశాడు. నల్లగా నిగనిగలాడే దాని తల నిమిరాడు. అది భయంతో మెడ చాచింది. కళ్ళు తిప్పింది. లుకాష్కా దాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు.

"రాత్రికి దీన్ని పలావ్ చేయిద్దాం. నువ్వు దీన్ని చంపి యీకలు పీకు."

"దీన్ని మనమే తినేద్దామా? అధికారికిద్దామా?"

"వాడికిప్పటికే బోలెడయ్యాయి."

"వాటిని చంపటం నాకిష్టం వుండదు" నజార్కా అన్నాడు.

"దాన్నిలా యిచ్చెయ్యి!"

లుకాష్క బాకు కిందనుంచి చిన్న కత్తిని తీసి కనక్కనిపించాడు. ఆ పక్షి కొట్టుమిట్టాడింది. అది రెక్కలు చాచే లోపుగానే రక్తం కారి, దాని తల వంగి, కంపించింది.

''అదీ పద్ధతి'' అన్నాడు లుకాష్క అడివికోడిని కింద పడేస్తూ. ''యిది సుష్ఠుగా పలావ్ అవుతుంది.''

నజార్కు ఆ పక్షి కేసి చూసి కంపించిపోయాడు.

''యిదిగో, లుకాష్కా, మళ్లీ రాత్రికి మాటు వెయ్యడానికి యీ పిశాచం మనల్ని పంపిస్తాడు'' అన్నాడతను, పక్షిని తీస్తూ. (అతను అధికారిని ఉద్దేశించాడు.) ''ఫోముష్కిన్‌ని వైన్ తెమ్మని పంపించాడు. అది వాడి వంతన్నావి. ప్రతీ రాత్రీ మనమే వెళ్లాలి! యెప్పుడూ మన నెత్తినే రుద్దుతాడు.''

సైనిక చౌకీ వారనే యీల వేసుకుంటూ వెళ్లాడు లుకాష్క.

''ఆ తాడు తీసికెళ్లు'' కేకేసాడతను.

నజార్కు అలాగే చేసాడు.

''యీవేళ వాడికి తెలిసేటట్టు చేస్తాను, తప్పకుండా. 'మేం వెళ్లమని' చెప్పేద్దాం; మనకి ఓపిక లేదు. దీనికి అంతులేదేటిహ! వుహుం, నిజంగానే వాడికి చెప్పెయ్యి; నువ్వు చెబితే వాడు వింటాడు. యిది మరీ దరిద్రంగా వుంది'' అన్నాడు నజార్కు.

''పోరా! పెద్ద రాద్ధాంతం చేస్తున్నావేంటి?'' అన్నాడు లుకాష్క. దేన్ని గురించో ఆలోచిస్తున్నట్టన్నాడు. ''చెత్త, బాబూ! వాడీ రాత్రికి మనల్ని వూళ్లోనుంచి పంపేస్తే మంటగానే వుంటుంది. అక్కడేదో కాలక్షేపం చెయ్యొచ్చు. కాని యిక్కడ, యిక్కడేముంది చెయ్యడానికి? మనం చౌకీలో వున్నా, మాటులో పొంచి వున్నా ఒకటే, యేం మని షివిరా, నువ్వు!''

''అయితే వూరికి పోతావా?''

''పండక్కి పోతాను.''

''మీ దున్నైకా ఫోముష్కిన్‌తో కథ నడిపిస్తోందట, గూర్కా అన్నాడు'' హఠాత్తుగా అన్నాడు నజార్కా.

''సరే యెలాగో చావనీ'' అన్నాడు లుకాష్కా వరసైన తెల్లటి పళ్ళు కనిపించేటట్టు, నవ్వకపోయినా. ''నాకింకెవ్వరూ దొరకనట్టు!''

''గూర్కా చెప్పిందేమిటంటే దానింటికి వెళ్ళాట్ట. దాని మొగుడు లేట్ట. ఫోముష్కిన్ అక్కడ కూర్చున్నాట్ట, యేదో తింటూ. గూర్కా కొంచెం సేపు వుండి వెళ్ళి పోయాట్ట. కిటికీ పక్కన పోతూ దాని మాటలు విన్నాట్ట. 'పోయాడా, శనిగాడు.... యేం? కజ్జికాయ తింటంలేదు, బుజ్జీ? నువ్వీ రాత్రికి వెళ్ళక్కర్లేదు' అందిట. కిటికీ దగ్గర గూర్కా అన్నాట్ట 'బాగుంది, అలా వుండాలి!' ''

''నువ్వు అల్లుతున్నావ్.''

''ఛ, దేవుడితోడు.''

''సరే, అదింకొకణ్ణి చూసుకుంటే దాన్నఘోరించనీ'' అన్నాడు లుకాష్కా కొంచెమాగి. ''పిల్లలకేం కరువులేదు. యేమైనా అదంటే నాకు మొహం మొత్తింది.''

''సరే, నువ్వెంత చవటవో చూడు. ఆ కేతనధారి కూతురు మర్యాంకాతో సఖ్యంగా వుండాలి. ఆ పిల్ల యెవరితోటే కలవదేం?'' అన్నాడు నజార్కా.

లుకాష్కా కనుబొమలు ముడిచాడు. ''ఓహో మర్యాంకానా! వాళ్ళంతా ఒకటే మచ్చు'' అన్నాడు.

''పోనీ ఒక సారి ప్రయత్నించు....''

''యేమిటి నీ ఉద్దేశ్యం? వూళ్ళో యిక అమ్మాయిలు లేరా?''

లుకాష్కా యీల వెయ్యడం మొదలెట్టాడు. సైనిక చౌకీకి నడిచాడు, పొదలనుంచి ఆకులు తుంచుతూ. హఠాత్తుగా ఓ లేత మొక్కని చూసి బాకు పిడిలోని కత్తిని తీసి దాన్ని నరికాడు. ''భలే దట్టింపు కర్ర అవుతుంది'' అన్నాడు, గాలిలో సుయ్‌మనేదాకా దాన్ని తిప్పుతూ.

కోసక్కులు మట్టితో అలికిన యివతలి గదిలో నేలమీద కురచ తాతార్ బల్ల దగ్గర కూర్చుని వున్నారు. మాటులో యెవరు పొంచి వుండాలా అన్న సమస్య వచ్చింది.

''యీ రాత్రికి యెవరెళ్ళాలి?'' అన్నాడో కోసక్కు, పక్క గదిలో వున్న అధికారికి, తెరిచి వున్న గుమ్మంలోనుంచి.

''అవును, యెవరు?'' అధికారి తిరిగి కేకేశాడు. ''బుర్లాక్ మాసు వెళ్ళాడు, ఫోముష్కిన్ కూడా'' అన్నాడతను సందేహంగా. ''మీరిద్దరూ వెళ్ళండి, నువ్వూ, నజార్కా'' అన్నాడు లుకాష్కా కేసి తిరిగి. ''యెర్గుషోవ్ కూడా వెడతాడు. యీపాటికి బాగా తాగి పడుకున్నాడేమో. కైపు దిగిపోయివుండాలి.''

''మీకెలాగూ కైపు దిగదు, వాడికెందుకు దిగాలి?'' అన్నాడు నజార్కా సన్నని గొంతుకతో.

కోసక్కులు నవ్వారు.

గుడిసె దగ్గర తాగేసి పడుకున్న కోసక్కే యెర్గుషోవ్. ఆ క్షణంలోనే అతను తూలుతూ కళ్ళు నులుముకుంటూ గదిలోకి వచ్చాడు.

లుకాష్కా అప్పటికే లేచాడు. తుపాకీ సిద్ధం చేసుకున్నాడు.

''వెంటనే పొండి! తిళ్ళు తిని పొండి!'' అన్నాడు అధికారి. ఒప్పుకున్న సూచన కోసం ఆక్కుండానే తలుపేసుకున్నాడు. కోసక్కులు తన మాట వింటారనే నమ్మకం అతనికి లేదని తెలుస్తూనే వుంది. ''మరి నాకు ఆజ్ఞలేకపోతే నేను యెవర్నీ పంపివుండేవాణ్ణిగాను. కాని యే క్షణంలోనేనా ఓ ఆఫీసర్ రావచ్చు. యిప్పటికే యెనమండుగురు అబ్రేక్కులు దాటి వచ్చారంటారు వాళ్ళు'' అన్నాడతను.

''సరే, మనం వెళ్ళాలి కదా. అదే నియమం. యిలాంటప్పుడేం చెయ్యలేం. మనం వెళ్ళాలి'' అన్నాడు యెర్గుషోవ్.

యీలోపున రెండు చేత్తులోటీ అడివికోడి మాంసం ముక్కని నోటి దగ్గర పెట్టుకుని ఓ సారి నజార్కా కేసీ, ఓ సారి అధికారి

కేసీ చూస్తూ యేం జరిగిందో పట్టనట్టే వున్నాడు లుకాష్కా. వాళ్లి ద్దరి కేసీ నవ్వాడంతే. మాటులోకి పోవడానికి వాళ్లు తయారయేముందు, రాత్రయే దాకా, నిష్ప్రయోజనంగా, ప్లేన్ చెట్టు కింద నుంచున్న యెరోష్కా మామ ఆ చీకటి గదిలోకి వచ్చాడు.

"బాగుంది, అబ్బాయిలూ," కప్పు యెత్తు తక్కువగా వున్న ఆ గదిలో అతని బిగ్గరగా అరిచే కంఠధ్వని మిగతా గొంతుకల్ని ముంచేస్తూ ప్రతిధ్వనించింది. "నేనూ వస్తున్నా మీతోటి. మీరు చెచెన్ల కోసం కాయండి, నేను అడివిపందుల కోసం."

8

యెరోష్కా మామా, ఆ ముగ్గురు కోసక్కులూ పై అంగీలతోటీ, భుజాలమీద తుపాకులతోటీ ఆ స్థలం వదిలి టెరెక్ ఒడ్డున వాళ్లు మాటుండే చోటికి వెళ్లేటప్పటికి బాగా చీకటైంది. నజార్కా వెళ్లకూడ దనుకున్నాడుగాని లుకాష్కా కేక లేసాడు. వాళ్లు వెంటనే బయల్దేరారు. నిశ్శబ్దంగా కొంచెం దూరం వెళ్లాక వాళ్లు కందకం నుంచి పక్కకి తిరిగి దాదాపు రెల్లు మూసిన దారిన నది దగ్గరకు వెళ్లారు. ఒడ్డున మందంగా నల్లగా వున్న దుంగ ఒకటుంది. అది నీళ్లల్లో కొట్టుకొచ్చింది. చుట్టూతా వున్న రెల్లుని యీమధ్యనే కొట్టేసారు.

"యిక్కడ వుందామా?" అన్నాడు నజార్కా.

"యెందుకుండ కూడదు?" బదులు చెప్పాడు లుకాష్కా. "యిక్కడ కూర్చోండి, నేనిప్పుడే వస్తా. మామ కెక్కడ కెళ్లాలో చూపిస్తా నంతే."

"యిది భేషైన చోటు; యిక్కణ్ణుంచి మనం చూడచ్చుగాని, మనం కనిపించం" అన్నాడు యెర్గుషోవ్. "అంచేత యిక్కడ మాటుందాం. యిదే అసలు చోటు!"

నజార్కా, యెర్గుషోవ్ పై అంగీలు పరిచి దుంగ వెనకాల చతికిలబడ్డారు, లుకాష్కా యెరోష్కా మామతో వెళ్లాడు.

''యిక్కడికి పెద్ద దూరం కాదు, మామా'' అన్నాడు లుకాష్కా మెల్లిగా ముసలాడి ముందుకి అడుగేస్తూ. ''అవెక్కడున్నాయో నీకు చూపిస్తా — తెలిసిన వాణ్ణి నేనొఖణ్ణే.''

''అదీ దారి! నువ్వు గట్టివాడివి, సిసలైన ఉర్వన్‌వి!'' అన్నాడు ముసలాయన తనూ మెల్లిగా మాట్లాడుతూ.

కొద్ది అడుగులు ముందుకెళ్లి, లుకాష్కా ఆగాడు. ఓ నీటి కుంట మీదికి వంగి యీల వేసాడు. ''అదిగో, అవి నీళ్లు తాగడానికి వచ్చిన చోటు, కనిపిస్తోందా?'' వినిపించీ వినిపించనట్టుగా అన్నాడు, కొత్తగా పుస్ప గిట్టల గుర్తుల కేసి చూపిస్తూ.

''దేవుడు నిన్ను చల్లగా చూస్తాడు, నాయనా '' అన్నాడు ముసలాడు. ''పంది గుంట అవతల పల్లంలో వుండచ్చు. నేను కాపుంటాలే, నువ్వెళ్లు'' అన్నాడు.

పైఅంగీ యింకా పైకి లాక్కుని లుకాష్కా ఒక్కడూ వెనక్కి వెళ్లాడు, కాసేపు యెడమవైపున రెల్లు గోడ కేసీ, కాసేపు ఒడ్డుకింద ప్రవహించే టెరెక్ కేసీ చురుకు చూపులు విసురుతూ. ''ఎక్కణ్నో వాళ్లలో ఒహడు కాపుకాస్తూనో, పాకుతూనో వుండి వుంటాడు నిస్సందేహంగా'' అనుకున్నాడు, చెచెన్ కొండవాడు వుండ వచ్చుని. హఠాత్తుగా పెద్ద గలగలా, నీళ్లు తుళ్లినట్టు పడ్డ చప్పుడూ అతన్ని నిలబెట్టేసి తుపాకీ పట్టుకునేటట్టు చేసాయి. ఓ అడివి పంది గుర్రుమంటూ ఒడ్డు కిందనుంచి ఎగిరింది. నీళ్ల తళుక్కులో దాని నల్లటి ఆకార రేఖలు ఒక్క క్షణం కనిపించి రెల్లులో మాయ మయ్యాయి. లుకాష్కా తుపాకీ యెక్కుపెట్టి గురి చూశాడు. కాల్చే లోపునే పంది పొదల్లోకి మాయమైపోయింది. లుకాష్కా చిరాగ్గా తుపుక్కున ఉమ్మేశాడు. మాటు దాపు చేరి మళ్లీ ఆగాడతను,

మెల్లిగా యీలవేసాడు. అతని యీలకి జవాబు వచ్చింది. అతను మిత్రుల దగ్గరికి నడిచాడు.

పరిచిన బట్టమీద ముడిచి పెట్టుకుపోయి నజార్క అప్పటికే నిద్రపోతున్నాడు. కాళ్ళు మడం వేసుకుని కూర్చున్నాడు యెర్మశోవ్. లుకాష్కకి చోటివ్వడానికి కొంచెం జరిగాడు.

''మాటులో పొంచి వుండటం భలే! నిజంగా బాగుందీ చోటు. అతన్నక్కడికి తీసుకెళ్ళావా?'' అన్నాడతను.

''ఎక్కణ్ణో చూపించానతనికి'' అన్నాడు లుకాష్క తన పైఅంగీ పరుస్తూ. ''యెంత పెద్ద పందిని యిప్పుడు లేవగొట్టాను, నీళ్ల పక్కనే! అదే యిదనుకుంటాను. అది చేసిన చప్పుడు విన్లేదా నువ్వు?''

''నేను విన్నాలే. వేటే ననుకున్నాను. నేననుకున్నాను: 'లుకాష్క వేటని లేవగొట్టాడు' '' యెర్మశోవ్ అన్నాడు, పైఅంగీ కప్పుకుంటూ. ''నేను నిద్రపోతా. కోళ్ళు కూసినప్పుడు లేపు. మనకి క్రమశిక్షణ వుండాలి. నేను పడుకుని కునుకు తీసి లేస్తా. అప్పుడు నువ్వు కునుకు తీద్దువు గాని నేను కాపలా కాస్తా – అదీ పద్ధతి'' అన్నాడు.

''నేను నిద్రపోను'' అన్నాడు లుకాష్క.

ఆ రాత్రి చీకటిగా, వెచ్చగా, నిశ్శబ్దంగా వుంది. ఆకాశంలో ఒక వేపునే నక్షత్రాలు మెరుస్తున్నాయి. మిగిలిన పెద్ద భాగాన్ని కొండ శిఖరాలనుంచి విస్తరించిన పెద్ద నల్లని మేఘం ఆవరించింది. గాలి లేదు. కొండలతో కలిసిపోయిన మేఘం నెమ్మదిగా ముందుకు సాగుతోంది. దాని వంపులు తిరిగిన అంచులు గంభీర నక్షత్రాకాశంలో స్పష్టమైన రేఖల్తో కనిపిస్తూ వున్నాయి. తనకి ముందున్న భాగంలోనే ఆ కోసక్ టెరెక్‌నీ, అవతలి దూరాన్నీ స్పష్టంగా చూడగలడు. వెనకాతల రెండు వేపులా రెల్లు గోడ అతన్ని ఆవరించింది. అడపా దడపా ఆ రెల్లు అటూ యిటూ కదిలి ఒక దాన్ని ఒకటి కొట్టుకుని గుంయ్‌మంటోంది, వూరికేనే. కిందనుంచి చూస్తే వాటి కదిలే చివళ్ల

వినీలాకాశపు నేపథ్యంలో చెట్టు చిగురు కొమ్మల్లాగా వున్నాయి. దగ్గరసా, తన కాళ్ల దగ్గరే ఒడ్డు వుంది. కింద వడిగా ప్రవహించే నీళ్ళు. యింకొంచెం కిందగా ప్రవహించే తళుకుమనే జేగురు నీళ్ళ, ఒడ్డునారగా లోతులేని చోట్ల, లయబద్ధంగా సుళ్ళు తిరుగుతున్నాయి. యింకా కింద నీళ్ళూ, ఒడ్డూ, మేఘం, కళ్ళు పొడుచుకున్నా కని పించని చీకట్లో కలిసిపోయాయి. నీళ్ళపైన నల్లని నీడలు తేలుతూ వస్తున్నాయి. అవి ప్రవాహానికి కొట్టుకొచ్చే కాండాలని అనుభవం వున్న కోసక్ గ్రహిస్తాడు. సకృత్తుగా మాత్రం వేసవి మెరుపు నల్లని అద్దంలో మాదిరీ నీళ్ళల్లో ప్రతిఫలించి యేటవాలుగా వుండే అవతలి ఒడ్డుని కనిపించేటట్టు చేస్తుంది. లయబద్ధంగా వున్న ఆ రాత్రి శబ్దాలూ రెల్లు నవసవా, కోసక్కుల గురకా, దోమల రొదా, నీళ్ల ప్రవాహమూ యెక్కడో దూరంగా మధ్యమధ్యన పేలే తుపాకీ చప్పు డులో భగ్నం అయేవి, లేదా ఒడ్డున వున్న మట్టిపెళ్ల రాలిపడితే నీళ్ళల్లో కలిగే గలగలవల్లా ఓ చేప యెగరడంవల్లా, అడివిపొదల్లో దూసుకుపోయే జంతువు చప్పుడువల్లా. ఓసారి ఓ గుడ్లగూబ లయబద్ధంగా రెండు రెక్కలూ ఒక సారి కొట్టుకునేటట్టూ, ఒకో సారి కొట్టు కోకుండానూ టెరెక్‌మీదుగా యెగిరింది. సరిగ్గా కోసక్కుల నెత్తిమీద అది అడివివైపు మలుపుతిరిగి, ప్రతి రెండవసారీ కాకుండా, ప్రతిసారీ రెక్కలు కొట్టుకునేటట్టు ఆడుతూ పాత ప్లేన్ చెట్టు దగ్గరికి యెగిరి చాలా సేపు చప్పుడు చేసి అప్పుడు కొమ్మల మీద వాలింది. అనుకోని యీ ప్రతి చప్పుడూ ఆ కోసక్ యేకాగ్రతతో విన్నాడు, తుపాకీ నిదానంగా అందుకుంటూ, కళ్ళు లగ్నంచేస్తూ.

ఆ రాత్రి చాలా భాగం గడిచింది. పశ్చిమంగా కదిలిన మేఘం వినీల నక్షత్రాకాశాన్ని వెల్లడి చేస్తూ తునకలై విడిపోయింది. పైకి తిరిగిన బంగారు నెలవంక కొండలమీద యెర్రటి కాంతితో ప్రకాశి స్తోంది. చలి తీవ్రం అవుతోంది. నజార్కా లేచి యేదో గొణిగి, మళ్లీ

నిద్రలోకి జారిపోయాడు. లుకాష్క విసుగెత్తి నుంచున్నాడు. బాకు పిడిలోనుంచి కత్తిని లాగాడు. కర్రని దట్టింపు కర్రగా చెక్కడం మొద లెట్టాడు. కొండలకవతల వున్న చెచెన్ల గురించే బుర్రంతా ఆలోచనలు. వాళ్ళ ధైర్యవంతులైన కుర్రాళ్ళు యెలా అడ్డం పడివచ్చేదీ, కోసక్కు లంటే యెలా భయం లేకుండా వుండేదీ, ఆ క్షణంలో కూడా యెక్కడ్నో ఒక చోట నదిని దాటుతూ వుండవచ్చుననేదీ యివే ఆలోచనలు. యెన్నో సార్లు మాటునుంచి తల పైకెత్తి నది వారగా చూసాడు. కాని యేమీ కనిపించలేదు. మధ్యమధ్యన అలా నదికేసీ, అవతలి ఒడ్డు కేసీ చూస్తూనే వుండేవాడు. మసక వెన్నెల్లో అవతలి ఒడ్డు యిప్పుడు నీళ్లకంటే విడిగా, అస్పష్టంగానైనా, కనిపించింది. అతను చెచెన్ల గురించి ఆలోచించడంలేదు యిక. యెప్పుడు మిత్రుణ్ని లేపేసి వూళ్ళోకి యింటికి పోయే సమయం అవుతుందా అని ఆలోచిస్తున్నాడు. వూళ్లో తన దున్యైకా, కోసక్కులు తమ ప్రియురాళ్లని పిలుచుకున్నట్టు తన బంగారు కొండ, గురించి వూహించుకున్నాడు. ఆమెని గురించి చిరాగ్గా అనుకున్నాడు. వెండి పొగమంచు నీళ్లపైన ప్రకాశిస్తోంది. అతనికి దగ్గర్లోనే చిన్నగద్దలు కూస్తూ రెక్కలల్లల్లాడిస్తున్నాయి. యివి రాబోయే ప్రభాత సూచికలు. కడకి, దూర గ్రామంనుంచి ఒక కోడికూత వినవచ్చింది. దాన్ననుసరించి దీర్ఘంగా యింకో కోడి కూత, అలా అలా యింకా కూతలు.

''వాళ్లని లేపచ్చు'' అనుకున్నాడు లుకాష్క. తన దట్టింపు కర్ర పూర్తి చేశాడు. కళ్ళు బరువెక్కినట్టనిపించింది. మిత్రుం కేసి తిరిగి యెవరి కాళ్ళు యెవరివో ఆనవాలు పట్టాడు. ఆ క్షణంలో టెరెక్ అవతలి ఒడ్డున నీళ్లలో యేదో దభేలుమన్న శబ్దం వినిపించింది. కొండలకావలి దిఙ్మండలం కేసి తిరిగాడు. పైకి తిరిగిన చంద్రవంక దిగువన వేకువ రేకలు విచ్చుకుంటున్నాయి. అవతలి గట్టు స్తూల రేఖలకేసీ, టెరెక్‌కేసీ, యిప్పుడు దానిమీద స్పష్టంగా కొట్టుకొచ్చే

దుంగల కేసీ చూశాడు. తనే కదులుతున్నట్టూ, కొట్టుకొచ్చే దుంగల తోటి టెరెక్ నిశ్చలంగా వున్నట్టూ ఒక క్షణం అనిపించింది. మళ్ళీ తేరిపార చూశాడు. కొమ్మ వున్న పెద్ద నల్ల దుంగ ముఖ్యంగా అతని దృష్టిని ఆకర్షించింది. ఆ దుంగ వింతగా నది మధ్య నుంచి తేలుతోంది, వూగడమూ లేదు, సుళ్ళు తిరగడమూ లేదు. ప్రవాహంతో పాటు తేలుతూపోతూ వున్నట్టు కాకుండా, లోతు తక్కువగా వున్న చోటికి, నదిని దాటుతున్నట్టు కూడా కనిపించింది. మెడ సారించి తదేక దీక్షగా పరీక్షించాడు లుకాష్క. ఆ దుంగ మిట్ట కేసి తేలింది, ఆగింది. ఓ ప్రత్యేకమైన పద్ధతిలో దిక్కు మార్చింది. దాని కింద నుంచి ఓ చెయ్యి బయటికి చాచుకు వచ్చినట్టు లుకాష్కకి అనిపించింది.

"నా అంతట నేనే ఓ అబ్రేక్ని చంపేస్తే!" అనుకున్నాడు. తుపాకీ తీసుకుని వేగంగా, హడావుడి లేకుండా కదుల్తూ, తుపాకీ కుదురు అమర్చి, తుపాకీ దానిమీద చప్పుడు చెయ్యని స్థితిలో వుంచి పట్టుకున్నాడు. తుపాకీ గుర్రం వెనక్కి లాగి వూపిరి బిగపట్టి, అతని కళ్ళు చీకట్లో వెదుకుతూవుంటే గురిపెట్టడం మొదలెట్టాడు.

"వాళ్ళని లేపను" అనుకున్నాడు. కాని అతని గుండె యెంత వేగంగా కొట్టుకుంటోందంటే, ఆలకిస్తూ అలాను వూగిసలాడాడు. అకస్మాత్తుగా ఆ దుంగ నీళ్ళలో ఒక మునక వేసి మళ్ళీ ప్రవాహానికి అడ్డంగా అతనికేసి తేలుతూ రాసాగింది....

"నేను గురితప్పకూడదు!..." అనుకున్నాడు. ఆ మసక వెన్నెలలో, తేలుతూవున్న దుంగ ముందు ఓ తాతార్ తల కొంచెం కనిపించిందతనికి. సరిగ్గా తలకేసి గురిపెట్టాడు. చాలా దగ్గరగా వున్నట్టు కనిపించింది — సరిగ్గా తుపాకీ గొట్టం చివర. ఆ గురి సూచకం నుంచి కళ్ళు పైకెత్తాడు. "సందేహం లేదు, అబ్రేక్!" సంతోషంగా అనుకున్నాడు. తటాల్న మోకాళ్ళమీద లేస్తూ మళ్ళీ గురిపెట్టాడు.

తన పొడుగాటి తుపాకీ చివర, సరిగ్గా ఆ గుర్తు పెట్టేసి, చిన్నతనంలో నేర్చుకున్న కోసక్ పద్ధతిలో అనుకున్నాడు: ''దేముడూ, ఆయన కుమారుడూ సాక్షిగా,'' తుపాకీ గుర్రం నొక్కాడు. ఒక క్షణంపాటు కాంతివంతమైన మెరుపు నీళ్ళనీ, దెబ్బనీ ప్రకాశింప చేసింది. ఆ తీక్ష్ణమైన ఆకస్మికమైన గుండు శబ్దం నదికి అడ్డంగా దూసుకు పోయింది, దూరంగా యెక్కడికో హోరుగా శబ్దం చేస్తూ. ఆ దుంగ యిప్పుడు అడ్డంగా కాకుండా ప్రవాహంతోపాటుగా తేలుతూ పోయింది, వూగుతూ, సుళ్ళు తిరుగుతూ.

''వాణ్ణి పట్టుకోండ్రోయ్!'' యెర్గుషోవ్ అరిచాడు, తన తుపాకీ కోసం వెతుక్కుంటూ, తను ఏడుకున్న దుంగ వెనకాలనుంచి లేస్తూ.

''ఛవ్ నోర్మూయ్యరా, నాకొడకా!'' పళ్ళు కొరుకుతూ మెల్లిగా అన్నాడు లుకాష్క. ''అబ్రేక్కులు!''

''ఎవర్నీ కాల్చింది నువ్వు? యెవరది లుకాష్క?'' అడిగాడు నజార్క.

లుకాష్క మాట్లాడలేదు. తుపాకీలో మందు మళ్ళీ దట్టించు కుంటూ, తేలుతూవున్న దుంగకేసి చూస్తున్నాడు. కొంచెం దూరంలో వో యిసక తిన్నెమీద అది ఆగింది. వెనకనుంచి నీళ్లలో వూగే యేదో పెద్దది కంటికి ఆనింది.

''ఏంటి చంపావ్ నువ్వు? మాట్లాడవేం'' నిర్బంధించేరు ఆ కోసక్కులు.

''అబ్రేక్కులు అని చెప్పడం లేదూ?'' అన్నాడు లుకాష్క.

''ఆ సంగతి చాల్లే, నీ తుపాకీ పేలిందా?...''

''నేనో అబ్రేక్‌ని చంపాను. నే చేసిందదీ'' ఉద్రేకంతో గద్గదికమై పోతూ వున్న గొంతులో, కాళ్లమీద నిలబడుతూ గొణిగాడు లుకాష్క. ''ఓ మనిషి యీదుతూ వున్నాడు....'' అన్నాడు యిసక తిన్నెకేసి చూపిస్తూ. ''వాణ్ణి చంపాను. అదుగో అక్కడ చూడండి.''

''మాకు కథలు చెప్పకు!'' అన్నాడు యెర్మొషేవ్ మళ్లీ, కళ్లు నులుముకుంటూ.

''యేంటి చెప్పకూ? అక్కడ చూడు'' అన్నాడు లుకాష్క, అతనెంత బలంగా భుజం పట్టుకుని లాగాడంటే యెర్మొషేవ్ మూలిగాడు.

లుకాష్క చూపించిన వేపు చూసాడతను. ఆ కళేబరాన్ని చూసి వెంటనే గొంతు మార్చాడు.

''ఓర్నీ! కాని యింకా వచ్చేవాళ్లుంటారేమో! నిజం!'' అన్నాడు మెల్లిగా. తన తుపాకీ పరీక్షించడం మొదలెట్టాడు. ''అడ్డంగా యీదుకొచ్చే గూఢచారి వాడు; మిగతా వాళ్లు యిప్పటికే యిక్కడుండివుంటారు, లేకపోతే అవతలి వేపునేనా, దూరంగా వుండి వుండరు, నిజం!''

లుకాష్క పటకా వదులు చేసుకుని, సర్కేషియన్ కోటు విప్పేస్తూ వున్నాడు.

''ఏమిట్రా నువ్వు, వెధవా?'' గట్టిగా అరిచేడు యెర్మొషేవ్. ''అంత గొప్పలు పోయేవంటే ఛస్తావ్, యెందుకూ పనికి రాకుండా, నిజం! వాణ్ణి చంపేవుంటే వాడు పారిపోడు. యేదీ నాక్కూడా నా తుపాకీ బిళ్లలోకి కొంచెం మందు యియ్యి. యేమన్నా వుందా నీ దగ్గర? నజార్క, నువ్వు చౌకీదగ్గరకి తొందరగా వెళ్లు. ఒడ్డమ్మటే వెళ్లకు, చంపేస్తారు, నిజం!''

''నేనొఖ్ఖణ్ణీ వెళ్లనా! నువ్వే పో!'' అన్నాడు నజార్క కోపంగా.

లుకాష్క కోటు విప్పేసి గట్టు కేసి కిందికి దిగి వెళ్లాడు.

''వెళ్లకు, నే చెప్తున్నా!'' అన్నాడు యెర్మొషేవ్, తన తుపాకీలో మందు దట్టిస్తూ. ''చూడు, వాడు కదలడం లేదు. నాక్కనిపిస్తోంది. యెలాగూ తెల్లవారుతోంది. చౌకీనుంచి వాళ్లొచ్చేదాకా ఆగు. నువ్వు వెళ్లిపోరా, నజార్క. భయపడతున్నావేం, భయపడకు, నిజం!''

''లుకా, ఒరేయ్, లుకాష్కా! యెలా జరిగిందో చెప్పరా!'' అన్నాడు నజార్కా.

నీటిలోకి వెళ్లే ఆలోచన మార్చుకున్నాడు లుకాష్కా.

''చౌకీ దగ్గరకి త్వరగా వెళ్లు, నే కాపలా వుంటా. కోసక్కుల తోటి కాపలావాళ్లని పంపమని చెప్పు. అబ్రేక్కులు యీ వేపున వుంటే వాళ్లని పట్టుకోవాలి.''

''అదే నే చెప్పేదీనీ. వాళ్లు జారిపోతారు. వాళ్లని పట్టెయ్యాలి'' అన్నాడు యెర్గుషోవ్ లేస్తూ.

యెర్గుషోవ్, నజార్కా లేచారు. దైవస్మరణ చేసి చౌకీ దగ్గరికి బయల్దేరారు – నది గట్టమ్మటేకాదు, గచ్చపొదల్లోనుంచి అడ్డంపడి అడివి దారిలోకి చొచ్చుకుంటూపోయారు.

''జాగ్రత్త, లుకాష్కా, కదలద్దు – వాళ్లు నిన్నిక్కడ చీల్చేస్తారు, అంచేత నాలుక్కళ్లతో జాగ్రత్తగా వుండు'' అన్నాడు యెర్గుషోవ్, వెళ్లిపోతూ.



''ఫొండి, నాకు తెలుసు'' గొణిగాడు లుకాష్కా. తుపాకీ పరీక్షించి మళ్లీ దుంగ వెనకాల కూర్చున్నాడు.

లుకాష్కా ఒంటరిగా వున్నాడు. మిట్టకేసి చూస్తూ కోసక్కుల జాడ కోసం కూర్చున్నాడు. కాని చౌకీ కొంచెం దూరంలో వుంది. అతను ఆత్రంతో నలిగిపోతున్నాడు. తను చంపిన అబ్రేక్‌తో వుండే మిగిలిన వాళ్లు పారిపోతారని అనుకుంటూ వున్నాడు. ముందు సాయంత్రం పారిపోయిన పందంటే యెంత చిరాకు కలిగిందో పారిపోబోయే అబ్రేక్కులంటేనూ అంతే కలిగింది. చుట్టూ చూస్తూ, అవతలి గట్టుకేసి చూశాడు. ప్రతీ క్షణం ఓ మనిషి కనిపిస్తాడని చూస్తూ, తుపాకీ కుదురు సిద్ధం చేసి, కాల్చడానికి సిద్ధంగా వున్నాడు. అతనిని చంపేస్తారేమోనన్న వూహ అతని బుర్రకి తట్టనేలేదు.

## 9

తెల్లవారుతోంది. ఆ చెచెన్ కళేబరం లోతు తక్కువ నీళ్లల్లో మెల్లిగా వూగుతూ స్పష్టంగా కనిపిస్తోంది. హఠాత్తుగా లుకాష్క దగ్గర్లోనే రెల్లు గుజగుజ లాడింది. పదధ్వనులు వినిపించాయి. రెల్లు దుబ్బు మెత్తని తలలు కదలడం చూశాడు. తుపాకీ గుర్రం పూర్తిగా లాగిపట్టి గొణిగాడు "దేవుడూ, ఆయన కుమారుడూ సాక్షిగా." తుపాకీ క్లిక్ మనేటప్పటికి అడుగుల చప్పుడు ఆగింది.

"ఓయ్, కోసక్కులూ! మీ మామని చంపకండి!" అంది గాఢ మంద్రస్వరం తొట్రుపడకుండా. రెల్లుని పక్కకి తొలగిస్తూ యెరోష్క మామ లుకాష్క దగ్గరగా వచ్చాడు.

"కొంచెంలో చంపేసి వుండేవాణ్ణి. దేవుడి తోడు!" అన్నాడు లుకాష్క.

"యేమిటీ నువ్వు కాల్చావా?" అడిగాడు ముసలాడు. అతని ఖంగు మనే కంఠం అడవిగుండా, నదిమీదుగా ప్రతిధ్వనించింది, ఆ కోసక్కుని ఆవరించివున్న రాత్రి నిగూఢ ప్రశాంతతని ఒక్క ఉదుటున భగ్నంచేస్తూ. ప్రతీదీ హఠాత్తుగా కాంతివంతమైనట్టూ స్పష్టమైనట్టూ వుంది.

"అదిగో, మామా, నువ్వేం చూళ్లేదు కాని నేనో జంతువుని చంపాను" అన్నాడు లుకాష్క తుపాకీ గుర్రం వదిలేసి, అస్వాభావిక మైన నెమ్మదితనంతో లేస్తూ.

ఆ ముసలాడు తదేకంగా తెల్లటి వీపు కేసి చూస్తున్నాడు. యిప్పుడది స్పష్టంగా కనిపిస్తోంది. టెరెక్ సన్నటి అలలు చుట్టూ తాకుతూ వున్నాయి.

"వీపుమీద దుంగ పెట్టుకుని యీదుతూ వున్నాడు. కాని నేను వాణ్ణి గమనించాను, అప్పుడు.... అక్కడ చూడు, అక్కడ! వాడికి నీలం లాగూ, తుపాకీ వున్నాయనుకుంటున్నాను.... నీకు కనిపిస్తున్నాయా?" అడిగాడు లుకాష్క.

“ఆఁ! చూస్తున్నాను!” అన్నాడు ముసలాడు కోపంగా. గంభీర మైన పరుషమైన కవళిక అతని ముఖంమీద కనిపించింది. “సువ్వొక జిగిత్‌ని చంపావు” అన్నాడతను విచారంతో కనిపించేటట్టు.

“ఆఁ! నేనిక్కడ కూర్చున్నాను. హఠాత్తుగా అవతలి పక్క నల్లగా వున్నదేదో చూసాను. యింకా అక్కడ వుండగానే వాణ్ణి గుర్తు పట్టాను. అక్కడికెవరో మనిషి వచ్చి పడిపోయినట్టుగా వుంది. చిత్రంగా వుందనుకున్నాను. అప్పుడు ఓ కొట్టుకొచ్చే దుంగ, కొంచెం సుమా రైందే, తేలుతూ వచ్చింది, ప్రవాహంతో బాటు గాదు, అడ్డంగా; మరి నాకేం కనిపించిందనుకున్నావ్, దాని కిందనుంచి ప్రత్యక్షమైన తల! చాలా చిత్రం! రెల్లునుంచి యివతలికి చూసాను, కాని యేం కనిపించదు; అప్పుడు నుంచున్నాను. వాడు వినేవుంటాడు, దొంగ వెధవ. మిట్టలోకి పోయి తొంగి చూసాడు. వాడు అక్కడ ఆగి చుట్టూ తా చూడగానే ‘అబ్బే, నీ వల్ల కాదు, నువ్వు జారిపోలేవు!’ అనుకున్నాను. (నాకు గొంతు బిగపట్టినట్టు అయింది!) తుపాకీ సిద్ధం చేసుకున్నాను, కాని కదల్లేదు. నిదానించాను. వాడు కొంచెం తాళి మళ్లీ యీదడం మొదలెట్టాడు. వాడు వెన్నెల్లోకి వచ్చే సరికి వాడి వీపు కనిపించింది, మొత్తం. ‘దేవుడూ, ఆయన కుమారుడూ, పవిత్ర భూతం సాక్షిగా....’ ఆ పొగలోనుంచి అతను కొట్టుమిట్టాడ్డం చూశాను. అతను మూలిగాడు, నాకలా అనిపించింది. ‘హేయ్! దేవుడిదయ, వాణ్ణి నేను చంపేసాను!’ అనుకున్నాను. వాడు యిసక తిన్నె దగ్గరికి కొట్టుకు వచ్చేటప్పటికి వాణ్ణి స్పష్టంగా చూడగలిగాను; లేద్దామని ప్రయత్నించాడు గాని వాడి వల్ల కాలేదు. కొంచెం గిజగిజలాడి పడి పోయాడు. ప్రతీదీ చూశాను. చూడు, వాడు కదల్డు – వాడు చచ్చే వుండాలి! మన మిగిలిన వాళ్లు చౌకీదగ్గరికెళ్లారు ఒక వేళ వాళ్లలో యింకా యెవరేనా వుంటారేమోనని.”

''వాళ్లను పట్టరు!'' అన్నాడు ముసలాడు. ''యిప్పుడు వాళ్లెక్కడో దూరంగా వున్నారు, నాయనా!'' మళ్లీ విచారంగా తల పంకించాడు.

సరిగ్గా అప్పుడే నదివెంబడి గుర్రాలమీదా, కాలి నడకనా సమీపిస్తూన్న కోసక్కుల పెద్ద కంఠాలూ, దుబ్బుల్ని తొలగించే ధ్వనీ విన్నాడు.

''పడవ తెచ్చారా?'' అరిచాడు లుకాష్క.

''నువ్విప్పుడు మొనగాడివి, లుకా! దాన్ని గట్టుకి లాగు'' అరిచాడో కోసక్.

పడవ కోసం ఆక్కుండా లుకాష్క బట్టలు విప్పుకోవడం మొదలెట్టాడు, అంత సేపూ తను చంపినవాడిమీద కన్నేసి వుంచి.

''ఓ క్షణం ఆగు, నజార్క పడవ తెస్తున్నాడు'' కేకేశాడు అధికారి.

''ఒరేయ్ వెధవా, వాడింకా బతికున్నాడేమో, నాటకం ఆడుతున్నాడేమో! బాకు తీసికెళ్లు!'' యింకో కోసక్ అరిచాడు.

''అక్కర్లేదు'' అరిచాడు లుకాష్క లాగు విప్పుకుంటూ. తొందరగా బట్టలు విప్పేసి, దైవస్మరణ చేసి నదిలోకి దూకాడు. తెల్లని చేతులతో పెద్ద బారలు చాస్తూ నీళ్లమీద యెత్తుగా వీపు తేలుస్తూ, గట్టిగా గాలి పీలుస్తూ పెరెకెకడ్డంగా మిట్టల కేసి యీదుకు పోయాడు. కోసక్కుల గుంపు బిగ్గరగా మాట్లాడుకుంటూ ఒడ్డున నుంచున్నారు. ముగ్గురు అశ్వికులు పహారా కాయడానికి పోయారు. నది మలుపు దగ్గర పడవ కనిపించింది. లుకాష్క మిట్టమీద నుంచుని, కళేబరంమీదకి వంగి, రెండు సార్లు కుదిపాడు. ''చచ్చాడు! శుభ్రంగా!'' కీచు కంఠంతో అరిచాడు.

ఆ చెచెన్ తలకి గుండు తగిలింది. నీలం లాగూ, చొక్కా, సర్కేషియన్ కోటూ తొడుక్కున్నాడు. వెనకాతల ఓ తుపాకీ, బాకూ కట్టేసి వున్నాయి. అన్నిటికీ పైన ఓ కొమ్మ కట్టివుంది, మొదట్లో లుకాష్కకి భ్రమ కలిగించిందదే.

''యేం గండుచేపని పట్టావురా నువ్వు'' అన్నాడు అక్కడ వృత్తంగా

గుమికూడిన కోసక్కులలో ఒకడు, ఆ కళేబరాన్ని పడవలోనుంచి యెత్తి నేలమీద గడ్డి అణిగేటట్టు పడేస్తున్నప్పుడు.

''యెంత పసుప్పచ్చగా వున్నాడో!'' అన్నాడింకొకడు.

''మనవాళ్లు వెతకడానికెక్కడికి పోయారు? మిగతా వాళ్లు అవతలి ఒడ్డున వున్నారనుకుంటాను. ఈదు నేగు కాకపోతే అలా యీది వుండడు. వాడొక్కడే యెందుకు యీత్తాడు?'' అన్నాడు మూడోవాడు.

''మిగతావాళ్ల కంటే ముందే దొరికిపోదామనుకున్న బుద్ధిమంతు డేమో, సిసలైన జిగిత్!'' అన్నాడు లుకాష్క వెటకారంగా. అతను గట్టుకింద నుంచుని తడిసీన బట్టలు పిండుకుంటూ వణుకుతున్నాడు. ''గడ్డం రంగేసివుంది, క్షవరం చేయించుకున్నాడు.''

''యీదడానికి సులువుగా వుంటుందని కోటు సంచీలో కట్టేసి వీపుమీద తగిలించి వుంది'' యెవరో అన్నారు.

''యిదిగో, లుకాష్క'' శవంమీదనుంచి తీసిన తుపాకీ, బాకూ పట్టుకుని అన్నాడు అధికారి. ''ఆ బాకు నువ్వుంచేసుకో, కోటు కూడా. కాని యీ తుపాకీకి నీకు మూడు వెండి రూబుళ్లు యిస్తాను. చూశావా, తుపాకీ గొట్టం అంత బాగుండలేదు'' అన్నాడు గొట్టం లోకి వూత్తూ. ''యిది వూరికే జ్ఞాపకార్థం కావాలంతే నాకు.''

లుకాష్క మాట్లాళ్లేదు. యీ మాదిరి అడుక్కోడం అతనికి చిరాకేసింది. కాని దాన్ని తప్పించుకోలేమని అతనికి తెలుసు.

''దొంగవెధవ'' అన్నాడతను ముఖం చిట్లించుకుని ఆ చెచెన్ కోటుని విసిరేస్తూ. ''మంచి కోటేనా వేసుకున్నాడు కాదు, యిది వుత్త పీలిక!''

''వంట చెరకు మోసుకురావడానికి పనికొస్తుందంతే'' కోసక్కులలో ఒకడన్నాడు.

''మోసేవ్, నేనింటికి పోతా'' అన్నాడు లుకాష్క పై అధికారికి

బహుమతి యిచ్చిందానికి లాభం పొందాలని, తన చిరాకు శుభ్రంగా మర్చిపోయి.

''తప్పకుండా నువ్వేళ్లొచ్చు.''

''శవాన్ని చౌకీ దగ్గరికి తీసుకుపోండి, అబ్బాయిలూ'' అన్నాడు అధికారి, యింకా తుపాకీ పరీక్షించుకుంటూ. ''యెండ తగలకుండా యేదేనా వాడిమీద కప్పండి. కొండల్లోనుంచి వాళ్లు వీణ్ణి సొమ్మిచ్చి విడిపించుకోడానికి పంపవచ్చు.''

''యింకా యెండెక్కలేదు'' అన్నాడొకడు.

''నక్కేదేనా వీణ్ణి పీకేస్తే? అది బాగోదు, యేమంటావ్?'' అన్నాడింకో కోసక్.

''కాపలా పెడతాం; వాళ్లు కొనుక్కుపోడానికొస్తే వీణ్ణి నక్కలు పీకెయ్యడం బాగోదుకదా.''

''సరే, లుకాష్క, నువ్వేమన్నా చెప్పు, వీళ్లకి నువ్వు ఓ కడవ చిఖిర్ పోయించాల్సిందే'' అధికారి హుషారుగా అన్నాడు.

''దాన్దేముంది! అది ఆచారం'' వంత పలికారు కోసక్కులు. ''చూడు, దేవుడు నీకెంత అదృష్టం యిచ్చాడో! యింకా జీవితంలో అడుగెట్టలేదు, అప్పుడే ఓ అబ్రేక్కుని చంపావ్ నువ్వు!''

''యీ బాకూ, కోటూ కొనెయ్యండి, పిసినారిగా వుండొద్దు. యీ లాగు కూడా యిచ్చేస్తాను, నాకు మరీ బిగుతైపోతుంది. వాడో ఒంటి నరం వెధవ'' అన్నాడు లుకాష్క.

ఓ కోసక్ ఒక రూబుల్‌కి కోటు కొనుక్కున్నాడు. యింకోడు రెండు కడవల వోడ్కా ఖరీదు బాకుకి యిచ్చాడు.

''తాగండ్రా, బాబూ! ఓ కడవ యిస్తా. నేనే దాన్ని వూరినుంచి తెస్తా'' అన్నాడు లుకాష్క.

''యీ లాగుని ఆడపిల్లలకి రుమాళ్లుగా కత్తిరించండెహే!'' అన్నాడు నజార్క.

ఆ కోసక్కులు పగలబడి నవ్వారు.

"చాలింక నవ్వడం! శవాన్ని తీసికెళ్లండి, యీ దరిద్రాన్ని గుడిసె దగ్గర పడేస్తారా?" అన్నాడు అధికారి.

"దేని కోసం అలా నుంచుంటారు? లాగండ్రా అబ్బాయిలూ!" కోసక్కుల నుద్దేశించి అరిచాడు లుకాష్కా ఆజ్ఞాపిస్తున్న ధోరణిలో. అతను తమ అధికారైనట్టు అతని ఆజ్ఞ మన్నించి, అయిష్టంగానే ఆ శవాన్ని పట్టుకున్నారు వాళ్లు. కొద్ది అడుగుల దూరం ఆ కళేబరాన్ని లాగి దాని కాళ్లు వదిలేసారా కోసక్కులు. అవి నిర్జీవంగా నేలకి జారిపోయాయి. పక్కకి జరిగి కాసేపు నిశ్శబ్దంగా నుంచుండి పోయారు వాళ్లు. నజార్కా ముందుకి వచ్చి ఓ పక్కకి తిరిగిన తలని సరిజేసాడు, కణతల దగ్గరున్న గుండ్రని గాయం, చచ్చిపోయినవాడి మొహం, మొత్తం కనిపించేటట్టు.

"చూడండి యెలాటి ఆనవాలు అయిందో, తిన్నగా మెదడులో. వాడు మారిపోడు. వాడి యజమానులు యెప్పటికీ గుర్తుపట్టగలరు!" అన్నాడతను.

యెవళ్లూ మాట్లాడ్లేదు. అంతా నిశ్శబ్దమైపోయింది.

సూర్యుడు పైకి యెక్కాడు. ఆ చీలిన కిరణాలు మంచుతో తడిసిన పచ్చికమీద ప్రకాశిస్తున్నాయి. దగ్గర్లోనే టెరెక్ గొణుగుతోంది. నిద్ర లేచిన అడివిలో ఉదయానికి అభివాదం చేస్తున్నట్టు అడివికోళ్లు ఒకదాన్నొకటి పిలుస్తున్నాయి. ఆ కోసక్కులు నిశ్చలంగా, నిశ్శబ్దంగా చచ్చినవాడి చుట్టూతా నుంచున్నారు వాణ్ణే చూస్తూ. కృశించిన కడుపు చుట్టూతా మొలకట్టుతో కట్టబడివున్న నీలం లాగు తప్ప యేమీ లేని కావిరంగు శరీరం మంచి సౌష్ఠవంగా, సుందరంగా వుంది. కండరాలు తేలిన చేతులు పక్కకి పడివున్నాయి. ఒక పక్కన గడ్డకట్టిన గాయంతోటి, నీలంగా, కొత్తగా గుండుగీసిన తల వెనక్కివాలి వుంది. కమలిన నున్నటి నొసటికీ గుండుకీ తీక్ష్ణ

మైన తేడా వుంది. తెరుచుకున్న గాజు లాంటి కళ్ళు నిశ్చలమైన కనుపాపలతోటి పైకి తేరివున్నాయి, ప్రతీదాన్ని దాటి యెక్కడో చూస్తున్నట్టుగా. ఎర్రని, ఒత్తైన మీసాలకింద చక్కని పెదాలు మూలలకి సాగి చురుకైన, సరదా అయిన పరిహాసానికి చిరునవ్వు నవ్వుతున్నట్టు బిగిసిపోయి వున్నాయి. పల్చటి మణికట్లు వెంట్రుకలతో వున్నాయి. వేళ్ళు లోపలికి వంగాయి. గోళ్లు మాత్రం యెర్రరంగు వెయ్యబడి వున్నాయి.

లుకాష్కా బట్టలు వేసుకోలేదు. తడిసిపోయి వున్నాడు. మామూలు కంటే అతని మెడ యెర్రగానూ కళ్లు కాంతివంతంగానూ వున్నాయి. వెడల్పాటి చెక్కిళ్లు వణుకుతున్నాయి. ఆరోగ్యవంతమైన అతని తెల్లటి శరీరంనుంచి ఆ లేత ఉదయపు గాలిలో, కనిపించీ కనిపించని, ఆవిరి లేస్తోంది.

''వాడు సాహసికుడే!'' అతను గొణిగాడు, ఆ శవాన్ని మెచ్చుకుంటూ.

''అవును, నువ్వు వాడి చేతిలో పడివుంటే నీకేం కనికరం దక్కి వుండేది కాదు'' అన్నాడు కోసక్కులలో ఒకడు.

మళ్లీ కలకలం అయింది. ఆ కోసక్కులు సందడి చేస్తూ మాట్లాడు కోవడం మొదలెట్టారు. నీడపట్టుకోసం పొదలు నరకడానికి యిద్దరు వెళ్లారు. మిగతావాళ్ళు చౌకీ కేసి నడిచారు. లుకాష్కా, నజార్కా వూళ్ళోకి వెళ్లడానికి తయారవడం కోసం పరిగెత్తారు.

టెరెక్‌ని వూరినుంచి విడదీసే దట్టమైన అడివిలో దాదాపు పరిగెడుతూ, యెడతెరిపి లేకుండా మాట్లాడుకుంటూ యింటికెళ్లే దారిలో వున్నారు లుకాష్కా, నజార్కా అరగంట తర్వాత.

''జాగ్రత్త, నేను నిన్ను పంపించానని దానితో చెప్పకు. వూరికే వెళ్లి దాని మొగుడు యింటి దగ్గరున్నాడేమో చూడు'' లుకాష్కా తన తీక్ష్ణ స్వరంతో అన్నాడు.

"నేనూ యామ్కా దగ్గరికి పోతా, మజా చేద్దాం, యేం?" అన్నాడు విధేయుడైన నజార్కా.

"యింకెప్పుడు చేస్తాం యివాళ కాకపోతే?" అన్నాడు లుకాష్కా.

వూరు చేరాక ఆ యిద్దరూ తాగి సాయంత్రం దాకా పడుకోడానికి ఒరిగారు.

## 10

యీ సంఘటన జరిగిన మూడవ రోజున కాకసస్ పదాతి సైన్యం లోని రెండు దళాలు నోవొమ్లీన్స్కయా గ్రామానికి వచ్చాయి. గుర్రాల్ని విప్పేసిన బలగాల వాహనాలు చౌకులో నుంచున్నాయి. వంటవాళ్లు గాడి తవ్వి అనేక పెరళ్లనుంచి (భద్రంగా తగినంత నిలవ వుంచని చోట్లనుంచి) పోగుచేసిన వంట చెరకుతోటి వంటలు వండుతున్నారు. సార్జంట్ మేజర్లు పేర్లు పిలుస్తున్నారు. సైన్య సహాయక దళం వాళ్లు గుర్రాల్ని కట్టడానికి నేలమీద రాటలు పాతుతున్నారు. క్వార్టర్ మాస్టర్లు తమ యిళ్ల దగ్గరున్నట్టుగా, వీధుల్లో తిరుగుతున్నారు, ఆఫీసర్లకీ జవాన్లకీ మకాం చూపిస్తూ.

ఆకుపచ్చ మందుగుండు పెట్టెలు ఒక వరసలో వున్నాయి. బలగపు వాహనాలూ, గుర్రాలూ వున్నాయి. జావ వండుతూవుండే అండాలున్నాయి. ఒక కేప్టెన్, ఒక లెఫ్టినెంట్, సార్జంట్ మేజర్ ఒనీసిమ్ మిహైలొవిచ్ వున్నారు. బలగాలు ఈ కోసక్ గ్రామంలో మకాం చెయ్యాల్సిన చోటుగా ఆజ్ఞ వచ్చింది. వాళ్లలో ప్రతి ఒకడూ కులాసాగా వున్నాడు.

కాని వాళ్లు అక్కడెందుకు మకాంచేసారు, కోసక్కులు యెవరు, ఆ బలగం అక్కడ వుండాలని వాళ్లడిగారా, వాళ్లు పాత విశ్వాసాల వాళ్లా కాదా? అదంతా అనవసరం. పనిలోనుంచి విశ్రాంతి దొరికి, అలిసిపోయి దుమ్ము కొట్టుకుని, ఆ సైనికులు గొడవగా, ఓ పద్ధతి

లేకుండా, స్థిరపడ్డానికి ప్రయత్నించే తేనెటీగల దండులా చౌకంలా, వీధులన్నీ వ్యాపించారు.

కోసక్కుల మంటని యేమీ పట్టించుకోకుండా, హుషారుగా మాట్లాడుకుంటూ తమ తుపాకీలు చప్పుడు చేస్తూ వుంటే, యిద్దరూ ముగ్గురూ జట్లుగా వాళ్లు యిళ్లలోకి ప్రవేశించి తమ సరంజామా వేలాడదీసీ, సంచులు విప్పుకునీ, ఆడవాళ్లతోటి వేళాకోళాలాడుతూనూ వున్నారు. తమ ప్రియమైన చోటు, జావ అండాల చుట్టూతా చాలామంది సైనికులు పోగయారు. వాళ్లు పళ్ల మధ్య చిన్న పైపులు పెట్టుకుని, వేడిగా వున్న ఆకాశంకేసి లేచి దట్టమైన మేఘంలా తయారయే పొగకేసి కాసేపూ స్వచ్ఛమైన గాలిలో కరిగిన గాజులా రెపరెపలాడే మంటకేసి కాసేపూ చూస్తూ వున్నారు. కోసక్ ఆడాళ్లనీ, మగాళ్లనీ యెగతాళి పట్టించారు, యెందుకంటే వాళ్లు అసలు రష్యన్లలా వుండరు కనక. అన్ని ముంగిళ్లలోనూ సైనికులూ, వాళ్ల నవ్వులూనూ. అలాగే, విసుగెత్తిపోయి తమ యిళ్లని జాగ్రత్త పెట్టుకుంటూ ఆ సైనికులకి నీళ్లూ వంట పాత్రయూ లేవనే కోసక్ స్త్రీల కీచు కంఠాలు వినిపిస్తున్నాయి. చిన్న పిల్లలు తల్లులకీ, ఒకళ్లనొకళ్లకీ, అంటుకుపోయి సైనికుల చర్యలన్నీ భయంతో కూడిన ఆతృతతో చూస్తూ వుండిపోయారు (వాళ్లు అంతకు ముందేమీ చూసి యెరగరు) లేకపోతే తగినంత దూరంలోనో వాళ్ల వెనకాలో పరిగెత్తారు.

ముసలి కోసక్కులు విచారకరమైన నిశ్శబ్దంతో యివతలికి వచ్చి, యిళ్ల చుట్టూతా వుండే మట్టి అరుగులమీద కూర్చుని, సైనికుల చర్యలు చూస్తూ వుండిపోయారు, యేం జరుగుతోందో తమకి యేమీ బోధపడనట్టు లేదా పట్టనట్టు.

మూణ్ణెల్ల క్రితం పటాలంలో కేడెట్‌గా చేరిన ఒలేనిన్ వూళ్లో వున్న మంచి యిళ్లలో ఒక దాంట్లో బస చేశాడు, కేతనధారి ఇల్యా వసీల్యెవిచ్ యింట్లో, అంటే ఉలీత్క యింట్లో.

‘‘యిదెలా వుంటుందో దేవుడికి తెలియాలి డ్మీత్రియ్ అంద్రేయెవిచ్’’ అన్నాడు వగర్చే వన్యూష, ఒలేనిన్‌తోటి. ఒలేనిన్ సర్కేషియన్ కోటు తొడుక్కున్నాడు. గ్రోజ్నయాలో తను కొన్న కబర్దా గుర్రం యెక్కాడు. అయిదు గంటల స్వారీ తర్వాత, మంచి హుషారుగా తనకి కేటాయించిన బసలోకి ప్రవేశిస్తున్నాడు.

‘‘యెందుకూ, యేమిటి సంగతి?’’ అనడిగాడు ఒలేనిన్ గుర్రాన్ని నిమురుతూ. సామాను బళ్లతో వచ్చి, సామాను విప్పుతూ, చెమటలు కక్కుతూ, జుట్టు రేగిపోయి, చిరాకుపడుతూ వున్న వన్యూష కేసి హుషారుగా చూశాడు.

ఒలేనిన్ చాలా మారిపోయినట్టు కనిపించాడు. నున్నగా గీసేసిన మీసాలూ, గడ్డం బదులు కొత్తగా వుండే మీసం, చిన్న గడ్డం పెంచాడు. తెల్లవార్లూ నిద్రలేకుండా గడిపిన రోజులవల్ల సంక్రమించిన పాలిపోయిన ముఖపు వర్ణం బదులు అతని చెక్కిళ్లూ, నుదురూ చెవుల వెనక చర్మం ఆరోగ్యవంతమైన సూర్యరశ్మికి కెంపెక్కాయి యిప్పుడు. శుభ్రమైన కొత్త నల్లని తోకకోటు బదులు యిప్పుడతను మాసిపోయిన తెల్లటి సర్కేషియన్ కోటు తొడుక్కున్నాడు, కింద చాలా వెడల్పుగా ముడతలు పడ్డ వేలాడే భాగం వుంది. భుజంమీద తుపాకీ వుంది. బాగా గంజి పెట్టిన మెడపట్టీ బదులు యెండకి నల్లబడిన అతని మెడకి పట్టు బెష్మెత్ ఎర్రపట్టీ చుట్టివుంది. అతను సర్కేషియన్ బట్టలైతే వేసుకున్నాడు గాని వాటిని సరిగా వేసుకోలేదు. యెవరేనాగాని అతన్ని రష్యన్ అనుకుంటారుగాని జిగిత్ అనుకోరు. అదే వస్తువు — కాని అసలు వస్తువు కాదు. యేమైనప్పటికీ అతని మూర్తి మొత్తం ఆరోగ్యంతో, సంతోషంతో, ఆత్మతృప్తితో నిండివుంది.

‘‘అవును, మీకు తమాషాగానే వుంటుంది. మీరే వీళ్లతో మాట్లాడి చూడండి. మీతో కక్షగట్టినట్టుంటారు, దాంతో సరి. ఒక్క మాట వూడిపడితే వొట్టు’’ అంటూ వన్యూష కోపంగా బాల్చీ

గుమ్మంలోకి గిరవాటెట్టాడు. "యెందుకనో వీళ్ళు రష్యన్లలా కని పించరు."

"గ్రామాధికారితో మాట్లాడాల్సింది నువ్వు."

"వాడెక్కడుంటాడో నాకు తెలీదు" కష్టపెట్టుకుంటున్నట్టు లన్నాడు వన్యూష.

"నిన్నింత కష్ట పెట్టిందెవరు?" ఒలేనిన్ అడిగాడు, చుట్టూతా చూస్తూ.

"దేవుడికి తెలియాలి. ఛీ! యిక్కడో యజమానీ, పాడా యేమీ లేదు. వాడెక్కడికో క్రిగా*కో యేమో పోయాడంటారు. ఆ ముస ల్దంది. సాక్షాత్తూ రాక్షసే. ఓరి భగవంతుడా!" అన్నాడు వన్యూష నెత్తిమీద చేతులు పెట్టుకుంటూ. "యిక్కడ మనం యెలా బతకాలో నాకు తెలీదు. వీళ్ళు తాతార్లకంటే ఛండాలంగా వున్నారు. ఆఁ! నిజంగా – పైగా మేం క్రైస్తవులం అని చెప్పుకుంటారు! తాతార్ దుర్మార్గుడే. కాని యెంత చెడ్డా వాడు దర్జాగా వుంటాడు. క్రిగా కెళ్ళాట్ట! మంచిది! యీ క్రిగా యేంటో నాకు తెలీదు!" అంటూ ముగించాడు వన్యూష. పక్కకి తిరిగాడు.

"పనివాళ్ళ బసదగ్గర లాగా కలిసిపోయినట్టుగా వుండదన్నమాట, హే" అన్నాడు యెగతాళిగా ఒలేనిన్, గుర్రం దిగకుండా.

"మీ గుర్రం యిలా యిస్తారా?" అన్నాడు యీ కొత్త పద్ధతికి స్పష్టంగా గందరగోళపడిపోయినట్టు, కాని తన ఖర్మకి సమాధాన పడిపోతూ.

"అంచేత తాతార్ దర్జాగా వుంటాడన్నమాట! హే! వన్యూష!" రెట్టించాడు ఒలేనిన్ గుర్రం దిగుతూ, జీను తడుముతూ.

---

* నది ఒడ్డున చేపలు పట్టడానికి కంచె కట్టిన చోటు. – సం.

''మీకు నవ్వడం బాగానే వుంటుంది! మీకు వేళాకోళంగా వుంది'' కోపంగా గొణిగాడు వన్యూష.

''రా, కోప్పడకు, వన్యూష'' బదులు చెప్పాడు ఒలేనిన్, యింకా చిరునవ్వు నవ్వుతూ. ''ఓ నిముషం ఆగు. నే వెళ్లి యింటివాళ్లతో మాట్లాడతాను. చూడు నేనన్నీ యేర్పాటు చేస్తాను. మనకిక్కడ యెంత సరదాగా వుండబోతోందో నీకు తెలీదు. వూరికే బాధపడిపోకు.''

వన్యూష మాట్లాళ్లేదు. కళ్లు లగ్నంచేసి యజమాని కేసి చురచురా చూసాడు, తల పంకించాడు. వన్యూష ఒలేనిన్‌ని వట్టి యజమాని లాగానే చూశాడు, ఒలేనిన్ వన్యూషని ఒట్టి పనివాడిలాగానే చూశాడు. యెవరేనా గాని వాళ్లు స్నేహితులని వాళ్లతో అంటే వాళ్లు ఆశ్చర్య పోతారు, యెందుకంటే వాళ్లు తమకి తెలియకుండానే అలా వుంటారు. తన యజమాని యింట్లోకి వన్యూష పదకొండేళ్ల వయ సప్పుడే వెళ్లాడు, అప్పుడు ఒలేనిన్‌కీ అదే వయసు. ఒలేనిన్ పది హేనేళ్ల వయసప్పుడు వన్యూషకి పాఠాలు చెప్పాడు. అతనికి ఫ్రెంచి నేర్పాడు. అదంటే వన్యూషకి గర్వంగా వుండేది. మంచి హుషారుగా వున్నప్పుడిప్పటికీ ఫ్రెంచి మాటలు వదుల్తాడు. అలా చేసినప్పుడల్లా మొద్దుగా నవ్వేవాడు.

ఒలేనిన్ ద్వారబంధందగ్గరి మెట్లెక్కి యింటి తలుపు తోశాడు. యింటి దగ్గరున్నప్పుడు కోసక్ స్త్రీ లందరిలాగానే మర్యాంకా గులాబీ రంగుగా గాగరా మాత్రమే వేసుకునివుంది. గుమ్మందగ్గర్నుంచి భయంగా గెంతి గోడకి కరిచిపెట్టుకుపోయి, తన ముఖపు కిందిభాగాన్ని చొక్కా చేత్తో కప్పుకుంది. తలుపు వెడల్పుగా తెరుస్తూ, ఒలేనిన్ ఆ దారి మునిచీకట్లో ఆ కోసక్ బాలిక పొడుగాటి సౌష్ఠవమైన విగ్ర హాన్ని చూసాడు. యువకులకి వుండే త్వరితమైన ఆతృతతోటి పల్చటి గాగరా వెల్లడిచేసే ఆ దృఢమైన కన్యా సౌష్ఠవాన్ని, అనూ

యకపు భయంతోటీ, పల్లెటూరి వింతటోటీ అతని మీదే లగ్నమైన అందమైన నల్లని కళ్లనీ, అప్రయత్నంగానే చూశాడు.

"యివే ఆ పిల్ల" అనుకున్నాడు ఒలేనిన్. "కాని యీమె లాంటి వాళ్ళు చాలామంది వుండొచ్చు" అని వెంటనే అతని బుర్రకి తట్టింది. అతను లోపలి తలుపు తెరిచాడు.

పెద్దావిడ ఉలీత్క కూడా గాగరా మాత్రమే వేసుకుంది. ఆమె వీపు అతని కేసి తిప్పి వుంది. ఆమె వంగి నేల వూడుస్తోంది.

"నమస్కారమమ్మా! మా బస కోసం వచ్చాను..." మొదలెట్టాడతను.

ఆ కోసక్ ఆమె, నిటారుగా లేవకుండానే, అతని కేసి, కఠినంగా వున్నా కాని యింకా అందంగా వున్న తన మొహం తిప్పింది.

"యెందుకొచ్చారిక్కడికి మీరు? మమ్మల్ని ఆట పట్టించడానికా ఏం? మీకు యెగతాళి చెయ్యడం నేర్పుతా! మిమ్మల్ని పెద్దమ్మోరు మింగెయ్యా!" అరిచిందావిడ, ఆ ఆగంతకుడికేసి తన ముటముటలాడే మొహంతో ఓరగా చూస్తూ.

ఆ అలిసిపోయిన కాకేసియన్ సైన్యం (అందులో తనూ ఒకడు) యెక్కడ బడితే అక్కడ, ముఖ్యంగా యుద్ధంలో తమ మిత్రులైన కోసక్కులచేత, సంతోషంగా ఆదరించబడుతుందని వూహించాడు ఒలేనిన్ మొదట్లో. దాంతోటి యీ బాపతు ఆహ్వానానికి కలవరపడి పోయాడు. యేమైనా సమయస్ఫూర్తిని కోల్పోకుండా, తమ బసకి డబ్బులు యిచ్చుకుంటామని సంజాయిషీ యిచ్చుకోబోయాడు. కాని ఆ పెద్దావిడ ఒక్క పిసరు కూడా అతన్ని మాట్లాడనివ్వలేదు.

"దేనికొచ్చారు మీరు? మీలాంటి చీడ యెవరిక్కావాలి? ...కేసిన దవళ్ళా మీరూనూ! కొంచెం ఆగండి; ఆయన రాగానే మీ చోటు మీకు చూపిస్తాను. మీ కుళ్ళు డబ్బు యెవరిక్కావాలి? డబ్బుట! యెప్పుడూ డబ్బు మొహం యెరగం! మీ చెత్త పొగాకుతోటి యిల్లంతా కంపుచేస్తారా, డబ్బు పారేస్తే కంపు పోతుందేమో! మీలాంటి చీడని

యిదివరకు చూళ్లేదూ మేం! మిమ్మల్ని పేగుల్లోనూ, గుండెల్లోనూ కాల్చా!'' ఆవిడ తీక్ష్ణంగా అరుస్తూనే వుంది, ఒలేనిన్‌కి మాట్లాడే అవకాశమే యివ్వకుండా.

''వన్యూష చెప్పింది నిజమే!'' అనుకున్నాడు ఒలేనిన్. ''తాలార్‌వాడే దర్జాగా వుంటాడు.'' ఉలీత్కా శాపనార్థాలు ఆగకముందే యింట్లోంచి యివతల పడ్డాడు. అతను వెళ్లిపోయేటప్పుడు మర్యాంకా, యింకా గాగరా తొడుక్కునే వుంది కాని ముఖాన్ని కళ్లదాకా తెల్లటి రుమాలుతో కప్పుకుని, తటాల్న దారిలోనుంచి అతన్ని దాటి బయటికి పోయింది. చెప్పుల్లేని కాళ్లతో వేగంగా మెట్లమీదనుంచి టపటపా దిగి, ఆమె వసారా దాటి పరిగెత్తిపోయింది. ఆగి, నవ్వే కళ్లతో ఆ యువకునికేసి తొందరగా చూస్తూ యింటి మూల మలుపు తిరిగి అంతర్ధానమైపోయింది.

ఆమె బింకమైన యౌవనప్రాయపు నడకా, తెల్లటి రుమాలు కిందనుంచి మిలమిల మెరిసే ఆమె అమాయకపు చూపూ ఆమె లాఘవం గల పొందికైన ఆకృతీ ఒలేనిన్‌ని యింతకుముందు కంటే యెక్కువ శక్తివంతంగా ఆకట్టుకున్నాయి.

''నిజంగా యిదే ఆ పిల్ల'' అనుకున్నాడతను. బసని గురించిన ఆలోచనల్తో బుర్ర పాడుచేసుకోకుండా, మర్యాంకాకేసే చూస్తూ వుండిపోయాడు, వన్యూషని సమీపిస్తూ.

''యిదిగో, చూశారా ఆ పిల్ల మిగిలిన వాళ్లల్లాగే అనాగరికంగా వుంది, మచ్చిక కాని గుర్రప్పిల్లలాగా!'' అన్నాడు వన్యూష యింకా సామానుతో తంటాలుపడుతూ వున్నా, కొంచెం హుషారయాడు యీ పాటికి.

''లాఫామ్*! విజయగర్వపు కంఠంతో బిగ్గరగా అని, ఫకాల్న నవ్వాడు.

---

* ఆడది! (ఫ్రెంచి). — సం.

# 11

సాయంత్రానికి యింటి యజమాని చేపలు పట్టడంనుంచి తిరిగి వచ్చాడు. ఆ కేడెట్ బసకి డబ్బు చెల్లిస్తాడని తెలుసుకుని ఆ పెద్దావిడ్ని సమాధానపరిచి వన్యూష కోరికలు తీర్చాడు.

కొత్త మకాంలో ప్రతీదీ కుదుటపడింది. యింటి వాళ్ళు తమ శీతాకాలం యింటిలోకి మారారు. వేసవి విడిదిని ఆ కేడెట్‌కి నెలకి మూడు రూబుళ్ళకి అద్దెకిచ్చారు. ఒలేనిన్ యేదో యింత తిన్నాక నిద్ర కుపక్రమించాడు. సాయంత్రానికి లేచి ముఖం కడుక్కుని శుభ్రంగా ముస్తాబై భోజనం చేసి సిగరెట్ ముట్టించి వీధివైపు వుండే కిటికీవార కూర్చున్నాడు. చల్లగా వుంది. నగిషీ చెక్కిన కురుమాడు వున్న యింటి నీడ యేటవాలుగా ఆ మట్టి రోడ్డుమీద పడుతోంది; యెదురుగా వున్న గోడమట్టంపైకి కూడా యెక్కుతోంది. నిట్రటగా వున్న యెదురింటి రెల్లు కప్పు అస్తమయ సూర్యుని కిరణాల్లో మెరుస్తోంది. గాలి చల్లగా వుంది. వూళ్ళో ప్రతీదీ నిశ్శబ్దంగా వుంది. సైనికులు సర్దుకుని గొడవలేకుండా వున్నారు. పశువుల మందలింకా యింటికి రాలేదు, పనుల్లోనుంచి మనుషులూ యింకా తిరిగిరాలేదు.

ఒలేనిన్ బస దాదాపు వూరి చివర వుంది. వుండీ, వుడిగీ టెరెక్ అవతల యెక్కడ్నుంచో, ఒలేనిన్ వచ్చిన వేపునుంచీ (చెచెన్ కొండల్లోనుంచో, లేక కుమిక్ మైదానంనుంచో) తుపాకీ పేల్చిన నీరవ ధ్వని వినవచ్చేది. మూణ్నెళ్ళ ఆరుబయలు జీవితం తర్వాత ఒలేనిన్ చాలా సంతృప్తిగా వున్నాడు. అప్పుడే కడుక్కున్న ముఖం హాయిగా వుంది, దారుఢ్యమైన శరీరం నిర్మలంగా వుంది (దండయాత్ర తర్వాత అలవాటు లేని అనుభూతి). విశ్రాంతిగా వున్న అవయవాల్లో, ఒక ప్రశాంతత, శక్తి వున్న గుర్తింపుతో వున్నాడు. మనస్సు కూడా నిర్మలంగా స్వచ్ఛంగా వుంది. దండయాత్ర గురించీ, గడిచిన ప్రమాదాల గురించీ

అనుకున్నాడు. తను మిగతా వాళ్ళతో సమంగానే వాటిని యెదుర్కొన్నట్టు జ్ఞాపకం చేసుకున్నాడు. అతన్ని సాహసికులైన కాకేసియన్లలో ఒక మిత్రునిగా చూశారు. అతని మాస్కో జ్ఞాపకాలు యెక్కణ్నో వెనకబడిపోయాయి, యెంత దూరమో దేవుడికే తెలియాలి! పాత జీవితం తుడుచుకుపోయింది. సరికొత్త జీవితం ఆరంభమైంది. అందులో యింకా పొరపాట్లు జరగలేదు. యిక్కడ కొత్త వాళ్ళల్లో కొత్త వాడుగా అతను కొత్త మంచి పేరు తెచ్చుకోగలిగాడు. యౌవనభరితమైన, హేతురహితమైన జీవితానందాన్ని గుర్తించాడు. కిటికీలోంచి కాసేపు యింటినీడలో బొంగరాలు తిప్పుకునే పిల్లల కేసీ, కాసేపు తన కొత్త బస చుట్టూతానూ చూసి అతననుకున్నాడు, తనకి కొత్త చోటైన యీ కోసక్ గ్రామంలో యెంత హాయిగా స్థిరపడిపోవచ్చునోనని. మధ్యమధ్యన కొండల కేసీ, ఆకాశంకేసీ చూశాడు. తన జ్ఞాపకాలతోటీ, కలలతోటీ, కలిసి పోయిన గంభీరమైన ప్రకృతి శోభని మెచ్చుకున్నాడు. తను మాస్కో వదిలినప్పుడు వూహించుకున్నట్టుగా కాదుగానీ అతను అనుకోనంత బాగా అతని నూతన జీవితం ఆరంభమైంది. ఆ పర్వతాలు, పర్వతాలు, పర్వతాలు! – అతని సకల ఆలోచనలకీ అనుభూతులకీ అవే నేపథ్యం.

''కుక్కకి సెలవు చెప్పి ముద్దెట్టుకున్నాడు! కూజా నాకాడు!... యెరోష్క మామ కుక్కని ముద్దెట్టుకున్నాడు!'' అకస్మాత్తుగా కిటికీ కింద బొంగరాలు తిప్పుకునే కోసక్కు పిల్లలు, పక్క వీధి కేసి చూస్తూ అరిచారు. ''కుక్కని ముద్దెట్టుకున్నాడు, తన బాకుని సారా కోసం అమ్మేశాడు!'' అరిచారు పిల్లలు, గుంపుగా చేరుతూ, వెనక్కి అడుగేస్తూ.

ఆ అరుపులన్నీ యెరోష్క మామని ఉద్దేశించి. అతను భుజాన్న తుపాకీతోటీ, నడికట్టు దగ్గర వేలాడే కొన్ని అడివికోళ్ళతోటీ తన వేట దండయాత్రనుంచి తిరిగివస్తున్నాడు.

''నేను తప్పు చేసా(నా బాబులూ, తప్పుచేశాను'' అన్నాడతను

చేతులు బలంగా వూపుతూ, వీధికిరువేపులా వున్న కిటికీలకేసి చూస్తూ. "నేనా కుక్కని తాగడానికి వదిలాను. అదీ తప్పు" అని రెట్టించాడు, చిరాగ్గా, కాని పట్టించుకోనట్టు నటిస్తూ.

ఆ ముసలి వేటగాడిపట్ల ఆ పిల్లల ప్రవర్తనకి ఒలేనిన్ ఆశ్చర్య పోయాడు. కాని ఆ భావ ప్రకాశకమైన, తెలివితేటలు అగపడే ముఖమూ ఆ భారీ విగ్రహమూ గల యెరోష్క మామ అని పిలిచే ఆ మనిషిని చూసి యింకా చకితుడయ్యాడు.

"యిదిగో మామా, యిదిగో కోసక్! యిలారా!" పిలిచాడతను.

ముసలాడు కిటికీలోకి చూసి ఆగాడు. "బాగున్నావా, నేస్తం" అన్నాడతను క్షవరం చేయించుకున్న నెత్తిమీదనుంచి టోపీ తీస్తూ.

"బాగున్నానా, నేస్తం" బదులు చెప్పాడు ఒలేనిన్. "ఏమిటా పిల్లలు నీకేసి అరుస్తున్నారు?"

యెరోష్క మామ కిటికీ దగ్గర కొచ్చాడు. "అఁ! యేముందీ, వాళ్లేదో ముసలాణ్ణి యేడిపిస్తున్నారు. దాన్దేముందిలే, నాకూ యిష్టమే. వాళ్లని ముసలిమామతో వేళాకోళాలాణ్ణియ్యి" అన్నాడతను, దృఢమైన సంగీత గమకంతో, మర్యాదైన పెద్దవాళ్లు మాట్లాడేటట్టు. "నువ్వు సైన్యానికి కమాండరువా?" అడిగాడు.

"అబ్బే, నేను ఓ కేడెట్ని. సరేగాని ఆ అడివికోళ్ల నెక్కడ చంపావు?" ఒలేనిన్ అడిగాడు.

"యీ మూడింటినీ అడివిలో కొట్టాను" అన్నాడు తన వెడల్పాటి వీపుని కిటికీకేసి తిప్పుతూ, పటకాలో తలలు దోపబడి, కోటుని రక్తంతో తడిపి, వూగుతూ వున్న అడివికోళ్లని చూపించడానికి.

"నువ్వెప్పుడూ వీటిని చూళ్లేదా? కావలిస్తే ఓ జోడు తీసుకో! యిదిగో" రెండు అడివికోళ్లని కిటికీ దగ్గర అందించాడు. "నువ్వు వేటగాడివా?" అడిగాడు.

"వూఁ! దండయాత్రప్పుడు నాలుగింటిని కొట్టాను."

''నాలుగే? చాలా యెక్కువే!'' అన్నాదు ముసలాడు వెటకారంగా. ''నువ్వు తాగుతావా? చిఖిర్ తాగుతావా?''

''యెందుకు తాగను? తాగుతాను.''

''భలే, మొత్తానికి భలే కుర్రాడివే. మనం కునాక్‌లు*గా వుందాం, నువ్వూ, నేనూ'' యెరోష్క మామ అన్నాడు.

''లోపలికి రా, ఓ చుక్క చిఖిర్ వేద్దాం'' అన్నాడు ఒలేనిన్.

''తప్పకుండానూ'' అన్నాడా ముసలాడు. ''కాని యీ అడివికోళ్లని తీసుకో.''

ఆ కేడెట్ అంటే యిష్టపడ్డట్టే వుంది ఆ ముసలాడి మొహం. అతన్నుంచి వూరికే మందు కొట్టెయ్యొచ్చని గ్రహించాడు. ఆ జత పక్షులూ వృథా కావు.

కొద్ది క్షణాల్లో యెరోష్క మామ విగ్రహం యింటి గుమ్మంలో ప్రత్యక్షమైంది. అప్పుడు మాత్రమే ఒలేనిన్ ఆ మనిషి భారీ విగ్రహం పూర్తిగా చూడగలిగాడు. సమూలం తెల్లగా వున్న పెద్ద గడ్డంతో అతని జేగురురంగు మొహం వార్ధక్యంవల్లా, శ్రమవల్లా గీతలు పడి వుంది. అయినా ఆ వయసులో ఆ ముసలాడి కాళ్ల కండరాలూ, చేతులూ, భుజాలూ చాలా అసాధారణంగా పెద్దవిగానూ, స్ఫుటంగానూ వున్నాయి. అంటకత్తెర వేయించుకున్న జుట్టు కింద నెత్తిమీద పెద్ద గాయపు మచ్చలున్నాయి. మందమైన కండపుష్టిగల అతని మెడ వృషభానికి మాదిరీ అడ్డదిడ్డంగా పోయే ముడతల్తో వుంది. కాయమ్మల్లా బిరుసెక్కిన చేతులు గాయపడీ, గీసుకుపోయీ వున్నాయి. అతను గుమ్మంలోనుంచి తేలిగ్గా సునాయాసంగా అడుగెట్టాడు. తుపాకీ తీసి ఓమూల పెట్టాడు, గది చుట్టూతా వేగంగా ఓ చూపు పారేసి,

---

* కునాక్ — పరమమిత్రుడు, వాడి కోసం యే త్యాగమూ యెక్కువ కాదు. -- సం.

ఆ యింట్లో వుంచిన సరుకులూ, సామాన్లూ విలువ గుర్తించాడు. ముతక చర్మం చెప్పుల్లో పక్కలకి తిరిగిన పాదాలతో నెమ్మదిగా గది మధ్యలోకి అడుగెట్టాడు. అతని తోటి షరాటుగా వున్నా, అసహ్యం గాని చికిర్, వోద్కా, మందుగుండు, గడ్డకట్టిన రక్తం వాసన వచ్చాయి.

యెరోష్కా మామ దేవుళ్ళబొమ్మలకి వందనం చేసి గడ్డం నిమురుకుని, ఒలేనిన్ దగ్గరి కెళ్లి, తన మందమైన గోధుమరంగు చెయ్యి చాచాడు. "కోష్‌కిల్డి" అన్నాడతను. "తాతార్‌లో 'నీకు సుఖం కలుగుగాక' అని వాళ్ళ భాషలో అర్థం."

"కోష్‌కిల్డి! నాకది తెలుసు" ఒలేనిన్ జవాబిచ్చాడు కరచాలనం చేస్తూ.

"అబ్బే, నీకు తెలీదు. నీకా పద్ధతి తెలీదు, వెర్రివాడా" అన్నాడు యెరోష్కా, తప్పు పడుతున్నట్టు తల వూపుతూ. "యెవరేనా నీకు కోష్‌కిల్డి అని చెపితే నువ్వు 'అల్లా రసి బోసన్' అంటే 'దేముడు నిన్ను కాపాడుగాక' అని బదులు చెప్పాలి. అదీ పద్ధతి, నాయనా, కోష్‌కిల్డి అని కాదు. కాని నీకు అదంతా నేర్పుతాలే. మాకిక్కడ ఒకడుండేవాడు, ఇల్యా మొసేయిచ్, మీ రష్యనే, అతనూ నేనూ కునాక్‌లమి. భలేవాడ్లే! తాగుబోతు, దొంగ, వేటగాడు — యెలాంటి వేటగాడని! అతనికి అన్నీ నేర్పాను."

"నాకేం నేర్పుతావు?" అడిగాడు ఒలేనిన్, ఆ ముసలాడిపట్ల యింకా ఆసక్తి పెరిగి.

"నిన్ను వేటకి తీసుకెడతా, చేపలు పట్టడం నేర్పుతా. నీకు చెచెన్‌లని చూపిస్తా. నీకో పిల్లని చూసిపెడతా, నీకిష్టమైతే — అది గూడా! అలాంటి వాణ్ణి నేను! జోకర్ గాణ్ణి!" — ఆ ముసలాడు నవ్వాడు. "నే కూర్చుంటాను. అలిసిపోయాను. కర్గా?" అన్నాడతను వాకబు చేస్తున్నట్టు.

''కర్గా అంటే?'' అడిగాడు ఒలేనిన్.

''అంటే జార్జియన్‌లో 'అంతా బాగుంది' అని. కాని నేనూరికే అలా అంటాను. అది నా పద్ధతి, అది నా వూతపదం. కర్గా, కర్గా. వూరికే అలా అంటానంతే, సరదాకి. సరే అబ్బాయ్, ఆ చిఖిర్ తెప్పించవూ? నీ చేతిలో మనిషి వుంటాడేమో, లేడా? ఓయ్, ఇవాన్!'' కేక పెట్టాడు ముసలాడు. ''మీ సిపాయిలందరూ ఇవాన్లే. మీవాడూ ఇవానేనా?''

''ఆఁ! వాడి పేరూ ఇవానే — వన్యూష.* యిదిగో వన్యూష! యింటావిడని అడిగి కొంచెం చిఖిర్ యిక్కడికి తీసుకురా.''

''ఇవానన్నా, వన్యూష అన్నా అంతా ఒకటే. మీ సిపాయీలంతా ఇవాన్లేమిటి? ఇవాన్, మహానుభావా'' అన్నాడు ముసలాడు, ''యిప్పుడే మొదలెట్టిన పీపానుంచి కొంచెం యిమ్మని వాళ్లతో చెప్పు. వూళ్లో కల్లా మంచి చిఖిర్ వాళ్ల దగ్గరుంది. ముప్పై కోపెక్కుల కంటే యెక్కువియ్యకు. జాగ్రత్త. యెందుకంటే ఆ ముసలి ముండకి మహా దానందం.... మా జనం పాపిష్ఠివాళ్లు, మొద్దుసరుకు'' యెరోష్కమామ, వన్యూష వెళ్లింతర్వాత, ఆప్తుడిలో చెప్పే గొంతుకతో చెబుతూనే వున్నాడు. ''వాళ్లు మిమ్మల్ని మనుషుల్లా చూడరు; మీరు తాతార్ కంటే అధ్వాన్నం వాళ్ల దృష్టిలో. 'లౌకికమైన రష్యన్లు' అంటారు వాళ్లు. కాని నాకు సంబంధించి, నువ్వు సైనికుడివైనా నువ్వొ మనిషివే, నీకూ మనసుంది. యేమంటావ్? ఇల్యా మొసేయిచ్ సైనికుడే కాని యెంత బంగారం లాంటి మనిషి! యేమంటావ్, నేస్తం? అందుకనే మా వాళ్లకి నేనంటే పడదు, కాని బలాదూర్! నేను సరదాగా వుంటాను, నాకెవరన్నా యిష్టమే, నేను యెరోష్కని! నిజం, నేస్తం?''

ఆ వృద్ధ కోసక్ ఆ యువకుడి భుజంమీద ఆప్యాయంగా తట్టాడు.

---

* వన్యూష అనేది ఇవాన్‌కి ముద్దుపేరు. — సం.

# 12

యీలోపుగా యింటి యేర్పాట్లు పూర్తిచేసి పటాలం మంగలిచేత క్షవరం కూడా చేయించుకుని, పటాలం సౌకర్యంగా బస చేసిందన్న దానికి గుర్తుగా యెత్తైన బూట్ల లోపలినుంచి లాగు యివతలికి తీసేసి వస్యూష మంచి హుషారుగా వున్నాడు. అతను యెరోష్క కేసి తను ముందెన్నడూ చూడని అడివి జంతువుని చూసినట్టు, శ్రద్ధగానే, గాని సానుభూతిగా కాకుండా చూశాడు. ఆ ముసలాడు ఖరాబుచేసిన నేలకేసి చూసి తల పంకించాడు. బల్ల కిందనుంచి రెండు సీసాలు తీసి యింటావిడ దగ్గరికి పోయాడు.

''నమస్కారమండీ, అమ్మగారూ'' అన్నాడు చాలా మర్యాదగా వుండా లని నిశ్చయించుకుని. ''మా యజమాని కొంచెం చిఖిర్ తెమ్మని పంపించారు. కొంచెం తీసిపెడతారా, మంచివాళ్లు?''

ఆ పెద్దావిడ జవా బివ్వలేదు. ఆ పిల్ల, ఓ చిన్న తాతార్ అద్దం ముందు ఓ రుమాలు తలకి చుట్టుకుంటూ, నిశ్శబ్దంగా వన్యూష కేసి చూసింది.

''డబ్బు లిస్తానండీ, అమ్మగారూ'' అన్నాడు వన్యూష జేబులో నాణేలు గలగల్లాడిస్తూ. ''మాపట్ల బాగా వుండండి, మేమూ బాగా వుంటాం'' అన్నాడింకా.

''యెంత కావాలి?'' అంది పెద్దావిడ తటాల్న.

''ఓ బుడ్డి.''

''వెళ్లి కొంచెం తీసియ్యి వాళ్లకి, తల్లీ'' అంది ఉలీత్క కూతురి తోటి. ''కొత్తగా మొదలెట్టిన పీపాలోది తీసియ్యి, మా అమ్మవుకదూ.''

ఆ పిల్ల తాళాలూ, వడగట్టే బుడ్డీ తీసుకుని వన్యూషతోటి యింటి బయటికి వెళ్లింది.

కిటికీ పక్కనుంచి వెడుతున్న మర్యాంకాని చూపించి ''చెప్పు, యెవరా పిల్ల?'' అని అడిగాడు ఒలేనిన్.

యెరోష్కా మామ కన్నుగీటి, అతన్ని మోచేత్తో పొడిచాడు.

''కొంచెం సేపాగు'' అన్నాడతను. కిటికీలోంచి తల బయటికి పెట్టాడు. ''ఆఖ్'' మని దగ్గాడు, అప్పుడో పెద్ద బొబ్బ పెట్టాడు. ''మర్యాంకా బుజ్జీ, ఓయ్, మర్యాంకా, నా చిన్నీ, నన్ను ప్రేమించవూ, ముద్దుపిల్లా! నేను జోకర్‌గాణ్ణి'' అన్నాడు ఒలేనిన్‌తో, రహస్యంగా.

ఆ పిల్ల తల తిప్పకుండా చురుగ్గా, పద్ధతిగా చేతులు వూపుతూ కోసక్ స్త్రీలకి ప్రత్యేకమైన తెగువగల నడకలో కిటికీ దాటి వెళ్ళింది. మెల్లిగా తన నల్లటి నీడ కళ్ళని ఆ ముసలాడి కేసి తిప్పిందంతే.

''నన్ను ప్రేమించు, నువ్వు సంతోషంగా వుంటావ్'' అరిచాడు యెరోష్కా, కన్నుగీటుతూ ప్రశ్నిస్తున్నట్టు ఆ కేడెట్ కేసి చూశాడు. ''నేను భలేవాణ్ణి, జోకర్‌గాణ్ణి. అది రాణీకదూ, ఆ పిల్ల, హే?'' అన్నాడు.

''పిల్ల సొగసైందే. ఆమెని లోపలికి పిలు'' అన్నాడు ఒలేనిన్.

''వద్దు, వద్దు'' అన్నాడా ముసలాడు. ''ఆ పిల్లకి లుకాష్కాతో పెళ్ళవాలి. వాడో మంచి కోసక్. ధైర్యవంతుడు. మొన్నో అబ్రేక్కుని చంపాడు. నీకింత కంటే మంచిదాన్ని చూస్తాను. పట్టు జరీతో ధగధగలాడిపోయే దాన్ని చూస్తాను. నేనో సారి అన్నానంటే అది చేశానే. నీకు సిసలైన సొగసుకత్తెని చూస్తాను.''

''నువ్వా! ముసలాడివి! – అలాంటి మాటలంటావ్? అది పాపం!'' బదులు చెప్పాడు ఒలేనిన్.

''పాపమా? యెక్కడుంది పాపం?'' అన్నాడా ముసలాడు ఒత్తి పలుకుతూ. ''సొగసైన పిల్ల కేసి చూడ్డం పాపమా? దాంతో కొంచెం సరసమాడ్డం పాపమా? దాన్ని ప్రేమించడం పాపమా? మీ ప్రాంతాల్లో అంతేనా?... అబ్బే నేస్తం, అది పాపం కాదు, అది మోక్షం! దేవుడు నిన్ను సృష్టించాడు, ఆడపిల్లనీ సృష్టించాడు. అన్నీ దేవుడే చేశాడు. కాబట్టి సొగసైన ఆడపిల్ల కేసి చూడ్డంలో పాపం లేదు.

ఆడపిల్లని సృష్టించింది అందుకే — ప్రేమించబడ్డానికే, సంతోషం యివ్వ డానికే. నేనల్లాగే భావిస్తా, నేస్తం.''

మర్యాంకా ముంగిలి దాటి, పీపాలతో నిండిపోయి, చీకటిగా చల్లగా వున్న కొట్టుగదిలో ఓ పీపా దగ్గరికి వెళ్లింది. యథాప్రకారం ప్రార్థన చేసి లెడ్డు అందులో ముంచింది. వస్యూష గుమ్మం దగ్గర నుంచుని ఆమె కేసి చూసి చిరునవ్వు నవ్వాడు. ఒత్తి గాగరా మాత్రమే వేసుకోవడం, వెనకాల బిగుతుగానూ, ముందు దోపుకునీ వుండటం తమాషాగా కనిపించిందతనికి. యింకా తమాషాగా వున్న దేమంటే ఆమె వెండి కాసుల పేరు వేసుకోవడం. అది రష్యన్ పద్ధతి కాదని అతని అభిప్రాయం. యింటి దగ్గర పనివాళ్ల బసలో వాళ్లంతా నవ్వుతారు, అలాంటి పిల్లని చూస్తే. ''లా ఫిల్ కమ్‌సే త్రేబ్యాం,* వూరికే మార్పుకి'' అనుకున్నాడతను. ''యజమానికి చెబుతా.''

''వెలుతురి కడ్డంగా నుంచున్నా వెందుకు, దెయ్యంలాగా!'' వున్న ట్టుండి ఆ పిల్ల అరిచింది. ''ఆ బుడ్డి నాకందివ్వకూడదూ?''

బుడ్డి నిండా చల్లని యెర్రటి వైన్ పట్టి మర్యాంకా దాన్ని వస్యూష కిచ్చింది. ''డబ్బులు అమ్మకియ్యి'' అంది డబ్బులు పట్టుకున్న అతని చేతిని తోసేస్తూ.

వస్యూష నవ్వాడు. ''ఎందుకంత పెడసరంగా వుంటావ్, బుల్లెమ్మా?'' అన్నాడు మంచిగా, సంశయంగా కాళ్లనటూ యిటూ కదుపుతూ, ఆ పిల్ల పీపా మూత మూస్తూ వుండగా.

ఆమె నవ్వడం ప్రారంభించింది.

''మీరో! మీరూ మంచిగా వుంటారా?''

''మేం, మా యజమానీ, నేనూ చాలా మంచిగా వుంటాం'' అన్నాడు వస్యూష నిశ్చయంగా. ''మేం యెంత మంచిగా వుంటా

---

*యీ అమ్మాయి చాల బాగుంది (ఫ్రెంచి). — సం.

మంటే మేం వున్న చోట్ల మాకు ఆతిధ్యం యిచ్చిన వాళ్లంతా యెంతో కృతజ్ఞతగా వున్నారు. యెందుకంటే ఆయన ప్రభువంశీకుడు.''

ఆ పిల్ల వింటూ నుంచుంది.

''మీ యజమానికి పెళ్లైందా?'' అడిగింది.

''లేదు, ఆయన కుర్రాడూ, అవివాహితుడూనూ. యెందుకంటే గొప్పింటి పెద్దోళ్లు చిన్నప్పుడు పెళ్లి చేసుకోరు'' బోధిస్తున్నట్టన్నాడు వన్యూష.

''పసిపాప! పీట బలిసిన దున్నపోతులా వున్నాడు, పెళ్లాడ్డానికి పసిపాపట! మీ అందరికీ అధికారా?'' అడిగిందామె.

''మా యజమాని కేడెట్; అంటే యింకా ఆఫీసరు కాదని. కాని జనరల్ కంటే ఆయనెక్కువ — చాలా ముఖ్యుడు! మా కర్నల్ కి, ఆమాట కొస్తే జార్ చక్రవర్తికే, ఆయన తెలుసు'' వన్యూష గొప్పగా వివరించాడు. ''మేం మిగతా పటాలంలోని ముష్టివెధవల్లా కాదు. ఆయన తండ్రి సెనేటర్. ఆయనకింద వెయ్యి మందికిపైగా దాసు లుండే వాళ్లు, అంతా సొంతం, వాళ్లు మాకు ఒకొక్కసారి వెయ్యి రూబుళ్లు పంపుతారు. అందుకనే ప్రతీ వాడికీ మేమంటే యిష్టం. యింకోడెవడేనా కేప్టెన్ అయుండొచ్చు, కాని డబ్బుండదు. దానివల్ల యేం లాభం?''

''వెళ్లు, నే తాళం వేసుకుంటాను'' అందా పిల్ల, అతని మాటకి అడ్డువస్తూ.

వన్యూష ఒలేనిన్ కి ఆ వైన్ తెచ్చియిచ్చి ''లఫిల్ స్త్రే జొలీ''* అని ప్రకటించి, తెలివితక్కువగా నవ్వుతూ, వెంటనే అవతలికి వెళ్లాడు.

---

* అమ్మాయి చాల అందమైంది (ఫ్రెంచి). — సం.

# 13

యీలోపున వూరి చౌకులో భేరీ మోగింది. జనం పనులనుంచి యిళ్లకి వచ్చారు. బంగారు ధూళి మేఘాల్లో గుంపుగా పశువుల మంద వూరి ద్వారం దగ్గర చేరి అరిచింది. అమ్మాయిలూ, ఆడవాళ్లూ పశువుల్ని తోలుకుంటూ వీధుల్లోనూ, దొడ్లలోనూ హడావుడిగా పోతున్నారు. దూరంగా వున్న హిమశిఖరాల వెనక సూర్యుడు మణిగాడు. ఒక నిస్తేజపు నీలి ఛాయ నేలమీదా నింగిమీదా వ్యాపించింది. చీకటి కమ్మిన తోటంపైన మసక నక్షత్రాలు మినుకు మన్నాయి. గ్రామంలో సవ్వడి మణిగింది. పశువుల పని అయిపోయాక ఆ రాత్రికి వాటిని వదిలేసి, ఆడవాళ్లు యువతలికి వచ్చి వీధుల మూలల్లో చేరారు. పళ్ల కింద పొద్దుతిరుగుడు పువ్వుల గింజలు కొరుకుతూ యిళ్ల మట్టి అరుగులమీద కూలబడ్డారు. ఆ తర్వాత మర్యాంకా గేదె పాలూ, రెండావుల పాలూ పితికి ఆ గుంపుల్లో ఒకదాని దగ్గర చేరింది. ఆ గుంపులో కొంతమంది ఆడాళ్లూ, అమ్మాయిలూ, ఓ ముసలి కోసక్కూ వున్నారు. వాళ్లంతా ఆ చంపేసిన అబ్రేక్ని గురించి మాట్లాడుకుంటూ వున్నారు. ఆ కోసక్ వర్ణిస్తూవుంటే ఆడవాళ్లు అడుగుతూ వున్నారు.

''అతనికి మంచి బహుమతి వస్తుందనుకుంటున్నాను'' ఆడాళ్లల్లో ఒకామె అంది.

''రావచ్చు, అతనికో శిలువ యిస్తారనుకుంటున్నారు.''

''మోసెవ్ అతనికి అన్యాయం చెయ్యాలని చూసేడు. తుపాకీ అతన్నుంచి లాగేసుకున్నాడు; కిజ్ల్యార్లో అధికారులు అది విన్నారు.''

''ఆ మోసెవ్ అంత కుత్సితపు వెధవేం!''

''లుకాష్కా యింటికొచ్చాడన్నారు'' ఆడపిల్లల్లో ఒకామె అంది.

''వాడూ, నజార్కా కలిసి యామ్కా దగ్గర మజాచేస్తున్నారు.''

(యామ్కా పెళ్లికాని, పరువుతక్కువ కోసక్ ఆడది, సారాకొట్టు నడిపేది.) "వాళ్లు సగం కడవ తాగేరని చెప్పగా విన్నాను."

"ఆ ఉర్వన్‌ది యేమదృష్టం" యెవరో అన్నారు. "సిసలైన సాహసికుడు. మంచి కుర్రాడనే మాట కాదనలేం. దేనికైనా గానీ చురుగ్గా వుంటాడు. బుద్ధిమంతుడైన కుర్రాడు! వాళ్ల నాన్నా అలాగే వుండేవాడు, కిర్యాక్ మామ; వీడూ వాళ్ల నాన్న పోలికే. ఆయన్ని చంపేసినప్పుడు వూరు వూరంతా యేడ్చింది. అదుగో, వాళ్లే" అన్నాడా మాట్లాడే మనిషి, వీధిలో వాళ్ల వేపే వస్తున్న కోసక్కుల కేసి చూపిస్తూ. "యెర్గుషోవ్ కూడా వీళ్లతో కలిశాడు! తాగుబోతు!"

లుకాష్క, నజార్క, యెర్గుషోవ్ సగం కడవ వోడ్కా తాగేసి, ఆ అమ్మాయిల కేసి వస్తున్నారు. ఆ ముగ్గురి మొహాలూ ముఖ్యంగా, ఆ ముసలి కోసక్‌ది, మామూలు కంటే జేవురించి వున్నాయి. యెర్గుషోవ్ తూలుతూ, తుళ్లుతూ నజార్కని పక్కలో పొడుస్తూనే వున్నాడు.

"మీరేం పాడ్డంలేదేం? మా మజాకి పాడండి. పాడండెహె!" ఆడపిల్లల్ని ఉద్దేశించి అరిచాడతను.

"బాగా గడిచిందా, బాగా గడిచిందా?" అనే మాటల్తో వాళ్లకి స్వాగతం వచ్చింది.

"మేం యెందుకు పాడాలి? యివాళేం సెలవుకాదు. మీరే బిగించేసి వున్నారు, మీరే పోయి పాడుకోండి" అంది వాళ్లలో ఒకామె.

యెర్గుషోవ్ పగలబడి నవ్వాడు. నజార్కని పొడిచాడు. "నువ్వు పాడు, యేం. నేనూ మొదలెడతా. నేసందులో చెయ్యి తిరిగినవాణ్ణే. నే చెబుతున్నాగా."

"యేమిటి, నిద్రపోయేరా, నా అందాలరాసులూ, మేం చౌకీనుంచి పండగ చేసుకోవడం కోసం వచ్చాం. లుకాష్క గౌరవార్థం అప్పుడే తాగేశాం" అన్నాడు నజార్క.

లుకాష్కా ఆ గుంపు దగ్గరికి చేరాక నెమ్మదిగా టోపీ యెత్తి, అమ్మాయిల ముందు ఆగాడు. అతని వెడల్పాటి చెక్కిళ్ళూ, మెడా యెరుపెక్కాయి. అతను మెల్లగా చెదరకుండా మాట్లాడాడు. కాని మత్తు లేకుండా వున్న అతని శమనంలోనూ, శాంతంలోనూ నజార్కా వాగుడులోనూ, సందడిలోనూ వున్నదానికంటే యెక్కువ జీవం, శక్తీ వున్నాయి. తోక ఆడిస్తూ బుసకొడుతూ చటుక్కున ఆగి, నాలుక్కాళ్ళూ మేకేసి నేలకి కొట్టి బిగించేసినట్లు నిలబడి పోయి ఆటలాడే గుర్రప్పిల్లని గుర్తుకు తెస్తాడు అతను. లుకాష్కా మెదలకుండా అమ్మాయిల ముందు నుంచున్నాడు; అతని కళ్ళు నవ్వుతున్నాయి. అతను కాసేపు పైకంలో వున్న తన మిత్రులకేసీ, కాసేపు అమ్మాయిలకేసీ చూస్తూ దాదాపుగా యేమీ మాట్లాడలేదు.

మర్యాంకా ఆ గుంపులో చేరగానే అతను తన టోపీని దృఢంగా, హడావుడి లేకుండా యెత్తి, ఆమెకి దారి యిచ్చాడు. అప్పుడు ఆమె ముందుకి అడుగేసి ఒక కాలు కొంచెం యెదరకి వుంచి, బొటన వేళ్ళు పటకాలో పెట్టుకుని, తన బాకుతో ఆడుకుంటూ వున్నాడు. మర్యాంకా అతని అభివాదానికి సావకాశమైన శిరఃకంపనంతో బదులు చెప్పి, అరుగుమీద చతికిలబడి తన గాగరా జేబులోనుంచి కొన్ని గింజలు తీసింది. లుకాష్కా మర్యాంకాకేసే దృష్టి వుంచి, కొన్ని గింజలు నింపాదిగా కొరుకుతూ తొక్కలు ఉమ్మేశాడు. మర్యాంకా గుంపులో చేరగానే అక్కడ గమ్మునైపోయింది.

"యింకా వుంటావా?" అడిగిందామె, మాట మొదలెడుతూ.

"రేప్పొద్దుటి దాకా" అన్నాడు లుకాష్కా, గంభీరంగా.

"బాగుంది, దేవుడు నీకు అదృష్టం యిచ్చాడు, నువ్వంటే నాకు సంతోషంగా వుంది, నేనిందాకా అంటున్నట్టు" అన్నాడా ముసలి కోసక్.

"నేనూ అదే అంటున్నాను" మాట చేర్చాడు యెర్గుషోవ్ తూలుతూ,

నవ్వుతూ. ''మన కెంతమంది చుట్టాలున్నారు'' అన్నాడతను. పక్కన పోతున్న సైనికుణ్ణి చూపించి, ''ఆ సైనికుల వోడ్కా బాగుంది – నాకు నచ్చింది.''

''మూడు పిశాచాలని మా నెత్తిమీదకి తోశారు. తాత వూళ్లో పెద్దల దగ్గర కెళ్లాట్ట. కాని వాళ్లు చెయ్యగలిగిందేమీ లేదన్నార్ట'' అడవాళ్లలో ఒకామె అంది.

''ఆహా, గొడవలో పడ్డావన్న మాట, పడ్డావా?'' అన్నాడు యెర్గుషోవ్.

''చుట్ట పొగతో నిన్ను బయటికి తరిమేశారు కదూ?'' యింకో ఆవిడ అంది. ''దొడ్లో నీ యిష్టం వచ్చినంత పొగతాగు, ఆఁ! కాని యింట్లో మాత్రం ఒప్పుకోను గ్రామపెద్ద తనే వచ్చినా సరే. నేను ససేమిరా ఒప్పుకోను. దానికి తోడు నిన్ను దోచెయ్యొచ్చు కూడానూ. తను మాత్రం యెవరికీ బస యివ్వలేదు, ఆఁ పెద్ద! నా శార్ధం పెద్ద!''

''నీకిష్టం లేదేం? యేం?'' యెర్గుషోవ్ మళ్లీ మొదలెట్టాడు.

''ఆడపిల్లలు సైనికులకి పక్కలు వెయ్యాలనీ, వాళ్లకి చిఖిర్, తేనే యివ్వాలనీ కూడా విన్నాను'' అన్నాడు నజార్కా, లుకాష్కలాగా ఓ కాలు ముందుకు పెట్టి, అతనిలాగా టోపీ ఒరగబెడుతూ.

యెర్గుషోవ్ విరగబడి నవ్వాడు. దగ్గర్లో ఓ అమ్మాయిని వాడేసి పట్టుకుని కాగలించుకున్నాడు. ''నిజం అది.''

''వోయ్, నీజిమ్మడా!'' కీచుమంది ఆ పిల్ల. ''మీ ముసల్దాన్తో, చెబుతా.''

''చెప్పు దాంతో'' అతనరిచాడు. ''నజార్కా చెప్పింది నిజమే. ఓ కాగితం పంపార్ట. వాడు చదవగలడు, మీకు తెలుసా. నిజంగా నిజం!'' తర్వాత వున్న పిల్లని కాగలించుకోవడం మొదలెట్టాడు.

''నీకేం పొయ్యేకాలం దాపురించిందీ, దున్నపోతా'' కీచుమంది గులాబీ

బుగ్గల గుండ్రని మొహం గల ఉస్తేంకా, నవ్వుతూ అతన్ని కొట్టడానికి చెయ్యి యెత్తుతూ.

ఆ కోసక్ వెనక్కి అడుగేసి దాదాపు తూలి పడబోయాడు. "అబ్బ, ఆడపిల్లలకేం బలం లేదంటారు, నువ్వేమో నన్ను చంపేశావ్."

"అవతలికి ఫో, దున్నపోతా. యే మాయరోగం తోసుకొచ్చింది నిన్ను చౌకీనుంచి" అంది ఉస్తేంకా, అతన్నుంచి తప్పించుకుంటూ, మళ్ళీ పగలబడి నవ్వింది. "నువ్వేమో గుర్రుకొడుతూ అబ్రేక్కుని జార విడుచుకున్నావ్, అవునా? ఒకవేళ అతను నిన్నే చంపేసి వుంటే యింకా బాగుండేది."

"నువ్వు బొబ్బలెట్టేవుండే దానివి, యేం?" అన్నాడు నజార్కా, నవ్వుతూ.

"బొబ్బలెట్టడమా! నేనా!"

"చూడు, చూడు, దానికేం ఖాతరు లేదు. బొబ్బలెడుతుంది కదూ, నజార్కా" అన్నాడు యెర్గుషోవ్.

యింత సేపూ మాట్లాడకుండా మర్యాంకా కేసి చూస్తూ నుంచున్నాడు లుకాష్కా. ఆతని చూపు ఆ పిల్లని స్పష్టంగా యిబ్బంది పెడుతోంది.

"సరేకాని, మర్యాంకా, వాళ్ల ముఖ్యుణ్నొకణ్ణి మీ నెత్తిమీద రుద్దారని విన్నాను" అన్నాడతను, దగ్గరగా జరుగుతూ.

తన అలవాటు ప్రకారం మర్యాంకా జవాబిచ్చే ముందు తాళింది. మెల్లగా ఆ కోసక్కు కేసి కళ్లు యెత్తింది. లుకాష్కా కళ్లు నవ్వుతున్నాయి, అనుకునేదానికి విడిగా, తనకీ ఆ పిల్లకీ మధ్యన యేదో ప్రత్యేకమైంది వున్నట్టు.

"ఆఁ! వాళ్లకేం బాధ వాళ్లకి రెండిళ్ళున్నాయి" మర్యాంకా తరఫున ఓ ముసలావిడ జవాబిచ్చింది. "కానీ ఫోముష్కిన్ వాళ్ల నెత్తిమీద క్కూడా ఒక ముఖ్యుణ్ణి గెంటార్ట. వాళ్ల నడవ, ఓ మూల

మూలంతా, వాడి సామానుతో నిండిపోయిందట, పాపం వాళ్ల కెక్కడ కెళ్లడానికీ లేదు. యిలాంటి దెప్పుడేనా యెరుగుదుమా, వో దండు దండునంతా యిలా బలాదూర్ వూరిమీద వదిలెయ్యడం? తెగులు గాని, వాళ్లేం చెయ్యాల్ట యిక్కడ?'' అందామె.

''వాళ్లు పెరెక్‌మీద వంతెన కడతారని విన్నాం'' పిల్లల్లో ఒకత్తె అంది.

''ఆడపిల్లలందర్నీ కుక్కడానికి వాళ్లు గొయ్యి తవ్వుతారనీ నాకు తెలిసింది, యెందుకంటే వాళ్లు మగపిల్లవాళ్లని ప్రేమించడం లేదట'' అన్నాడు నజార్కా ఉస్తేంకా దగ్గరికొస్తూ, వాడు మళ్లీ తిక్క చేష్ట చేసాడు. అది అందర్నీ నవ్వించింది. యెర్గుషేవ్ వరసలో తర్వాత వున్న మర్యాంకా పక్కనుంచి వెళ్లి ఓ ముసలిదాన్ని కాగలించుకున్నాడు.

''మర్యాంకాని కాగలించుకోవేం? తర్వాత ఆమే వుంది'' అన్నాడు నజార్కా.

''అబ్బే, మా ముసిల్దీ యింకా తియ్యగా వుంది'' బిగ్గరగా అన్నాడా కోసక్, గింజుకునే ఆ ముసల్దాన్ని ముద్దెట్టుకుంటూ.

''నన్ను వూపిరాడకుండా పీక నొక్కేస్తావు నువ్వు'' ఆమె గీపెట్టింది నవ్వుతూ.

లయబద్ధంగా టకటక మనే అడుగుల చప్పుడు వాళ్ల నవ్వుని ఆపింది. ముగ్గురు సైనికులు పై అంగీల్తో, భుజాల్న తుపాకీ లుంచుకుని మందుగుండు బండి దగ్గర పహారా వాళ్ల బదులు వెళ్లడానికి, కదం తొక్కుతూ నెడుతున్నారు.

పాత అశ్విక దళం మనిషైన వాళ్ల అధికారి ఆ కోసక్కులకేసి కోపంగా చూశాడు. రోడ్డు మధ్యన లుకాష్కా నజార్కా నుంచున్న చోటికి వాళ్లు దారి తొలగేటట్టుగా తన మనుషుల్ని నడిపించాడు. నజార్కా జరిగాడు, లుకాష్కా మాత్రం కళ్లు లగ్గుంచేసి, వెడల్పాటి తన వీపు తిప్పాడు, వున్న చోటునుంచి జరక్కుండా.

''మనుషులిక్కడ నుంచున్నారు, చుట్టు తిరిగి వెళ్లండి'' అతను గొణిగాడు, తల సగం మాత్రమే తిప్పి, సైనికుల కేసి తృణీకారంగా చూస్తూ. ఆ మట్టి రోడ్డు మీద వరస తప్పకుండా అడుగువేస్తూ సైనికులు నిశ్శబ్దంగా వెళ్లిపోయారు.

మర్యాంకా నవ్వడం మొదలెట్టింది. మిగిలిన పిల్లలు జతకలిపారు.

''ఏం పొంగు! బారుకోట్ల మలగురువుల గుంపులాగా'' అన్నాడు నజార్కా. సైనికులని అనుకరిస్తూ రోడ్డుమీద కొద్ది అడుగులు నడిచాడు. మళ్లీ ప్రతివాళ్లూ నవ్వుతెరలలో పొర్లిపోయారు.

లుకాష్కా మెల్లగా మర్యాంకా దగ్గరికొచ్చాడు. ''ఆ మొనగాణ్ణి యెక్కడ వుంచారు?'' అడిగాడతను.

మర్యాంకా ఓ క్షణం ఆలోచించింది. ''కొత్త యిల్లు అద్దెకిచ్చాం'' అంది.

''వాడు ముసలాడా, పడుచోడా'' ఆమె పక్క కూర్చుంటూ అడిగాడు లుకాష్కా.

''నేనడిగానా?'' జవాబిచ్చింది ఆమె. ''వాడికి కొంచెం చిఖిర్ తెచ్చి పెట్టడానికి వెళ్లాను. యెరోష్కా మామతో కిటికీ పక్కన కూర్చుని వుండటం చూసాను. ఎర్రటి తలకాయలా వున్నట్టు కనిపించింది. బండెడు సామాను మోసుకొచ్చారు వాళ్లు'' అని కళ్లు నేలమీదకి సారించింది.

''చౌకీనుంచి తంటాలుపడి రావడం యెంత సంతోషంగా వుంది నాకు!'' ఆ పిల్ల దగ్గరికి యింకా జరుగుతూ, అంత సేపూ ఆ పిల్ల కళ్లలోకే చూస్తూ అన్నాడు లుకాష్కా.

''యెక్కువ రోజు లుంటావా?'' అడిగింది మర్యాంకా చిన్న చిరు నవ్వు నవ్వుతూ.

''పొద్దుటిదాకా. నాక్కాసిని గింజలియ్యి'' అన్నాడు చెయ్యి చాస్తూ.

యిప్పుడు మర్యాంకా దాపరికం లేకుండా చిరునవ్వు నవ్వింది. గాగరా మెడపట్టీ వదులుచేసి అంది, ''అన్నీ తీసుకోకు.''

''నువ్వు లేకుండా యెంత ఒంటరితనం అనుభవించాను యింత కాలమూ'' అన్నాడతను నింపాదిగా చెవిలో, అణుచుకుంటూ, ఆ పిల్ల గాగరా మధ్యనుంచి కొన్ని గింజలు తీసుకుంటూ. యింకా ఆమెమీదకి వంగి, దరహాస నయనాల్తో తగ్గుస్థాయిలో ఆమెతోటి మాట్లాడుతూనే వున్నాడు.

''నేను రాను, నీకే చెబుతున్నా'' తటాల్న బిగ్గరగా అంది మర్యాంకా, వెనక్కి వాలి.

''అబ్బే, అదేంకాదు... నీకో సంగతి చెప్పాలనుకుంటున్నాను'' గుస గుసలాడేడు లుకాష్కా. ''ఒట్టు! రా!''

మర్యాంకా తల వూపింది, కాని చిరునవ్వు నవ్వుతూనే వూపింది.

''మర్యాంకా! మర్యాంకా! అమ్మ పిలుస్తోంది. భోజనాలకి!'' ఆ గుంపు కేసి పరిగెత్తుతూ, మర్యాంకా తమ్ముడు కేకేసాడు.

''వస్తున్నా'' జవాబిచ్చింది మర్యాంకా. ''వెళ్లిపోరా, బాబూ, నువ్వెళ్లిపో – నేనో క్షణంలో వస్తున్నా.''

లుకాష్కా నుంచుని టోపీ యెత్తాడు.

''నేనూ యింటికి పోతా, అదే ఉత్తమం'' అన్నాడతను యేమీ పట్టించుకోకుండా వున్నట్టు కనిపించడానికి, కాని చిరునవ్వు ఆపుకో లేకపోయాడు. యింటి సందు మొగలో మాయమైపోయాడు.

యీ లోపున రాత్రి వూరిని ఆవరించింది. నల్లని ఆకాశంమీద ప్రకాశవంతమైన నక్షత్రాలు విస్తరించుకున్నాయి. వీధులు చీకటిగా, నిర్మానుష్యంగా వున్నాయి. నజార్కా యింకా ఆడవాళ్లతోటే మిట్ట దగ్గర వుండిపోయాడు. వాళ్ల నవ్వులు యింకా వినిపిస్తున్నాయి. కాని లుకాష్కా ఆ పిల్లల దగ్గర్నుంచి మెల్లిగా కదిలిపోయి, పిల్లిలా నక్కి, తటాల్న లాఘవంగా పరిగెత్త నారంభించాడు, తన బాకుని సరిచేసు

కోడానికి పట్టుకుంటూ. యింటి కేసి పరిగెత్తలేదతను, కేతనధారి యింటికేసి పరిగెత్తాడు. రెండు వీధులు దాటి ఓ సందులోకి తిరిగాడు. కోటు కింద భాగం పైకెత్తుకుని కంచెదాపు చీకట్లో కూర్చున్నాడు. ''పిసరైన కేతనధారి కూతురు!'' అనుకున్నాడు మర్యాంకాని గురించి. ''పిసరు కూడా సరసం పోదు, వెధవగాడవ! అయినా చూద్దాం!''

దగ్గరికొచ్చే ఆడపిల్ల అడుగుల చప్పుడు అతని దృష్టిని ఆకట్టుకుంది. వింటూ తనకి తనే నవ్వుకున్నాడు.

మర్యాంకా తల వంచుకుని, ఓ బెత్తంతో కంచెగుంజలకేసి కొడుతూ, అతనికేసి తిన్నగా త్వరగా క్రమబద్ధంగా అంగలు వేస్తూ నడుస్తోంది. లుకాష్క నుంచున్నాడు. మర్యాంకా ఉలికిపడి ఆగింది.

''ఓ! నువ్వా దౌర్భాగ్యుడా! యెంత భయపెట్టావు నన్ను! అయితే నువ్వింటికి పోలేదన్న మాట!'' అందామె. బిగ్గరగా నవ్వింది.

లుకాష్క ఓ చెయ్యి ఆమె చుట్టూతా వేసి రెండో చేత్తో ఆమె ముఖం పైకెత్తాడు. ''నీకేం చెప్పాలనుకున్నానో, దేవుడితోడు!'' అతని కంఠం వణికింది, మణిగిపోయింది.

''యేంటి మాట్లాడుతున్నావ్ నువ్వు, యీ రాత్రివేళ!'' అంది మర్యాంకా. ''అమ్మ నాకోసం చూస్తోంది. నువ్వు నీ రామచిలక దగ్గరికి పో.''

అతని చేతుల్లోనుంచి విడిపించుకుని, కొన్ని అడుగులు పరిగెత్తిపోయింది. వాళ్ళింటి దడికంచె దగ్గరికొచ్చాక ఆమె తిరిగి ఆ కోసక్ కేసి తిరిగింది. అతనామె పక్క పరిగెడుతున్నాడు, తనతో యింకా కొంచెం సేపుండమని ఆమెని బతిమాలుతూనే వున్నాడు.

''సరే, యేం చెప్పాలనుకున్నావ్, చీకటి పక్షీ?'' మళ్ళీ నవ్వడం మొదలెట్టింది.

''నన్ను చూసి నవ్వద్దు, మర్యాంకా! తప్పేగొయ్యా! వూఁ, నాకు రామచిలక వుంటే యేం? దాని సిగ్గోసిరి! నువ్వు వూఁ అను, మరి

నేను నిన్ను ప్రేమిస్తా – నువ్వేం కావాలన్నా చేస్తా. యిది విను!" జేబులో డబ్బులు గలగల లాడించాడు. "మనం బ్రహ్మాండంగా బతకొచ్చు. వాళ్లంతా సరదాగా గడుపుతున్నారు. నా గతేంకాను? నీనుంచి నాకు యే సుఖమూ లేదు, మర్యాంకా, ప్రియా!"

ఆ పిల్ల మాట్లాళ్లేదు. గబగబా కదిలే వేళ్లతో బెత్తం ముక్కలు ముక్కలుగా విరిచేస్తూ, ఆమె అతని ముందు నుంచుంది.

లుకాష్క హఠాత్తుగా తన పళ్ళూ, పిడికిలీ బిగించేశాడు. "యేమిటీ జాగారం! నేన్నిన్ను ప్రేమించడం లేదా అమ్మాయ్! నాతో నీ యిష్టం వచ్చినట్టుండచ్చు" తటాల్న అన్నాడతను, కోపంగా కనుబొమలు ముడిచి, ఆమె రెండు చేతులూ లాక్కుంటూ.

మర్యాంకా ముఖంలోని కలవరపాటులేని కవళికా, నెమ్మదైన స్వరమూ మారలేదు.

"ఆవేశపడకు లుకాష్క, నే చెప్పేది విను" జవాబిచ్చింది ఆమె, చేతులు వెనక్కి లాక్కోకుండా, కాని ఆ కోసక్కుని అంత మాత్రం దూరంలో వుంచుతూ. "నేనాడపిల్లనే, నిజమే. నే చెప్పేది విను! నేను కాదుగదా నిర్ణయించుకునేది. కాని నన్ను నువ్వు ప్రేమిస్తే, ఓ సంగతి చెబుతా. నా చేతులొదిలెయ్యి, అలా పట్టుకోనక్కర్లేకుండానే చెబుతా. నేను నిన్ను పెళ్లాడతా. కాని చిల్లర చేష్టలు నా వల్లగాదు" అంది మర్యాంకా, తల తిప్పకుండానే.

"నన్ను పెళ్లాడతావా? పెళ్లి మనమీద ఆధారపడి లేదులే. నన్ను ప్రేమించు, మర్యాంకా, బంగారం" చిరుబురూ, ఆగ్రహం తగ్గి మళ్లీ మర్యాదగా, అణకువగా, జాలిగా మారిపోయి ఆమె కళ్లలోకి దగ్గరసా చూసి నవ్వుతూ అన్నాడు లుకాష్క.

మర్యాంకా అతన్ని వాటేసుకుని గట్టిగా పెదాలమీద ముద్దు పెట్టుకుంది. "ప్రియా!" అని ఆమె మెల్లిగా అంది వంకరపోయేటట్టు అతన్ని తన కేసి అదుముకుంటూ. వెంటనే, ఒక్క ఉదుటున,

అతన్నుంచి దూరంగా విడిపోతూ, వాళ్ల యింటి ద్వారం దగ్గరికి, వెనుదిరిగి చూడకుండా, పరిగెత్తిపోయింది.

యింకో క్షణం ఆగమనీ, తను చెప్పేది వినమనీ ఆ కోసక్ మొర పెడుతూ వున్నా మర్యాంకా ఆగలేదు.

"ఫో. మనర్ని చూస్తారు! అద్దెకున్న పిశాచంగాడు దొడ్లో యెక్కడ్నో తారట్లాడుతూనే వుంటాడని నా అనుమానం" అంది.

"కేతనధారి కూతురు" అనుకున్నాడు లుకాష్క. "ఆమె నన్ను పెళ్లాడుతుంది. పెళ్లి సంగతి సరేలే, వూరికే నాతో సరసమాడ కూడదూ!"

అతను యామ్కా యింటిదగ్గర నజార్కాని చూశాడు. అతనితో కాసేపు తాగి, దున్యెకా యింటికి వెళ్లాడు. ఆమె తనపట్ల అవిధేయంగా వున్నా అక్కడ అతనా రాత్రి గడిపాడు.

## 14

మర్యాంకా గేటు దాటి వచ్చేటప్పటికి ఒలేనిన్ ముంగిట్లో నడుస్తూ వుండటమూ నిజమే. ఆమె 'అద్దెకున్న పిశాచంగాడి' గురించి యేం చెప్పిందీ వినడమూ నిజమే. ఆ సాయంత్రమంతా తన బస గుమ్మం దగ్గర అతను యెరోష్కా మామతో గడిపాడు. ఓ బల్ల వేసుకుని, సమొవార్* పెట్టుకుని, వైనూ, వెలిగించిన కొవ్వొత్తీ యివతలికి తెచ్చుకుని టీ తాగుతూ, చుట్ట ముట్టించుకుని, గుమ్మంలో, తన కాళ్ల దగ్గర కూచున్న ఆ ముసలాడు చెప్పే కథలు వింటూ వున్నాడు. గాలి నిశ్చలంగా వున్నా ఆ కొవ్వొత్తి, మైనం కారి, రెపరెప లాడింది, కాసేపు గుమ్మాన్నీ, కాసేపు బల్లనీ, పింగాణీ సామాన్నీ,

* రష్యన్ టీ పాత్ర. — సం.

కాసేపు క్షవరం చేయించుకున్న ఆ ముసలాడి నెరిసిన తలనీ వెలుతుర్లో చూపెడుతూ. దీపం జ్వాల చుట్టూ పురుగులు తిరిగాయి. అవి బల్లమీదా, గ్లాసుల్లోనూ, రెక్కలల్లల్లాడిస్తూ ఓ క్షణం అవతలి వేపు నల్లని నీడలోకి మాయమైపోతూనూ వుంటే వాటి రెక్కలనుంచి దుమ్మురాలింది. ఒలేనిన్, యెరోష్కా కలిసి అయిదు సీసాల చిఖిర్ ఖాళీ చేశారు. ప్రతీ సారీ యెరోష్కా గ్లాసులు నింపి ఒలేనిన్‌కి అతని ఆరోగ్యం కోసమని తాగుతూ అందిచ్చేవాడు. అలుపులేకుండా మాట్లాడుతూనే వుండేవాడు. పాత రోజులనాటి కోసక్ జీవితం గురించి చెప్పాడు. తన తండ్రి 'ఆ భారీ మనిషి' గురించీ, ఆయనొక్కడూ యెలా బస్తాన్నర బరువున్న చచ్చిన అడివి పందిని మోసిందీ, ఒక్కసారి రెండు కడవల చిఖిర్ తాగగలిగిందీ చెప్పాడు. తన రోజుల గురించీ, తన స్నేహితుడు గిర్చిక్ గురించీ, ప్లేగువ్యాధి రోజుల్లో అతనితో కలిసి తను టెరెక్ కవతలనుంచి బొచ్చుకంబళీ దుప్పట్లు కాజెయ్యడం గురించీ చెప్పాడు. తను యెలా ఓ రోజున రెండు జింకల్ని చంపిందీ, రాత్రిళ్లు చౌకీ దగ్గరకి లగెత్తుకొచ్చే తన 'బంగారం' గురించీ చెప్పేడు. యిదంతా యెంత వాగ్ధాటితో యెంత వర్ణనీయంగా చెప్పేడంటే ఒలేనిన్ కాలం యెలా గడిచిందీ గమనించనేలేదు.

''ఓహ్! నేస్తం, నేను వయసులో వున్నప్పుడు నువ్వు చూళ్లేదు. అప్పుడు నీకు నా తడాఖా చూపించి వుండేవాణ్ణి. యివాళా? 'యెరోష్కా మామ కూజా నాకుతున్నాడు!' కాని అప్పటి యెరోష్కా మొత్తం పటాలమంతా పేరు మోసిపోయాడు. ఒకటోరకం గుర్రం యెవరిది? గుర్దా* కత్తి యెవరికుంది? యెవరితో కలిసి తాగి మజా చెయ్యాలి? కొండల్లోకి అహ్మెత్‌ఖాన్ని చంపడానికి పంపదగ్గ

---

* కాకసస్‌లో యెన్న తగిన కత్తులూ, బాకులూ వాటిని చేసిన వాడి పేరుమీద పిలిచేవారు — గుర్దా. — సం.

మనిషెవరు? ఆఁ! యెప్పుడూ యెరోష్కాయే. ఆడపిల్లలు వెంట బడే దెవర్ని? అస్తమానూ యెరోష్కాయే ప్రత్యక్షం. యెందుకంటే నేను, నేనే నిజమైన జిగిత్‌ని. తాగేవాణ్ణి, దొంగని (నేనే కొండల్లో గుర్రాల గుంపుని పట్టేసేవాణ్ణి), పాటగాణ్ణి; అన్నింటోనూ చెయ్యి తిరిగిన వాణ్ణి! అలాంటి కోసక్కులేరీ యివాళ? పిళ్లకేసి చూడాలంటేనే నాకసహ్యం. పిళ్లు అంత యెత్తున్నప్పుడు (యెరోష్కా నేలమీద మూడు అడుగుల యెత్తులో చెయ్యిపెట్టాడు) సవ్వొచ్చే బూట్లు వేసుకుని వాటికేసే చూస్తూ వుంటాయి — వాళ్లకి తెలిసిన సంతోషమంతా అదే. లేకపోతే తాగుడుతో నింపేసుకుంటారు, మగాళ్లల్లా తాగలేరు, అంతా యేదో రకంగా తప్పుడే. నేనెవర్ని? నేను యెరోష్కా దొంగని, నా గురించి వూళ్లో వాళ్లకి తెలుసు, కొండల్లో తెలుసు. నన్ను చూడ్డానికి రాజకుమారులు వచ్చేవారు! వాళ్లు నా కునాక్‌లు. నేను ప్రతివాడికీ కునాక్‌నే. వాడు తాతార్ అయితే తాతార్‌తోనే, అర్మీనియన్ అయితే అర్మీనియన్‌తో; జవానైతే జవానుతోటే. ఆఫీసరైతే ఆఫీసరుతోటే! వాడు తాగేవాడైనంతకాలమూ మనకేం ఫికర్ లేదు. 'నువ్వీ ప్రాపంచిక విషయాలనుంచి పరిశుద్ధుడవుకమ్మ' అంటారు వాళ్లు, 'నువ్వు సైనికులతో తాగకుము, తాతార్‌తో తినకుము.' "

"యెవరంటారలా?" ఒలేనిన్ అడిగాడు.

"యెవరా, మన మతం పెద్దలు! కాని ఓ ముల్లా చెప్పేదో, తాతార్ ఖాజీ చెప్పేదో విను. వాడంటాడు: 'ఒరే! విశ్వాసరహితుడైన మతద్వేషీ, నీవెందుకు పంది మాంసం తింటావు?' ప్రతివాడికీ వాడి ధర్మం వుందని అది తెలియ చెపుతోంది. కాని నేనదేమంటే అంతా ఒకటే. దేముడు ప్రతీదాన్నీ మనిషి ఆనందం కోసం చేశాడు. యెందులోనూ పాపం లేదు. మాటకి, ఓ జంతువుని తీసుకో. తాతార్ల రెల్లులో వుంటుంది. మన రెల్లులోనూ వుంటుంది. అదెక్కడికెడితే అక్కడే దాని యిల్లు! దేవుడేదిస్తే అదే తింటుంది! దానికి

నువ్వు నరకంలో సెనంమీద కాలిపోతా వంటారు మన నెధవాయలు. యిదంతా దగా, నా దృష్టిలో'' అన్నాడు, కాసేపాగి.

''దగా అంటే యేమిటి?'' అడిగాడు ఒలేనిన్.

''యేముంది, నీతులు చెప్పేవాళ్లదే. చెర్వ్లేనయాలో ఓ సైనిక కేప్టెన్ వుండేవాడు. నా కునాక్, భలే వాడ్లే, అచ్చు నాలాగే. చెచ్న్యాలో అతన్ని చంపేసారు. అతనంటూ వుండేవాడు నీతులు చెప్పేవాళ్లు అన్నీ వాళ్ల బుర్రల్లో సృష్టిస్తారని. 'నువ్వు చస్తే నీ గోరీమీద గడ్డి మొలుస్తుంది, అంతే!' అనేవాడు.'' ఆ ముసలాడు నవ్వాడు. ''తెగించిన వాడ్లే.''

''నీ వయసెంత?'' అడిగాడు ఒలేనిన్.

''బ్రహ్మదేవుడికి తెలియాలి! ఓ డెబ్బై వుంటాయేమో. మీ జార్ రాణీవారు గద్దెమీదున్నప్పుడు నేనేం బుల్లికూచినిగాను. అది లెక్కేసుకో. డెబ్బై వుంటాయ్, హే?''

''ఆఁ, వుండొచ్చు, కాని నువ్వింకా భలే వున్నావ్.''

''ఆఁ, దేవుడి దయవల్ల. నేనింకా సత్తువగా వున్నా. ఆటి నుంచీ అంతే ననుకో, ఓ ఆడది తగలేసింది నన్ను, అది రప్ప. దొంగముండ....''

''అదేమిటి?''

''ఆ, తగలేసింది.''

''అయితే నువ్వు చచ్చిపోతే నీ గోరీమీద గడ్డి మొలుస్తుందంటావ్?'' రెట్టించాడు ఒలేనిన్. యెరోష్కా తన వూహ స్పష్టంగా చెప్పడం లేదన్నది తెలుస్తూనే వుంది. ఓ క్షణం వూరుకున్నాడు. ''నువేమిటను కున్నావ్? యిదిగో తాగు!'' తటాల్న అరిచాడతను, నవ్వుతూ ఒలేనిన్‌కి కొంచెం వైన్ యిస్తూ.

"సరే, యెక్కడున్నాన్నేను?" అతను కొనసాగించాడు, గుర్తు చేసుకుంటూ. "యేం అలాంటి వాణ్ణి నేను. నేనో వేటగాణ్ణి. పటాలంలో నాతో ఢీటు వచ్చే వేటగాడు లేడు. యే జంతువునేనా సరే, పక్షినేనా సరే నీకు చూపిస్తాను. అవేం చేస్తాయి, యెక్కడికి పోతాయ్ — అన్నీ నాకు తెలుసు! నాకు కుక్కలున్నాయి, రెండు తుపాకులు, వలలు, తెరలు, ఓ గద్ద. అన్నీ వున్నాయి నాకు, దేవుడి దయవల్ల! నువ్వు అసలైన వేటగాడివైతే, దబ్బాల కొటుని రాకుండా, నీకు ప్రతిదీ చూపిస్తా. నేనెలాంటి వాణ్ణో తెలుసా? జాడ చూసీ చూడగానే — ఆ జంతువుని తెలుసుకుంటాను. అదెక్కడ పడుకుంటుందో, యెక్కడ నీళ్ళు తాగుతుందో, యెక్కడ పొర్లుతుందో నాకు తెలుసు. నాకు నేనే ఓ మాటు వేసుకుని రాత్రంతా కూచుంటా, కాపలా కాస్తూ. యింటిదగ్గర కూచుని యేం లాభం? వూరికే అల్లరి, తెగ తాగడం. ఆడముండ లొచ్చి వాగుతూ వుంటారు, పిల్ల వెధవలు నన్ను చూసి అరుస్తారు. అది చాలు మనిషికి పిచ్చెక్కడానికి. తెల్లవారకట్లే అవతలికి పోవడం అంటావ్, ఒది లేదు. ఓ చోటు నువ్వు చూసుకుంటావ్, రెల్లు తొక్కి అక్కడ చూస్తూ కూచుంటావ్, ఊపిరిబిగపట్టుకున్నాగా. అడివిలో జరిగే ప్రతిదీ నీకు తెలుస్తుంది. ఆకాశంకేసి చూస్తావ్: నక్షత్రాల గమనం చూస్తావ్, వేళ యెంతైందీ అవి చెపుతాయి నీకు. చుట్టూతా చూస్తావు — అడివి రెపరెప లాడుతుంది; నువ్వు అలా చూస్తూనే వుంటావ్ ఆఖరికి పొదల్లో ఫెళఫెళ లాడుతుంది, నువ్వనుకుంటావ్ — బురదలో పొర్లడానికి ఓ అడివిపంది వస్తుందని. గద్ద పిల్లలు 'గీ'మని కూత పెడతాయి, వూళ్ళో కోళ్ళు కొక్కరో అంటాయి, బాతులు బక్‌బక్ మంటాయి. బాతుల అరుపు వినిపిస్తే యింకా అర్ధరాత్రి కాలేదన్న మాట. నాకా సంగతులన్నీ తెలుసు! లేదా ఓ

తుపాకీ కాల్పు వినిపిస్తుంది, యెక్కడో దూరంగా, యింక నీ వూహలు మొదలు. యెవడా కాల్చేది? నీలాగే జంతువుకోసం కాసిపెట్టు కున్న యింకో కోసక్కా? వాడు దాన్ని చంపాడా? వూరికే గాయపర్చాడా? పాపం ఆ జంతువు రక్తం కారుస్తూ రెల్లు దుబ్బుల్లో కుంటుకుంటూ పోయిందా? యేసు లేని గొడవేనా? నాకది నచ్చదు! ఓహ్ నాకదెంత అసహ్యం! యెందుకు జంతువుని గాయపర్చడం? వెధవ, వెధవా! లేకపోతే నువ్వనుకుంటావ్ 'ఓ అబ్రేక్ తెలివితక్కువ కోసక్కు నెవణ్నోనా చంపాడేమో.' నీ బుర్రంతా అలాంటి ఆలోచనలే. ఓ సారి నేను నది దగ్గర కాపుకాసి వుంటే, ఓ వుయ్యాలా కొట్టుకురావడం చూసాను. దాంట్లో లోపం యేమీ లేదు, ఓ మూల కాస్త విరిగిపోయిందంతే. అప్పుడొచ్చాయి చూస్కో ఆలోచనలు! యెవరి వుయ్యాలా అయి వుంటుంది. దుర్మార్గపు ముండాకొడుకులు మీ జవాన్లెవరో యే కొంపలోనో దూరి చెచెన్ ఆడాళ్లని నట్టేసి వుంటారు; యే రాక్షసుడో ఓ పసి బిడ్డని చంపి వుంటాడు, దాన్ని కాళ్లతో పట్టుకుని గోడ కేసి బుర్ర బద్దలుగొట్టి వుంటాడు. యేం వాళ్లలాంటి పన్లు చెయ్యరూ? ఓహ్! మనుషులికి జాలి లేదు! నన్ను కనికరంతో ముంచెత్తే ఆలోచనలు వచ్చాయి. అంతే, వుయ్యాలా విసిరేసి వుంటారు, ఆడకూతుర్ని గెంటేసి వుంటారు, యిల్లు తగలెట్టి వుంటారు, కాని దాని మొగుడు తుపాకీ తీసుకుని నుమ్మల్ని దోచేసుకోడానికి మా వేపు వచ్చివుంటాడు అనుకు న్నాన్నేను. అక్కడ కూర్చుంటే నీకొచ్చే ఆలోచనలు బోలెడు. కాని దుబ్బుల్లోనుంచి పంది పిల్లలు తోసుకొస్తూ వుంటే నీ గుండె దడదడ లాడిపోతుంది. యిటు రండి మా తల్లులూ! నువ్వు అను కుంటావప్పుడు నన్ను వాసన పట్టేస్తాయి. ఆఁ, నువ్వు కూర్చుని యిక కదలవు, అప్పుడు నీ గుండె చూస్కో దడా! దడదడా! చాలు, నువ్వు గాలిలో యెగిరిపోడానికి. యీ వసంతకాలంలో ఓ సారి పూంఛి పంది పిల్లల మంద నా దగ్గరి కొచ్చింది, యేదో వల్లగా కనిపించింది.

'దేవుడూ ఆయన కుమారుడూ సాక్షిగా' అనుకున్నా. నేను యిహ కాల్చే ద్దామా అనుకున్నానంతే. పంది గుర్రుమంది పిల్లలకి, 'ప్రమాదం పిల్లలూ, యిక్కడో మానవుడున్నాడు' అంది. అంతే, పిల్లలన్నీ దుబ్బులు చీల్చుకుంటూ పారిపోయాయి. దాన్ని పళ్ళతో కొరికేద్దామా అన్నంత యిదైపోయింది నాకు.''

''అక్కడ మనిషున్నాడని పంది తన పిల్లలకి యెలా చెప్పగల్దు?'' అడిగాడు ఒలేనిన్.

''యెందుకు చెప్పలేదు? ఆ జంతువేమన్నా దద్దమ్మనుకున్నావా? అబ్బే, అది మనిషి కంటే తెలివైంది, దాన్ని నువ్వు పంది అని పిలిచినా సరే! దానికి ప్రతీదీ తెలుసు. మాట వరసకి, యిది చూడు. నీ జాడ లోనే మనిషెడతాడు, దాన్ని గమనించడు; కాని పందో, నీ జాడ చూడగానే వాసన చూసి పారిపోతుందంతే. అది చాలదూ దానికి జ్ఞానం వుందనడానికి? లేదంటావా? నీ వాసనే నీకు తెలీదు, కాని దానికి తెలుసు. మనం యిదీ అనుకోవాలి. నువ్వు ఆ పందిని చంపాల నుకుంటావ్, కాని లక్షణంగా బతికి పోవాలనుకుంటుంది అడివిలోకి. నీకో ధర్మం వుంది, దానికో ధర్మం వుంది. అది పందే, కాని అది నీకంటే యేం తక్కువగాదు – మనమంతా దేవుడి జీవాలమే. ఓ నాయనా! మనిషి వెధవ, వెధవ, వెధవన్నర వెధవ!'' యీ మాటనా ముసలాడు యెన్నో సార్లు రెట్టించాడు, అప్పుడు తలకాయ వాలేసి, ఆలోచిస్తూ కూర్చున్నాడు.

ఒలేనిన్ కూడా ఆలోచనల్లో మునిగిపోయాడు. గుమ్మం దిగి వెనక చేతులు కట్టుకుని, ముంగిట్లో పచార్లు చేస్తూ వుండిపోయాడు.

యెరోష్క ఆలోచనల్లోనుంచి తేరుకుని, తలయెత్తి, రెపరెపలాడే కొవ్వొత్తి జ్వాల చుట్టూ తిరిగి అందులో మాడిపోయే పురుగుల కేసి దీక్షగా చూస్తూ వుండిపోయాడు.

''వెర్రిమొద్దూ, వెర్రిమొద్దూ! యెక్కడికి యెగిరిపోతున్నారు? వెర్రి

మొద్దూ, వెర్రిమొద్దూ!'' అతను లేచి తన మందమైన వేళ్లతో పురుగుల్ని తోలెయ్యడం మొదలెట్టాడు.

''నువ్వు కాలిపోతావ్, వెర్రిముండా! యిటు యెగురు, చచ్చినంత చోటుంది.'' తన మందమైన వేళ్లతో దానిని రెక్కలతో సున్నితంగా పట్టుకుని మళ్లీ యెగరడానికి దాన్ని వదిలేస్తూ మృదువుగా అన్నాడతను. ''నిన్ను నువ్వే చంపేసుకుంటున్నావు, అయ్యో నాకు నువ్వంటే విచారంగా వుంది!''

అతను చాలా సేపు నాగుతూ, సీసాలోనుంచి పోసుకుని తాగుతూ కూర్చున్నాడు. ఒలేనిన్ ముంగిట్లో అటూ యిటూ పచారుచేస్తూ వున్నాడు. హఠాత్తుగా గేటు బయట గుసగుసల శబ్దం వినిపించి చకితుడయ్యాడు. అప్రయత్నంగా వూపిరి బిగపట్టుకుని, అతను ఒక స్త్రీ నవ్వూ, మగాడి గొంతూ, ముద్దు పెట్టుకున్న ధ్వనీ విన్నాడు. కావాలని కాలికింద గడ్డిని రెపరెపలాడిస్తూ ముంగిలి అవతలి వేపుకి వెళ్లాడు. కొంచెం సేపటి తర్వాత గుంజల దడి కిర్రుమంది. నల్లని సర్కేషియన్ కోటూ, తెల్లని గొర్రెబొచ్చు టోపీ వున్న కోసక్ ఒకడు దడి వారే వెళ్లాడు (అది లుకాష్క). ఒక పొడుగాటి ఆడమనిషి, నెత్తిమీద తెల్లని రుమాలుతో, ఒలేనిన్‌ని దాటి వెళ్లింది. ''నీగ్గాని, నాగ్గాని ఒకళ్లతో ఒకళ్లకి పన్లేదు'' అని చెబుతున్నట్టుగా వుంది మర్యాంకా పొంకమైన నడక. అతను కళ్లతోటే ఆమెని గుమ్మందాకా అనుసరించాడు. ఆమె రుమాలు తీసెయ్యడం, కూర్చోవడం కూడా కిటికీ గుండా చూసాడు. ఒక్కసారిగా ఒంటరితనపు విచారానుభూతి, అస్పష్టమైన దిగుళ్లు, ఆశలు, యెవళ్లమీదనో ఒకళ్ల మీద అసూయా అతని మనసు నావరించాయి.

యిళ్లలో ఆఖరి దీపాలు ఆరిపోయాయి. ఆఖరి చప్పుళ్లూ మాయమై పోయాయి. గుంజలదడీ, దొడ్లో తెల్లగా మెరుస్తూ పశువులూ, యిళ్లకప్పులూ తీవిగల బూరుగు చెట్లూ అన్నీ కూడా, పని చేసిం

తర్వాత పక్కే గాఢమైన నిద్రలో మునిగినట్టుగా, వున్నాయి. చిత్తడిగా వున్న దూరంనుంచి కప్పల యెడతెగని బెకబెకలు మాత్రం ఆ యువకుణ్ణి చేరుతున్నాయి. తూర్పు దిక్కున నక్షత్రాలు తగ్గిపోతూ, పలుచుకుంటూ వున్న వెలుతుర్లో కరిగిపోతూన్నట్టు కనిపిస్తున్నాయి. కాని నడినెత్తిన అవి ముందుకంటే దట్టంగా గంభీరంగా వున్నాయి. ఆ ముసలాడు చేతిమీద తల పెట్టుకుని జోగుతున్నాడు. అవతలి దొడ్లో ఓ కోడి కూసింది. కాని ఒలేనిన్ దేన్ని గురించో ఆలోచిస్తూ యింకా ముంగిట్లో పచారు చేస్తున్నాడు. యెంతోమంది కలిసి పాడుతూ వున్న పాట ధ్వని అతనికి వినిపించింది. అతను దడి దగ్గర కెళ్ళి విన్నాడు. ఎంతోమంది పడుచు కోసక్కులు పాడుతున్నారు. ఓ గొంతుక అన్నిటి కంటే యెక్కువగా మోగుతోంది.

"అక్కడ యెవరు పాడుతూ వున్నారో తెలుసా?" అన్నాడు ముసలాడు, నిద్రలేస్తూ. "అది ధైర్యవంతుడైన లుకాష్క. వాడో చెచెన్‌ని చంపాడు, యిప్పుడు సంబరంగా వున్నాడు. కాని అందులో సంబరపడ్డానికేముంది?... వెర్రివాడు, వెర్రివాడు!"

"నువ్వెప్పుడన్నా మనుషుల్ని చంపావా?" అడిగాడు ఒలేనిన్.

ఆ ముసలాడు హఠాత్తుగా మోచేతులమీద ఆనుకుని లేచి, తన మొహం ఒలేనిన్ దగ్గరగా పెట్టాడు.

"ఓయ్ పిశాచమా!" ముసలాడు అరిచాడు. "ఏంటె నువ్వడిగేది? ఆ సంగతి యెత్తొద్దు. ఒక మనిషిని చంపడం చాలా ఘోరమైన విష యం.... ఆఁ! చాలా ఘోరమైన విషయం.... సరే, సెలవ్, నేస్తం. నీ మందూ, భోజనం సుష్టుగా వున్నాయి" అన్నాడతను, లేస్తూ. "రేపు రానా, వేటకెడదామా?"

"ఆఁ! రా!"

"జాగ్రత్త, పెందరాళే లే, యెక్కువ సేపు నిద్రపోయావో నీకు జరిమానాయే."

''యేం భయపడొద్దు. నీకంటే ముందే లేస్తాలే'' అన్నాడు ఒలేనిన్.

ఆ ముసలాడు వెళ్ళిపోయాడు. ఆ పాట ఆగిపోయింది. కాని అడుగుల చప్పుడూ మాటలూ వినిపిస్తున్నాయి. కొంచెం సేపటి తర్వాత పాట మళ్ళీ మొదలైంది. కాని యింకా దూరంగా, యెరోష్కా కంచు కంఠం కూడా మోగుతోంది.

''యేం మనుషులు, యేం జీవితం!'' అనుకున్నాడు ఒలేనిన్, ఒక నిట్టూర్పుతో. ఒంటరిగా యింట్లోకి తిరిగి వెళ్ళాడు.

## 16

యెరోష్కా మామ ప్రస్తుతం నౌకరీలో లేడు. ఒంటరిగా వుంటాడు. యిరవై యేళ్ళ కితం అతని భార్య సదాచార మతానికి మారిపోయి అతన్ని వదిలేసి ఒక రష్యన్ సార్జంట్ మేజర్‌ని పెళ్ళాడింది. అతనికి పిల్లల్లేరు. తను వయసులో వున్నప్పుడు వూళ్ళోకల్లా మహా ధైర్యవంతుడైన అగ్గి పిడుగునని అతను చెప్పుకున్నా అదేం డప్పాలు కాదు. ఒకనాటి అతని శౌర్యం పటాలంలో ప్రతి ఒక్కడికీ తెలుసు. రష్యన్లూ, చెచెన్లూ చాలామంది అతని చేతిలో చచ్చారు. కొండల్లో కొల్లగొట్టడానికి వెళ్ళేవాడు, రష్యన్లని కూడా దోచుకునేవాడు. రెండు సార్లు జైలు కెళ్ళాడు. అతని జీవితంలో యెక్కువ భాగం అడవుల్లోనే గడిచింది, వేటాడ్డంలో. అక్కడ అతను రోజులకొద్దీ ఒట్టి రొట్టే తినీ, ఒట్టి నీళ్ళు తాగీ బతికాడు; కాని అదే మరి వూళ్ళో వున్నప్పుడైతే పొద్దుటినుంచి సాయంత్రం దాకా మజా చేస్తూ గడిపేసేవాడు. ఒలేనిన్‌ని వదిలి వెళ్ళాక ఓ రెండు గంటలు పడుకున్నాడు. వెలుతురు రాకుండానే నిద్ర లేచాడు. తనకి ముందు రోజు సాయంత్రం పరిచయమైన మనిషిని గురించి ఆలోచిస్తూ మంచంమీద పడుకున్నాడు. ఒలేనిన్ అమాయకత్వం (అమాయకత్వం అంటే తనకి

లాగుడు పోయించడానికి వెనక్కి తీయలేదనే అర్థంలోనే) అతనికి ముచ్చటేసింది, ఒలేనిన్ తనే అంత ముచ్చటేశాడు. రష్యన్లంతా యెందుకు "అమాయికంగా" అంత సంపదతో వుంటారోనని ఆశ్చర్యపడ్డాడు, వాళ్లకి యెందుకు యేమీ తెలీదో, అయినా చదువుకుని వుంటారోననీ ఆశ్చర్యపోయాడు. యీ ప్రశ్నలే తలపోస్తూ వుండిపోయాడు. ఒలేనిన్‌నుంచి తనేం రాబట్టగలడో కూడా ఆలోచించాడు.

యెరోష్కా మామ యిల్లు విశాలమైందే, పాతదీ కాదు. కాని అందులో ఆడది లేని లోటు కనిపిస్తూనే వుంది. కోసక్కులకి సామాన్యంగా వుండే పరిశుభ్రతకి మారుగా యిల్లంతా రోతగా మహా వికారంగా వుంది. రక్తపు మరకల కోటొకటి బల్లమీద విసిరేసి వుంది; గద్దకి పెట్టడానికి వూడపెరికి కోసిన కాకిపక్క పిసిగిన పిండి ముద్ద సగం వుంది. ముతకతోలు చెప్పులూ, తుపాకీ, బాకూ, చిన్న సంచీ, తడిసిన బట్టలూ, చిల్లర గుడ్డముక్కలూ బల్లలమీద చెల్లాచెదురుగా వున్నాయి. ఓ మూల కంపు కొట్టే నీళ్ల తొట్టి వుంది. అందులో ఓ జత చెప్పులు నానబెట్టి వున్నాయి. పక్కనే వో తుపాకీ, వేటతెర వున్నాయి. చచ్చిన కొన్ని అడవికోళ్లూ, విసిరేసిన వలా నేలమీద పడి వున్నాయి. కాలికి తాడు కట్టేసిన కోడి ఒకటి అక్కడ తిరుగుతూ ఆ కుళ్లని పొడుస్తోంది. రాజెయ్యని పొయ్యిమీద పాల లాంటి ద్రవం వున్న విరిగిన కుండ ఒకటి వుంది. పొయ్యికి యెత్తులో పైన తాడుతో కట్టేసిన గద్ద వొకటి అరుస్తూ తాడు తెంపుకోడానికి గుంజుకుంటోంది. యీకలు రాల్చే గద్ద ఒకటి ఓరగా పెట్టుకేసి చూస్తూ అడపాదడపా తల అటూ యిటూ తిప్పుతూ పొయ్యి అంచున కూర్చుంది.

చొక్కా తొడుక్కుని యెరోష్కా మామ గోడకీ పొయ్యికీ మధ్యన బిగించిన చిన్న పక్కమీద బోర్లపడుకున్నాడు. బలిష్ఠమైన అతని కాళ్లు లేచివున్నాయి. పాదాలు పొయ్యిమీదకి వున్నాయి. చేతులమీద

గద్ద గీసిన బరుకులు, తన మందమైన వేళ్లతో గిల్లుకుంటూ వున్నాడు. గద్దని చేతి తొడుగులు లేకుండానే తీసికెళ్లడం అతని కలవాటు. గదంతా, ముఖ్యంగా ఆ ముసలాడి దగ్గర, అతని కూడా వుండే ఘాటు వాసనలతో వుంది, అసహ్యాకరం కాకపోయినా.

''ఉయ్‌దెమా, మామా?'' (మామ వున్నాడా లోపల?) కిటికీ లోనుంచి వచ్చిందో తీవ్రమైన కంఠం. అది లుకాష్కదని వెంఠనే అతను గ్రహించాడు.

''ఉయ్‌దె, ఉయ్‌దె, ఉయ్‌దె! వున్నా!'' అరిచాడా ముసలాడు. ''రావయ్యా, యిరుగింటి మర్కా, లుకాష్క మర్కా. యేంటి మీ మామతో పనిబడింది? చౌకీ దగ్గరికి పోతున్నావా?''

ఆ గద్ద తన యజమాని అరుపుకి, రెక్కలల్లాడించి కాలి తాడు లాగింది.

ఆ ముసలాడికి లుకాష్క అంటే యిష్టం. కోసక్కుల్లోని యువతరం అంటే తనకున్న సామాన్యమైన తృణీకారంనుంచి తను మినహాయింపు యిచ్చింది అతని ఒక్కడికే. దీనికి తోడుగా, లుకాష్క, అతని తల్లీ, యిరుగుపొరుగు వాళ్లలాగా తరచుగా ఆ ముసలాడికి వైనూ, గడ్డ కట్టిన మీగడ, యింట్లో చేసుకునే అలాటి వస్తువులూ యిచ్చేవారు. అవి యెరోష్కకి వుండవు కదా. యెరోష్క తన జీవితమంతా దేనికి పడితే దానికి లొంగిపోవడానికే సమ్మతించేవాడు. తన పిచ్చి వ్యామోహాలన్నిటికీ ఉపయోగ దృష్టినుంచే వివరణ యిచ్చేవాడు. ''సరే, యెందుక్కాదూ? వాళ్లా యివ్వగలరు. నేను వాళ్లకి లాజా మాంసం, లేకపోతే, పిట్ట యిస్తాను, వాళ్లు వాళ్ల మామని మర్చిపోరు: వాళ్లెప్పుడేనా ఓ కేక్, లేకపోతే, కాస్త పిండివంట తెస్తారు'' తనకి తనే అనుకుంటూ వుండేవాడు.

''మంచిది, మర్కా! నిన్ను చూడ్డం సంతోషంగా వుంది'' ఉత్సాహంగా అరిచాడా ముసలాడు. గబగబా తన కాళ్లు కింద పెట్టి పక్క

మీదనుంచి యెగిరి క్రిరుమనే నేలమీద ఒకటి రెండడుగులు నడిచాడు. పక్కకి తిరిగిన పాదాల వేళ్లను చూశాడు. తన కాళ్ల వాలకం చూసి తనే ముచ్చట పడిపోయాడు, నవ్వుకున్నాడు. నేలమీద చెప్పుల్లేని కాలి మడమతో తన్నాడు. మళ్లీ తన్నాడు. ఇప్పుడు ఒక్క గెంతు వేశాడు. ''అది బాగుంది కదూ, హే?'' అడిగాడు, అతని చిన్ని కళ్లు మెరుస్తూ వుండగా.

లుకాష్క నీరసంగా నవ్వాడు.

''చౌకీ దగ్గరికి తిరిగిపోతున్నావా?'' అడిగాడు ముసలాడు.

''మనం చౌకీ దగ్గరున్నప్పుడు నీకిస్తానన్న చిఖిర్ తెచ్చాను.''

''దేవుడు నిన్ను చల్లగా చూస్తాడు!'' అన్నాడా ముసలాడు. నేలమీద పడివున్న తన పెద్ద లాగూ, బెష్మెత్ తీసుకుని తొడుక్కున్నాడు. నడుం చుట్టూతా ఓ పట్టీ బిగించాడు. కుండలోని నీళ్లు కాసిని చేతుల్లో పోసుకుని పాత లాగుకు తుడిచాడు. చిన్న దువ్వెన ముక్కతోటి గడ్డం దువ్వుకున్నాడు. లుకాష్క ముందు ఆగాడు. ''తయారై పోయాను'' అన్నాడతను.

లుకాష్క ఒక గిన్నె తెచ్చి, దాన్ని తుడిచి, వైన్‌తో నింపాడు. బల్లమీద కూర్చొని దాన్ని ముసలాడి చేతికిచ్చాడు.

''నీ ఆరోగ్యం కోసం! దేవునికీ ఆయన కుమారునికీ!'' అన్నాడు ముసలాడు చాలా గంభీరంగా, ఆ వైన్ అందుకుంటూ. ''నువ్వు కోరుకున్నది లభించుగాక, నువ్వెప్పటికీ సాహసికుడిగానే వుందువుగాక, శిలువ సంపాదింతువుగాక.''

లుకాష్క కూడా ప్రార్థన జపించి, కొంచెం తాగాడు. అప్పుడు దాన్ని బల్లమీద పెట్టాడు.

ఆ ముసలాడు లేచి, కాస్త యెండిన చేపని తెచ్చాడు. దాన్ని గడపమీద పెట్టాడు. దాన్నక్కడ పెట్టి సాఫుగా చెయ్యడానికి కొట్టాడు.

అప్పుడు తన కాయగాచిన చేతుల్తో ఓ నీలం పళ్ళెంలో పెట్టాడు (అదొక్కటే అతనికున్నది). దాన్ని బల్లమీద పెట్టాడు.

''నాక్కావాల్సిన వన్నీ నాకున్నాయి. నాకు తిండానికింత వుంది దేవుడి దయవల్ల'' అన్నాడు గొప్పగా. ''సరే, మోసెవ్ సంగతేంటి?'' అడిగాడు.

ఆ ముసలాడి అభిప్రాయిం తెలుసుకుందామన్న ఉద్దేశంతో, ఆ అధికారి తన దగ్గర్నుంచి తుపాకీ యెలా తీసుకున్నదీ లుకాష్క చెప్పాడు.

''పోన్లే, తుపాకీని పోనిద్దూ. ఆ తుపాకీ యివ్వకపోతే నీకు బహుమతి రాదు'' అన్నాడు ముసలాడు.

''కాని, మామా, అశ్విక కోసక్ కాకపోతే యేం బహుమతీ రాదట కదా; ఆ తుపాకీ భలే వుంది, ఎనభై రూబుళ్ళంటుంది.''

''ఆఁ, పోనిద్దూ! నాకు యిలాంటి తగూయే వచ్చింది ఓ ఆఫీసరు తోటి. వాడు నా గుర్రం కావాలన్నాడు. 'దాన్నిచ్చెయ్యి నాకు, నువ్వు కేతసధారి నవుతావు' అన్నాడు. నేనివ్వలా, నాకేమీ రానూలేదు.''

''అవును, మామా, చూడు నేనో గుర్రం కొనుక్కోవాలి; నది అవతల గుర్రం యాభై రూబుళ్ళకి తక్కువ వుండదు అంటున్నారు. అమ్మేమో యింకా వైన్ అమ్మలేదు.''

''ఆఁ, మేం పట్టించుకునే వాళ్ళం కాదు'' అన్నాడు ముసలాడు. ''యెరోష్క మామ నీ వయసప్పుడు నోగాయ్‌లనుంచి గుర్రాల మంద కొట్టేసి టెరెక్ అడ్డంగా తోలుకొచ్చేవాడు. ఒక్కొక్కప్పుడు ఓ పావు సీసా వోడ్కాకీ, పై అంగీకీ మాంచి గుర్రం యిచ్చేవాళ్ళం.''

''అంత చవకెందుకని?'' అడిగాడు లుకాష్క.

''నువ్వు వెర్రిబాగులోడివి, వెర్రిబాగులోడివి, మర్కా'' అన్నాడు ముసలాడు తిరస్కారంగా. ''ఎందుకూ, దాని కోసమే యెవడేనా దాజే సేది, పిసినిగొట్టుగా వుండకుండా వుండాలనే! అదెలా జరిగేదో నీ మట్టుకి నువ్వసలు చూళ్ళేదనుకుంటాను? ఏం, మాట్లాడవేం?''

"నేనేం చెప్పేది, మామా? మా తరం మీ తరం లాంటి తర్ఫీదుది కాదేమో అనిపిస్తోంది."

"నువ్వు వెర్రివాడివి, మర్కా, వెర్రివాడివి! ఒకటే తర్ఫీదు కాదూ?" కఠినంగా అన్నాడు ముసలాడు, ఆ కోసక్ కుర్రాణ్ణి అనుకరిస్తూ. "నీ వయసప్పుడు నేనలాంటి కోసక్కుని కాను."

"అంటే?" లుకాష్కా అడిగాడు.

ముసలాడు తిరస్కారంగా తల వూపాడు. "యెరోష్కా మామ కపటం లేనివాడు; అతను దేనికీ వెనుకాడ లేదు! అందుకనే నేను అందరు చెచెన్లతోటీ కునాక్‌నే. నన్ను చూడ్డానికి ఓ కునాక్ వచ్చేవాడు, వాడికి వూటుగా వోడ్కా పోసేవాణ్ణి. సంతోషపెట్టేవాణ్ణి. పడుకోడానికి నా పక్క యిచ్చేవాణ్ణి. చూడ్డానికి వెడితే యేదేనా బహుమతి తీసుకెళ్ళేవాణ్ణి. అలా వుండేవాళ్ళు, యిప్పటి రోజుల్లో లాగా కాదు. మీకున్న సరదా అల్లా గింజలు తినడం, తొక్కలు వుమ్మెయ్యడం!" అని ముసలాడు తిరస్కారంగా పూర్తి చేశాడు, యిప్పటి కోసక్కుల పొద్దుతిరుగుడు గింజలు తినడం, తొక్కలు వుమ్మెయ్యడం అనుకరిస్తూ.

"అవును, నాకూ తెలుసు. నువ్వు చెప్పింది నిజమే" అన్నాడు లుకాష్కా.

"సిసలైనవాడివి కావాలంటే జిగిత్‌గా వుండు, రైతులా కాదు! ఓ రైతు కూడా గుర్రం కొనుక్కోగలడు, డబ్బిచ్చేస్తాడు, గుర్రం తీసుకుంటాడు!"

కాసేపు నిశ్శబ్దంగా వుంది.

"నిజమే, మామా, వూళ్ళోనూ చాకిట్లో కూడా విసుగ్గా వుంటోంది. కాసేపు కాలక్షేపానికి యెక్కడికేనా పోదామన్నా లేదు. మన కుర్రాళ్ళంతా బెదిరిపోతున్నారు. నజార్కాని చూడు. మొన్నో రోజున

వూరిదగ్గరికెడితే గిరీఖాన్ కొన్ని గుర్రాల కోసం నోగాయ్ రమ్మన్నాడు. కాని యెవరూ పోలేదు. నేనొఖ్ఖణ్ణే యెలా పోను?"

"ఒరె! మీ మామ సంగతేంటి? నేను యెండిపోయాననుకున్నావా? వూఁ? నేనెండిపోలేదు. నాకో గుర్రం దొరికితేనా? తక్షణం నోగాయ్ పోతాను."

"చెత్త మాట్లాడి యేం లాభం!" అన్నాడు లుకాష్క. "గిరీఖాన్ విషయం యేం చెయ్యాలో చెప్పు. వాడంటాడు 'గుర్రాల్ని టెరెక్ దగ్గరికి తీసుకురండి. మొత్తంగా ఓ మందంతా తోలుకొచ్చినా ఫరవా లేదు, నేను చోటు చూస్తాను.' వాడూ ఓ చెచెన్, తెలుసు కదా, వాణ్ణి నమ్మలేం."

"గిరీఖాన్‌ని నమ్మచ్చు. వాడి బంధువర్గమంతా మంచివాళ్లు. వాళ్ల నాన్న నాకు నమ్మిన కునాక్. కాని మీ మామ చెప్పింది విను, నీకు తప్పుడు దారి చూపించడు. గిరీఖాన్‌చేత ఒట్టు పెట్టించు, అప్పుడంతా సరిగ్గా తిన్నగా వుంటుంది. నువ్వు వాడితో వెడితే పిస్టల్ కూడా తయారుగా వుంచుకో. యెందుకైనా మంచిది. ముఖ్యంగా, గుర్రాల్ని పంచుకునేటప్పుడు. ఓ సారి ఆ రకంగా ఓ చెచెన్ చేతిలో నేను చచ్చివుండేవాణ్ణి. వాడినుంచి గుర్రానికి పది యాబుల్లడిగాను. నమ్మడం మంచిదేననుకో, కానీ తుపాకీ లేకుండా పడుకోవద్దు."

లుకాష్క ఆ ముసలాడు చెప్పేది శ్రద్ధగా విన్నాడు.

"సరే, మామా, నీదగ్గర రాతిమొక్క గడ్డి వుందా" అని అడిగాడు కొంచెం సేపు ఆగి.

"నా దగ్గరేం లేదురా, కాని యెలా సంపాదించాలో చెబుతాను. నువ్వు బుద్ధిమంతుడివి. ముసలాణ్ణి మరిచిపోకేం, చెప్పనా?"

"చెప్పు మామా."

"నీకు తాబేలు తెలుసా? అది దొంగముండ, తాబేలు!"

"ఆఁ! నాకు తెలుసు!"

"దాని గూడు వెతుకు. దాని చుట్టూతా కంచె వెయ్యి. అప్పుడు అది లోపలికి పోలేదు. అది వస్తుంది. దాని చుట్టూతా తిరుగుతుంది. అప్పుడది రాతిముక్క గడ్డి కోసం వెడుతుంది. త్వరలోనే అది ఒకటి తెస్తుంది. కంచెని చీల్చుకుని పోతుంది. నువ్వాడు పొద్దున్నే వెళ్లి చూడు. కంచె దారి చేసి వుంటుంది. ఆ రాతిముక్క గడ్డి పక్కన పడి వుంటుంది. నువ్వెక్కడికి కావాలంటే అక్కడికి దాన్ని తీసుకెళ్లు. తాళాలూ, గడలూ యేవీ నిన్ను అడ్డలేవు."

"నువ్వు స్వయంగా పరీక్షించి చూశావా?"

"పరీక్షించి చూడ్డం అంటే నేను చూళ్లేదనుకో. కాని చాలా మంది చెప్పగా విన్నాను. నేను నాటిన మంత్రం ఒకటే. గుర్రం యెక్కినప్పుడు 'అంతా జయం' అని జపించడమే. నన్నెవడూ చంప లేదు!"

"'అంతా జయం' అంటే యేమిటి, మామా?"

"యేంటీ, అదీ నీకు తెలీదా? యేం మనుష్యులా మీరు! మీ మామ నడిగావు, మంచిది. విను. నే చెప్పినట్లు చెప్పు:

"జయం! జియాన్ వాసులార,
మీ చక్రవర్తిని కాంచుడీ.
మా అశ్వాల నధిరోహిస్తాం
సోఫోనియా శోకించును
జకేరియాస్ భాషించును
మతబోధక నాంద్రీచ్
సదా మానవాళి ప్రేమించును.

"సదా మానవాళి ప్రేమించును" ముసలాడు రెట్టించాడు. "నీకిప్పుడు తెలిసిందా అది? యేదీ చెప్పూ."

లుకాష్క నవ్వాడు.

"చెప్పు మామా, అందుకనేనా వాళ్ళు నిన్ను చంపలేంది? వూరికే అలా జరిగివుండచ్చుగా!"

"మరీ తెలివి మీరిపోతున్నావు! దీన్ని కంఠస్థం చెయ్యి, జపించు. నీకే అపకారం జరగదు. 'అంతా జయం' అని జపించు, నువ్వు బాగుపడతావు." ముసలాడు తానే నవ్వడం మొదలెట్టాడు. "యెందుకేనా మంచిది నోగాయ్ దగ్గరకు పోకు, లుకాష్కా!"

"యెందుకని?"

"రోజులు మారిపోయాయి. అప్పటి మనుషులు కారు మీరు. శుద్ధ పేద ముద్దలు, యీ కాలం కోసక్కులు! చూడు యెంతమంది రష్యన్లు మన నెత్తిమీద కొచ్చారో! మిమ్మల్ని కోర్టుకి యీడుస్తారు వాళ్ళు. చూడు మరి! వదిలెయ్యండి! దానికి తగ్గ మనిషిని కాదు! గిర్చిక్, నేనూ మేం యేం చేసే వాళ్లమంటే...." ఆ ముసలాడు తన అంతంలేని కథల్లో ఒకటి మొదలెట్టబోయాడు గాని లుకాష్కా కిటికీకేసి చూసి అతని కడ్డం వచ్చాడు.

"బాగా పొద్దెక్కింది, మామా. నేను పోవాలి. ఓ రోజున వచ్చి మమ్మల్ని చూడు."

"దేవుడు నీకు తోడు వుండుగాక! ఆ సైన్యంవాడి దగ్గరికే పోతున్నాను. వేటకి తీసికెడతానని మాట యిచ్చాను. వాడు మంచి వాడ్లాగానే కనిపిస్తున్నాడు."

## 17

యెరోష్కా యింటినుంచి లుకాష్కా తన యింటికి పోయాడు. మంచుపొగలు నేలమీదనుంచి లేచి వూరిని కమ్ముతున్నాయి. పశువులు కనిపించకుండా వున్నా, అన్ని వేపులనుంచీ అవి కదల నారంభించినట్టు వినిపిస్తోంది. కోళ్ళు మరింత తరుచుగా, పట్టుదలతోటి ఒక దాన్నొకటి

సిలుచుకుంటున్నాయి. నాలుగు వేపులా వెలుతురు పరుచుకుంటోంది. జనం లేస్తున్నారు. దగ్గరసా వచ్చేదాకా పూరా మంచుతో తడిసిపోయిన తన ముంగిటే కంచెనీ యింటి గుమ్మాన్నీ, తెరిచిన గుడిసెనీ ఆనవాలు పట్టలేకపోయాడు లుకాష్క. మంచు పట్టిన ముంగిలినుంచి కట్టెలు కొట్టే గొడ్డలి చప్పుడు విన్నాడు. లుకాష్క యింట్లో కెళ్లాడు. తల్లి లేచి పొయ్యి దగ్గర నుంచుని వుంది, కట్టెలు అందులో పడేస్తూ. అతని చెల్లెలు యింకా పడుకునే వుంది.

''సరే, లుకాష్క, సెలవు సరదాగా గడిచింది కదూ?'' నెమ్మదిగా అతని తల్లి అడిగింది. ''రాత్రి యెక్కడ గడిపావు?''

''వూళ్లోనే వున్నాను'' అన్నాడు లుకాష్క అయిష్టంగా, తన తుపాకీని పెట్టెలోనుంచి తీసి, జాగ్రత్తగా పరీక్షించి అందుకుంటూ.

తల్లి తల వూపింది.

తుపాకీ చెవిలోకి కొంచెం తుపాకీ మందు పోసాడు లుకాష్క. ఓ సంచీ తీసాడు. అందులోనుంచి కొన్ని ఖాళీ తూటా డొల్లలు తీసాడు. వాటిని కూరడం మొదలెట్టాడు, గుడ్డ పీలికతో చుట్టిన ప్రతీ గుండుతోటీ జాగత్తగా బిరడా పెట్టాడు. కూరిన తూటాలని పళ్లతో కొరికి పరీక్షించి సంచీ పక్కన పెట్టాడు.

''అమ్మా, నా సంచీలు కుట్టాలని చెప్పాను, అయిందా?'' అడిగాడు.

''ఆ, అయింది. మన మూగపిల్ల రాత్రి దేన్నో బాగు చేస్తోంది. ఏం చౌకీ దగ్గర కెళ్లిపోయే వేళ అయిందా నీకు? నిన్ను సరిగా చూడను కూడా లేదు కదరా.''

''వూఁ, నేను తయారవగానే వెళ్లిపోవాలి'' అన్నాడు లుకాష్క మందుగుండు కట్టేస్తూ. ''మన మూగపిల్లేదీ? అవతల వుందా?''

''కట్టెలు కొడుతోందేమో, అనుకుంటున్నా. నీ కోసం పలవరించిపోయింది. 'నేను వాణ్ణి చూళ్లేనేమో అసలు' అంది నాతో. చేతులు ముఖానికి యిలా పెట్టుకుని నాలిక కటుక్కు మంటుంది. చేతులు

గుండెమీద చరుస్తుంది, 'వాణ్ణి చూస్తే బాగుణ్ణు' అంటున్నట్టు. దాన్ని లోపలికి పిలవనా? ఆ అబ్రేక్‌ని గురించి అంతా గ్రహించింది.''

''దాన్ని పిలు'' అన్నాడు లుకాష్కా. ''అక్కడ కొంచెం కొవ్వు పెట్టాను; దాన్ని తే. కత్తికి కొవ్వు పుయ్యాలి.''

ఆ పెద్దావిడ అవతలికి వెళ్లింది, కొంచెం సేపటి తర్వాత లుకాష్కా మూగచెవిటి అక్క కిర్రుమనే మెట్లమీద యెక్కివచ్చి యింట్లో ప్రవేశించింది. ఆమె తమ్ముడి కంటే ఆరేళ్లు పెద్దది. మొద్దుగా అయినా ముతగ్గా మూరే కవళిక గల ముఖం (మూగచెవిటి వాళ్లందరికీ మామూలుగా వుండేటట్టుగా) కాకపోయినట్లైతే అచ్చు అతని లాగానే వుండేది.

అన్నీ మాసికలే వున్న ముతక గాగరా వేసుకుంది; కాళ్లకి చెప్పుల్లేవు, బురదగా వున్నాయి. నెత్తిమీద పాత నీలం రుమాలు వుంది. ఆమె మెడా, చేతులూ, ముఖమూ కండదేరి వున్నాయి, మొగాడి లాగా. ఆమె బట్టలూ, మొత్తం వాలకమే, ఆమె కష్టమైన మగ పనికి అలవడ్డట్టు సూచిస్తున్నాయి.

చేతుల నిండా కట్టెలు మోసుకొచ్చింది. వాటిని పొయ్యి పక్కన పడేసింది. అప్పుడు తమ్ముడి దగ్గరికి వెళ్లింది. ముఖమంతా ముడతలు పడేట్టు చేసే సంతోషభరితమైన చిరునవ్వుతో అతని భుజాలని తాకింది. చేతుల్తోటీ, ముఖంతోటీ, మొత్తం శరీరం తోటీ గబగబా అతనికి సౌంజ్ఞలు చేసింది.

''బాగుంది, బాగుంది, మంచి పిల్ల స్త్రెప్కా!'' అన్నాడా తమ్ముడు తల పంకిస్తూ. ''నువ్వు ప్రతీదీ తెచ్చావు, ప్రతీదీ బాగు చేసావు, నువ్వు మంచి పిల్లవి! యిదిగో, తీసుకో మరి!'' అంటూ జేబులోనుంచి అల్లం బిస్కట్లు రెండు ముక్కలు తీసి ఆమెకిచ్చాడు.

ఆ మూగపిల్ల మొహం సంతోషంతో య్రెరబడింది. ఆమె పట్టలేని ఆనందపు కేరింతలు వెయ్యసాగింది. ఆ అల్లం బిస్కట్లు

రాక్కుని యింకా వేగంగా, యెక్కువ సార్లు ఓ వేపుకి చూపిస్తూ, తన మొద్దు వేళ్లని కనుబొమలమీదా, ముఖంమీదా పోనిస్తూ అభినయం ఆరంభించింది. లుకాష్క ఆమెని అర్థం చేసుకున్నాడు, పెదాలమీద నీరసపు చిరునవ్వుతోటి తల వూపుతూ. ఆమె అతనికి చెబుతోంది ఆడపిల్లలకి రుచికరమైన పదార్థాలమ్మనీ, వాళ్లకి అతనంటే యిష్టమనీ, ఒక పిల్ల మర్యాంకా – అందరిలోకీ చక్కనిది – ప్రేమిస్తోందనీ. మర్యాంకా యింటికేసి వేగంగా చూపిస్తూనూ, తన కనుబొమలకేసీ, ముఖంకేసీ చూపిస్తూనూ, పెదాలు చప్పరిస్తూనూ, తల వూపుతూనూ మర్యాంకాని సూచించింది. తన చేతిని గుండెమీద పెట్టుకునీ, దాన్ని ముద్దుపెట్టుకునీ, యెవళ్లనో కౌగలించుకున్నట్టు అభినయిస్తూనూ 'ఆమె నిన్ను ప్రేమిస్తోంది' అని చెప్పింది. వాళ్లమ్మ యింటిలోకి తిరిగి వచ్చింది. తన మూగ కూతురు చెప్పేదేమిటో చూసి చిన్నగా నవ్వి తల వూపింది. కూతురు ఆవిడకి అల్లం బిస్కట్లు చూపించింది. మళ్లీ సంతోషాన్ని వ్యక్తంచేసే శబ్దం చేసింది.

''ఉలీత్కాకి మొన్న చెప్పాను వాళ్లదగ్గరికి పెళ్లి పెద్దల్ని పంపిస్తానని. నా మాటలు సుముఖంగానే వింది'' అంది.

లుకాష్క తల్లికేసి నిశ్శబ్దంగా చూసాడు. ''కాని వైన్ అమ్మడం సంగతేమిటమ్మా? నాకో గుర్రం కావాలి.''

''సమయం వచ్చినప్పుడు బండికేస్తాను. పీపాలు సిద్ధం చేసుకోవాలి'' అందామె తన కొడుకు కుటుంబ విషయాల్లో తల దూర్చడం యేమీ యిష్టం లేనట్టుగా. ''అవతల కెళ్లేటప్పుడు చూడు గుమ్మంలో నీకో సంచీ కనిపిస్తుంది. దాన్ని నేను పొరుగువాళ్లనుంచి తెచ్చాను. వెనక్కి చౌకీ దగ్గరికి తీసికెళ్లడానికి యేదో పెట్టాను. లేకపోతే నీ జీను సంచీలో పెట్టనా?''

''అలాగే'' అన్నాడు లుకాష్క. ''గిరీఖాన్ కనక నా కోసం నది

దాటి వస్తే చౌకీ దగ్గరికి పంపు. మళ్లీ యెప్పటికోగాని సెలవు దొరకదు. వాడితో నాకు పని వుంది.''

అతను బయల్దేరడానికి తయారయాడు.

''వాణ్ణి పంపుతాలే'' అందా పెద్దావిడ. ''నువ్వా యామ్కా దగ్గర అస్తమానూ మజా చేస్తున్నావు, అవునా? రాత్రి దూళ్లని చూడ్డానికి అవతలికి వెడితే, నీ గొంతుకే పాట పాడుతూ వినిపించింది నాకు.''

లుకాష్క బదులు చెప్పలేదు. గుమ్మం దాటి వెళ్లాడు. భుజం మీద మూటలు వేసుకున్నాడు, కోటు అంచులు లోపలికి దోపుకున్నాడు, తుపాకీ తీసుకున్నాడు, అప్పుడు గడపదగ్గర ఓక్షణం ఆగాడు.

''అమ్మా, వెళ్లొస్తా!'' అన్నాడు గేటు వేస్తూ. ''నజార్కతోటి నాకో చిన్న పీపా పంపు. ఆ కుర్రాళ్లకి యిస్తానన్నాను. వాడడుగుతాడు దాన్ని.''

''దేవుడు నిన్ను కాపాడుతాడు, లుకాష్కా. దేవుడు నిన్ను కాపాడు గాక! నీకు కొంత పంపుతా, కొత్త పీపానుంచి పంపుతా'' అంది పెద్దావిడ దడిదాకా వెడుతూ. ''యిదిగో మాట'' అంది కంచెమీద ఆనుకుని.

ఆ కోసక్ ఆగేడు.

''నువ్విక్కడ మజా చేస్తూనే వున్నావ్; సరే యేదో అయిపోయింది. యెందుకు కుర్రాళ్లు హుషారుగా వుండకూడదు? దేవుడు నీకు అదృష్టం యిచ్చాడు, అదీ మంచిదే. కాని చూడు, బాబూ, గుర్తుంచుకో. వూరికే వెళ్లి చిక్కుల్లో పడకు. అన్నిటికంటే నీ అధికార్లని గౌరవించు. అది తప్పదుసుమా. నేను వైన్ అమ్మేసి నీ గుర్రం కోసం డబ్బు చూస్తా. ఆ పిల్లతోటి నీకు సంబంధం కుదురుస్తా.''

''సర్లే, సర్లే'' అన్నాడు లుకాష్క, చిట్లించుకుంటూ.

అతని మూగ అక్క అతని దృష్టి నాకర్షించే శబ్దం చేసింది.

తన తలకేసీ, అరిచేతికేసీ చూపించింది, ఆ చెచెన్ గుండును సూచిస్తూ. అప్పుడు కనుబొమలు ముడిచింది, తుపాకీతో గురి చూడ్డం అభినయిస్తూ. గట్టిగా అరిచి, గబగబా మూలుగుతూ, తల పంకించింది. దానర్థం లుకాష్క యింకో చెచెన్‌ని చంపాలని.

లుకాష్క గ్రహించాడు. చిరునవ్వు నవ్వాడు. వెనకాల పై అంగీ కింద తుపాకీ పట్టుకుని వేగంగా సునాయాసంగా దట్టమైన పొగ మంచులోకి అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

ఆ గేటు దగ్గర యింకా కొంచెం సేపు నుంచుని ఆ పెద్దావిడ నిశ్శబ్దంగా యింట్లోకి తిరిగివెళ్ళి, వెంటనే పనిలో మునిగిపోయింది.

## 18

లుకాష్క సైనిక చౌకీ దగ్గరికి సరిగ్గా జయుర్దేరే వేళప్పుడే యెరోష్క మామ కుక్కల్ని యీలవేసి పిలిచాడు. దడిమీదనుంచి యెగిరి, వెనక సందులగుండా, ఒలేనిన్ బసకి వెళ్ళాడు. వేటకెళ్ళేటప్పుడు ఆడ వాళ్ళ తటస్థపడ్డం అతనికి కిట్టదు.

ఒలేనిన్ యింకా నిద్రపోతూనే వున్నాడు. యెరోష్క మామ భుజంమీద తుపాకీ వేసుకుని, సరంజామా అంతా తగిలించుకుని, తలుపు తీసేటప్పటికి వన్యూష కూడా మెలకువగా వున్నా, యింకా పక్కమీదే వుండి చుట్టూతా గదిలో చూస్తున్నాడు, లేవడానికి వేళ అయిందా లేదా అని.

"దుడ్డు కర్ర!" గట్టి గొంతుతో యెరోష్క అరిచాడు. "ప్రమాదం! చెచెన్లు మీద పడ్డారు! ఇవాన్! సమొవార్ సిద్ధంచెయ్యి నీ యజ మానికి. నువ్వు లే ముందు — త్వరగా చూడు!" అరిచాడా ముసలాడు. "అదీ మా పద్ధతి, నా తండ్రీ! యెందుకూ, ఆడపిల్లలు కూడా

లేచారు! కిటికీలోంచి చూడు. అదుగో, ఆమె నీళ్లకి పోతోంది, నువ్వింకా పక్కమీదే వున్నావు!''

ఒలేనిన్ లేచి గెంతాడు, ఆ ముసలాణ్ణి చూడగానే, ఆ గొంతు వినగానే హాయిగా తేలిగ్గా వుందనిపించింది.

''కానీ వన్యూష్, కానీ!'' అరిచాడతను.

''మీరిలాగేనా వేటకెళ్లేది?'' అన్నాడా ముసలాడు. ''వాళ్లంతా నాస్తా కొట్టేస్తున్నారు. మీరేమో యింకా నిద్రపోతూనే వున్నారు! లియామ్! యిటు!'' కుక్కని పిలిచాడు.

''నీ తుపాకీ సిద్ధంగా వుందా?'' అని అరిచాడు, ఓ మొత్తం గుంపేదో యింట్లో వున్నట్టు.

''సరే పొరపాటు, బాబూ, పొరపాటైపోయింది. ఒప్పుకున్నాగా. కాని యేం చేస్తాం? మందుగుండు, వన్యూష, తుపాకీలో దట్టించే చిత్తు కాగితాలు!'' అన్నాడు ఒలేనిన్.

''జరిమానా!'' అరిచాడా ముసలాడు.

''ద్యు తె వౌలెవు?''* అడిగాడు వన్యూష యికిలిస్తూ.

''నువ్వు మాలోవాడివి కాదు, మీ పిచ్చి కూతలు మాలో వుండవు, పిచ్చినాయనా!'' అరిచాడా ముసలాడు వన్యూషకేసి, చిగుళ్లు యివతలికి పెట్టి చూపిస్తూ.

''ప్రథమ తప్పిదం క్షమించాలి'' అన్నాడు ఒలేనిన్ హుషారుగా, యెత్తు బూట్లు లాక్కుంటూ.

''ప్రథమ తప్పిదం క్షమించడం జరిగింది'' బదులు చెప్పాడు యెరోష్క. ''యింకో సారి యెక్కువ సేపు నిద్రపోయావంటే ఓ కడవ చిఖిర్ జరిమానా. యింకొంచెం పొద్దెక్కితే నీకు లేళ్లేం దొరకవు.''

---

* టీ తాగుతారా? (ఫ్రెంచి). — సం.

''ఒక వేళ మనం వాటిని చూసినా అవి మనకంటే తెలివైనవి'' అన్నాడు ఒలేనిన్ ముందు రాత్రి ముసలాడు అన్న మాటలు తిప్పి చెబుతూ. ''నువ్వు వాటిని మోసం చెయ్యలేవు.''

''అలాగే, నవ్వు, నవ్వు! నువ్వొక దాన్ని చంపి అప్పుడు మాట్లాడు. కానీ, జల్దీ! చూడు, యింటి యజమాని నిన్ను చూడ్డానికి తనే వస్తున్నాడు'' చెబుతూనే వున్నాడు యెరోష్క కిటికీలోంచి చూస్తూ. ''చూడు అతను యెంత ముస్తాబయాడో. తన కొత్త కోటు వేసుకున్నాడు ఆఫీసర్వని నీకు చూపిండానికి. ఆఁ! యీ మనుషులు! యీ మనుషులు!''

నిజంగానే వన్యూష లోపలికి వచ్చి, యింటి యజమాని ఒలేనిన్‌ని చూడ్డానికి వచ్చాడని చెప్పాడు.

''లార్జాం!*'' అన్నాడతను గూఢంగా ఆయన రాకకి అర్థం యేమిటో ముందే తన యజమానిని హెచ్చరిస్తున్నట్టు. కొత్త సర్కేషియన్ కోటు తొడుక్కుని, భుజంమీద అధికార పట్టీలతోటే, బాగా మెరిసే బూట్లతోటే (కోసక్కులలో చాలా అరుదు) యింటి యజమాని అటూ యిటూ వూగుతూ అతన్ననుసరించి వచ్చి గదిలోకి ప్రవేశించాడు. వస్తూనే ఒలేనిన్‌కి అభివాదం చేసాడు.

ఆ కేతనధారి ఇల్యా వసీల్యెవిచ్ 'చదువుకున్న' కోసక్. అసలు రష్యాని చూసిన వాడు. బడి పంతులుగా వున్నాడు. అన్నిటినీ మించి అతను 'కులీనుడు.' కులీనుడి లాగా కనిపించాలని కోరుకునేవాడు. కాని పాపం అతని విపరీతమైన నాగరికతా నటన కింద, బేడిజం కింద, ఆత్మవిశ్వాసం కింద, అసంగతంగా మాట్లాడే పద్ధతి కింద అతను ఒట్టి యెరోష్క మామే నని అనిపించకమానదు. అలా అని యెండకి

---

* డబ్బు (ఫ్రెంచి). — సం.

కమిలిపోయిన అతని ముఖమూ, అతని చేతులూ, యెర్రటి నాసికా తేటతెల్లం చేస్తాయి. ఒలేనిన్ అతన్ని కూర్చోమన్నాడు.

"నమస్కారం, ఇల్యా వసీల్యెవిచ్ బాబూ" అన్నాడు యెరోష్క, ఒలేనిన్‌కి పరిహాసంగా కనిపించేటంతటి కిందికి వంగి వందనం చేస్తూ.

"నమస్తే మామా. అయితే అప్పుడే నువ్విక్కడ వున్నావన్న మాట" అన్నాడా కేతనధారి నిర్లక్ష్యంగా తల వూపుతూ.

ఆ కేతనధారి నలభై దగ్గర వాడు, కొనదేలిన నెరిసిన గడ్డం, సన్నగా యెండిపోయినట్టుంటాడు, అయినా స్ఫురద్రూపంగా, ఆ వయసులో నవనవలాడుతూ. ఒలేనిన్‌ని చూడ్డానికి వచ్చి, అతనికి తనంటే ఒక సాదా కోసక్ అనే భావం కలుగుతుందేమోనని భయపడ్డాడు. ఒలేనిన్ మొదట్నుంచీ తన ప్రాముఖ్యం గుర్తించాలనీ భావించాడు.

"యితగాడు మా ఈజిప్షియన్ నిమ్రోద్!"* అన్నాడతను ఒలేనిన్‌తోటి, తృప్తికరమైన చిరునవ్వుతో ఆ ముసలాణ్ని చూపిస్తూ. "పరమ శివుడి ముందు గొప్ప వేటగాడు! అన్నింటిలోనూ యితను మా మొదటి పంక్తి మనిషి. అతనితోటి పరిచయ భాగ్యం మీకు యిప్పటికే కలిగిందన్న మాట, యేమంటారు?"

తడిసిన ముతక చర్మం చెప్పుల్లో వున్న తన కాళ్లకేసి చూసాడు యెరోష్క మామ. ఆ కేతనధారి సామర్థ్యానికీ పాండిత్యానికీ సాలోచనగా తల వూపాడు. తనలోనే గొణుక్కున్నాడు: "ఈజిప్షియన్ నిమ్రోద్! యెలాంటి మాటలు వూహిస్తాడో!"

"అవును మేం వేటకెడదామనుకుంటున్నాం" జవాబిచ్చాడు ఒలేనిన్.

---

* బైబిల్ కథలో గొప్ప వేటగాడు. — సం.

''అలాగాండీ? సరిగ్గా! కాని నాకు మీతో చిన్న పని వుంది'' అన్నాడు కేతనధారి.

''నాతోనా? యేమిటి?''

''మీరు పెద్ద మనుషుల్లా కనిపిస్తున్నారు'' అని మొదలెట్టాడు కేతన ధారి. ''నే కూడా వొక ఆఫీసరు హోదాలోనే వున్నాను కాబట్టి మనం మొహమాటం లేకుండా వ్యవహారం మాట్లాడుకోవచ్చు పెద్ద మనుషుల్లాగా....'' (అతను ఆగి, చిరునవ్వుతోటి ఒలేనిన్ కేసీ, ఆ ముసలాడి కేసీ చూసాదు.) ''కాని నా మాటమీద మీరు గౌరవం వుంచితే, అప్పుడు, మా ఆవిడ మా జనంలో తెలివితక్కువది కావడం వల్ల, మొన్నటి మీ మాటలు సరిగా గ్రహించలేకపోవడం జరిగింది. అంచేత మా బస రెజిమెంటల్ అడ్జుటెంట్‌కి, గుర్రపుశాల కాకుండా, ఆరు రూబుళ్లు అద్దెకివ్వాలి. నా మట్టుకి నేను యేం లేకుండా వూరికే అద్దెకివ్వడం జరగచ్చు ననుకోండి. కాని మీరనుకుంటున్నట్టు ఒక ఆఫీసరు స్థాయి వాణ్ణి కాబట్టి మీతోటి ప్రతిదానిమీదా అంగీకారానికి రాగలను, వ్యక్తిగతంగా, యీ ప్రాంతంవాణ్ణే కావడంవల్ల. యిక్కడి ఆచారాల దృష్ట్యా కాకపోయినా, నేను ప్రతి దాంట్లోనూ షరతులకి కట్టుబడతాను....''

''యేం స్పష్టంగా మాట్లాడతాడు!'' గొణిగాడు ముసలాడు.

ఆ కేతనధారి అలా చాలా సేపు కొనసాగించాడు. ఆఖరికి తనకి అతని గదులు నెలకి ఆరు రూబుళ్ళకి అద్దెకివ్వాలనుకుంటున్నట్టు శ్రమపడి ఒలేనిన్ గ్రహించాడు. అతను దానికి సంతోషంగా ఒప్పుకున్నాడు. కేతనధారికి ఓ గ్లాసు టీ యివ్వబోయాడు. అతను వద్దన్నాడు.

''మా తెలివితక్కువ ఆచారాల ప్రకారం సరాయి పాత్రలనుంచి తాగడం పాపం అనుకుంటాం మేము'' అన్నాడతను. ''అహాఁ నేను చదువుకోవడంవల్ల నేనర్థం చేసుకోగల్గినా, మా ఆవిడ, సరే, మామూలు బలహీనతలవల్ల....''

''సర్లెండి, మీరు కొంచెం టీ తాగుతారా?''

''మరి మీరేం అనుకోకపోతే నేను నా స్వంత గ్లాసు తెచ్చుకుంటాను'' అన్నాడు కేతనధారి. గడపలోకి పోయాడు.

''యిదిగో నా గ్లాసు తీసుకురా!'' కేకేశాదతను. కొద్ది క్షణాల్లో తలుపు తెరుచుకుంది; యెండకి నల్లబడిన పడుచు హస్తం గులాబీ రంగు పొడుగు చేతుల చొక్కా తొడుక్కుని, ఓ గ్లాసు ముందుకి పెట్టింది. ఆ కేతనధారి ముందుకి వెళ్ళి దాన్నందుకుని కూతురి తోటి యేదో గొణిగాడు. అతని స్వంత గ్లాసులో ఒలేనిన్ కొంచెం టీ పోసాడు, యెరోష్కకి ''క్షుద్ర''మైన గ్లాసులో పోసాడు.

''పాపం, మీకు ఆలస్యమైపోయింది'' అన్నాడు కేతనధారి, పెదాలు కాల్చుకుంటూ గ్లాసు ఖాళీచేసి. ''నాక్కూడా చేపలు పట్టడమంటే చెడ్డ సరదా. నేనిప్పుడు పనిలోనుంచి కొంచెం విశ్రాంతి కోసం సెలవు మీద వున్నాను. నాక్కూడా అదృష్ట దేవతని ఆకర్షించాలనీ, టెరెక్ నది వరాలు నా వాటాకి దొరుకుతాయేమో చూడాలనీ వుంటుంది. మీరు కూడా దయచేసి మా యింటికి వచ్చి మా గ్రామ సంప్రదాయం ప్రకారం మా వైన్ తాగాలని ఆశిస్తున్నాను.''

ఆ కేతనధారి అప్పుడు వంగి వందనం చేసి, ఒలేనిన్‌తో కర చాలనం చేసి, వెళ్ళిపోయాడు. ఒలేనిన్ తయారవుతూ వుండగా, ఆ కేతనధారి ఆధికారికంగా, తెలిసేటటువంటి గొంతుకతో యింట్లో సూచన లివ్వడం విన్నాడు. ఆ తర్వాత కొద్ది క్షణాలకి చిరిగిన బెష్మెత్‌తో, మోకాళ్ళదాకా మడుచుకున్న పంట్లాంతో, భుజాన చేపల వలతో, ఆ కేతనధారి కిటికీ పక్కనుంచి వెళ్ళడం అతను చూశాడు.

''దొంగ వెధవ!'' అన్నాడు యెరోష్క తన ''క్షుద్ర''మైన గ్లాసు ఖాళీ చేస్తూ. ''నువ్వు నిజంగానే వాడికి ఆరు రూబుళ్ళు యిస్తా వేంటి? అలాంటిదెక్కడేనా విన్నామా? యీ వూళ్ళో కల్లా భేషైన

కొంప నీకు రెండు రూబుళ్లకి వస్తుంది. వాడు కిరాతకుడు! ఎందుకూ, నా కొంప మూడు రూబుళ్ల కిస్తా!''

''వద్దు, నేనిక్కడే వుంటా'' అన్నాడు ఒలేనిన్.

''ఆరు రూబుళ్లే!... వూరికే డబ్బుని వెదజల్లడమే'' ఆ ముసలాడు నిట్టూర్చాడు. ''కొంచెం చిఖిర్ వేద్దాం, ఇవాన్!''

ప్రయాణానికి సిద్ధం అవడానికి ఓ గ్లాసు వోడ్కా, అల్పాహారం అయ్యాక ఒలేనిన్, ఆ ముసలాడూ కలిసి ఎనిమిది లోపునే అవతలికి వెళ్లారు. గేటు దగ్గర ఓ ఎద్దుల బండి యెదురైంది. కళ్లమీద పడేదాకా తలకు కట్టుకున్న తెల్లటి రుమాలూ గాగరామీద బెష్మెత్, ఎత్తు బూట్లూ తొడుక్కున్న మర్యాంకా, చేతిలో పొడుగాటి బెత్తం పుచ్చుకొని, కొమ్ములకి చుట్టేసిన తాళ్లతోటి ఎద్దుల్ని లాగుతోంది.

''ఏమందం!'' అన్నాడు ముసలాడు, ఆమెని పట్టేసుకుందామన్నట్టు నటిస్తూ.

మర్యాంకా అతనికేసి కొరడా ఝుళిపించింది. వాళ్లిద్దరికేసీ అంద మైన కళ్లతో చూసింది.

ఒలేనిన్‌కి హృదయం యింకా తేలికపడ్డట్టు అయింది.

''సరే రా, రా'' అన్నాడతను తుపాకీ భుజంమీదకి వేసుకుంటూ, తనమీద ఆ పిల్ల చూపుల్ని గుర్తిస్తూ.

ఎద్దుల్ని అదలిస్తూన్న మర్యాంకా కంఠం వాళ్ల వెనక ఖంగు మంది. తర్వాత కదుల్తూ వున్న బండి కిర్రు శబ్దం అనుసరించింది.

గ్రామానికి వెనకతట్టులో పచ్చిక బీళ్లగుండా వాళ్లు వెళ్లే దారి పొడవునా, యెరోష్క మాట్లాడుతూనే వున్నాడు. అతను కేతనధారిని వదల్లేదు, అతన్ని తిడుతూనే వున్నాడు.

''అతనిమీద నీకు అంత కోపం యెందుకు?'' అడిగాడు ఒలేనిన్.

''వాడు పిసినిగొట్టు. నాకది నచ్చదు'' అన్నాడు ముసలాడు. ''పొయ్యేటప్పుడు కట్టుకుపోతాడా! మరెందుకు, ఎవరికోసం వాడు కూడ

బెట్టడం? రెండు యిళ్లు కట్టించాడు. తోడబుట్టిన వాడిమీద వ్యాజ్యం వేసి యింకో తోట కొట్టేశాడు. యింక కాగితం కరామత్తుల విష యంలో వాడు యెలాంటి కుక్క! పై వూళ్ళనుంచి కాగితాలు పూర్తి చేసి పెట్టమని వాడి దగ్గరికి వస్తూంటారు జనం. వాడు రాసినట్టే పనులు జరిగిపోతాయి. వాడు సరిగ్గా అలాగే చేస్తాడు. కాని ఎవరి కోసం వాడి కూడాపన? వాడికున్న దల్లా ఒక పిల్లాడూ, పిల్లా. దానికి పెళ్లయిపోతే మిగిలే దెవరు?''

''దాని కట్నం కోసం జాగ్రత్త చేస్తున్నాడేమో'' అన్నాడు ఒలేనిన్.

''ఏంటి కట్నం? ఆ పిల్లదాని కోసం యెగబడుతూ వుంటే, అది శుభ్రమైన పిల్ల. కాని వాడు దుర్మార్గుడు, దాన్ని ఐశ్వర్యవంతుడికిచ్చి పెళ్లి చేస్తాడు. ఆ పిల్లమీద పెద్ద మొత్తం కొట్టేస్తాడు. మా లుకాష్క కోసక్ వున్నాడు. భేషైన కుర్రాడు. మా పొరుగువాడూ, నాకు మేనల్లుడూనూ. వాడే ఆ చెచెన్‌ని చంపినవాడు. ఆ పిల్లంటే వాడికెప్పట్నుంచో మక్కువ. కాని వీడు వాడికివ్వడు. ఏదో సాకు చెబుతూ వుంటాడు. 'పిల్ల మరీ చిన్నది' అంటాడు. వాడి ఉద్దేశం యేంటో నాకు తెలుసు. వాళ్ళంతా తన కాళ్లకి వంగి దణ్ణం పెట్టి నాకాలని వాడి భావన. అయినా వాళ్లు దాన్ని లుకాష్కకి చేసుకుంటారు. ఎందుకంటే వాడే వూళ్లో కల్లా సెభాషైన కుర్రాడు, జిగిత్. అబ్రేక్‌ని చంపాడు, వాడికి శిలువ బహుమానం వస్తుంది.''

''కాని, దీని సంగతేమిటి? నే రాత్రి దొడ్లో పచార్లు చేస్తూ వుండగా మా యింటాయన కూతురూ ఓ కోసక్కూ ముద్దుపెట్టుకో వడం చూశాను'' అన్నాడు ఒలేనిన్.

''నేన్నమ్మను!'' అరిచాడు ముసలాడు, ఆగుతూ.

''నాతోడు'' అన్నాడు ఒలేనిన్.

''అదో దొంగముండ!'' అన్నాడు యెరోష్క. యేదో లోతైన ఆలోచనలోకి జారిపోయాడు. ''ఆ కోసక్ ఎవరు?''

‘‘నేను చూళ్లేదు.’’

‘‘పోన్లే, ఎలాంటి టోపీ పెట్టుకున్నాడు, తెల్లదా?’’

‘‘ఆ!’’

‘‘ఎర్ర కోటూ? సుమారు నీ యెత్తున్నాడా?’’

‘‘ఉహు, ఓ పిసరు పొడుగే.’’

‘‘సరే, వాడే వాడు!’’ అన్నాడు యెరోష్క పగలబడి నవ్వుతూ. ‘‘ఆ మనిషి మర్కాయే. వాడే లుకాష్క. నేను వాణ్ణి తమాషాకి మర్కా అంటా, లుకాష్కాయే! వాడంటే నాకిష్టం. నే సరిగ్గా అలాగే వుండేవాణ్ణి. వాళ్లని పట్టించుకోవడం యెందుగ్గాని? నా రామచిలక తల్లితోటీ, వదినతోటీ పడుకునేది, కాని నేను యెలాగో లోపలికి దూరేసేవాణ్ణి. అది మేడమీద పడుకొనేది; దొంగముండ, దాని తల్లి వుందేం, అది పక్కా దెయ్యమే. నేనంటే దాని కెంత మంట! యేం, నేను నా నేస్తంతోటి వచ్చేవాణ్ణి, వాడి పేరు గిర్చిక్. మేము దాని కిటికీ కిందికి వచ్చేవాళ్లం, నేను వాడి భుజాలు యెక్కేవాణ్ణి, కిటికీ యెత్తి, తడిమేవాణ్ణి. పక్కనే ఓ బల్లమీద పడుకుంటూ వుండేది. ఓ సారి నేను దాన్ని లేపాను, కొంచెంలో కేకలు వేసేసేదే అది, నన్ను గుర్తుపట్టకుండా ‘ఎవరది?’ అందది. మరి నేను జవాబివ్వ లేను. దాని తల్లి కదలడం మొదలెట్టింది కూడా. కాని నేను నా టోపీ తీసేసి, దాని నోటిమీద నొక్కేసాను. వెంటనే దాన్ని తను ఆనవాలు పట్టేసింది. యెందుకంటే అది చిరిగిపోయింది. నా దగ్గరకి పరిగెత్తుకొచ్చేసింది. ఆ రోజుల్లో నాక్కావలసిన ప్రతీదీ నాకు దక్కేది. తను గడ్డ మీగడ, ద్రాక్షపళ్లు ప్రతీదీ తెస్తూవుండేది’’ తన ఆచరణాత్మకమైన ధోరణిలో సాగించేడు యెరోష్క. ‘‘అలా అని అది ఒక్కత్తే కాదు. అదీ బతుకంటే!’’

‘‘మరి యిప్పుడు?’’

"యిప్పుడు మనం కుక్క వెంటపోతాం, అడివికోడి చెట్టుమీద కూర్చునేదాకా చూస్తాం, అప్పుడు పేలుస్తాం."

"మర్యాంకా కోసం ఓ పట్టుపట్టలేకపోయావా?"

"కుక్కల్ని పరీక్షగా చూడు. యీ రాత్రికి నీకు చూపిస్తా" అన్నాడా ముసలాడు, తన అభిమాన పాత్రమైన కుక్క లియమ్‌ని చూపిస్తూ.

కొంచెం సేపు నిశ్శబ్దం తర్వాత, మళ్లీ ఓ వంద అడుగుల దూరం తర్వాత తమ సంభాషణ ఆరంభించారు. అప్పుడు ఆ ముసలాడు మళ్లీ ఆగాడు. దారిలో అడ్డంగా పడి వున్న ఓ కొమ్మని చూపించాడు.

"అదేమిటనుకుంటున్నావ్? ఏమీ కాదనుకుంటున్నావేం! ఆ కర్ర అలా పడి వుండకూడదు. అది అనర్థం."

"ఎందుకని?"

ముసలాడు వెటకారంగా నవ్వాడు.

"ఓ! నీకేం తెలీదు. వూరికే నే చెప్పేది విను. ఒక కర్ర అలా పడి వుంటే, దాన్ని దాటకు. చుట్టు తిరిగి వెళ్లు, లేదా యిలా తీసి అవతల పారేసి ప్రార్థించు, 'దేముడూ, ఆయన కుమారుడూ, పవిత్ర భూతం.' అప్పుడు దేవుని ఆశీస్సులతో వెళ్లు. నీకేం జరగదు. అదీ నాకు మా ముసలాళ్లు చెబుతూ వుండేది."

"నడుద్దూ, వెధవ చెత్తంతానూ" అన్నాడు ఒలేనిన్. "నువ్వు నాకు మర్యాంకాని గురించి యింకా చెప్పు, మెరుగు. ఆమె లుకాష్కతో గ్రంథం నడిపిస్తోందా?"

"హుష్.... మాట్లాడకు!" ఆ ముసలాడు గుసగుసలతో అడ్డం వచ్చాడు. "వూరికే విను. అడివి చుట్టూ తిరిగిపోదాం."

ఆ ముసలాడు, తన మెత్తటి చెప్పులతోటి అడుగేస్తూ యిరుకు దారిగుండా, చిక్కని దట్టమైన అడవి పొదల్లోకి దారితీశాడు. మధ్య మధ్యన కనుబొమలు చిట్లిస్తూ, ఒలేనిన్‌కేసి తిరిగి చూశాడు. అతను

తన బరువైన బూట్లలోటి గరగర రణగొణధ్వని చేస్తూ, తుపాకీని నిర్లక్ష్యంగా మోస్తూ నడిచాడు. అది ఎన్నో సార్లు దారి కడ్డం వాలిన కొమ్మల్ని తగిలింది.

"అంతలా చప్పుడు చెయ్యొద్దు. మెల్లిగా అడుగెయ్యి, సైనికా!" ఆ ముసలాడు కోపంగా గుసగుసలాడేడు.

గాలిలో సూర్యుడు ఉదయించిన అనుభూతి తగుల్తోంది. పొగమంచు విడిపోతోంది. కాని అది యింకా చెట్ల శిఖరాలని కమ్మేవుంది. మింగే సేటంత పెద్దదిగా వుంది అడివి. ప్రతీ అడుక్కీ దృశ్యం మారిపోతోంది. చెట్టులా కనిపించింది పొద అయి కూర్చుంటోంది. ఓ రెల్లుకాడ చెట్టులా వుంటోంది.

## 19

నిశ్శబ్దంగా వుంది. వూళ్ళోని ధ్వనులు మొదట్లో కొంచెం దూరం వినిపించినా యిప్పుడా వేటగాళ్ళకి అందటం లేదు. కుక్కలు పరిగెడుతూ వుంటే గచ్చపొదలు మాత్రం గరగర మంటున్నాయి. అడపాదడపా పక్షులు కూస్తున్నాయి. ప్రమాదం యెప్పుడూ అడివిలో పొంచి వుంటుందనీ, ఆ చోటుల్లో అబ్రేక్కులు అస్తమానూ దాగి వుంటారనీ ఒలేనిన్‌కి తెలుసు. అడివిలో కాలినడకన పోయే మనిషికి తుపాకీ రక్ష అనీ తెలుసు. అతను భయపడ్డాడని కాదు, తన స్థానంలో మరెవరేనా అయితే భయపడవచ్చని అనుకున్నాడు. తడిగా, పొగమంచుతో వున్న అడివికేసి చూసి ఆ నీరస ధ్వనులు పట్టిపట్టి వింటూ, తుపాకీమీద పట్టు మార్చుకుని తనకి నూతనమైన మధురానుభూతి అనుభవించాడు. యెరోష్కా మామ ఒలేనిన్‌కి ముందు నడుస్తూ ప్రతి కుంట దగ్గరా ఆగుతూ, యే జంతువేనా రెండు జాడలు వదిలిందేమో పరీక్షగా చూస్తూ, అతనికి వాటిని చూపించాడు. అతను దాదాపుగా యేమీ మాట్లాడ్డం లేదు. యెప్పుడేనా గుసగుసలతో ఓ మాట

అనేవాడు. వాళ్ళు నడుస్తూ వున్న దారి ఒకప్పుడు బండి సట్టాలదారి, కాని యెప్పటినుంచో గడ్డి పెరిగి ఆ జాడలు కప్పడిపోయాయి. ఆ యెల్మ్, ప్లేన్ చెట్లు అడివి యిరువైపులా యెంత దట్టంగా తీగలతో కప్పడిపోయి పెరిగిందంటే దాని గుండా చూడ్డం అసాధ్యం అయింది. దాదాపు ప్రతి చెట్టూ అడివి ద్రాక్ష తీగలతోటి పైనుంచి కిందదాకా అల్లుకుపోయివుంది. నేలమీద గచ్చపొదలు మాత్రం దట్టంగా పరుచు కుని వున్నాయి. ప్రతి కాస్త ఖాళీజాగా నల్లరేగుపొదలతోటీ, బూడిద రంగు కుచ్చు రెల్లుతోటీ కప్పడిపోయింది. కొన్ని చోట్ల పెద్ద గిట్టల గుర్తులూ, బాణం ఆకారపు అడివికోడి జాడలూ బాటనుంచి గుబురుల్లోకి దారి తీశాయి. పశువులు యెప్పుడూ తిరగని ఆ దృఢమైన అడివి విస్తృతి ఒలేనిన్‌కి ప్రతి మలుపులోనూ కొట్టవచ్చినట్టు కన బడింది, యెందుకంటే అతనలాంటి దాన్ని అదివరకెన్నడూ చూళ్ళేదు. ఆ అడివీ, ఆ ప్రమాదమూ, ఆ ముసలాడూ అతని మర్మగర్భిత గుస గుసలూ, దృఢంగా నిటారుగా వుండే మర్యాంకా, ఆ పర్వతాలూ – అంతా యేదో కలలో వున్నట్టుగా కనిపించాయి.

''ఓ అడివికోడి వాలింది'' మెల్లిగా అన్నాడు ముసలాడు, చుట్టూతా చూసి ముఖంమీదకి టోపీ లాక్కుంటూ. ''నీ ముఖం కప్పుకో. అడివి కోడి!'' ఒలేనిన్‌కేసి కోప సౌంజ్ఞ చేశాడు. చేతులు దాదాపు నేలమీద ఆన్చి ముందుకు పాకాడు. ''దానికి మనిషి మొహం కిట్టదు.''

ఒలేనిన్ యింకా అతని వెనకే వుండగా ఆ ముసలాడు ఆగి ఓ చెట్టుని పరీక్షించసాగాడు. తనకేసి మొరుగుతూ వున్న కుక్కకేసి, ఆ మగపక్షి కొక్కొక్కొ అంది. ఒలేనిన్ ఆ పక్షిని చూశాడు. కాని ఆ క్షణంలో ఫిరంగినుంచి వచ్చినట్టుగా ఒక పేలుడు ధ్వని యెరోష్కా పెద్ద తుపాకీనుంచి వచ్చింది. ఆ పక్షి రెక్కలల్లల్లాడించి కొన్ని యీకలు రాల్చి నేల కూలింది. ఆ ముసలాడికేసి నడిచి వెడుతూ ఒలేనిన్ యింకో దాన్ని కదిలించాడు. తుపాకీ యెత్తి గురిచూసి కాల్చాడు.

ఆ అడవికోడి ఒక్క క్షణం యెగురుతుంటూ పైకెళ్లి, అప్పుడు పడిపోతూ, కొమ్మల్లో చిక్కుకుంటూ నేలకూలింది.

"సెభాష్, కుర్రాడా!" యెగురుతున్న పక్షిని కొట్టలేని ఆ ముసలాడు అరిచాడు, నవ్వుతూ.

ఆ పక్షుల్ని యేరుకుని యిద్దరూ నడిచారు. యీ శ్రమకీ, పొగడ్తకీ హుషారెక్కి ఆ ముసలాడికి యేదో చెబుతూనే వున్నాడు ఒలేనిన్.

"ఆగు! యిటురా, నిన్న యిక్కడ లేడి జాడ చూశాను" యెరోష్కా అడ్డం వచ్చాడు.

వాళ్ళు పొదల్లోకి మళ్లి మూడువందల అడుగులు వెళ్లాక, చెట్ల మధ్య ఖాళీగా వుండే జాగాలోకి యీడ్చుకుంటూ జారారు. అది రెల్లు పెరిగి, కొంత మేరకి నీళ్లలో వుంది. ఒలేనిన్ ఆ ముసలి వేటగాడితో అందుకోలేకపోతున్నాడు. యెరోష్కా మామ, ఓ యిరవై అడుగుల యెదరకి వెళ్లాక కిందకి వంగి తలవూపుతూ అతన్ని రమ్మని చేత్తో సౌంజ్ఞ చేశాడు. యెరోష్కాని చేరగానే అతను చూపించిన మనిషి అడుగుల జాడ చూశాడు ఒలేనిన్.

"కనిపిస్తోందా?"

"వూఁ!" అన్నాడు ఒలేనిన్, వీలైనంత నిబ్బరంగా మాట్లాడుతూ. "ఓ మనిషి అడుగుజాడ."

అప్రయత్నంగానే అతను కూపర్ రాసిన "పాత్‌ఫైండర్"ని గురించి అనుకున్నాడు. అబ్రేక్కుల గురించి ఆలోచన ఒలేనిన్ బుర్రలో మెరిసింది. కాని ఆ ముసలాడు వెడుతూ వున్న చిత్రమైన పద్ధతి చూసి అతన్ని అడగడానికి సందేహించాడు. యీ నిగూఢ ప్రవర్తనకి కారణం ప్రమాద భయమా లేక వేటా అన్న సందిగ్ధంలో వుండిపోయాడు.

"అబ్బే, అది నా అడుగుజాడే" సాదాగా అన్నాడు ముసలాడు.

''కాని యిదిగో'' అని గడ్డికేసి చూపించాడు. అక్కడొక జంతువు జాడ బొటాబొటీగా కనిపించింది.

ముసలాడు నడుస్తూనే వున్నాడు. ఒలేనిన్ వెనకబడకుండా వెడుతూనే వున్నాడు. యింకా ముందు ఓ యిరవై అడుగులు కిందికి వెళ్ళి వాళ్ళు విశాలంగా విస్తరించిన ఓ భేరి చెట్టుకిందికి వచ్చారు. దాని కింద, నల్లని నేలమీద, యేదో జంతువు అప్పుడే వేసిన పేడ వుంది. ఆ చోటంతా అడివి తీగలతో అల్లుకుపోయి హాయిగా వుండే పొదరిల్లులా, చీకటిగా, చల్లగా వుంది.

''అది యీ పొద్దున్న యిక్కడ వుంది. యీ చోటు యింకా చెమ్మగా వుంది, పూర్తి తాజాగా'' అన్నాడు ముసలాడు నిట్టూరుస్తూ.

హఠాత్తుగా వాళ్ళు నుంచున్న చోటునుంచి ఓ పదడుగుల అవతల అడివిలో భయంకరమైన ఫెళఫెళార్భటి విన్నారు. అదిరిపోయి వాళ్ళిద్దరూ తుపాకులు పట్టుకున్నారు. కాని వాళ్ళకేం కనిపించలేదు. కొమ్మలు విరగడం మాత్రం విన్నారు. వేగంగా లయబద్ధంగా దౌడు తీసే శబ్దం మాత్రం ఓ క్షణం వినిపించింది. తర్వాత అది మంద్రస్వరంలా దూరంగా ప్రతిధ్వనిస్తున్నట్టు మారింది. అడివిగుండా యింకా విశాలంగా మళ్ళీ ప్రతిధ్వనించింది. ఒలేనిన్‌కి గుండెలో యేదో తెగినట్టనిపించింది. దట్టమైన గుబురుకేసి చూశాడు, కాని వృధా అయింది. తర్వాత ముసలాడికేసి చూశాడు. భుజంమీద యింకా తుపాకీ వుంచుకుని యెరోష్కా మామ నిశ్చలంగా నుంచున్నాడు. అతని టోపీ వెనక్కి వుంది. అతని కళ్ళు అసాధారణమైన కాంతితో వెలుగుతున్నాయి. అరిగిపోయిన పసుప్పచ్చ పళ్ళు కోపంగా బయటికి పెట్టిన అతని నోరు అదే స్థితిలో బిగుసుకుపోయినట్టు వుంది.

''చిలువ కొమ్ముల మగ జింక!'' గొణిగాడతను. నిస్పృహతో తుపాకీ కింద పడేస్తూ తన తెల్లటి గడ్డాన్ని పీక్కోడం మొదలెట్టాడు. ''యిదిగో యిక్కడణ్ణే అది నుంచుని వుండింది. చుట్టు తిరిగిన దారిలో

వచ్చి వుండాల్సింది మనం.... దద్దమ్మ, దద్దమ్మ!'' గడ్డాన్ని కోపంగా పట్టి లాగాడు. ''దద్దమ్మా! సండీ!'' అతను రెట్టించాడు, తన గడ్డాన్ని తనే బాధగా పీక్కుంటూ.

ఆ పొగమంచులో యేదో యెగురుతున్నట్టు కనిపించింది. దూరంగా దూసుకుపోయే ఆ జింక శబ్దం యింకా యెక్కడో ప్రతిధ్వనింపింది.

అలిసిపోయి, ఆకలితో, అయినా పూర్తి దృఢంగానే, ఆ ముసలాడితో కలిసి ఒలేనిన్ తిరిగి వచ్చేటప్పటికే సాయం సంధ్య అయింది. భోజనం తయారుగా వుంది. ఆ ముసలాడితో కలిసి సంతోషంగా, వెచ్చగా అనిపించేంతవరకూ అతను తిని, తాగుతూ వున్నాడు. అప్పుడతను గుమ్మంలోకి వెళ్లాడు. మళ్లీ సూర్యాస్తమయంలో అతని ముందా పర్వతాలు ఉత్థానమయ్యాయి. మళ్లీ వేట గురించీ, అబ్రేక్కుల గురించీ, ప్రియురాళ్ల గురించీ, సాహసోపేతమైన నిర్లక్ష్య జీవితం గురించీ ఆ ముసలాడి అనంత గాథలు. మళ్లీ మర్యాంకా లోపలికీ యివతలికీ సెరట్లోనుంచి వెళ్లింది. ఆమె గాగరా శక్తివంతమైన ఆమె కన్యా సౌందర్య సౌష్ఠవాన్ని రేఖాకృతిగా చూపెట్టింది.

## 20

ఆ ముసలాడూ, తనూ జింకని బెదిరించిన చోటికి ఆ మర్నాడు ఒలేనిన్ వంటరిగా వెళ్లాడు. అతను చుట్టు తిరిగి గేటుగుండా వెళ్ల కుండా ముళ్ల కంచెలమీదనుంచి యెక్కి వెళ్లాడు, మిగతా అందరూ చేసేటట్టుగానే. తన కోటుని గుచ్చుకున్న ముళ్ళు తీసే లోపునే, ముందే వెడుతూ వున్న అతని కుక్క రెండు అడివికోళ్లని లేపింది. ముళ్లపొద యింకా చేరాడో లేదో ఆ అడివికోళ్లు అడుగడుక్కీ లేస్తూనే వున్నాయి. (తెరవెనకాలనుంచి తుపాకీ పేల్చే ఉద్దేశ్యంతో దాన్ని వుంచు తున్నట్టు ఆ ముసలాడు తనకా స్థలాన్ని ముందు రోజు చూపించనే

లేదు.) ఒలేనిన్ పన్నెండు సార్లు పేల్చి అయిదు పక్షుల్ని చంపాడు. కాని వాటికోసం ముళ్లపొదలు యెక్కిపోవడం అతనికి యెంత అలసట అయిందంటే త్వరగానే అతను చెమటతో తడిసి ముద్దయిపోయాడు. అతను కుక్కని వెనక్కి పిలిచాడు. తుపాకీ గుర్రం తీసేశాడు. రప్పలమీద కొన్ని గుళ్లు వుంచాడు. దోమల్ని తన సర్కేషియన్ కోటు పెద్ద చేతులతో తోలుకుంటూ, తాను ముందు రోజు వెళ్లిన చోటికి నెమ్మదిగా వెళ్లాడు. యేమైనా కుక్కని ఆపడం దుర్లభం అయిపోతోంది. అది దారిలో కూడా అడివికోళ్ల జాడలు పసికడ్తోంది. ఒలేనిన్ యింకో రెండు అడివికోళ్లని చంపాడు. దాంతోటి వాటిని సేకరించి తను వెళ్లాల్సిన చోటు చేరేటప్పటికి మధ్యాహ్నం అయింది.

ఆ పగలు నిర్మలినంగా, ప్రశాంతంగా చాలా వేడిగా వుంది. ఆ పొద్దుటి తడి అడివిలో కూడా ఆరిపోయింది. మశక సైన్యం అక్షరాలా అతని ముఖాన్నీ వీపునీ చేతుల్నీ కప్పేసింది. అతని కుక్క వెనక భాగ మంతా దోమలు కప్పివుండటంతోటి నలుపునుంచి బూడిద రంగుకి మారింది, అలాగే అతని కోటూనూ. దానిగుండా అవి కుదుతున్నాయి. ఒలేనిన్ వాటినుంచి పారిపోవడానికి తయారయాడు. ఆ వూళ్లో వేసవిలో వుండటం అసాధ్యమైపోతుందని అనుకున్నాడు. యింటికి పోదామా అనుకుని, అలాంటి బాధని మిగతా వాళ్లు ఓర్చుకుంటున్నారు కదా అని గుర్తుకు వచ్చి, తనూ దాన్ని భరిద్దామని తీర్మానించుకుని అవి తనని కొరికి తినెయ్యడానికి వాటికి లొంగిపోయాడు. చిత్రంగా మధ్యాహ్ననికి ఆ అనుభూతి సంతోషదాయకమైంది. ఆ మశక భూయిష్ఠమైన వాతావరణమూ, చెమటతో కలిసిపోయి చెయ్యీ ముఖమూ అంతా పులుముకుపోయిన ఆ కశ్మలమూ, శరీరమంతా యెడతెగని చిరాకూ లేనట్లయితే అడివి తన స్వభావాన్నీ, అందాన్నీ పోగొట్టుకుంటుందని కూడా ఆఖరికతని కనిపించింది. విపరీతంగా పుష్కలంగా పెరిగిన ఆ చెట్టుచేమలకీ ఆ అడివిలో నిండిపోయిన అసంఖ్యాక

పక్షి జంతు సంతతికీ, ఆ శ్యామల వృక్షాది పత్ర సమూహానికీ, ఆ సువాసన కమ్మిన చెమ్మ గాలికీ, టెరెక్ నదినుండి అన్ని చోట్లా పూరించి బురద నీటితో నిండి, వేలాడుతున్న ఆకులకింద గలగల పారే చిన్న కాలవలకీ ఆ వేలాది మశక సైన్యం యెంత నచ్చిందంటే మొదట్లో భయంకరంగా అసహ్యాకరంగా కనిపించింది యిప్పుడు యింపుగా కనిపించింది. తాను అంతకు ముందు రోజున జింకని బెదరగొట్టిన చోటికి చుట్టు తిరిగి వెళ్ళాడు. యేదీ కనిపించకపోవడంతోటి, విశ్రాంతిగా ఒరుగుదామనిపించిందతనికి. సూర్యుడు సరిగ్గా నడినెత్తిన వున్నాడు. అతను యెప్పుడు ఖాళీ జాగాలోకీ, దారి మీదకీ వచ్చినా నిటారు సూర్య కిరణాలు అతని వీపుమీదా నెత్తిమీదా చురుక్కుమని తగుల్తున్నాయి. ఆ యేడు బరువైన అడివికోళ్ళూ నడుందగ్గర యిబ్బందిగా వున్నాయి. ఆ జింక జాడ కనిపెట్టి ఒక పొదకిందనుంచి అడివిలోకి సరిగ్గా ఆ జింక పడుకుని నివాసం వుండే చోటికి పోయాడు. చుట్టూతా వున్న శ్యామల వృక్షాది, పత్ర సమూహాన్నీ, ఆ జింక చెమటతో తడిసిన చోటునీ, యెండిన పేడనీ, జింక మోకాళ్ల చిహ్నాల్నీ, అది పైకి కెళ్ళగించిన నల్లటి మట్టి పెళ్లల్నీ, అంతకు ముందునాటి తన అడుగు జాడల్నీ పరిశీలించాడు. ప్రశాంతంగా హాయిగా యే ఆలోచనలూ కోరికలూ లేనట్లనిపించిందతనికి. ఒక వింత హేతురహితానందంతోటీ, సర్వవ్యాప్త ప్రేమతోటీ యెంత పరవశుడయ్యాడంటే చిన్న నాటి తన పాత అలవాటువల్ల అతను శిలువగీత గీసుకుని ప్రార్థన చేసి యెవరికో కృతజ్ఞతలు చెప్తున్నాడు. హఠాత్తుగా యెప్పుడూ లేనంతటి స్పష్టతతోటి అనుకున్నాడు: "యిక్కడ దిమిత్రియ్ ఒలేనిన్ అనే నేను, మిగతా వాళ్ళందరికంటే భిన్నమైనవాణ్ణి, దేవుడికే తెలియాలి యెక్కడో — జింక వుండే చోటు, బహుశా యెప్పుడూ మనిషి ముఖం చూసి యెరగని ముసలి అందమైన జింక వుండే చోటు, యే మనిషీ యెప్పుడూ కూర్చొని వుండని చోటు, యిలాంటి ఆలోచనలు రాని చోటు, ఒంటరిగా ఒక్కణ్ణే

పడుకుని వున్నాను. నేనిక్కడ కూర్చున్నాను; నా చుట్టూతా ముదురువీ, లేతవీ చెట్లు వున్నాయి. వాటిల్లో ఒకటి అడివి తీగల్తో అల్లుకుపోయి వుంది. అడివికోళ్ళు రెపరెపలాడుతున్నాయి. ఒక దాన్ని ఒకటి తోలుకు పోతున్నాయి, బహుశా తమ సోదరులు హతులైనారన్నట్టు పసిగట్టి.'' అడివికోళ్లని తడిమాడు. పరీక్షించాడు. ఆ కవోష్ణ రక్తాన్ని చేతి నుంచి సర్కేషియన్ కోటుమీద తుడుచుకున్నాడు. ''బహుశా గుంట నక్కలు కూడా వాటిని పసిగట్టే వుండాలి. మాడ్చుకున్న మొహాలతో యింకో దిక్కుకి పోయి వుంటాయి. నా పైన మశకాలు ఆకులపైన యెగురుతూ వున్నాయి. వాటికి ఆకులు ద్వీపాల్లా కనిపిస్తున్నాయి. అవి గాలిలో తేలుతూ రొద చేస్తున్నాయి. ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఓ నంద, ఓ వెయ్యి, ఓ లక్ష మశకాలు అన్నీ కూడా ఒకదాని కొకటి రొద చేస్తూ, వాటిల్లో ప్రతి ఒకటీ ఒక డ్మ్రిత్రియ్ ఒలేనిన్, ప్రతీదీ యింకో దానికి భిన్నంగా, నాలాగే.'' ఆ దోమలు యేం రొద చేస్తు న్నాయో వివరంగా వూహించుకున్నాడు: ''యిలా, యిలాగ కుర్ర కుంకలూ! మనం తినగలిగిన వాడెవడో యిక్కడున్నాడు!'' అవి రొద చేసి అతన్ని అతుక్కున్నాయి. తను రష్యన్ కులీనుణ్ణి కాదనీ, మాస్కో నాగరిక సమాజంవాడు కాదనీ, ఫలానా ఫలానా వాడి బంధువూ నేస్తమూ కాదనీ, వూరికే ఒక దోమ అనీ, లేకపోతే ఒక అడివికోడి అనీ, లేక ఒక జింక అనీ, తన చుట్టూతా వున్న వాటిలాగేననీ అతనికి స్పష్టంగా అనిపించింది. ''వాటికి లాగానే, యెరోష్క మామ లాగానే నేనూ కొంత కాలం బతికి చస్తాను. అతను చెప్పినట్టు గడ్డి మొలుస్తుంది. యింకేమీ కాదు.''

''కాని గడ్డి పెరిగితే మాత్రం యేమిటి?'' అతను ఆలోచించ సాగాడు. ''అయినా నేను బతకాలి. ఆనందంగా వుండాలి. యెందుకంటే ఆనందమే నేను కోరుకునేది. నేనెవరినైతేనేం — మిగిలిన వాటిలాగానే ఒక జంతువుని, దానిమీద గడ్డి పెరుగుతుంది, యింకేమీ కాదు,

లేకపోతే భగవదంశ యిమిడ్చిన ఒక చక్రాన్ని — అయినా నేను బతకాలి అత్యుత్తమంగా. నేను ఆనందంగా యెలా బతకాలి, నేనింతకు ముందు ఆనందంగా యెందుకు లేను?'' అతను తొలి జీవితాన్ని గుర్తుకు తెచ్చుకోవడం మొదలెట్టాడు. తనమీద తనకే అసహ్యం వేసింది. తను అన్నీ అపేక్షించేవాడుగా, స్వార్థపరుడుగా తనకే అనిపించింది. యింత కాలమూ తనకిగా తనకి యేమీ అవసరం లేకపోయిందని యిప్పుడతనికి అనిపించింది. ఆకుల సుబుర్నగుండా వెల్తురు ప్రకాశించే వృక్షాది పత్ర సమూహాలకేసీ, అస్తమయ సూర్యునికేసీ, వినీలాకాశంకేసీ చుట్టూ చూస్తూ వుండిపోయాడు. అంతకు ముందుటంతటి ఆనందంతోటీ వుండిపోయాడు.

''నేనిప్పుడెందుకు ఆనందంగా వున్నాను, నేను దేనికోసం బతికాను?'' అనుకున్నాడతను. ''నేను నాకోసం యెంత అపేక్షించాను, యెన్ని కుయుక్తులు పన్నాను, అయినా విచారమూ, అవమానమూ తప్ప యేమీ సాధించలేకపోయాను! యిప్పుడు ఆనందంగా వుండటానికి నాకేమీ అక్కర్లేదు.'' హఠాత్తుగా ఒక కొత్త తేజస్సు తనకి వెల్లడైనట్టు అనిపించిందతనికి. ''ఆనందం అంటే యిదే!'' అనుకున్నాడు. ''యితరుల కోసం బతకడంలోనే ఆనందం వుంది. అది స్పష్టం. ఆనందం కోసం తపన ప్రతివాడికీ సహజంగా వుంటుంది; అంచేత అది న్యాయమే. దాన్ని స్వార్థంగా సాధించాలని ప్రయత్నించినప్పుడు — అంటే స్వార్థం కోసం — ఐశ్వర్యం, కీర్తి, సౌఖ్యమూ లేక ప్రేమా కావాలనుకున్నప్పుడు ఆ కోరికలు తీరడం అసాధ్యమయే పరిస్థితులు తలయెత్తవచ్చును. దాన్నిబట్టి ఆ కోరికలే కాని, ఆనందపు అపేక్ష అన్యాయమైనది కాదని తేలుతోంది. కాని బాహ్య పరిస్థితుల ప్రమేయం యెలా వున్నా, యెప్పుడూ యే కోరికలు తీరతాయి? యేమిటవి? ప్రేమ, ఆత్మ పరిత్యాగం.'' అతని కనిపించినట్టు యీ కొత్త సత్యాన్ని కనిపెట్టినప్పుడు, అతనెంత సంతోషంలో ఉద్రేకంతో వుండిపోయాడంటే అతను యెగిరి

గంతేశాడు. తను ఆత్మార్పణ గావడానికీ, మేలు చెయ్యడానికీ ప్రేమించడానికీ ఆలంబన అయే వాళ్ల కోసం సహా ఆత్రంగా వెదకడం ఆరంభించాడు. ''ఒకడు తన కోసం యేమీ కోరుకోడు గనక మిగిలిన వాళ్ల కోసం యెందుకు బతక్కూడదు?'' అనుకుంటూ వుండి పోయాడు.

యిది పూర్తిగా పరిశీలించి మేలు చెయ్యడానికి అవకాశం వెతికేందుకు త్వరగా యింటికి పోయే ఉద్దేశ్యంతో తుపాకీ అందుకున్నాడు. గుబురుల్లోంచి యివతలికి వచ్చాడు.

అతను ఖాళీ జాగాలోకి రాగానే చుట్టూతా చూశాడు, చెట్ల శిఖరాలపైన సూర్యుడింక కనిపించడం లేదు. మరింత చల్లబడింది. ఆ చోటు అతనికి వింతగా కనిపించింది, వూరు చుట్టూతా వున్న ప్రాంతంలాగా కాదు. ప్రతిదీ మారిపోయినట్టు వుంది — ఆ వాతావరణమూ, అడివి లక్షణమూ; ఆకాశం మబ్బుల్లో కప్పడిపోయింది; వృక్షశిఖరాల్లో గాలి రివ్వుమంటోంది. చుట్టూతా యేమీ కనిపించడం లేదు రెల్లూ, శిథిలమౌతూవున్న కూలిన వృక్షాలూ తప్ప. యేదో జంతువుల వెంటబడిన కుక్కని పిలిచాడు. తన గొంతు యేదో యెడారి నుంచి వచ్చినట్టుగా తిరిగివచ్చింది. హఠాత్తుగా అతన్ని ఒక ప్రచండమైన భీతి ఆవహించింది. అతను భయకంపితుడయ్యాడు. అబ్రేక్కులూ, తను విన్న హత్యలూ గుర్తుకొచ్చాయి. యే పొద వెనకనుంచో ఓ అబ్రేక్ తనమీదికి యెగురుతాడనుకున్నాడు. తను ప్రాణం కోసం పోరాడి చని పోవాలి. లేకపోతే పిరికివాడులాగా వుండాలి. యెంతో కాలంగా తను తలుచుకోని విధంగా దేవుణ్ణి గురించి, తదనంతర జీవితం గురించి తలుచుకున్నాడు. చుట్టూతా ప్రకృతి — చీకటిగా, కర్కశంగా, ఆటవికంగా. ''యే క్షణంలోనేనా నువ్వు చచ్చిపోయేటప్పుడు, యెవరికీ తెలియని విధంగా యే మేలూ చెయ్యకుండా చచ్చిపోయేటప్పుడు యెందుకు వాడు బతకడం ధర్మమేనా?'' అనుకున్నాడు. వూరు వుందనుకున్న దిక్కులో

వెళ్లాడు. తన వేటని గురించిన ఆలోచన యింక అతనికి లేదు; వచ్చినంత అలిసిపోయాడు. ప్రతి క్షణమూ తన జీవితానికి సంజాయిషీ అడగబడుతుందని యెదురుచూస్తూ ప్రతి పొదకేసీ, చెట్టుకేసీ ప్రత్యేక మైన శ్రద్ధతోటీ, భయంలోటీ చూశాడు. కొంత సేపు తిరిగాక, పొరెక్‌నుంచి చల్లని యిసక నీరు ప్రవహిస్తున్న కాలువ దగ్గరికి వచ్చాడు. యిక దోవ తప్పకుండా వుండాలని దాన్ని అనుసరించ నిశ్చయించు కున్నాడు. ఆ కాలువ యెక్కడికి లాక్కుపోతోందో తెలియకుండానే అతను అలా పోయాడు. హఠాత్తుగా అతని వెనక రెల్లు గుంయ్‌మంది. అతను వణికిపోయాడు. తుపాకీ చేజిక్కించుకున్నాడు. మరు క్షణం అతను సిగ్గుతో చితికిపోయాడు. అతి ఆవేశం వున్న ఆ కుక్క, గట్టిగా వగరుస్తూ ఆ కాలువలోని చన్నీళ్లలోకి దూకి, నీళ్లని తపతపమని నాలికతో తాగుతోంది.

అతను కూడా నీళ్లు తాగాడు. ఆ కుక్క పోతున్న దారిలో దాన్ని అనుసరించాడు, అది వూళ్లోకే నడిపిస్తుందని ఆశిస్తూ. కుక్క పక్కన వున్నా చుట్టూతా వున్న ప్రతీదీ యింకా దుశ్శకునసూచకంగానే వుంది. అడివి యింకా చీకటైంది. పాత చిన్న వృక్ష శిఖరాల్లో గాలి యింకా యీదురుగా వీస్తోంది. ఆ చెట్లలోని తమ గూళ్ల చుట్టూతా పెద్ద పక్షులు 'గీ' మంటూ మళ్లు తిరిగాయి. వృక్ష సంతతి పల్చ బడింది. యింకా యింకా రెపరెపలాడే రెల్లూ, అడివి జంతువుల జాడలు పడ్డ యిసుక బయలు ప్రదేశాలూ అతనికి తగిలాయి. ఆ గాలి యీదురుకి యింకో నిరుత్సాహపు యేకరీతి ఘోష తోడైంది. పూర్తిగా వ్యాకులం పడిపోతున్నట్లనిపించింది. చెయ్యి వెనక పెట్టుకుని అడివికోళ్లని తడిమాడు. ఒకటి పోయిందని గ్రహించాడు. అది తెగి జారిపోయింది. రక్తం కారే మెడా, తలా, పటకాకి అంటిపెట్టుకుని వున్నాయి. ముందెన్నడూ లేనంతగా అతను భయకంపితుడయ్యాడు. దేవుణ్ణి ప్రార్థించడం మొదలెట్టాడు. యే మేటూ, భయాపూరితమైన

పనీ చెయ్యకుండానే చచ్చిపోతానేమోనని భయపడ్డాడు. బతకాలని యెంతో కోరుకున్నాడు. యేదైనా మహత్తర ఆత్మార్పణ కృత్యం చెయ్యడం కోసం బతకాలనుకున్నాడు.

## 21

హఠాత్తుగా అతని హృదయంలో సూర్యకాంతి విరిసినట్లైంది. ఎవరో రష్యన్ భాష మాట్లాడుతూ వుండటం విన్నాడు. టెరెక్ నది వడిగా జారే ప్రవాహ శబ్దం విన్నాడు. కొద్ది అడుగుల దూరంలో ముందు ప్రవహించే నది నీళ్ల ఉపరితలాన్నీ, ఆ నది గట్టుదగ్గరా, మిట్టల్లోనూ వున్న బూడిదరంగు యిసకనీ, సుదూర మైదానాల్నీ, నదికి పైన రేఖాసూచితమైన ఆ సైనిక చౌకీ ప్రాకార శీర్షాన్నీ, జీను వేసి, బందం వేసి గచ్చపొదల్లో సిద్ధంగా వున్న గుర్రాన్నీ, తన ముందు విస్తరించుకున్న పర్వతాల్నీ చూశాడు. మేఘాల మాటునుంచి ఒక్క క్షణం దర్శనమిచ్చిన అరుణ సూర్యుణ్ణీ, పదివార రెల్లుమీదా, బురుజుపైనా, కోసక్కులమీదా ప్రకాశమానంగా మెరిసే ఆ సూర్యుని ఆఖరి కిరణాల్నీ చూశాడు. ఈ కోసక్కుల మధ్య లుకాష్క బలిష్ఠమైన ఆకారం కంటబడింది.

యే స్పష్టమైన కారణమూ లేకుండానే, మళ్లీ ఒలెనిన్, తను సంపూర్ణ ఆనందంతో వున్నట్టు భావించుకున్నాడు. అతను నది అవతలి బడ్డున ప్రశాంతమైన చెచెన్ గ్రామానికి యెదురుగా నిజ్నిప్రోతోజ్‌కీ స్థావరందగ్గరికి వచ్చాడు. ఆ కోసక్కులకి వందనం చేశాడు. కాని యింకా యే మంచి చెయ్యడానికి తగ్గ అవకాశం కనిపించకపోవడంతోటి యింట్లోకి వెళ్లాడు. ఆ యింటిలోనూ అలాంటి అవకాశం అతనికి కనిపించలేదు. కోసక్కులు అతన్ని ముభావంగా చూశారు. ఆ మట్టి యింట్లోకి ప్రవేశిస్తూనే సిగరెట్ ముట్టించాడు. ఆ కోసక్కులతనికి యే మాత్రం ఆదరం చూపించలేదు. మొదటిది అతను సిగరెట్

కాలుస్తున్నాడనీ. రెండోది వాళ్ళకి తను దృష్టిని మళ్ళించే పని యేదో ఆ పూట వుంది. ఆ చచ్చిపోయిన అబ్రేక్ బంధువులైన శత్రు చెచెన్లు ఆ శవానికి సుంకం చెల్లించడం కోసం వేగులవాడితో కొండలనుంచి వచ్చారు. ఆ కోసక్కులు గ్రామంనుంచి తనుకి ఆజ్ఞలిచ్చే అధికారుల రాక కోసం నిరీక్షిస్తూ వున్నారు. ఆ చచ్చిపోయినవాడి సోదరుడు పొడుగ్గా, సౌష్ఠవమైన శరీరంతో, అంటుకత్తెరవేసి యెరుపు రంగు వేసుకున్న గడ్డంతో, తను తొడుక్కున్న కోటూ, టోపీ చిరిగిపోయినా చక్రవర్తిలా దర్జాగ నుంచున్నాడు. అతని ముఖం దాదాపు చచ్చిపోయిన అబ్రేక్ ముఖంలాగే వుంది. అతను యెవళ్ళకేసీ చూపు అనుగ్రహించలేనట్టుగా వున్నాడు. శవంకేసి ఒక్క సారి కూడా చూళ్ళేదు. కాని నీడలో గొంతు కూర్చుని తన చిన్న పైప్ పీలుస్తూ ఉమ్మేస్తున్నాడు. అపుడపుడు ఆజ్ఞాపించే కంఠధ్వనులు చేశాడు. అతని అనుయాయుడు వాటిని తక్షణం శిరసా వహించేవాడు. రష్యన్లని వేరే పరిస్థితుల్లో యెక్కువ సార్లు చూసిన నిజమైన జిగిత్ వాడు. వాళ్ళని గురించిన యేదీ అతనికి ఆశ్చర్యం కలిగించదు, ఆసక్తి కలిగించదు. ఒలేనిన్ ఆ శవం దగ్గరకి వెళ్ళి దాన్ని చూస్తూ వున్నాడు. ఆ సోదరుడు పట్టించుకోకుండా యేహ్యంగా అతన్ని చూసి యేదో కోపంగా తీక్ష్ణంగా అన్నాడు. ఆ వేగు చనిపోయినవాడి ముఖం కోటుతో కప్పేశాడు. ఆ జిగిత్ ముఖంమీద హుందాగా, గంభీరంగా కనిపించే భంగిమ చూసి ఒలేనిన్ చకితుడయ్యాడు. యే వూరినుంచి వచ్చిందీ యేమిటీ అని వాడితో సంభాషణ మొదలెట్టాడు. కాని ఆ చెచెన్ అతనికేసి చూడను కూడా సరిగా చూడకుండా, తిరస్కారంగా ఉమ్మేసి ముఖం పక్కకి తిప్పుకున్నాడు. తనపట్ల ఆసక్తి చూపించకపోవడంతోటి ఆశ్చర్యపడి దానికి కారణం వాడి వెధవాయిత్వమైనా కావాలి లేకపోతే రష్యన్ భాష వాడికి తెలియకపోవడమైనా కావాలి అనుకున్నాడు. అంచేత అతను ఆ వేగుకేసి తిరిగాడు. అతగాడు ముభాసీలాగా కూడా

వ్యవహరిస్తున్నాడు. ఆ వేగులవాడు అవతలి మనిషంత చింపిరి బట్టల తోనూ వున్నాడు, కాని యెర్రజుట్టుకు బదులు నల్లని జుట్టుంది. అస్థిమితంగా వున్నాడు. తెల్లటి పళ్లు ధగధగ మెరిసిపోతున్నాయి. నల్లని కళ్లూ మెరుస్తున్నాయి. ఆ వేగు యిష్టంగానే సంభాషణలోకి దిగాడు. ఒక సిగరెట్టు అడిగాడు.

"వాళ్లు అయిదుగురు అన్నదమ్ములు" తన వచ్చీరాని రష్యన్‌లో మొదలెట్టాడు అతను. "రష్యన్లు చంపిన మూడోవాడు వీడు. యింక యిద్దరు మాత్రం వున్నారు. వాడు జిగిత్, గొప్ప జిగిత్!" ఆ చెచెన్ని చూపిస్తూ అన్నాడు. "వాళ్లు అహ్మెద్‌ఖాన్‌ని చంపినప్పుడు, అంటే యీ చనిపోయినవాణ్ని, యితను అవతలి ఒడ్డున రెల్లులో కూర్చు న్నాడు. మొత్తం అంతా చూశాడు: వాణ్ని పడవలో పడేసి ఒడ్డుకు తీసుకురావడమూ అంతా. రాత్రిదాకా అక్కడ కూర్చున్నాడు. ఆ ముసలాణ్ని చంపేద్దామనుకున్నాడు గాని మిగిలిన వాళ్లు అడ్డుపెట్టారు."

ఆ మాట్లాడేవాడి దగ్గరకెళ్లి కూర్చున్నాడు లుకాష్క.

"యే వూరు మీది?" అడిగాడు.

"ఆ కొండల్లో వుంది" అన్నాడా వేగు, టెరెక్ అవతల మసక నీలపు కనుమ చూపిస్తూ. "నీకు సుయూక్‌సూ తెలుసా? దానవతల యెనిమిది మైళ్లుంటుంది."

"నీకు సుయూక్‌సూలో గిరీఖాన్ తెలుసా?" అడిగాడు లుకాష్క, తన పరిచయం నిజంగా గర్వకారణమైనట్టు. "అతను నా కునాక్."

"నా వూరి పక్కవాడే" అన్నాడా వేగు.

"మంచి వాడ్లే!" లుకాష్క ఆసక్తి పెరిగింది. ఆ వేగుతోటి తాతార్‌లో మాట్లాడ్డం మొదలెట్టాడు.

కాసేపట్లో ఓ కోసక్ లెఫ్టినెంటూ, ఆ గ్రామ పెద్దా, యిద్దరు కోసక్కుల పరివారంతో గుర్రాలమీద వచ్చారు. కొత్తగా నియమించబడ్డ కోసక్ ఆఫీసరు ఆ కోసక్కులని "క్షేమమా!" అని

అభివాదం చేశాడు. కాని యెవరూ రష్యన్ సంప్రదాయంలో లాగా "క్షేమం దొరా" అని బదులు చెప్పలేదు. కొద్దిమంది మాత్రం వంగి నమస్కారం చేశారు. కొంతమంది, లుకాష్కాతో సహా, లేచి సావధానంగా నిలబడ్డారు. కాపలా స్థావరందగ్గర అంతా సక్రమంగా వుందని కార్పొరల్ రిపోర్టు ఇచ్చాడు. ఒలేనిన్‌కి యిదంతా పరిహాసంగా కనిపించింది. అదంతా ఆ కోసక్కులు యేదో సైనికుల ఆట ఆడుతున్నట్టుగా వుంది. యీ మర్యాదలన్నీ త్వరలోనే పోయి మామూలు ప్రవర్తన బయటపడింది. ఆ లెఫ్టినెంట్ మిగిలిన వాళ్ళంత చొరవైన కోసక్కానూ. చకచకా ఆ దుబాసీతో తాతార్‌లో మాట్లాడ్డం మొదలెట్టాడు. వాళ్ళు ఓ నిబంధన కాగితం తయారుచేశారు. దాన్ని ఆ వేగుకిచ్చారు. వాడ్నుంచి కొంత డబ్బు తీసుకున్నారు. అప్పుడు శవందగ్గర కెళ్ళారు.

"లుకా గ్రిసీలొవ్ యెవరు?" అడిగాడా లెఫ్టినెంట్.

లుకాష్కా టోపీ తీసి ముందుకు వచ్చాడు.

"నీ సాహస కృత్యాన్ని కమాండర్‌కి తెలియజేశాను. దాన్నుంచి యేం వస్తుందో నాకు తెలీయదు. నీకో శిలువ యివ్వాలని సిఫార్సు చేశాను. కార్పొరల్‌ని చెయ్యడానికి నువ్వు మరీ చిన్నవాడివి. నువ్వు చదవగలవా?"

"ఉహుఁ! చదవలేనండి."

"కాని మనిషిని చూస్తే బ్రహ్మాండంగా వున్నావు" అన్నాడా లెఫ్టినెంట్ మళ్ళీ ఆటలో కమాండర్‌లాగే అభినయిస్తూ. "టోపీ పెట్టుకో. యే గ్రిసీలొవ్ కుటుంబం వాడివి.... ఆ భారీ అయిన, యేం?"

"వాడి మేనల్లుడే" అని బదులు చెప్పాడు కార్పొరల్.

"నాకు తెలుసు, నాకు తెలుసు. సరే, అటు కాస్త సాయం చెయ్యండి" అన్నాడతను, ఆ కోసక్కుల కేసి తిరుగుతూ.

లుకాష్క మొహం సంతోషంతో కళకళ్లాడుతూ మామూలుకంటే అందంగా కనిపించింది. కార్పొరల్‌నుంచి దూరం జరిగాడు. టోపీ పెట్టుకుని, ఒలేనిన్ సక్కన కూర్చున్నాడు.

ఆ శవాన్ని పడవలోకి మొయ్యగానే ఆ సోదరుడైన చెచెన్ ఒడ్డు దిగాడు. వాడు వెళ్లడానికి దారి కోసం ఆ కోసక్కులు అప్రయత్నంగానే పక్కకి ఒళ్లారు. అతను పడవలోకి యెగిరి, ఒడ్డుని బలంగా కాలితో తన్ని, పడవని లోపలికి గెంటాడు. ఒలేనిన్ గమనించినట్టు, అతను ఆకస్మాత్తుగా మొట్టమొదటి సారి, త్వరితంగా కోసక్కులకేసి చూసి, తన సహచరుణ్ణి యేదో ప్రశ్న అడిగాడు. వాడు యేదో చెప్పి లుకాష్కకేసి చూపించాడు. ఆ చెచెన్ అతనికేసి చూసి నెమ్మదిగా దృష్టి మళ్లించి అవతలి ఒడ్డుకు చూశాడు. ఆ చూపు పగని వెల్లడించలేదు, చెడ్డ యేవగింపుని తెలియజేసింది తప్ప. మళ్లీ యేదో మాట అన్నాడు.

''వాడు యేమిటి అంటున్నాడు?'' ఒలేనిన్ కుదురుగా లేని దుబాసీని అడిగాడు.

''మీ వాళ్లు మా వాళ్లని చంపుతారు. మా వాళ్లు మీ వాళ్లని చంపుతారు. యిది అస్తమానూ అంతే'' బదులు చెప్పాడా వేగు. వాడు స్పష్టంగా దాన్ని కల్పించినట్టుంది. పడవలోకి దూకుతూ వుంటే వాడి తెల్లటి పళ్లు చిరునవ్వుతో తళుక్కుమన్నాయి.

ఆ చనిపోయినవాడి సోదరుడు అవతలి ఒడ్డుకేసి తదేకంగా చూస్తూ, నిశ్చలంగా కూర్చున్నాడు. వాడు యెంత పగతోటీ అసహ్యంతోటీ నిండిపోయాడంటే, వాడి జిజ్ఞాసని కదిలించేది యేదీ యివతలి ఒడ్డున లేదు. పడవకి ఓ అంచున నిలబడి, తెడ్డుని ఓ సారి యిటూ, ఓ సారి అటూ వేస్తూ నేర్పుగా పడవని నడిపిస్తూ ఆ వేగు యెడతెరిపి లేకుండా మాట్లాడుతూనే వున్నాడు. ఆ నదిలో ఆ పడవ అయిమూలగా దూరం పోయే కొద్దీ యింకా యింకా చిన్నదైపోయినట్టు వుంది. ఆ గొంతుకలూ వినిపించీ వినిపించకుండా పోయాయి. ఆఖరికి కనుచూపు దూరంలో,

వాళ్ళు అవతలి ఒడ్డుకి చేరారు. వాళ్ళ గుర్రాలు హాజరుగా వున్నాయి. ఆ శవాన్ని యెత్తారు. దాన్ని (గుర్రం బెదిరినా) ఓ జీనుమీద వేసి, యెక్కి రోడ్డువార వూరు పక్కగా నడక వేగంతోటే స్వారీ చేసుకుంటూ పోయారు. ఆ పక్కలనుంచి వాళ్లని చూడ్డానికి ఓ గుంపు పోగయింది.

నదికి రష్యన్ భాగం వైపున వున్న కోసక్కులు మహదానంద భరితులై సంబరంగా వున్నారు. అన్ని వేపులనుంచీ తుళ్లడం పేలడం వినిపిస్తూనే వున్నాయి. ఆ లెఫ్టినెంటూ, గ్రాను పెద్దా సంబరం చేసుకోడానికి మట్టి యింట్లో దూరారు. లుకాష్క ముఖం ఉత్సాహవంతంగా వుంది. ప్రశాంతమైన భావం ప్రదర్శించడం కోసం వృథాగా ప్రయత్నిస్తూ మోకాళ్లమీద చేతులు పెట్టుకుని, ఒలేనిన్ పక్కన కూర్చుని ఓ కర్రని చెక్కుతూ కూర్చున్నాడు.

"యెందుకు మీరు పొగతాగుతారు?" అన్నాడు తెచ్చిపెట్టుకున్న ఆత్రుతతోటి. "అది బాగుంటుందా?"

అతను మాట్లాడ్డానికున్న కారణమల్లా ఒలేనిన్‌ని ఆ కోసక్కుల్లో యేకాకిగా యిబ్బందిగా వున్నట్టు అతను చూడడమే.

"యిది వూరికే అలవాటు. యేం?" బదులు చెప్పాడు ఒలేనిన్.

"హుమ్, మేం యెవరమైనా పొగపీలిస్తే గొడవలే! అటు చూడండి ఆ కొండలు దూరంగా లేవు" అన్నాడు ఆ కనుమ వైపు చూపిస్తూ. "అయినా అక్కడికి పోలేరు! మీరొక్కళ్ళూ వెనక్కి యెలా వెళ్లగలరు? చీకటి పడుతోంది. మీకిష్టమైతే నేను తీసికెడతాను. కార్పొరల్‌ని నాకు సెలవిమ్మని అడగండి" అన్నాడు లుకాష్క.

"భలేవాడు!" అనుకున్నాడు ఒలేనిన్, ఆ కోసక్ ఉత్సాహవంతమైన మొహం చూస్తూ. మర్యాంకానీ, గేటుదగ్గర తను విన్న ముద్దునీ గుర్తు చేసుకున్నాడు. లుకాష్కపట్ల అతని మోటుతనంపట్ల జాలేసింది. అతననుకున్నాడు: "యేమిటీ గందరగోళమంతా? ఓ మనిషి యింకోణ్ణి చంపుతాడు. ఓ మహత్తరమైన కార్యం చేసినట్టు తృప్తిగా,

ఆనందంగా వుంటాడు. అంత సంబరపడ్డానికి తగ్గ కారణమేదీ లేదనీ, చంపడంలో ఆనందం లేదనీ, ఆత్మార్పణలోనే వుందనీ అతనికి చెప్పేది యేదీ లేదా?''

''సుప్పు వాణ్ణి మళ్ళీ చూడకపోవడం మంచిది, మిత్రమా! నిన్ను గురించి వాడు అడగడం విన్నావా?'' ఆ పడవ పోవడం చూసిన కోసక్ ఒకడు అన్నాడు లుకాష్కాని సంబోధించి.

లుకాష్కా తల పైకెత్తి ''ఆ నా కొడుకా?'' అన్నాడు. ఆ మాటకి అర్థం చనిపోయిన చెచెన్ అని.

''నీ కొడుకు లేవడులే. కానీ ఆ యెర్రటోడు ఆ నీ కొడుకు సోదరుడు!''

''వాడు బతికిపోయాడు, అదే పదివేలు వాడికి'' అన్నాడు లుకాష్కా నవ్వుతూ.

''దేన్ని గురించి అంత సంతోషం నీకు, మీ సోదరుడే హతుడైనా డనుకో సంతోషమేనా నీకు?'' అడిగాడు ఒలేనిన్.

నవ్వే కళ్ళతో ఒలేనిన్‌కేసి చూశాడా కోసక్. ఒలేనిన్ చెప్పదలచు కున్నదంతా అర్థం చేసుకున్నట్టే కనిపించాడు. కాని అలాంటి వూహలకి అతీతంగా వున్నట్టున్నాడు.

''ఆఁ! అదీ జరగచ్చు, మా వాళ్ళు చచ్చిపోవడం లేదూ ఒకో సారి?''

## 22

ఆ లెఫ్టినెంటూ, గ్రామ పెద్దా గుర్రాలమీద వెళ్ళిపోయారు. లుకాష్కాని తృప్తి పరిచినట్టూ వుంటుంది, తనూ ఒంటరిగా వెళ్ళ క్కర్లేదని ఒలేనిన్ లుకాష్కాకి సెలవిమ్మని అధికారిని అడిగాడు. అతని చ్చాడు. లుకాష్కా మర్యాంకాని చూడాలనుకుంటున్నాడని ఒలేనిన్ భావిం చాడు. అలాంటి చక్కని సరదా అయిన కోసక్ సాహచర్యం అంటే అతనికి సంతోషం కలిగింది. తన మనసులో అప్రయత్నంగానే

లుకాష్కానీ మర్యాంకానీ యేకం చేశాదు. వాళ్ళని గురించి అనుకోవడం హాయిగా వుంది. "అతను మర్యాంకాని ప్రేమిస్తున్నాడు. నేను ఆమెను ప్రేమించగలను" అనుకున్నాడు ఒలేనిన్. ఆ చీకటడవిలో వాళ్ళిద్దరూ యింటికేసి నడుస్తూ పోతూవుంటే ఒక బలీయమైన నూతన కరుణార్ద్రపూరిత అనుభూతి అతన్ని ముంచేసింది. లుకాష్కా కూడా ఆనందంగా వున్నాడు. ఆ విభిన్నమైన యువకుల మధ్య ప్రేమలాంటి దేదో వున్నట్టనిపించింది. ఒకళ్లకేసి ఒకళ్లు చూసుకున్న ప్రతిసారీ వాళ్ళకి నవ్వాలనిపించింది.

"యే గేటుగుండా వెడతావు?" ఒలేనిన్ అడిగాడు.

"మధ్యవాటిగుండా. కాని మీతోటి బాడవ దాకా వస్తా. దాని తర్వాత మీ కింక భయం వుండదు."

ఒలేనిన్‌కి నవ్వొచ్చింది.

"నేను భయపడుతున్నా ననుకున్నావా? వెనక్కి వెళ్లిపో, చాలు, నేనొక్కణ్ణీ వెళ్లగలను."

"ఫరవాలేదు. కాని నేను చేసేదేముంది? భయపడకుండా యెలా వుంటార్లెండి? మాకే భయం వేస్తుంది" అన్నాడు లుకాష్కా, ఒలేనిన్ స్వాభిమానాన్ని కుదుట బెట్టేందుకు. అతను నవ్వాడు కూడా.

"అయితే నాతో రా, కాసేపు కబుర్లు చెప్పుకుని చుక్కవేద్దాం. పొద్దున్నే వెనక్కి పోదువు గాని."

"నాకు యీ రాత్రి గడపడానికి చోటు లేదనుకున్నారేంటి?" అని నవ్వాడు లుకాష్కా. "కాని కార్పోరల్ నన్ను వెనక్కి రమ్మన్నాడు."

"కిందటి రాత్రి నీ పాట విన్నాను. నిన్ను చూశాను కూడా...."

"అయ్..." లుకాష్కా తల పంకించాడు.

"నీకు పెళ్లవబోతోందట నిజమా?" అడిగాడు ఒలేనిన్.

"అమ్మ నన్ను పెళ్లిచేసుకోమంటోంది. కాని నేనింకా ఓ గుర్రం కూడా సంపాదించలేదు."

''నువ్వు ఖాయమైన ఉద్యోగంలో లేవూ?''

''అబ్బే లేను! నేనీ మధ్యనే చేరాను. నాకింకా ఓ గుర్రమూ లేదు, సంపాదించనూ లేదు. అందుకనే పెళ్లి జరగడం లేదు.''

''గుర్రాని కెంతవుతుంది?''

''నది అవతల నిన్న ఓ దాన్ని బేరమాడుతున్నాం. అరవై వెండి రూబుళ్లు చాలవట, అది నోగాయ్ గుర్రమే అయినా.''

''నువ్వు వచ్చి నా డ్రాబంట్‌గా వుంటావా!'' (డ్రాబంట్ అంటే దండయాత్రలో వున్నప్పుడు అఫీసరుకి జతగా వుండే ఒక రకం సైనిక పరిచారకుడు.) ''నేను నీ కది యేర్పాటు చేసి ఒక గుర్రం యిస్తాను'' అన్నాడు ఒలేనిన్ హఠాత్తుగా. ''నిజానికిప్పుడు నాకు రెండున్నాయి, రెండు గుర్రాలు అవసరం వుండదు.''

''రెండు అవసరం కాదా?'' లుకాష్కా రెట్టించాడు, నవ్వుతూ. ''మీరు నాకు బహుమానం యెందుకివ్వాలి? దేవుడి దయవల్ల మా అంతట మేం సంపాదించగలం.''

''వద్దా, నిజమే? డ్రాబంట్‌గా వుండవా?'' అన్నాడు ఒలేనిన్, లుకాష్కాకి గుర్రం యివ్వాలని తన బుర్రకి తట్టినందుకు సంతోషంగా. యెందుకనో తెలియకపోయినా యిబ్బందిగా అయోమయంగా అనిపించింది. మాట్లాడబోయినా యేం చెప్పాలో తోచింది కాదు.

లుకాష్కాయే మొదలెట్టాడు.

''రష్యాలో మీకు సొంత యిల్లు వుందా?'' అడిగాడు.

ఒలేనిన్ తనకి ఒకటి కాదు యెన్నో యిళ్లున్నాయని చెప్పకుండా వుండలేకపోయాడు.

''మంచి యిల్లా? మా యింటికంటే పెద్దదా?'' హుషారుగా అడిగాడు లుకాష్కా.

''యింకా పెద్దది. పదింతలు పెద్దది. మూడంతస్థులు'' అన్నాడు ఒలేనిన్.

"మీకున్న లాంటి గుర్రాలున్నాయా?"

"నాకు వంద గుర్రాలున్నాయి. ఒకోటీ మూడు నాలుగు వందల విలువ చేసేవి. కాని మీ గుర్రాల్లాంటివి కావు. మూడు వందల వెండి రూబుళ్ళు! పరిగెత్తే గుర్రాలు.... కాని నాకు యిక్కడి గుర్రాలే చాలా యిష్టం."

"సరే, యిక్కడికి మీ అంతట మీరే వచ్చారా లేక వాళ్ళు పంపారా?" అన్నాడు లుకాష్కా యింకా నవ్వుతున్నట్టు కనిపిస్తూ. "అదిగో, అక్కడే మీరు దారి తప్పింది. మీరు కుడి వేపు తిరగాల్సింది" అన్నాడతను, వాళ్ళు వెడుతూ వున్న దారి చూపించి.

"నా అంతట నేనే వచ్చాను. మీ ప్రాంతాన్ని చూసి దండయాత్ర చెయ్యాలని వచ్చాను" బదులు చెప్పాడు ఒలేనిన్.

"నేనే రోజునేనా దండయాత్రకి పోతాను" అన్నాడు లుకాష్కా. "అదుగో గుంటనక్కల కూతలు వినిపిస్తున్నాయా?" అడిగాడు, వింటూ.

"అది సరే గాని ఓ మనిషిని చంపినందుకు నీకు భయం వెయ్యదూ?" అడిగాడు ఒలేనిన్.

"అందులో భయపడ్డానికి యేముంది? నాకు దండయాత్రకి పోవాలని వుంది. వెళ్ళి తీరుతాను" రెట్టిస్తూ అన్నాడు లుకాష్కా.

"బహుశా మనిద్దరం కలిసిపోతామేమో. మా పటాలం సెలవల ముందు పోతుంది, మీ దళం కూడా."

"దేని కోసం యిక్కడికి వచ్చారు? మీకు యిల్లు, గుర్రాలు, నౌకర్లు, అన్నీ వున్నాయి. నేనే మీలా వుంటేనా, యేమీ చెయ్యను. మజాగా వుండటం తప్ప! మీ హోదా యేమిటి?"

"నేనో కేడెట్‌ని. కాని నన్ను ఆఫీసరుగా సిఫార్సు చేసారు."

"అబ్బ, మీరు చెప్పేది బడాయి కాకుండా నిజమే అయి, నేను మీ స్థానంలో వుండివుంటేనా చచ్చినా యిల్లు వదిలేవాణ్ణి కాను!

నిజం, యెక్కడికీ యెప్పుడూ పోయి వుండేవాణ్ణి కాను. మీతో వుండటం మీకిష్టమేనా?''

''ఆహా! దివ్యంగా'' అన్నాడు ఒలేనిన్.

యీ రకంగా మాట్లాడుకుంటూ వాళ్ళు వూరు చేరకముందె బాగా చీకటి పడింది. వాళ్ళనింకా ఆ అడవి చీకటి చుట్టుముట్టే వుంది. వృక్షశిఖరాల్లో గాలి మూలుగుతోంది. గుంటనక్కలు, వాళ్ళకి చేరువలోనే, కూస్తూ, అరుస్తూ, మూలుగుతూ వున్నట్టనిపించింది. కాని వాళ్ళ యెదర వూళ్ళోనుంచి ఆడవాళ్ళ గొంతుకలూ, కుక్కల అరుపులూ అప్పటికే వినిపిస్తున్నాయి. యిళ్ళ స్థూలరేఖలు స్పష్టంగా కనబడు తున్నాయి. దీపాలు వెలుగుతున్నాయి. ప్రత్యేకం పిడకల పొగతో గాలి అంతా నిండిపోయింది. ఆ గ్రామంలోనే తన యిల్లు వున్నట్టూ తన సంసారం, ఆనందం, అంతా వున్నట్టూ యింకెక్కడా తను, ఆ కోసక్ గ్రామంలో గడిపినంత ఆనందమయ జీవితం గడపనట్టూ ఒక అను భూతి ఒలేనిన్‌కి కలిగింది, ముఖ్యంగా ఆ రాత్రి. యే మనిషి అన్నా యెంతో యిష్టమనిపించింది, ముఖ్యంగా ఆ రాత్రి లుకాష్కా అంటే అభిమానం కలిగింది. వాళ్ళు యింటికి చేరుకోగానే లుకాష్కాకి ఆశ్చర్యం కలిగేటట్టుగా ఒలేనిన్ శాలలోనుంచి స్వయంగా గుర్రాన్ని తీసుకువచ్చి అతనికి యిచ్చేశాడు. దాన్నతడు గ్రోజ్నయాలో కొన్నాడు. తను మామూలుగా స్వారీ చేసేది కాదు, యింకోటి. వయసులో వున్నది కాకపోయినా పనికి మాలింది కాదు.

''నా కెందుకూ మీరు బహుమతీ యివ్వడం? నేను యింకా మీకేమీ చెయ్యలేదే'' అన్నాడు లుకాష్కా.

''అబ్బే, యిదేముంది, తీసుకో. ఓ రోజున నువ్వు నాకు బహుమతీ యిద్దువుగాని.... శత్రువుమీదికి యిద్దరమూ కలిసే దాడికి వెడదాం'' అన్నాడు ఒలేనిన్.

లుకాష్కా అయోమయంలో పడ్డాడు.

''కాని మీ ఉద్దేశం యేమిటో? ఓ గుర్రం అంటే చాలా ఖరీదు, తెలుసా?'' అన్నాడతను గుర్రంకేసి చూడకుండానే.

''తీసుకో, తీసుకో! తీసుకోకపోతే నేను చిన్నబుచ్చుకుంటాను. వస్యూష! యీ బూడిదరంగు గుర్రాన్ని యితనింటికి తీసుకెళ్లు.''

లుకాష్కా గుర్రం మెడతాడు పట్టుకున్నాడు.

''సరే మీకు కృతజ్ఞుణ్ణి. అసలు నేనిలాంటిది వూహించను కూడా లేదు.''

పన్నెండేళ్ల కుర్రాడిలాగా ఒలేనిన్ మురిసిపోయాడు.

''దీన్ని యిక్కడ కట్టివెయ్యి. చాలా మంచి గుర్రం. గ్రోజ్నియాలో కొన్నాను. అద్భుతంగా దౌడు తీస్తుంది! వన్యూష, మాకు కొంచెం చిఖిర్ తెచ్చిపెట్టు. రా, యింట్లోకి రా.''

వైన్ వచ్చింది. లుకాష్కా కూచుని వైన్ పాత్ర అందుకున్నాడు.

''దేవుడు మేలు చేస్తే మీకు బదులుతీర్చే దారి దొరుకుతుంది నాకు'' అన్నాడు వైన్ తాగుతూ. ''మీ పేరేమిటి?''

''ద్మిత్రియ్ అంద్రేయిచ్.''

''బాగుంది, ద్మిత్రియ్ అంద్రేయిచ్‌గారూ, దేవుడు మిమ్మల్ని చల్లగా చూస్తాడు. మనం కునాక్‌లుగా వుందాం. మీరు తప్పకుండా ఓ సారి మా యింటికి దయచెయ్యాలి. మేం శ్రీమంతులం కాదనుకోండి, కాని ఓ కునాక్‌ని యెలా ఆదరించాలో మాకు తెలుసు. నేను అమ్మతో చెబుతా. మీకేం కావాల్సి వచ్చినా — గడ్డ మీగడ, ద్రాక్షపళ్లు. మీరు సైనిక చౌకీకి వస్తే వేటకి మీతో రావడానికి మీ నౌకర్నే నేను, నది దాటిపోడానికి, మీ యిష్టం యెక్కడికేనా సరే! యిదుగో నిన్ననే యెలాంటి అడవిపందిని చంపాను! మా కోసక్కులందరికీ పంచేశానండీ. నాకు గనక తెలిసి వుంటేనా, మీకే యిచ్చేసి వుండేవాణ్ణి.''

''సర్లే, సర్లే దన్యవాదాలు! కాని గుర్రాన్ని బండికి కట్టకు. యెప్పుడూ యిది బండి లాగలేదు.''

“బండికి కట్టడం యెందుకు? యింకోటుంది, మీకు చెబుతా, మీ కిష్టమైతే” అన్నాడు లుకాష్కా గొంతు తగ్గిస్తూ. “నాకో కునాక్ వున్నాడు, గిరీఖాన్. వాళ్లు కొండలనుంచి వచ్చేచోట రోడ్డు వార తనతో మాటు వుండమన్నాడు నన్ను. యిద్దరం వెడదామా? నేను మిమ్మల్ని దగా చెయ్యను. నేను మీ మురిద్*గా వుంటాను.

“అలాగే వెడదాం, ఓ రోజున వెడదాం.”

లుకాష్కా తన ప్రశాంతతని తిరిగి పొందినట్టే వుంది. తనపట్ల ఒలేనిన్ అభిప్రాయాన్ని గ్రహించినట్టూ వుంది. అతని నెమ్మదితనమూ, ప్రవర్తనలోని నిమ్మళమూ, ఒలేనిన్‌కి ఆశ్చర్యం కలిగించాయి, అతని కది అసౌకర్యంగా అనిపించింది. వాళ్లు చాలా సేపు మాట్లాడుకున్నారు. లుకాష్కా సుష్ఠుగా తాగినా మైకం లేకుండా (అతనెప్పుడూ మైకంలో పడడు) లేచి ఒలేనిన్‌తో కరచాలనం చేసి అతన్ని వదిలి వెళ్లేటప్పటికి చాలా ఆలస్యమైంది. అతనేం చేస్తాడో చూద్దామని ఒలేనిన్ కిటికీ గుండా చూశాడు. లుకాష్కా తలకిందకి ఒరగేసుకుని మెల్లిగా అవతలికి వెళ్లాడు. గుర్రాన్ని గేటు అవతలకి నడిపించుకుని వెళ్లి లకస్మాత్తుగా తల పంకించాడు. పిల్లిలాగా దాని వీపుమీదకి యెగిరాడు. మెడతాళ్ల దగ్గర్నుంచి కళ్లెం పోగు చేసుకున్నాడు. ఒక్క కేక వేసి దాన్ని వీధిలోకి దౌడు తీయించాడు.

లుకాష్కా తన సంతోషాన్ని మర్యాంకాతో పంచుకోడానికి పోతాడ నుకున్నాడు ఒలేనిన్. కాని అతనలా చెయ్యలేదు. అయినా అంతకు ముందెన్నడూ లేనంతగా తన మనసు తేలిక పడ్డట్టు భావించాడు. పసిపిల్లవాడిలాగా సంబరపడ్డాడు. తన గుర్రాన్ని లుకాష్కా కిచ్చేసానే కాదు, యెందుకు అలా చేసిందీ, తన నూతన ఆనందసిద్ధాంతం యేమిటైందీ వన్యూషకి చెప్పకుండా నిబ్బరించుకోలేకపోయాడు.

---

* మురిద్: యిక్కడ నేర్పేవాడు అని అర్థం. — సం.

వస్యూషకి యీ సిద్ధాంతం నచ్చలేదు. లర్జాం ఇల్ నెపా* కాబట్టి అదంతా చెత్త అన్నాడు.

లుకాష్క యింటికి స్వారీ చేసుకుపోయాడు. గుర్రంమీదనుంచి దుమికాడు. దాన్ని తల్లికి అప్పజెప్పాడు. దాన్ని సామూహిక కోసక్ మందతో వదిలెయ్యమన్నాడు. తను ఆ రాత్రికే సైనిక చౌకీకి తిరిగి పోవాల్సివుంది. అతని మూగ అక్క గుర్రం బాధ్యత తీసుకుంది. ఆ గుర్రం యిచ్చినతన్ని తను చూస్తే అతని కాళ్లమీద మోకరిల్లుతానని సౌంజ్ఞల ద్వారా తెలియజేసింది. కొడుకు చెప్పిన కథ విని ఆ ముసలావిడ తల ఆడించిందంతే. తన మనసులో మాత్రం వాడా గుర్రాన్ని కాజేసి వుంటాడని తీర్మానించుకుంది. అంచేత ఆ గుర్రాన్ని తెల్లవారే రోపుగానే మందలోకి తీసుకుపొమ్మని ఆ మూగపిల్లకి చెప్పింది.

లుకాష్క వంటరిగా చౌకీకి వెళ్లాడు, ఒలేనిన్ చేసిన పనిని గురించి ఆలోచించుకుంటూ. ఆ గుర్రం అంత మంచిది కాదని అనుకున్నాడు. కాని దాని ఖరీదు హీనపక్షం నలభై రూబుళ్లు వుంటుంది. ఆ బహుమానం రావడం సంతోషంగానే వుంది. కాని దాన్ని తన కెందుకిచ్చిందీ యేమాత్రమూ అర్థం కాలేదు, దాంతోటి కనీస కృతజ్ఞతా భావం కూడా కలగలేదు. పైపెచ్చు, తనపట్ల ఆ కేడెట్‌కి దురుద్దేశాలేవో వున్నాయనే అస్పష్టమైన అనుమానాలు మనసంతా నిండిపోయాయి. ఆ ఉద్దేశాలేమిటో అతను చెప్పలేకపోయాడు. కాని ఒక పరాయివాడు నలభై రూబుళ్ల విలువగల గుర్రాన్ని వూరికే, ఒట్టి దయతో, యిచ్చాడన్న దానికీ సమాధాన పడలేకపోయాడు. అది అసంభవంగా కనిపించింది. వాడేమన్నా తాగి మైకంలో వున్నా అర్థం చేసుకోవచ్చు! వాడేదో దాంబికం వెలగబెట్టాడ నుకోవచ్చు. కాని ఆ కేడెట్ తెలివిగానే వున్నాడు. అంచేత తనచేత యేదో చెడ్డ పని చేయించాలని లంచం యివ్వాలను

---

* డబ్బు లేదు (ఫ్రెంచి). — సం.

కుని వుంటాడు. "అబ్బ, వెధవ గొడవ!" అనుకున్నాడు లుకాష్కా. "నాకు గుఱ్ఱం వచ్చింది కదా, తర్వాత చూద్దాం. నేనేం తెలివితక్కువ వాణ్ణా. యెవరు యెవర్ని మోసం చేస్తారో చూద్దాం" అనుకున్నాడతను. తన జాగ్రత్తలో తను వుండాల్సిన అవసరం వుంది. అంచేత ఒలేనిన్ పట్ల ప్రతికూల అభిప్రాయాలు యేర్పాటు చేసుకున్నాడు. ఆ గుఱ్ఱం తనకి యెలా వచ్చిందీ యెవరికీ చెప్పలేదు. కొందరికేమో కొన్నానని చెప్పాడు. కొందరికేమో దాటవేశాడు. యేమైనా త్వరలోనే వూళ్లో నిజం పాక్కింది. లుకాష్కా తల్లీ, మర్యాంకా, ఇల్యా వసీల్యెవిచ్, మిగతా కోసక్కులూ ఒలేనిన్ ఒత్తి పుణ్యానికి యిచ్చిన బహుమతీ గురించి విన్నాక గందరగోళ పడిపోయారు. ఆ కేడెట్ అంటే తమ జాగ్రత్తలో తాము వుండ నారంభించారు. వాళ్ల భయాలెలా వున్నా అతని చర్య వాళ్లలో అతని 'నిష్కాపట్యానికీ,' సంపదకీ పెద్ద గౌరవ భావాన్ని కలగజేసింది.

"విన్నావా, ఇల్యా వసీల్యెవిచ్ యింట్లో కాపరముంటున్న ఆ కేడెట్ యాభై రూబుళ్ల గుఱ్ఱాన్ని లుకాష్కాకి అలా విసిరేసాట్ట? వాడు ఐశ్వర్యవంతుడై వుండాలి..." అన్నారొకరు.

"ఆఁ, విన్నా. వాడికి వీడు గొప్ప సేవ చేసివుంటాడు. యేం జరుగు తుందో చూద్దాం. ఓహ్, ఆ ఉర్వన్‌ది యేమదృష్టం!" బదులు చెప్పాడింకొకడు ముక్తసరిగా.

"ఆ కేడెట్లు దొంగముండా కొడుకులు!" అన్నాడు మూడోవాడు. "వాడే కొంపకో అగ్గి పెట్టెయ్యకపోతే అడుగు!"

## 23

ఒలేనిన్ జీవితం విసుగొచ్చేటంత క్రమబద్ధంగా సాగిపోతోంది. తన పై అధికారులతోగాని, సమానస్థులతోగాని అతి తక్కువ సంబంధాలే వుంటున్నాయి. కాకసస్‌లో ధనికుడైన కేడెట్ హోదా యీా

విషయంలో ప్రత్యేకమైన సౌకర్యంగానే వుంది. అతన్ని పనిలోకిగానీ, శిక్షణలోకిగానీ పంపటం లేదు. దండయాత్రలో చేరిందానికి ప్రతిఫలంగా ఆఫీసరు హోదాకి సిఫార్సు చేశారు. యీలోపున అతను కడుపులో చల్ల కదలకుండా కూర్చున్నాడు. ఆఫీసర్లతన్ని దొరలా చూశారు. అతనిపట్ల హుందాగా ప్రవర్తించారు. అతనికి సంబంధించి పేకాడ్డమూ, ఆఫీసర్లతో గానా బజానా ఆకర్షవంతంగా లేవు. అతనికి పటాలంలో వున్నప్పుడు ఆ అనుభవం వుండింది. అందుకని అతను ఆ వూళ్లో ఆఫీసర్ల సాహచర్యాన్నీ వాళ్ల జీవితాన్నీ తప్పించుకున్నాడు. ఓ కోసక్ గ్రామంలో విడిది చేసిన ఆఫీసర్ల బతుకులకి యెప్పట్నుంచో ఓ కచ్చితమైన పద్ధతి యేర్పాటైపోయింది. దుర్గంలో వుండే ప్రతి కేడెటూ, ఆఫీసరూ, రోజూ సారా తాగి, పేకాడి దండయాత్రలో వున్నందుకు లభించిన బహుమానాల గురించి అనుకున్నట్టే, కోసక్ గ్రామంలో కూడా రోజూ గృహస్థులతో చిఖిర్ తాగడమూ, ఆడపిల్లలకి తేనే, తినుబండారాలూ యివ్వడమూ, కోసక్ ఆడాళ్లమ్మట పడ్డమూ, ప్రేమలో పడ్డమూ, యెప్పుడేనా పెళ్లి చేసుకోవడమూ వుంటుంది. ఒలేనిన్ యెప్పుడూ తన దారి తను యేర్పాటు చేసుకున్నవాడే. నలిగిన దారులంటే అతనికి తెలియకుండానే అభ్యంతరం వుండేది. అతను యిక్కడ కూడా కాకసస్ ఆఫీసర్ల జీవితపు గాడిలో పడలేదు.

తెల్లవారగానే లేవడం అతనికి సహజంగానే వచ్చేసింది. టీ తాగిన తర్వాత తన గుమ్మంలోనుంచి పర్వతాల్నీ, ప్రభాతాన్నీ, మర్యాంకానీ మెచ్చుకుంటాడు. తర్వాత చిరిగిన యెద్దుతోలు కోటూ, నానబెట్టిన పచ్చి చర్మపు చెప్పులు తొడుక్కుంటాడు. పటకాలో బాకు దోపుకుని, తుపాకీ, సంచీలో కొంచెం భోజనం, సిగరెట్లూ తీసుకుంటాడు. కుక్కని పిలుస్తాడు. అయినా అయిన కొంచెం సేపటికి పూరవతరి అడివిలోకి బయల్దేరేవాడు. సాయంత్రం యేడు గంటలకి, అయిదారు అడివికోళ్లు పటకా దగ్గర వేలాడుతూ వుండగా (ఒకో అప్పుడు

యింకో జంతువుతో) అలిసిపోయి ఆకలితో తిరిగి వస్తాడు. సంచీలో తన సిగరెట్లూ, భోజనం అలానే వుండిపోతాయి. అతని సంచీలోని సిగరెట్లలాగా అతని బుర్రలోని ఆలోచనలుంటే ఆ పధ్నాలుగు గంటలూ ఒక్క ఆలోచన కూడా అక్కణ్ణుంచి కదల్లేదని చూడచ్చు.

మానసికంగా ఉల్లాసంగా, శక్తివంతంగా, పూర్తి ఆనందంతో తిరిగి వస్తాడు. అంత సేపూ యేం ఆలోచిస్తున్నాడో అతను చెప్పలేడు. అతని మనసులో సంచరించిపోయేవి వూహలా, జ్ఞాపకాలా, కలలా? తరచుగా ఆ మూడూనూ. సగత విడిచి, దేన్ని గురించి ఆలోచిస్తున్నానూ అనుకుంటాడు. ఒక కోసక్‌లాగా ద్రాక్షతోటలో భార్యతో పనిచేస్తున్నట్టు భావించుకుంటాడు. లేకపోతే కొండల్లోని అబ్రేక్కులాగా, లేకపోతే తననుంచి పారిపోయే అడివి పందిలాగా. అంత సేపూ అడివి కోడి కోసమనో, అడివిపంది కోసమనో, లేకపోతే జింక కోసమనో జాగ్రత్తగా చూస్తూ వుంటాడు.

సాయంత్రం యెరోష్క మామ భాయంగా అతనితో కూర్చుంటాడు. వన్యూష ఓ కూజా చిఖిర్ తెస్తాడు. వాళ్లు నిదానంగా మాట్లాడు కుంటారు, తాగుతారు. అప్పుడు సెలవు తీసుకుని తృప్తిగా నిద్రకు పక్రమిస్తారు. మర్నాడు మళ్లీ వేటకి పోతాడు. మళ్లీ ఆరోగ్యవంతం గానే అలిసిపోతాడు, వాళ్లు మళ్లీ కబుర్లు చెప్పుకుంటూ కూర్చుంటారు, పూటుగా తాగుతారు, మళ్లీ ఆనందంగా వుంటారు. ఒక్కొక్కప్పుడు ఓ సెలవు రోజునో, విశ్రాంతి రోజునో, ఒలేనిన్ రోజంతా యింటి దగ్గరే గడుపుతాడు. అలాంటి రోజుల్లో అతని ముఖ్యమైన పని మర్యాంకాని చూడ్డం, ఆమె ప్రతి కదలికనీ తనకి తెలియకుండానే తన కిటికీనుంచో గుమ్మంనుంచో అత్యాశగా చూపులతో అనుసరిస్తాడు. మర్యాంకాని అభిమానించి ప్రేమించాడు (అలా అని అతననుకున్నాడు) తను ఆ పర్వతాల సౌందర్యాన్నీ, ఆకాశపు సౌందర్యాన్నీ ప్రేమించినట్టే; ఆమెతోటి యే సంబంధమూ వుండాలనే ఆలోచనలేకుండానే. తనకీ

ఆమెకీ మధ్య ఆ కోసక్ లుకాష్కాకీ ఆమెకీ వున్నలాంటి సంబంధాలు, యింకా ఆమాటకొస్తే డబ్బున్న ఆఫీసర్లకీ మిగతా కోసక్ ఆడపిల్లలకీ తరుచుగా వున్నలాంటి సంబంధాలు వుండలేవని అతనికి అనిపించింది. తను తన తోటి ఆఫీసర్లమాదిరీ ప్రయత్నిస్తే తన పూర్తి భావనాత్మక సంతోషాన్ని పోగొట్టుకుని బాధల అగాధమూ, నిరాశా, పశ్చాత్తాపమూ బదులు తెచ్చుకోవాల్సి వుంటుందని అనిపించేది. దీనికి తోడు, ఆమెకి సంబంధించి, తను ఒక ఆత్మపరిత్యాగ విజయాన్ని అప్పటికే సాధించాడు. అది అతనికి యెంతో సంతోషాన్ని యిచ్చింది. అన్నిటికన్నా మర్యాంకా అంటే అతనికి భయంవేసింది. యెట్టి పరిస్థితుల్లో కూడా ఆమెతో ప్రేమని గురించి తేలికగా మాట్లాడే సాహసం చేసి వుండేవాడు కాదు.

ఒక సారి వేసవిలో ఒలేనిన్ యింటిదగ్గరే కూర్చుని వుండగా, అనుకోకుండా ఒక మాస్కో పరిచయస్థుడు, తను నాగరిక సమాజంలోకి ప్రవేశించినప్పుడు కలుసుకున్న యువకుడు, తగిలాడు.

''ఓహో, మాషే*, ప్రియమైన మిత్రమా, నువ్విక్కడ వున్నావని విన్నప్పుడు యెంత సంబరపడ్డాను!'' అతను తన మాస్కో ఫ్రెంచిలో మొదలెట్టాడు, తన సంభాషణల్లో ఫ్రెంచి మాటలు దొర్లిస్తూ. ''వాళ్లన్నారు 'ఒలేనిన్' అని. యే ఒలేనిన్? నా కెంత సంతోష మైందో!... చూడు విధి మనల్నిద్దర్నీ యిక్కడ కలిపింది! సరే యెలా వున్నావ్ యేమిటీ? ఆఁ!''

బెలేత్స్కీ రాకుమారుడు తన కథంతా చెప్పాడు: తను తాత్కాలికంగా యెలా పటాలంలో చేరిందీ, సర్వసైన్యాధ్యక్షుడు తన్ని యెలా తన కార్యాలయంలోకి తీసుకున్నదీ, దండయాత్ర తర్వాత, వ్యక్తిగతంగా తనకి పెద్ద పట్టకపోయినా, తను యెలా ఆ ఉద్యోగంలో చేరేదీ, అన్నీ.

---

* ప్రియమైన (ఫ్రెంచి). — సం.

"యిక్కడ, యీ గుంటలో వుంటూ కనీసం, ఉద్యోగంలో ప్రమోషన్ సంపాదించాలి — ఓ శిలువ సంపాదించాలి — లేదా ఒక గొప్ప కొలువు — రక్షక దళానికి బదిలీ కావాలి. అది తప్పనిసరి, నా కోసం కాదనుకో, కాని నా బంధుమిత్రుల కోసం. రాకుమారుడు నన్ను బాగా ఆదరించాడు. సరసమైన వాడులే" అన్నాడు బెలేత్‌స్కీ. అతను యెడతెరిపి లేకుండా చెబుతూనే వున్నాడు: "నా పేరు సెయింట్ అన్నా శిలువకి సిఫార్సు చేశారు, ఆ దండయాత్రకిగాను. నేనిక్కడ కొద్ది రోజులు వుంటాను, మనం దాడి ఆరంభించేదాకా. యిక్కడ మహా భేషుగ్గా వుంది. యేం ఆడాళ్ళు! బాగుంది, నువ్వెలా కాలక్షేపం చేస్తున్నావ్? మన కాప్టెన్, స్టార్‌త్సెవ్, నీకు తెలుసుగా, మంచివాడే, మొద్దు వెధవ, చెప్పాడు నాకు.... ఆఁ, అతను చెప్పాడు నువ్వు పరమ ఆటవికునిలాగా బతుకుతున్నావని, యెవర్నీ చూడకుండా! నువ్వు యిక్కడున్న మన సైనిక ఆఫీసర్లతోటి కలవదలచుకోకపోవడం నేను అర్థం చేసుకోగలను. మనిద్దరం ఒకళ్ళకొకళ్ళం ఆసరా వుంటామంటే నాకు మహదానందంగా వుంది. నేను కార్పొరల్ యింటి దగ్గర బస చేశాను. అక్కడ యెలాంటి పిల్ల వుందనుకున్నావ్, ఉస్తింకా! పిచ్చెక్కించేస్తుందనుకో."

యింకా, యింకా ఫ్రెంచి, రష్యన్ పదాలు దొర్లిపోతున్నాయి, ఆ ప్రపంచంనుంచి, ఒలేనిన్ వదిలి పెట్టేసాననుకున్న ప్రపంచంనుంచి.

బెలేత్‌స్కీని గురించిన సాధారణ అభిప్రాయం యేమిటంటే అతను సరదా అయినవాడని. బహుశా అయివుండొచ్చు; అతని ముఖం సొగసుగా, సాధువుగా వున్నా, ఒలేనిన్‌కి అతనంటే చెడ్డ ప్రతికూలం వుంది. తను వదిలేసిన దుర్మార్గం అంతా అతను కక్కుతూ వున్నట్టనిపించింది ఒలేనిన్‌కి. అన్నిటికంటే అతనికి చిరాకనిపించింది, తను అతన్ని, ఆ ప్రపంచంనుంచి వచ్చిన అతన్ని యెదిరించలేదు — తనకా శక్తి లేదు. తను వదిలిపెట్టిన ఆ పాత ప్రపంచానికి తనమీద ప్రబలమైన హక్కు

వున్నట్టు అతనికి అనిపించింది. బెలేత్‌స్కీమీదా, తనమీదా కూడా ఒలేనిన్‌కి ఆగ్రహం వచ్చింది. అయినా అయిష్టంగానే తన సంభాషణలో ఫ్రెంచి పదాలు దొర్లించాడు. సర్వసైన్యాధ్యక్షుడిమీదా, తన మాస్కో పరిచయాలమీదా ఆసక్తి చూపించాడు. తనూ, బెలేత్‌స్కీనే ఆ కోసక్ గ్రామంలో ఫ్రెంచి మాట్లాడే యిద్దరూ కాబట్టి తోటి ఆఫీసర్ల గురించీ, కోసక్కుల గురించీ తిరస్కారంగా మాట్లాడేడు. బెలేత్‌స్కీతో స్నేహంగా వున్నాడు, అతన్ని చూడ్డానికి వస్తానని మాట యిచ్చి; తనని చూడ్డానికి రమ్మని ఆహ్వానించీ. యేమైనా ఒలేనిన్ తనకిగా తను అతన్ని చూడ్డానికి వెళ్లలేదు.

వన్యూష బెలేత్‌స్కీని మెచ్చుకున్నాడు, అతను సిసలైన పెద్దమనిషని.

వెంటనే బెలేత్‌స్కీ కోసక్ గ్రామంలో వుండే ధనిక ఆఫీసరు జీవితం లాంటి మామూలు జీవితం ప్రారంభించాడు. ఒక నెల రోజుల్లోనే, ఒలేనిన్ కళ్ల ముందే అతనా వూరికి పాతకాపులాగా తయారయాడు. ముసలాళ్లచేత తాగించాడు. సాయంకాలాల్లో పార్టీలు యేర్పాటు చేశాడు. ఆడపిల్లలు యిచ్చే పార్టీలకి తనూ వెళ్లాడు. తన విజయాల గురించి గొప్పలు చెప్పేడు. అతను యెంత దూరం వెళ్లాడంటే, యెందుకో తెలియకుండానే, ఆడాళ్లూ, అమ్మాయిలూ అతన్ని తాత అని పిలవడం మొదలెట్టారు. మద్యాన్నీ, మగువలనీ మన్నించే మనిషంటే అర్థం చేసుకోగల ఆ కోసక్కులు అతనికి అలవాటుపడిపోయారు. ఒలేనిన్‌ని కంటే యెక్కువ అతన్ని అభిమానించారు కూడా. ఒలేనిన్ మాత్రం వాళ్లకి అంతుబట్టనే లేదు.

## 24

ఉదయం అయిదయింది. వన్యూష గుమ్మంలో సమొవార్ వెలిగిస్తున్నాడు. దాన్ని విసరడానికి పొడుగాటి బూటు పై భాగాన్ని ఉపయోగించాడు. ఒలేనిన్ టెరెక్‌లో స్నానం చెయ్యడానికి అప్పటికే

గుర్రంమీద వెళ్ళిపోయాడు. (యీ మధ్యనే అతనో కొత్త సరదా కనిపెట్టాడు. అది గుర్రాన్ని నదిలో స్నానం చేయించడం.) యజమానురాలు అవతలి యింట్లో వుంది. నిప్పు అంటించేటప్పుడు లేచే దట్టమైన నల్లటి పొగ పొగగొట్టంలోనుంచి వచ్చింది. పిల్ల శాలలో గేదె పాలు పితుకుతూ వుంది. ''ఒక్క క్షణం కుదురుగా వుంచోదు, దరిద్రపు ముండ!'' అసహనంగా వున్న ఆ పిల్ల గొంతు వినిపించింది. దాన్ననుసరించే లయబద్ధంగా పాలు పితికే చప్పుడు వినిపించింది.

యింటి కెదురుగా వున్న వీధిలోనుంచి గుర్రం గిట్టల చప్పుడు టకటకా వినిపించింది. చక్కటి ముదురు ధూసర వర్ణపు గుర్రంమీద, జీను లేకుండా, స్వారీ చేస్తూ వచ్చాడు ఒలేనిన్, గేటు దగ్గరికి. ఆ గుర్రం యింకా తడిగా మెరుస్తూ వుంది. చుట్టూ యెర్రటి రుమాలు చుట్టుకున్న మర్యాంకా పొందికైన తల, శాలలోనుంచి ప్రత్యక్షమైంది, మరుక్షణం అదృశ్యమైంది. ఒలేనిన్ యెర్రటి సిల్కు చొక్కా, పట్టాతో చుట్టబడి బాకు వున్న తెల్లటి సర్కేషియన్ కోటూ తొడుక్కుని పొడుగాటి టోపీ వేసుకున్నాడు. తడిసి, బలిష్ఠంగా వున్న గుర్రంమీద దర్జా కొంచెం తెలిసేటట్టుగా కూర్చున్నాడు. తుపాకీ వెనక పట్టుకుని గేటు తెరవడానికి వంగాడు. అతని జుట్టు యింకా తడిగానే వుంది. అతని ముఖం పడుచుదనంలోటీ ఆరోగ్యంతోటీ ప్రకాశిస్తోంది. తను అందంగా చలాకీగా జిగిత్‌లాగా వుంటానని అతను భావించుకున్నాడు. కాని అతను పొరపాటు పడ్డాడు. అనుభవజ్ఞుడైన కాకేషియన్ కెవరికేనా అతనింకా సైనికుడే.

ఆ పిల్ల తల యివతలికి పెట్టడం గమనించి, అతను సుతారంగా వంగి గేటు తెరిచి, గుర్రం కళ్ళెం బిగించి, కమ్చీ ఝుళిపించి, ముంగిట్లోకి ప్రవేశించాడు. ''టీ తయారైందా, వన్యూషా?'' అని హుషారుగా అరిచాడు, పశువులశాల కేసి చూడకుండా. అతని అందమైన గుర్రం వెనకకాళ్ళు దగ్గరగా చేర్చి, కళ్ళెం లాగుతూ, ప్రతి

కంఠరమూ కదిలిస్తూ, ఆ పెరట్లోని గట్టి నేలమీద కుప్పి గంతులు వేస్తూ, కంచెమీదనుంచి యెగరడానికి యెలా తయారుగా వుందో చూసి అతను మురిసిపోయాడు. "సె ప్రే"* అన్నాడు వన్యూష. అందమైన మర్యాంకా యింకా శాలలోనుంచి చూస్తూనే వుందనిపించింది ఒలేనిన్‌కి. కాని ఆమెని చూడ్డానికి దృష్టి తిప్పలేదు. గుర్రం మీదనుంచి కిందికి దూకగానే తుపాకీ గుమ్మానికి అడ్డం వచ్చింది. మోటుగా తూలాడు, భయంభయంగా శాలకేసి చూశాడు. అక్కడెవరూ లేరు. కాని పాలు పితికే లయబద్ధమైన చప్పుడు మాత్రం యింకా వినిపించింది.

యింట్లోకి వెళ్ళి, మరుక్షణం తిరిగివచ్చి, టీ గ్లాసుతోటీ, పైప్‌తోటీ, పుస్తకంతోటీ, గుమ్మంలో యింకా సూర్య కిరణాలు పడని చోట కూర్చున్నాడు. మధ్యాహ్నం భోజనాల లోపున యెక్కడికీ పోకూడదనుకున్నాడు. యెంతో కాలంగా వాయిదా వేస్తూవచ్చిన ఉత్తరాలు రాయాలనుకున్నాడు; యెందుకనో గుమ్మంలో ఆ చోటు వదలడానికి యిష్టపళ్ళేదు. యింట్లోకి పోవడం కూడా అదేదో ఖైదులాగా అంతే అయిష్టంగా వుంది. యింటావిడ పొయ్యి రాజేసింది. ఆ పిల్ల పశువులని బయటికి తోలి, తిరిగివచ్చింది. పిడకలు పోగుచేసి కంచెదగ్గర గుట్ట పోసింది. ఒలేనిన్ చదువుతూనే వున్నాడు కాని ఒక్క ముక్క కూడా అర్థంకావడం లేదు. పుస్తకంమీదనుంచి కళ్ళు పైకెత్తి ముంగిట్లో తిరుగుతూ వున్న బింకమైన ఆ యువతికేసి చూస్తూనే వున్నాడు. తడిగా వున్న ఆ యింటి ప్రభాత ఛాయలోకి ఆమె అడుగు పెట్టినా, పెరటి మధ్యలో వెల్తువగా వచ్చిన ఆహ్లాదకరమైన తొలి వెలుగులో ఆమె సౌందర్యపూరిత విగ్రహం, సూర్యకాంతిలో మెరిసే జేగీయమానమైన దుస్తులతో నల్లని నీడని పరుస్తూ తారట్లా

* తయారైంది (ఫ్రెంచి). — సం.

డినా — అంత సేపూ ఆమె కదలికల్లో యే ఒక్కటేనా పోగొట్టు కుంటానేమో నని భయపడ్డాడు. యెంత సునాయాసంగా సౌకుమార్యంగా ఆమె విగ్రహం నేలమీద వంగుతోందో చూడ్డం అతనికి ఆనందదాయక మైంది; ఆమెమీద వున్న గులాబీ గాగరా ఒక్క ఉడుపూ ఆమె వక్షోజం దగ్గరా సొగసైన కాళ్ల దగ్గరా యెలా ముడతలు పడుతోందో చూడ్డం ఆనందదాయకమైంది. ఆమె పైకి లేచినప్పుడు ఆమె బిగుతైన గాగరా ఆమె నిశ్వసించేటప్పుడు వక్షోజ రేఖల్ని యెలా చూపెడుతోందో చూడ్డం ఆనందదాయకమైంది. అరిగిపోయిన యెర్రని చెప్పుల్లో వున్న మృదువైన కాలిమడమలు వాటి ఆకారంలో మార్పులు రాకుండా యెలా నేల తాకుతున్నాయో చూడ్డం ఆనందదాయకమైంది. రెట్టపైకి మడిచిన ఆమె బలమైన చేతులు, శ్రమించే కండరాలు, దాదాపు కోపంగా వున్నట్టుగా పారని యెలా ఉపయోగిస్తున్నాయో, ఆమె నిగూఢ నీల నేత్రాలు మధ్యమధ్యని తనకేసి చూస్తున్నాయో, చూడ్డం ఆనందదాయకమైంది. సున్నితమైన కనుబొమలు ముడుచుకుని వున్నా, ఆమె నయనాలు సంతోషాన్నీ, ఆమెకున్న తన సౌందర్యపు గుర్తింపునీ వ్యక్తం చేశాయి.

''యేమోయ్, ఒలేనిన్, చాలా సేపైందేమిటి లేచి'' అన్నాడు బెలేత్స్కీ ముంగిట్లోకి ప్రవేశిస్తూనే. అతను కాకేషియన్ ఆఫీసరు కోటు తొడుక్కున్నాడు.

''హేయ్, బెలేత్స్కీ, యేమిటి యింత పెందరాళే వచ్చావ్?'' అన్నాడు ఒలేనిన్ చెయ్యి చాస్తూ.

''రావాల్సివచ్చింది. నన్ను గెంటేశారు. యీ రాత్రికి ఓ విందు వుంటుంది. మర్యాంకా, ఊస్తెంకా యింటికి నువ్వు వస్తావుగా?'' అన్నాడా పిల్లకేసి తిరిగి.

ఆ పిల్లని అంత చనువుగా పిలవడం ఒలేనిన్‌కి ఆశ్చర్యం వేసింది. మర్యాంకా అతని మాట విననట్టే తల వంచుకుంది. పార భుజంమీద

వేసుకుని తన బింకమైన పురుష గమనంతోటి అవతలి యింట్లోకి వెళ్లింది.

''దానికి సిగ్గుగా వుంది, ముద్దుకూన, దానికి సిగ్గు'' బెలేత్‌స్కీ అన్నాడు ఆమెకేసి చూస్తూ. ''నువ్వంటే సిగ్గు'' హుషారుగా చిరునవ్వు నవ్వుతూ గుమ్మం మెట్లెక్కాడు.

''విందు జరుగుతుందా? యెవరు గెంటేశారు నిన్ను?''

''విందు ఊస్తెంకా యింటి దగ్గర. నీకూ ఆహ్వానం వుంది. విందు అంటే పిండివంటలూ, అమ్మాయిల గుంపూ అని.''

''కాని, మనం అక్కడేం చెయ్యాలి?''

బెలేత్‌స్కీ రహస్యం తెలిసిన వాడులా చిరునవ్వు నవ్వాడు. కన్ను గీటాడు, మర్యాంకా వెళ్లిన అవతలి యింటికేసి తల ఆడిస్తూ.

ఒలేనిన్ భుజాలు కుదించి సిగ్గుపడ్డాడు. ''నువ్వు మొత్తానికి భలేవాడివి!'' అన్నాడతను.

''సర్లే, నటించకు!''

ఒలేనిన్ మొహం చిట్లించాడు. బెలేత్‌స్కీ అది గమనించి అతన్ని ప్రసన్నుణ్ణి చేసుకునేటట్టు చిరునవ్వు నవ్వాడు.

''అబ్బా, యేమిటి నీ ఉద్దేశం? యీ యింట్లో వుంటూ – యిలాంటి పిల్ల, అద్భుతమైన జాంపండులాంటి పిల్ల – '' అన్నాడు.

''అద్భుతమైన అందం! యింతకుముందెప్పుడూ యిలాంటి అందం చూళ్లేదు'' బదులు చెప్పాడు ఒలేనిన్.

''మరైతే?'' అన్నాడు బెలేత్‌స్కీ పరిస్థితి అర్థం చేసుకోలేకపోతూ.

''యిది కొంచెం విడ్డూరంగానే వుండచ్చు. కాని నేను వున్నదున్నట్టు చెప్పకుండా దాయటమెందుకు? నేనిక్కడకి వచ్చినప్పటినుంచీ నాకు ఆడవాళ్లు లేనట్టే వుంది. అలా వుండడం బాగుంది, నిజంగా! యిప్పుడు మనకీ, యీ ఆడాళ్లకీ ఉమ్మడిగా యేం వుంది? యెరోష్క –

అది వేరే సంగతి! అతనికీ నాకూ మధ్య సామాన్యమైన గుణం వుంది — వేట!''

''ఓ! ఉమ్మడిగా! నాకూ అమారియా ఇవానొవ్నాకీ ఉమ్మడిగా యేం వుంది? అదీ సంగతి! నువ్వనుచ్చు వాళ్లంత శుభ్రంగా వుండరని. అది వేరే సంగతి.... 'అలగేర్ కొమ్ అలగేర్!'*''

''నా మట్టుకు నాకు యే అమారియా ఇవానొవ్నాలూ తెలీరు. అలాంటి అమ్మాయిల్తో యెలా నడుచుకోవాలో కూడా తెలీదు. అలాంటి వాళ్లని గౌరవించలేం. కాని నేను వీళ్లను గౌరవిస్తున్నాను'' అన్నాడు ఒలేనిన్.

''అలాగే గౌరవిస్తూ వుండు వీళ్లని! నిన్నెవడు అడ్డగించాడు?''

ఒలేనిన్ బదులు చెప్పలేదు. అతను చెప్పదలచుకున్నది స్పష్టంగా పూర్తిచెయ్యాలనుకున్నాడు. అది అతని హృదయానికి ప్రియమైంది.

''నాకు తెలుసు నేను మినహాయింపని....'' అతను యిబ్బంది పడుతున్నట్టు తెలుస్తూనే వుంది. ''నా జీవితం యెలా రూపుదీసు కుందంటే, నా నియమాలు వదులుకోవాల్సిన అవసరం నాక్కనిపించ లేదు. అంతేకాదు నేను నీలాగా బతకాల్సివస్తే, యిప్పుడు నేను వుంటు న్నంత హాయిగా వుండటం మాట అటుంచి, అసలు బతకనే లేను. అంచేత నువ్వు వాళ్లలో వెదికేదానికి భిన్నమైందాని కోసం నేను వాళ్లలో చూస్తున్నాను.''

బెలేత్స్కీ నమ్మలేనట్టు కనుబొమలు యెత్తాడు.

''యేమైనాగానీ సాయంత్రం మా యింటికి రా. మర్యాంకా వస్తుంది. నీకు పరిచయం చేస్తాను. తప్పకుండా, యేం! నీకు విసుగ్గా వుంటే వెళ్లిపోదువుగాని, వస్తావు కదూ?''

---

* యుద్ధంలో యుద్ధంలాగ (ఫ్రెంచి). — సం.

‘‘వస్తాను. కాని అసలు సంగతి చెప్పాలంటే నేను గాఢంగా లొంగి పోతానేమోనని భయం.’’

‘‘అబ్బబ్బా!’’ అరిచాడు బెలేత్‌స్కీ. ‘‘పూరికే రా. నీ సంగతి నేను చూసుకుంటా. వస్తావా? మాట తప్పవు కదా?’’

‘‘వస్తా. కాని మనం చెయ్యాల్సిందేమిటో నాకు నిజంగా అర్థం కాలేదు, మనం చెయ్యాల్సిందేమిటి?’’

‘‘బాబ్బాబు, నీకో దణ్ణం. వస్తావు కదూ?’’

‘‘అలాగే చూద్దాం’’ అన్నాడు ఒలేనిన్.

‘‘అదీ మరి! అసలు యెవరూ యెక్కడా చూడని ముచ్చటైన మగువలీ పక్కనా! బతకడమేమో సన్యాసిలాగానా! యేం ఖర్మ! అందు బాటులో వున్నది అనుభవించకుండా యెందుకు బతుకు పాడుచేసుకుంటావ్? మన పటాలాన్ని వొజ్‌ద్విజేన్‌స్కయాకి పొమ్మని ఫర్మానా వచ్చిందట, విన్నావా?’’

‘‘జరక్కపోవచ్చు. యెనిమిదవ పటాలం పంపుతారని విన్నాను’’ అన్నాడు ఒలేనిన్.

‘‘లేదు, నాకు సైనికోద్యోగినుంచి ఉత్తరం వచ్చింది. అతను రాసిం దేమిటంటే రాకుమారుడు స్వయంగా దండయాత్రలో పాల్గొం టాడని. కొంచెం ఆయనతో గడపచ్చని సంతోషంగా వుంది. యిక్కడ మొహం మొత్తుతోంది.’’

‘‘మనం త్వరలోనే దాడి జరపబోతున్నామని విన్నాను.’’

‘‘నేనా మాట విన్లేదు; క్రినొవిత్సిన్ ఒక దాడికి గాను సెయింట్ అన్నా శిలువ అందుకున్నాడని విన్నాను. అతను లెఫ్టినెన్సీ వస్తుందను కున్నాడు’’ అన్నాడు బెలేత్‌స్కీ నవ్వుతూ. ‘‘పాపం నీరసపడిపోయి వుంటాడు, యేం? అతను దాని కోసమని ప్రధాన కార్యాలయం దగ్గ రికి వెళ్ళాడు....’’

సాయం సంధ్య అవుతోంది. ఒలేనిన్ పార్టీ గురించి ఆలోచించసాగాడు.

అతనికి వచ్చిన పిలుపు అతనికి చిరాగ్గా వుంది. అతనికి వెళ్లాలని అనిపించింది గాని అక్కడ యేం జరగబోయేదీ విద్యూరంగా అసం బద్ధంగా, ఆ మాట కొస్తే, భయంపుట్టించేదిగా కూడా వుంది. అక్కడ ఆడపిల్లలు తప్ప కోసక్ మగాళ్లుగాని, స్త్రీలుగాని వుండరని అతనికి తెలుసు. అక్కడ యేం జరగబోతోంది? తనెలా ప్రవర్తించాలి? వాళ్ల దేన్ని గురించి మాట్లాడుకుంటారు? తనకీ ఆ అనాగరిక కోసక్ అమ్మాయిలకీ మధ్య యేముంది? ఆ వింతైన, సిగ్గుమాలిన, అయినా కఠోరమైన సంబంధాలని గురించి బెలేత్స్కీ చెప్పాడు. తనక్కడ మర్యాం కాతో అదే యింట్లో ఉండటమూ, బహుశా ఆమెతోటి మాట్లాడ వలసి రావడమూ చిత్రంగా కనిపించాయి. ఆమె హుందా వైఖరి అతను జ్ఞాపకం చేసుకున్నప్పుడు అది అసంభవంగా కనిపించింది. కాని అదంతా పరమ సులభమైనట్లు మాట్లాడాడు బెలేత్స్కీ. ''బెలేత్స్కీ మర్యాంకాని అదే రకంగా చూడ్డం వుంటుందా? అది సరదాగా వుంటుంది'' అనుకున్నాడు. ''పోన్లే మానేస్తే మంచిది. యిదంతా రోతగా వెకిలిగా వుంటుంది. అన్నిటినీ మించి – ఫలితం యేమీ వుండదు!'' కాని మళ్లీ అతనికి యేం జరుగుతుందో ననే చింత. దీనికితోడు తను మాట యిచ్చినట్టు అనిపించింది. మనసు యెటూ నిర్ధారించుకోకుండానే అవతలకి వెళ్లాడు; అతను బెలేత్స్కీ యింటి దాకా అలా నడిచే వెళ్లాడు. అక్కడికెళ్లాక లోపలికెళ్లాడు.

బెలేత్స్కీ వుండే యిల్లు కూడా ఒలేనిన్ వున్న యింటి లాంటిదే. నేలకి అయిదడుగుల యెత్తులో కర్ర స్తంభాలమీద కట్టింది. రెండు గదులున్నాయి. మొదటి దాంట్లో (నిట్టపాటుగా మెట్లుండి, ఒలేనిన్ యెక్కి వచ్చింది) పక్షి యీకల పరుపులూ, కంబళీలూ, దుప్పట్లూ, బాలీసులూ కోసక్ పద్ధతిలో గోడవారనే చక్కగా, ఆకర్షణీయంగా అమర్చి వున్నాయి. పక్క గోడలకి యిత్తడి పాత్రలూ ఆయుధాలూ వేలాడుతున్నాయి. నేలమీద ఓ బల్లకింద, పుచ్చకాయలూ, గుమ్మడి

కాయలూ వున్నాయి. రెండో గదిలో పెద్ద యిటికల పొయ్యి, మేజా, బల్లలూ, పూజా చిత్రాలు వున్నాయి. ఆ గదిలోనే తన ప్రయాణాల పక్క సరంజామా, పెట్టెలూ యేర్పాటు చేసుకుని బెలేత్‌స్కీ వుంటాడు. అతని ఆయుధాలు గోడని వేలాడుతున్నాయి. వాటి వెనక చిన్న గొంగళి. మేజామీద అతని సబ్బూ, పౌడరూ వగైరా సామాన్లూ యింకా కొన్ని చిత్రాలూ వున్నాయి. ఓ బల్లమీద యింట్లో వున్నప్పుడు తొడుక్కునే పట్టు అంగీ విసిరేసి వుంది. బనీనూ, చెడ్డీ తొడుక్కుని మంచంమీద పడుకుని బెలేత్‌స్కీ చక్కగా ముస్తాబై "లే త్రువా ముస్కేతేర్"* చదువుతూ పడుకున్నాడు.

అతను ఒక్క ఉదుట్న లేచాడు.

"అమ్మయ్య, చూశావా నేనెలా అన్నీ యేర్పాటు చేసానో. బాగుంది కదూ? నువ్వు వచ్చావు నాకు చాలా సంతోషంగా వుంది. వాళ్లు యమా పనిలో వున్నారు. పిండివంట యేం చేస్తున్నారో తెలుసా? పంది మాంసం, ద్రాక్ష పళ్లూ పెట్టిన పిండి బూరెలు. యింకా వున్నాయి! వూరికే ఆ హడావుడి అంతా చూడు అక్కడ!"

కిటికీలోంచి చూస్తూనే వాళ్లకి నిజంగానే యింట్లో యెప్పుడూ వుండని సందడి వున్నట్టు కనిపించింది. ఆడపిల్లలు దాని కోసమనీ, దీని కోసమనీ లోపలికీ యివతలకీ పరిగెడుతున్నారు.

"ఇంకా యెంతసేపు పడుతుంది?" బెలేత్‌స్కీ అడిగాడు.

"అయిపోవచ్చింది! యేం? తాతకి ఆకలిగా వుందేమిటి?" యింట్లోంచి పకపకా నవ్వులు వినిపించాయి.

బొద్దుగా, గులాబి రంగు బుగ్గలతో, చక్కగా వున్న ఊస్తెంకా రెట్టలు పైకి మడుచుకుని బెలేత్‌స్కీ యింట్లోకి కొన్ని పళ్లేల కోసం వచ్చింది.

---

* ద్యూమా ఫ్రెంచిలో రాసిన నవల "ముగ్గురు వీరులు." – సం.

''పక్కకి పో, లేకపోతే యీ పళ్ళేలు ముక్కలు చేస్తాను!'' కీచుమంది, బెలేత్‌స్కీకి అందకుండా పారిపోతూ. ''వచ్చి కాస్త సాయం చెయ్యకూడదూ'' నవ్వుతూ ఒలేనిన్ కేసి అరిచింది. ''ఆడపిల్లలకి కాస్త ఫలహారాలు తేవడం మరవద్దు.'' (ఫలహారాలు అంటే బిస్కట్లూ, మిఠాయిలూనూ.)

''మర్యాంకా వచ్చిందా?'' అడిగాడు బెలేత్‌స్కీ.

''యెందుకు రాదూ! ఆమే పిండి తెచ్చింది.''

''యిదిగో చూశావా'' అన్నాడు బెలేత్‌స్కీ. ''ఊసెత్తింకాని కాస్త కడిగేసి శుభ్రమైన బట్టలు వేసి షోకు చేస్తే, మాస్కో అందగత్తె లందరికంటే కూడా బ్రహ్మాండంగా వుంటుంది. కర్నల్‌ని పెళ్ళాడిన కోసక్ ఆవిడని యెప్పుడేనా చూశావా? ఆమె యేం కళగా వుంది! బొర్షచోవా. యేం దర్జా! వాళ్ళకెలా వస్తుందో అది!...''

''బొర్షచోవాని నేను చూళ్ళేదు. కాని నేననుకోవడం వీళ్ళేసుకునే బట్టల్ని మించిన అందం లేదేమో.''

''ఆహా! యెలాంటి తరహా జీవితానికేనా అతుక్కుపోవడంలో నేను మొదటి రకం వాణ్ణి'' అన్నాడు బెలేత్‌స్కీ సంతోషపు నిశ్వాసంతో. ''నే వెళ్ళి చూసొస్తా వాళ్ళెంతలో వున్నారో.'' పట్టు అంగీ తొడుక్కుని బయటికి పరిగెడుతూ, ''నువ్వు ఫలహారాలు చూడు'' అని కేకేశాడు.

బిస్కట్లూ, తేనే తేవడానికి బెలేత్‌స్కీ నౌకర్ని పంపాడు ఒలేనిన్. కాని అతనికి డబ్బివ్వడం (యెవరికో లంచం పెడుతున్నట్టు) హఠాత్తుగా యెంత వెలపరం అనిపించిందంటే అతను కచ్చితంగా ఆ నౌకర డిగిందానికి జవాబు చెప్పలేకపోయాడు. ''అల్లం బిస్కట్లు యెన్ని తేను, తేనే బిస్కట్లూ యెన్ని తేను?''

''నీ యిష్టం.''

''మొత్తం డబ్బంతా ఖర్చు పెట్టెయ్యనా?'' అడిగాడా ముసలి

సైనికుడు భావగర్భితంగా. ''అల్లం బిస్కట్లు చాలా ప్రియం. పదహారు కోపెక్కులు.''

''ఆఁ, ఆఁ, మొత్తం ఖర్చు పెట్టెయ్యి'' అన్నాడు ఒలేనిన్. కిటికీ దగ్గర కూర్చున్నాడు. అతనేదో ఘోరమైన నేరం చెయ్యడానికి తయారవుతున్న వాడికి మల్లే గుండె దడదడ కొట్టుకోవడం ఆశ్చర్యంగా వుంది. బెలేత్స్కీ వెళ్లగానే ఆడపిల్లల యింట్లో కేకలూ, అరుపులూ వినిపించాయి. కొద్ది క్షణాల తర్వాత అల్లరీ అరుపులూ నవ్వులూ వినిపిస్తూండగానే అతను బయటికి యెగిరివచ్చాడు. ''గెంటేశారు నన్ను'' అన్నాడు.

ఓ క్షణం తర్వాత ఊస్తెంకా వచ్చింది. అంతా సిద్ధమైందని ప్రకటిస్తూ తన అతిథుల్ని గంభీరంగా ఆహ్వానించింది.

వాళ్లు ఆ గదిలోకి రాగానే ప్రతీదీ నిజంగానే సిద్ధమై వుంది: ఊస్తెంకా గోడవార మెత్తని దిళ్లని సరిజేస్తోంది. చాలీచాలని చిన్న గుడ్డ వున్న మేజామీద చిఖిర్ బుడ్డీ, కొన్ని యెండిన చేపలూ వున్నాయి. గదంతా పిండీ, ద్రాక్షపళ్ల వాసన వేస్తోంది. మామూలుగా తలల్ని రుమాళ్లతో కప్పుకున్నట్టుగా కప్పుకోకుండా అందమైన బెష్మెత్‌లు తొడుక్కున్న అరడజను మంది అమ్మాయిలు పొయ్యి వెనకమూల గుసగుసలాడుతూ, యికిలిస్తూ, నవ్వుతూ, తుళ్లుతూ ఒకళ్లమీద ఒకళ్లు పడుతూ వున్నారు.

''మా కుల దేవతకి మర్యాద చెయ్యవలసిందిగా మిమ్మల్ని వినయంగా ప్రార్థిస్తున్నాను'' అంది ఊస్తెంకా తన అతిథుల్ని మేజా దగ్గరికి ఆహ్వానిస్తూ.

ఒలేనిన్ ఆ అమ్మాయిల గుంపులో మర్యాంకాని చూశాడు. వాళ్లంతా మినహాయింపుల్లేకుండా అందంగా వున్నారు. మర్యాంకాని ఆ నీచమైన, యెడ్డి పరిస్థితుల్లో కలుసుకోవడం చిరాగ్గా, బాధగా అనిపించిందతనికి. ఒలేనిన్‌కి మనస్సు మొద్దుబారినట్లూ, యిరకాటంలో

పడ్డట్లూ అనిపించి, బెలేత్‌స్కీ చేసినట్టు చెయ్యాలని నిశ్చయించు కున్నాడు. మేజా దగ్గరికి గంభీరంగా ఆత్మవిశ్వాసంతో, అనాయాసంగా వెళ్లాడు బెలేత్‌స్కీ. ఊస్తెంకా ఆరోగ్యం కోసం ఓ గ్లాస్ వైన్ తాగాడు. మిగతా వాళ్లని కూడా అలానే చెయ్యమని ఆహ్వానించాడు. ఆడపిల్లలు తాగరని ఊస్తెంకా ప్రకటించింది.

''తాగచ్చు, కొంచెం తేనెతోటి'' ఆ గుంపులోనుంచి ఓ గొంతుక అంది.

అప్పుడే అల్లం బిస్కట్లూ తేనే తెచ్చిన నౌకర్ని పిలిచారు. వాడు ఓరగా (అసూయతోటో లేకపోతే అసహ్యంతోటో) ఆ పెద్ద మనుషుల కేసి చూశాడు. వాళ్లతని దృష్టిలో 'తాగి మజా చెయ్యడం' కోసమే వున్నారు. జాగ్రత్తగా, విధేయంగా, వాళ్లకి ఓ తేనె తుట్టె, బిస్కట్లూ అందజేసాడు. అవి ముతక కాగితంలో చుట్టబడి వున్నాయి. వాటి ఖరీదూ, చిల్లరా అంతా వివరంగా చెప్పబోయాడు గాని బెలేత్‌స్కీ అతన్ని పంపేసాడు. గ్లాసుల్లోని వైన్‌తో తేనె కలిపాక, మూడు పౌన్ల అల్లం బిస్కట్లని మేజామీద పరిచాక, ఆడపిల్లల్ని ఆ మూలనుంచి బలవంతంగా లాక్కొచ్చి బల్ల దగ్గర కూర్చోబెట్టాడు బెలేత్‌స్కీ. వాళ్లకి బిస్కట్లు పంచడం మొదలెట్టాడు. యెండకి నల్లబడినా, చిన్నగా వున్న మర్యాంకా చెయ్యి, రెండు గుండ్రని అల్లం బిస్కట్లూ, ఒక గోధుమ రంగు బిస్కట్టూ పట్టుకుని వుండటం ఒలేనిన్ అప్రయత్నంగానే గమనించాడు. వాటినేం చెయ్యాల్సిందీ ఆమెకి తెలీలేదు. ఊస్తెంకా, బెలేత్‌స్కీల చనువైన, సునాయాసమైన నడవడిక వున్నా, అక్కడి వాళ్లని హుషారు చేద్దామనే కోరిక వాళ్లకి వున్నా సంభాషణ సట్టుతూ నప్పనిదిగా వుంది. ఒలేనిన్ తడబడ్డాడు. యేం చెప్పాలా అని తడువుళ్లాడాడు. వాళ్లల్లో ఆతృత రేకెత్తిస్తూ, బహుశా అపహాస్యాన్ని రెచ్చగొడుతూ, తన బెరుకు తోటి వాళ్లకీ బెరుకు అంటి స్తున్నట్టు అనిపించి సిగ్గు పడిపోయాడు. ముఖ్యంగా మర్యాంకా

యిబ్బంది పడుతున్నట్టు నిపించింది. ''వాళ్ళు మానుంచి కొంత డబ్బు ఆశిస్తున్నట్టుంది'' అనుకున్నాడతను. ''మేం అది యెలా చెయ్యాలి? త్వరగా అది చేసి అవతలికి పోయే మార్గమేమిటి?''

## 25

''అదేమిటి మీ యింట్లో వుండే మనిషి నీకు తెలీదూ?'' అన్నాడు బెలేత్స్కీ మర్యాంకాని సంబోధిస్తూ.

''మమ్మల్ని చూడ్డానికి యెప్పుడూ రాకపోతే నాకెలా తెలుస్తుంది?'' అంది మర్యాంకా, ఒలేనిన్ కేసి ఓ చూపు విసురుతూ.

ఒలేనిన్ భయకంపితుడయ్యాడు. దేన్ని గురించో అతనికి తెలీదు. జేవురించుకుని యేం చెబుతున్నాడో తెలీకుండా అన్నాడు: ''మీ అమ్మంటే నాకు భయం. మొదటి సారి వచ్చినప్పుడు దులిపేసింది.''

మర్యాంకా పగలబడి నవ్వింది.

''అది సరిపోయిందన్న మాట మీరు భయపడ్డానికి?'' అందామె. అతనికేసి ఓ క్షణం చూసి, మళ్లీ చూపు పక్కకి తిప్పుకుంది.

ఒలేనిన్ ఆమె అందమైన ముఖమంతా చూడ్డం అదే మొదటి సారి. అప్పటిదాకా కళ్ల వరకూ రుమాలు కప్పుకుని ఆమె వుండగా చూడ్డమే అతను. ఆ గ్రామంలో సౌందర్యరాశిగా ఆమె వాసికెక్కడంలో ఆశ్చర్యం లేదు. కురచగా, బొద్దుగా, గులాబీ రంగు బుగ్గలతో ఉల్లాసంగా వుండే తేనె రంగు కళ్లలో యెడతెరిపి లేకుండా చిరునవ్వు నవ్వుతూ, వాగుతూ వుండే యెర్రని పెదాలతో ఉస్తెంకా సొగసుగానే వుంటుంది. మర్యాంకా అందుకు భిన్నంగా, కచ్చితంగా సొగసుగా వుండదు కాని సౌందర్యవంతమైంది. పొడుగాటి సౌష్ఠవమైన అవయవ నిర్మాణమూ, పరిణతమైన వక్షోజాలూ, భుజమూ, నల్లని కనుబొమలల కింద నీలి నీడలతో, కటువైనా సున్నితంగా వుండే హావ

భావాలున్న వెడల్పాటి కళ్ళూ, సుకుమారమైన నోరూ, చిరునవ్వూ లేనట్లయితే, ఆమె వాలకం మరీ మగరాయుడిలాగా, దాదాపు కఠినంగా వున్నట్లు అనిపించేదే. ఆమె అరుదుగా చిరునవ్వు నవ్వేది. కాని ఆమె చిరునవ్వు యెప్పుడూ విశేషంగానే వుండేది. కన్యాత్వపు శక్తినీ, ఆరోగ్యాన్నీ ప్రకాశింప జేస్తున్నట్టుండేది ఆమె. ఆ అమ్మాయిలంతా అందమైన వాళ్లే. కాని వాళ్ళూ, బెలేత్‌స్కీ, అల్లం బిస్కట్లు తెచ్చినప్పుడు నౌకరూ అందరూ అప్రయత్నంగా ఆమెకేసి రెప్పవెయ్యకుండా చూశారు. ఆ అమ్మాయిలని సంబోధించే యెవరేనా తప్పకుండా ఆమెనే సంబోధించేవారు. ఆమె వాళ్ల మధ్య గర్వంగా ఆనందంగా వుండే రాణీలా కనిపించింది.

ఆ పార్టీని ఉల్లాసంగా వుంచడానికి బెలేత్‌స్కీ యెడతెరిపిలేకుండా మాట్లాడుతూనే వున్నాడు. ఆడపిల్లల్ని చిఖిర్ అందిచ్చేటట్టు చేశాడు. వాళ్లతో సరసాలాడాడు. మర్యాంకాని గురించి ఒలేనిన్‌తో ఫ్రెంచిలో చవకబారు మాటలంటూనే వున్నాడు, ఆమె 'లా వ్యూత్' (నీది) అంటూ. అతన్ని తనకి మల్లే ప్రవర్తించమని ఆహ్వానించాడు. ఒలేనిన్ అంతకంతకూ యిబ్బంది పడిపోయాడు. అవతలి కెళ్లి పారిపోవడం యెలా అని సాకు కోసం ఒలేనిన్ వెదుకుతూ వుండగా, ఊస్తెంకా, ఆ రోజు ఆమె పేరున్న రోజు కాబట్టి, మగాళ్లకి ఓ ముద్దుతో చిఖిర్ యివ్వాలని బెలేత్‌స్కీ అన్నాడు. పెళ్లిళ్లలో ఆచారమైనట్టుగా తన పళ్లెంలో వాళ్లు డబ్బు పెట్టాలనే షరతుమీద ఆమె ఒప్పుకుంది.

''ఖర్మ కాకపోతే యీ వెలపరంగా వుండే విందుకి యెందుకు రావాలి నేను!'' అనుకున్నాడు ఒలేనిన్, వెళ్లిపోడానికి లేస్తూ.

''యెక్కడికీ పోతున్నావ్?''

''కొంచెం పొగాకు తెస్తా'' అన్నాడు పారిపోతున్నాననే ఉద్దేశ్యంతో. కాని బెలేత్‌స్కీ ఫ్రెంచిలో ''నా దగ్గర కొంచెం డబ్బుంది'' అంటూ అతని చెయ్యి పట్టుకున్నాడు.

"అంటే యెవడేనా యిక్కడ డబ్బు ముట్టచెప్పాలి, వెళ్లడానికి వీలు లేదు" అనుకున్నాడు ఒలేనిన్ తన మోటుతనంమీద తనకే చిరాకేసి. "నేను నిజంగానే బెలేత్స్కీ లాగా ప్రవర్తించలేనా? నేను రాకుండా వుండాల్సింది. ఒక సారి అంటూ వచ్చాక వాళ్ల సరదా పాడు చెయ్యడం బాగోదు. ఒక కోసక్‌లాగా నేను తాగాలి" అనుకున్నాడు. కొయ్య గిన్నె (యించుమించు యెనిమిది గ్లాసులు పట్టేది) తీసుకుని, దాదాపు పూర్తిగా చిఖిర్‌తో నింపి, గడగడ తాగేశాడు. అతనలా తాగుతూ వుంటే ఆడపిల్లలు అతనికేసి ఆశ్చర్యంగా, దాదాపు భయకంపితులై చూశారు. అది వాళ్లకి వింతగా, తగనట్లుగా కనిపించింది. ఊస్తెంకా వాళ్లకి చెరి వొక గ్లాసూ యింకా తెచ్చింది. యిద్దర్నీ ముద్దుపెట్టుకుంది.

"యిదిగో, అమ్మాయిలూ యిప్పుడు మనకింకో తమాషాకి డబ్బిదిగో" అంది, తన పళ్లెంలో ఆ మగాళ్లు పెట్టిన నాలుగు వెండి రూబుళ్లు గలగల లాడిస్తూ. ఒలేనిన్ యింక యిబ్బందిగా బాధపళ్లేదు. వాగడం మొదలెట్టాడు.

"యిదిగో, మర్యాంకా, యిప్పుడు ముద్దూ, పైనా యివ్వడం నీ వంతు" అన్నాడు బెలేత్స్కీ, ఆమె చెయ్యి పట్టుకుని.

"అలాగే, నేను నీకెలాంటి ముద్దిస్తానో!" అందామె వేళాకోళంగా, అతన్ని కొట్టడానికి తయారవుతూ.

"యేమీ యివ్వనక్కర్లేకుండానే నువ్వు తాతని ముద్దుపెట్టుకోవచ్చు" అంది యింకో పిల్ల.

"అదిగో, మంచి పిల్ల" అన్నాడు బెలేత్స్కీ పెనుగులాడే పిల్లని ముద్దెట్టుకుంటూ. "ఊహూఁ, నువ్వు యిచ్చితీరాలి" అతను ఒత్తిడి చేసాడు, మర్యాంకాని సంబోధిస్తూ. "మీ బసలో వుండే ఆయనకి ఓ గ్లాసు యియ్యి."

అతను ఆమెని చేత్తో పట్టుకుని బల్ల దాకా నడిపించుకెళ్ళి ఒలేనిన్ పక్కన కూర్చోబెట్టాడు.

''యేమందం'' అన్నాడతను ఆమె తలని పక్కనుంచి చూసేం దుగ్గాను తిప్పుతూ.

మర్యాంకా అభ్యంతరపెట్టలేదు. కాని గర్వంగా చిరునవ్వు నవ్వుతూ తన వెడల్పాటి కళ్ళని ఒలేనిన్ వైపు తిప్పింది.

''అందమైన పిల్ల'' రెట్టించాడు బెలేత్స్కీ. మర్యాంకా చూపు ''అవును, నేనెలాంటి అందగత్తెనో చూడండి'' అని నిర్ధరిస్తున్నట్టుగా వుంది.

తనేం చేస్తున్నదీ ఆలోచించకుండానే ఒలేనిన్ మర్యాంకాని కౌగలించుకున్నాడు. ముద్దుపెట్టుకోబోయాడుగాని ఆమె అకస్మాత్తుగా పట్టు విదిలించుకుని, బెలేత్స్కీని యించుమించుగా తన్నేసి మేజాపై వున్న వాటిని గెంటేసి, పొయ్యికేసి గెంతింది. అరుపులూ నవ్వులూ యెక్కువయ్యాయి. అప్పుడు బెలేత్స్కీ ఆ పిల్లలతో యేదో గుసగుసలాడేడు. వెంటనే వాళ్లంతా నడవలోకి పరిగెత్తిపోయి వెనక తలుపు వేసేశారు.

''యెందుకు బెలేత్స్కీని ముద్దుపెట్టుకుని నన్ను పెట్టుకోవు?'' అడిగాడు ఒలేనిన్.

''ఓ, అదా. నేను వద్దనుకున్నాను, అంతే'' అందామె పెదవి కొరుకుతూ, మొహం చిట్లిస్తూ. ''అతను తాత'' అంది యింకా, చిరునవ్వు నవ్వుతూ. తలుపు దగ్గర కెళ్లి ధనధన కొట్టడం మొదలెట్టింది. ''తలుపెందుకేశారే, భడవల్లారా?''

''పోన్లే, వాళ్ల నక్కడ వుండనీ మన మిక్కడ వుందాం'' అన్నాడు ఒలేనిన్, ఆమె దగ్గరసా వస్తూ.

ఆమె మొహం చిట్లించి తన చేత్తోటి అతన్ని కటువుగా తోసేసింది. మళ్ళీ ఆమె ఒలేనిన్‌కి యెంత రాజసంగా కనిపించిందంటే

అతని మత్తు వదిలింది. తను చేస్తున్న పనికి అతనికి సిగ్గేసింది. అతను తలుపు దగ్గరకు తనే వెళ్ళి దాన్ని లాగడం మొదలెట్టాడు.

"బెలేత్‌స్కీ! తలుపు తియ్యి! వెకిలిగా వుండద్దు!"

మర్యాంకా మళ్ళీ కాంతివంతమైన మందహాసం చేసింది. "హేయ్, మీకు నేనంటే భయం" అంది.

"ముమ్మాటికీ భయమే, మీ అమ్మలాగే నువ్వు పెంకెవి."

"మీరు యెక్కువ సేపు యెరోష్కాతో గడపాలి; అదే ఆడపిల్లలు మిమ్మల్ని ప్రేమించేటట్టు చేస్తుంది!" అతని కళ్ళల్లోకి సూటిగా, దగ్గరగా చూస్తూ ఆమె చిరునవ్వు నవ్వింది.

అతనికి యేం చెప్పాలో తెలీలేదు.

"నేను నిన్ను చూడ్డానికి వచ్చి వుంటే" అతను మాట జారేడు.

"అది వేరే సంగతి" అందామె తల యెగరేస్తూ.

ఆ క్షణంలో బెలేత్‌స్కీ తలుపు తీశాడు. మర్యాంకా అక్కడ్నుంచి యెగిరింది. అలా చెయ్యడంలో ఆమె తొడ ఒలేనిన్ కాలికి కొట్టుకుంది.

"నేను అనుకునేదంతా, ప్రేమ గురించీ, ఆత్మపరిత్యాగం గురించీ, లుకాష్కా గురించీ అదంతా చెత్త. ఆనందమనేదే అసలు విషయం. ఆనందంగా వున్నవాడే సరైనవాడు" అని ఒలేనిన్ మనసులో మెరిసింది. తనే వూహించనంతటి బలంతోటి అతను మర్యాంకాని లాక్కుని ఆమె కణతలమీదా, బుగ్గలమీదా ముద్దు పెట్టేసుకున్నాడు. మర్యాంకాకి కోపంరాలేదు సరికదా, ఆమె ఫకాల్న నవ్వి, మిగతా పిల్లల దగ్గరికి పరిగెత్తిపోయింది.

ఆ పార్టీ కదే ఆఖరు. ఊస్తెంకా తల్లి తన పనినుంచి తిరిగి వచ్చి ఆడపిల్లలందర్నీ ఓ దులుపు దులిపేసింది.

## 26

"అవును, నేను కొంచెం కళ్లేలు వదులు చెయ్యాలంతే. మహా యిదిగా యీ కోసక్ పిల్లతో ప్రేమలో పడిపోతాను" అని ఒలేనిన్ యింటికిపోతూ అనుకున్నాడు. యీ వూహలతోటే నిద్రకి ఉపక్రమించాడు. కాని యీ వూహలన్నీ తేలిపోతాయనీ మునుపటిలాగే జీవిస్తాననీ అనుకున్నాడు.

కాని అతని పాత జీవితం తిరిగి రాలేదు. మర్యాంకాతోటి అతని సంబంధాలు మారాయి. వాళ్లిద్దర్నీ విడదీసే గోడ బద్దలైంది. ఒలేనిన్ యిప్పుడామెని కలుసుకున్నప్పుడల్లా పలకరించేవాడు.

ఆ యజమాని అద్దె వసూలు చేసుకోడానికి యింటికి వచ్చాడు. ఒలేనిన్ ఐశ్వర్యమూ, దాతృత్వమూ విని అతన్ని తన యింటికి ఆహ్వానించాడు. ఆ పెద్దావిడ అతనికి సాదరంగా స్వాగతం చెప్పింది. ఆ పార్టీ నాటినుంచీ ఒలేనిన్ తరుచుగా సాయంత్రం వేళ వాళ్లింటికి వెళ్లేవాడు. బాగా పొద్దుపోయేదాకా అక్కడ కూర్చునేవాడు. ఆ గ్రామంలో తను అలవాటు పడ్డట్టుగానే బతుకున్నట్టనిపించింది. కాని అతనిలో వున్న ప్రతీదీ మారిపోయింది. పగలంతా అడవిలో గడిపేవాడు. సాయంత్రం యెనిమిది గంటల వేళకి, చీకటి పడేటప్పుడు, ఒంటరిగానో, లేకపోతే యెరోష్కా మామతోటో తన యింటివాళ్లని చూడ్డానికి పోయేవాడు. వాళ్లు అతని రాకకి యెంత అలవాటు పడిపోయారంటే, అతను రానప్పుడు ఆశ్చర్యపోయేవారు. అతను తను తాగిన వైన్‌కి బాగా ముట్టజెప్పేవాడు. మంచి నెమ్మదస్తుడు. వన్యూష అతనికి టీ తెచ్చేవాడు, అతను పొయ్యి దగ్గర ఓ మూల కూర్చునేవాడు. ఆ పెద్దావిడ అతన్ని పట్టించుకునేది కాదు. తన పనిలో తనుండేది. వాళ్లు టీ తాగుతూనో, చిఖిర్ తాగుతూనో కోసక్కుల విషయాలూ, యిరుగుపొరుగు విషయాలూ, లేకపోతే రష్యా గురించీ మాట్లాడుకునేవారు. ఒలేనిన్ చెబుతూ వుండటమూ, మిగతా

వాళ్ళు అడుగుతూ వుండటమూనూ. ఒకో అప్పుడు ఓ పుస్తకం తెచ్చుకుని తనే చదువుకుంటూ కూర్చునేవాడు. మర్యాంకా వాళ్ళ దగ్గరనే లాక్కుని పొయ్యిపైన తిన్నెమీదనో, లేక ఓ చీకటి మూలనో అడివి మేకలాగా నక్కి వుండేది. ఆ సంభాషణల్లో పాల్గొనేది కాదు. కాని అతను ఆమె కళ్ళనీ, ముఖాన్నీ చూసేవాడు. ఆమె కదలిక శబ్దాలూ, పొద్దుతిరుగుడు గింజలు కొరకడం ధ్వనులూ వినేవాడు. తను మాట్లాడేటప్పుడు ఆమె సర్వేంద్రియాలతోటీ వింటోందని అతనికని పించేది. తను నిశ్శబ్దంగా చదువుకునేటప్పుడు ఆమె అక్కడ వుందనే గుర్తింపుతో వుండేవాడు. ఆమె కళ్ళు తనమీదే లగ్నమైనాయని ఒకో అప్పుడు అనుకునేవాడు. వాటి కాంతి పుంజాలు తాకగానే అప్రయత్నం గానే నిశ్శబ్దం అయిపోయి ఆమెకేసి తేరిపార చూసేవాడు. అప్పుడామె తక్షణం తన ముఖం చాటుచేసుకునేది. అతను పెద్దావిడతో గాఢ మైన సంభాషణలో వున్నట్టు నటించేవాడు. అతను అంత సేపూ ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలనీ, ప్రతి కదలిక ధ్వనినీ వినేవాడు. ఆమె తిరిగి తనకేసి చూడ్డం కోసం నిరీక్షించేవాడు. పై వాళ్ళున్న ప్పుడు ఆమె సామాన్యంగా అతనితో స్నేహంగా హుషారుగా వుండేది. కాని వాళ్ళిద్దరే వున్నప్పుడు ఆమె సిగ్గుగా, మోటుగా వుండేది. ఒకో అప్పుడు మర్యాంకా యింటికి రాకముందే అతను వచ్చేవాడు. తటాలున ఆమె బింకమైన పదధ్వనులు వినేవాడు. తెరిచిన గుమ్మం దగ్గర ఆమె నీలిరంగు నూలు గాగరా మిణుకుమనడం చూసేవాడు. ఆమె యింటి మధ్యలోకి వచ్చేది, అతన్ని చూసేది. ఆమె కళ్ళు కనిపించీ కనిపించనంత దయాన్విత మందహాసం చేసేవి. అతనికి ఆనందమూ, భయమూ కలిగేవి.

ఆమెనుంచి అతను యేదీ ఆశించనూ లేదు, కోరనూ లేదు. కాని ప్రతి రోజూ ఆమె ఉనికి అతనికి అంతకంతకూ యెక్కువ అవసరమ యేది.

ఆ కోసక్ గ్రామ జీవితంలోకి ఒలేనిన్ యెంత సరిపూర్ణంగా యిప్పుడు చొచ్చుకుపోయాడంటే, తన గతమంతా అతనికి యేదో పరాయిగా కనిపించింది. భవిష్యత్తుకి సంబంధించి, ముఖ్యంగా తనిప్పుడు జీవిస్తూన్న ప్రపంచానికి అవతల వున్న భవిష్యత్తుకి సంబంధించి, అతని కేమాత్రమూ ఆసక్తి లేదు. యింటినుంచో, బంధువుల నుంచో, స్నేహితులనుంచో ఉత్తరాలు వచ్చినప్పుడు వాళ్లు దుఃఖంతో తనని యెంత చెడిపోయిన మనిషిగా చూసేదీ అతనికి కష్టం కలిగించేది. ఆ గ్రామంలో వుండి తనలాగా బతకలేని వాళ్లని తనేమో చెడిపోయినట్టు భావించాడు. తన పూర్వపు పరిసరాల్ని త్యజించి, యీ గ్రామంలో యేకాంత విలక్షణ జీవితానికి సర్దుకుపోవడం గురించి యెప్పటికీ పశ్చాత్తాప పడాల్సిన అవసరం వుండదని అతని నమ్మకం. యెప్పుడేనా దండయాత్రల్లో వున్నప్పుడూ, యే దుర్గంలోనేనా బసచేసేటప్పుడూ కూడా అతను సంతోషంగానే వుండేవాడు; కాని యిక్కడ్నే, యెరోష్కా మామ రెక్కల కిందనుంచీ, తన అడివినుంచీ, వూరిచివర తన బసనుంచీ, ముఖ్యంగా మర్యాంకానీ లుకాష్కానీ గురించి అనుకున్నప్పుడూ తన గత జీవితపు కాపట్యం అతనికి తెలిసేది. ఆ కాపట్యం అంతకు ముందు అతని కోపాన్ని రెచ్చగొట్టేదిగాని యిప్పుడు అది చెప్పలేనంత నీచంగా పరిహాసాస్పదంగా కనిపించింది. యిక్కడ రోజురోజుకీ యింకా స్వేచ్ఛగా యింకా యింకా మనిషిగా వున్నట్టు భావించాడు. తన వూహలు చిత్రించిన దానికి పూర్తి భిన్నంగా వుంది కాకసస్. తన కలల్లాంటిదీ, లేకపోతే కాకసస్‌ని గురించి తను చదివీ, వినీ వున్నలాంటిదీ యేమీ కనిపించలేదు. ''ఆ కాకేషియన్ దుస్తులతోటీ, కొండ చరియలతోటీ అమలాత్ బెక్‌లతోటీ, వీరులతోటీ దుర్మార్గుల తోటీ దీని కేమీ సంబంధంలేదు. యీ ప్రజలు ప్రకృతిలాగే జీవిస్తున్నారు: చస్తారు, పుడతారు, కలుస్తారు, యింకా యెక్కువ మంది పుడతారు, పోరాడతారు, తింటారు, తాగుతారు, సంబరపడ

తారు, చస్తారు. యే నిర్బంధాలూ లేవు, ప్రకృతి సూర్యుడిమీదా, గడ్డిమీదా, జంతువులమీదా, చెట్లమీదా విధించేవి తప్ప, వాళ్లకి వేరే నియమాలూ లేవు'' అనుకున్నాడు. అందుకనే వాళ్లు తనతో పోల్చుకుంటే అందంగా శక్తివంతంగా స్వేచ్ఛగా కనిపించారు. వాళ్లని చూడగానే తనమీద తనకే సిగ్గు కలిగింది. తనమీద తనకు విచారం ముంచుకొచ్చింది. ప్రతిదాన్నీ కాలదన్నెయ్యాలనీ, కోసక్ పేరు మీద సమోదు కావాలనీ, ఓ యిల్లూ పశువులూ కొనాలనీ, ఓ కోసక్ స్త్రీని పెళ్లాడాలనీ (మర్యాంకాని కాదు, ఆమెనతడు లుకాష్కకి వదిలేశాడు.) యెరోష్క మామతో వుండాలనీ, అతనితో చేపలు పట్టడానికీ, వేటకీ వెళ్లాలనీ కోసక్కులతో దండయాత్రలకు వెళ్లాలనీ అతనికి నిజంగానే తరుచుగా అనిపించేది. ''నేనెందుకు అలా చెయ్యను? నేను దేని కోసం ఆగుతున్నాను?'' అనుకునేవాడు. తనని తాను ప్రేరే పించుకునేవాడు. తనని తాను తిట్టుకునేవాడు: ''నాకు ధర్మంగా న్యాయంగా కనిపించింది చెయ్యడానికి నేను భయపడుతున్నానా? అమా యకమైన కోసక్‌లాగా ప్రకృతికి చేరువలో జీవించాలనీ, యెవర్నీ గాయ పరచకూడదనీ, అందరికీ మేలు చెయ్యాలనీ నాకు కలిగిన కోరిక నా మునుపటి కలలకంటే, ఓ మంత్రి కావాలనో, కర్నల్ కావాలనో అను కునే దానికంటే వెధవదా?'' కాని అతను ఆగాలనీ, యే నిర్ణయమూ తీసుకోగూడదనీ యేదో అంతర్వాణి చెప్పేది. తను యెరోష్కలాగా, లుకాష్కలాగా యెలాగూ పూర్తిగా బతకలేననే అస్పష్ట చైతన్యం అతన్ని నిలబెట్టేది, యెందుకంటే అతనికి ఆనందం అంటే భిన్నమైన వూహలు వున్నాయి — ఆత్మపరిత్యాగంలోనే ఆనందం వుందనే ఆలోచన అతన్ని వెనక్కి లాగేది. అతను లుకాష్కకి చేసింది యింకా ఆనందం యిస్తూనే వుంది. మిగిలిన వాళ్ల కోసం తను ఆత్మార్పణ చేసుకునే అవకాశాల కోసం అతను వెదుకుతూనే వున్నాడు. కాని అవి తగల్లేదు. ఒకో అప్పుడు ఆనందం కోసం తను నూతనంగా కనిపెట్టిన ఔషధం

మరిచిపోయేవాడు. యెరోష్కా మామ జీవితంతో తన జీవితం అవినా భావంగా అయిపోవడం సాధ్యమే ననుకునేవాడు. కాని వెంటనే తేరు కునేవాడు. తక్షణం చైతన్యపూరితమైన ఆత్మపరిత్యాగ భావాన్ని పట్టు కునేవాడు. ఆ పునాదిమీద నిబ్బరంగా గర్వంగా అందరు మనుషుల్నీ వాళ్ల ఆనందాన్నీ దర్శించేవాడు.

## 27

ద్రాక్షపళ్ల కోతకి సరిగా ముందు, ఒలేనిన్‌ని చూడ్డానికి లుకాష్కా గుర్రంమీద వచ్చాడు. ముందెప్పుడూ లేనంత ఉత్సాహంగా కనిపించాడు.

''ఆఁ, పెళ్లి చేసుకుంటున్నావా?'' అడిగాడు ఒలేనిన్, సంతోషంగా అతన్ని పలకరిస్తూ.

లుకాష్కా తిన్నగా సమాధానం చెప్పలేదు.

''యిదిగో యేటవతల మీ గుర్రాన్ని బదలాయించేశాను. యిదీ గుర్రం అంటే! లోవ్* గుర్రపుశాలనుంచి కబర్డా గుర్రం. నాకు గుర్రాల గురించి తెలుసు.''

ఆ కొత్త గుర్రాన్ని వాళ్ళు పరీక్షించారు. దాన్ని ముంగిట్లో కుడి వేపూ యెడంవేపూ నడిపించారు. ఆ గుర్రం నిజంగా అరుదైన ఒకటో రకంది. యెరుపూ గోధుమ రంగూ వుండి, కచ్చకొట్టింది. శరీరం వెడల్పుగా, పొడుగ్గా వుంది. మెరిసే బొచ్చూ, మందమైన పట్టుకుచ్చుతోకా, మెత్తటి జూలూ, మేలుజాతి తురాయీ వున్నాయి. అది యెంత బాగా మేపిన గుర్రమంటే లుకాష్కా చెప్పినట్టు, ''దాని వీపుమీద నిద్రపోవచ్చు.'' దాని గిట్టలూ, కళ్ళూ, పళ్లూ అద్భుతంగా రూపుదీరి విస్పష్టమైన ఆకార రేఖల్తో వున్నాయి. అలాంటిది

---

* లోవ్ గుర్రాలశాల కాకసస్‌లోకెల్లా మేలైన వాటిల్లో ఒకటని భావించే వారు. (లియో టాల్‌స్టాయ్ వివరణ.)

మేలు జాతి గుర్రాల్లోనే కనిపిస్తుంది. ఒలేనిన్ ఆ గుర్రాన్ని మెచ్చుకోకుండా వుండలేకపోయాడు. అలాంటి సుందరమైన గుర్రాన్ని కాకసస్‌లో అతనింకా చూళ్లేదు.

"యెలా నడుస్తుందో చూడండి!" అన్నాడు లుకాష్కా గుర్రం మెడ తడుతూ. "యేం నడక! యెంత తెలివైంది — యజమాని ననుసరించే పోతుంది."

"బదలాయింపుకి నువ్వు యెక్కువ అచ్చుకోవాల్సి వచ్చిందా?" అని అడిగాడు ఒలేనిన్.

"దాన్దేముంది లెండి, ఓ కునాక్‌నుంచి సంపాయించాను" అన్నాడు లుకాష్కా చిరునవ్వు నవ్వుతూ.

"అద్భుతంగా అందంగా వుండే గుర్రం! దీన్ని యెంత కిస్తావో చెప్పు!" ఒలేనిన్ అడిగాడు.

"దీనికి నూట యాభై రూబుళ్లు యిస్తామన్నారు. కాని మీకు వూరికే యిచ్చేస్తాను. వూఁ, అనండి యిది మీదే. దీని జీను తీసేస్తాను, దీన్ని మీరు తీసుకోవచ్చు. కానీ నా పనుల కోసం యేదో గుర్రం లాంటిది యివ్వండి చాలు" లుకాష్కా ఉల్లాసంగా అన్నాడు.

"అహఁ, వద్దు, యేమీ వద్దు."

"సరే అయితే, మీకో బహుమానం యిదిగో చూడండి" అన్నాడు లుకాష్కా నడుం వదులుచేసుకుని. అక్కణ్ణుంచి వేలాడే రెండు బాకుల్లో ఒకటి తీశాడు. "యేటి అవతల సంపాయించాను."

"ఓ, కృతజ్ఞుణ్ణి."

"అమ్మ మీకు కొన్ని ద్రాక్షపళ్ళు తనే తెచ్చి యిస్తానంది."

"యేంవొద్దు, అనవసరం. ఓ రోజున చూసుకుందాం. చూడు యీ బాకుకి నీకేమన్నా సొమ్ము యిస్తున్నానా?"

"యెలా యిస్తారు! మనం కునాక్‌లం కదా. గిరీఖాన్‌తో కూడా సరిగ్గా యింతే. యేటవతల నన్ను అతను వాళ్ళింటికి తీసికెళ్లి 'నీ

యిష్టం వచ్చింది యెంచుకో!' అన్నాడు. అంచేత నేనీ బాకుని తీసుకున్నాను. అది మా ఆచారం.''

వాళ్ళు యింట్లోకి వెళ్లి కొంచెం మద్యం తాగారు.

''యింకా యిక్కడ వుంటావా?'' అడిగాడు ఒలేనిన్.

''ఉహుఁ, చెప్పిపోదామని వచ్చాను. వాళ్లు నన్ను సైనిక చౌకీ నుండి టెరెక్ అవతలి పటాలానికి పంపిస్తున్నారు. నేనీ రాత్రికే నా మిత్రుడు నజార్కతో పోతున్నాను.''

''మరి పెళ్ళెప్పుడు?''

''ప్రధానం చేసుకోడానికి వస్తాను. మళ్లీ పటాలానికి తిరిగి వెళ్లి పోతాను'' లుకాష్క అయిష్టంగా జవాబిచ్చాడు.

''యేమిటీ, పెళ్లికూతుర్ని కలుసుకోవూ?''

''అంతే మరి – ఆమెని చూడ్డం వల్ల యేమిటి లాభం? మీరు దండయాత్రకి వస్తే మా పటాలంలో భారీ లుకాష్క అని అడగండి. అక్కడున్న అడివిపందులు యెన్నని! నేను రెండింటిని చంపాను. నేను మిమ్మల్ని తీసికెడతాను.''

''మంచిది సెలవ్. దేవుడు నిన్ను చల్లగా చూస్తాడు.''

లుకాష్క గుర్రం యెక్కాడు. మర్యాంకాని చూడకుండా, గుర్రాన్ని కుడివేపూ యెడంవేపూ వూగిస్తూ వెళ్లిపోయాడు వీధిలో. అక్కడ నజార్క అతని కోసం యెదురుచూస్తున్నాడు.

''యేమిటీ ఓ సారి చూసిపోవద్దూ?'' నజార్క అడిగాడు యామ్కా యింటికేసి కన్ను గీటుతూ.

''సరే'' అన్నాడు లుకాష్క. ''యిదిగో నా గుర్రం అక్కడికి తీసుకుపో. నేను త్వరగా రాకపోతే దానికి కొంచెం గడ్డి వెయ్యి. నేనె లాగైనా పొద్దుటికి పటాలం చేరతాను.''

''ఆ కేడెట్ నీకు యింకేమీ యివ్వలేదా?''

''బాకుతో అతని బాకీ తీర్చేసినట్టే – నా గుర్రం అడగబోయాడు''

గుర్రం దిగి, దాన్ని నజార్కకి అప్పజెపుతూ అన్నాడు లుకాష్క.

ఒలేనిన్ గది కిటికీ దాటుకుని, అతను ముంగిట్లోకి దూసుకు పోయాడు. కేతనధారి యింటి కిటికీ దగ్గరికి వచ్చాడు. అప్పటికే బాగా చీకట్టైంది. మర్యాంకా ఒక్తి గాగరా మాత్రమే తొడుక్కుని తల దువ్వుకుంటోంది. పడక్కి ఉపక్రమిస్తోంది.

"యిదిగో, నేను" మెల్లిగా అన్నాడా కోసక్.

మర్యాంకా చూపు కఠినంగా ఉదాసీనంగా వుంది, కాని ఆమె పేరు పిలవడం వినగానే హఠాత్తుగా ముఖం వికసించింది. కిటికీ తెరిచి తొంగి చూసింది, భయంగా, సంతోషంగా.

"యేమిటి, యేం కావాలి నీకు?" అందామె.

"తెరు!" గుసగుసలాడేడు లుకాష్క. "ఓ క్షణం లోపలికి రానీ. కాచుకుని వుండటం మహా యిబ్బందిగా వుంది!"

కిటికీలోనుంచే ఆమె తల చేతిలోకి తీసుకుని, ముద్దు పెట్టుకున్నాడు.

"వూఁ, తెరు!"

"యెందుకు చెత్త మాట్లాడతావు? నే చెప్పాను తెరవనని. చాలా రోజులుంటావా?"

అతను మాట్లాడలేదు. కాని ఆమెని ముద్దు పెట్టుకుంటూనే వున్నాడు. ఆమె మళ్లీ అడగలేదు.

"అబ్బ, సరిగ్గా నీచుట్టూతా చెయ్యి కూడా పెట్టలేకపోతున్నాను, కిటికీలోనుంచి" అన్నాడు లుకాష్క.

"అమ్మడూ, మర్యాంకా!" ఆమె తల్లి మాట వినిపించింది. "ఎవరూ?"

లుకాష్క టోపీ తీసేశాడు గుర్తుపట్టడానికి లేకుండా. కిటికీకింద ఒదిగిపోయాడు.

"పో, త్వరగా!" అంది మర్యాంకా మెల్లిగా. "లుకాష్క వచ్చాడు, నాన్న కావాలట" అందామె.

''అలాగా! అతన్నిక్కడకి పంపించు.''

''వెళ్లిపోయాడు, హడావుడిగా వున్నాట్ట.''

నిజానికి లుకాష్క వంగుని, పెద్ద అంగలు వేస్తూ కిటికీ కింద నుంచి దొడ్లో పరిగెత్తి యామ్కా యింటికి పోయాడు ఒలేనిన్ తప్ప యెవరూ చూడకుండా. రెండు గిన్నెల చిఖిర్ తాగాక అతనూ, నజార్కా ఊరికవతలకి స్వారీ చేసుకుంటూ పోయారు. ఆ రాత్రి వెచ్చగా, చీకటిగా, ప్రశాంతంగా వుంది. వాళ్లు నిశ్శబ్దంగా స్వారీ చేసుకుపోయారు. వాళ్ల గుర్రాల గిట్టల చప్పుడు మాత్రం వినిపించింది. లుకాష్క కోసక్ మింగల్ మీద పాట ప్రారంభించాడు. కాని మొదటి చరణం పూర్తవకుండానే ఆపేశాడు. కొంచెం సేపాగి నజార్కాకేసి తిరిగి అన్నాడు:

''నన్ను లోపలికి రానియ్యలేదురా!''

''ఆఁ! నాకు తెలుసు అది రానియ్యదని. యామ్కా నాకేం చెప్పిందో తెలుసా? ఆ కేడెట్ వాళ్లింటికి పోతున్నాట్ట. యెరోష్కా మామ ఆ కేడెట్‌కి మర్యాంకాని కలిపినందుకు ఓ తుపాకీ కొట్టేశానని డబ్బాలు కొడుతున్నాట్ట'' అన్నాడు నజార్కా.

''వాడు అబద్ధం చెప్తాడు ముసలి వెధవ!'' అన్నాడు లుకాష్క కోపంగా. ''అది అలాంటి పిల్ల కాదు. ఆ ముసలి వెధవ సరిగా వుండకపోతే ఓ సారి వాడి భరతం పడతాను.'' మళ్లీ తన కిష్టమైన పాట అందుకున్నాడు:

ఇజ్మయ్‌లొవొ గ్రామంబునుంచి
యజమాని ప్రియమైన తోటలోనుంచి
యెగిరిపోయెను తన గూటిలోనుంచి
మిలమిలా మెరిసేటి కళ్లడేగొకటి,
యువ వేటగాడొకడు వెంటబడ్డాడు,
సౌంజ్ఞతో పిలిచాడు దరిచేర రమ్మని.

"రా, డేగ, రమ్మ నా కుడి చేతిపైకి
నువ్వు రాకుంటేను కిరస్తాను జారు
యెత్తైన కొయ్యపై ఉరితీయు నన్ను."
మెరయు కన్నుల డేగ మాట్లాడె నిట్లు:
"బంగారు పంజరం తేలేవు నాకు
కుడి చేతిపై నన్ను పట్టుకోలేవు.
అంచేత పోతాను దూర దూరంగా
నీలంపు సంద్రాని కెగురుకుపోతా
తెల్ల హంసను చంపి అక్కడే నేను
తింటాను సుష్టుగా హంస మాంసమ్ము."

## 28

నిశ్చితార్థం కేతనధారి యింట్లో జరుగుతోంది. లుకాష్కా గ్రామానికి తిరిగి వచ్చాడు, కాని ఒలేనిన్‌ని చూడ్డానికి వెళ్లలేదు. పిలిచినా కూడా ఒలేనిన్ నిశ్చితార్థానికి వెళ్లలేదు. ఆ కోసక్ గ్రామంలో స్థిర పడ్డప్పట్నుంచీ యెన్నడూ లేనంత విచారంగా వున్నాడతను. లుకాష్కా మంచి డాబైన బట్టలు వేసుకుని సాయంత్రం తల్లితో కేతనధారి ఇంటికి వెళ్లడం చూసాడతను. లుకాష్కా తనంటే యెందుకంత నిరాదరంగా వున్నాడోనని చీకు పడ్డాడు. ఒలేనిన్ తన యింట్లో తలుపేసుకుని దినచర్య రాసుకోవడం మొదలెట్టాడు.

"యీమధ్య యెన్నో విషయాలు ఆలోచించాను. యెంతో మారిపోయాను. తిరిగి వరవడిసూత్రానికి వచ్చాను: ఆనందాని కున్న ఒక్క దారీ ప్రేమించడం, ఆత్మపరిత్యాగంగా ప్రేమించడం, ప్రతిదాన్నీ ప్రతివాణ్నీ ప్రేమించడం. ప్రేమ వలను అన్ని వేపులా పరచడం,

దానికిందికి వచ్చే అందర్నీ గ్రహించడం. యీ రకంగా నేను వస్యూషనీ, యెరోష్కా మామనీ, లుకాష్కనీ, మర్యాంకానీ పట్టాను.''

ఒలేనిన్ యీ వాక్యం పూర్తిచేస్తూండగానే యెరోష్కా మామ గదిలోకి వచ్చాడు.

యెరోష్కా ఆనంద డోలికల్లో వూగిపోతున్నాడు. అంతకు కొన్ని రోజుల ముందు ఒలేనిన్ అతన్ని చూడ్డానికి వెళ్లాడు. అప్పుడతను చిన్న బాకు తీసుకుని ముంగిట్లో అడివిపంది చర్మం నేర్పుగా వొలుస్తూ గర్వంగా ఆనందంగా వున్నాడు. కుక్కలు (వాటిలో అతని ప్రియమైన లియామ్ కూడా వుంది) అతనికి దగ్గర్లోనే, అతను యేం చేస్తున్నాడో చూస్తూ, మెల్లిగా తోకలు ఆడిస్తూ కూర్చున్నాయి. కంచె అవతలి నుంచి కుర్రవాళ్లు తనకేసి గౌరవంగా చూస్తూ వున్నారు. వాళ్ల మామూలు ప్రకారం అతన్ని యేడిపించడం లేదు. మామూలుగా అతనిపట్ల ఆదరంగా వుండని యిరుగుపొరుగు అమ్మలక్కలు అతనికి వంగి దణ్ణాలు పెట్టారు. ఒకామె కూజా నిండా చిఖిర్ తెచ్చింది. యింకొకావిడ గడ్డమీగడ, మరో ఆవిడ కొంచెం పిండీ తెచ్చారు. ఆ మర్నాడు యెరోష్కా రక్తంతో పులుముకుపోయి కొట్టుగదిలో కూర్చున్నాడు. పంది మాంసం పౌన్లకొద్దీ పంచాడు. కొందరి దగ్గర్నుంచి డబ్బు, మిగతా వాళ్లనుంచి వైన్ తీసుకున్నాడు చెల్లింపుగా. అతని మొహం స్పష్టంగా తెలియజేసింది: ''భగవంతుడు నాకు అదృష్టం యిచ్చాడు, నేను పందిని చంపాను; అంచేత నేను అందరికీ కావాలి.'' దాని సహజ పరిణామం యేమిటంటే అతను వరసగా నాలుగు రోజులు తాగాడు, వూరు వదిలివెళ్లనే లేదు. దానికి తోడు నిశ్చితార్థం దగ్గరా తాగడానికి కొంత దొరికింది.

ఒలేనిన్ దగ్గరికి పూటుగా తాగే వచ్చాడు. అతని ముఖం యెర్రగా వుంది. అతని గడ్డం చిక్కులు పడివుంది. కాని, బంగారు జరీ అల్లికతో షోకు చేసిన కొత్త యెర్ర బెష్మెత్ తొడుక్కున్నాడు.

తనతోటి ఒక బాలలైకా* తెచ్చాడు. దాన్ని నది అవతల సంపాదించాడు. ఒలేనిన్‌కి యెప్పట్నుంచో ఆ సంగీత విందు వాగ్దానం చేసి వున్నాడు. యీ స్థితిలో అది జరిపించాలనిపించింది. అంచేత ఒలేనిన్ రాసుకుంటూ వుండటం అతనికి విచారం కలిగించింది.

''రాసుకో, రాసుకో, నేస్తం'' అతను మెల్లిగా అన్నాడు, తనకీ ఆ కాగితానికీ మధ్య యేదో దెయ్యం కూర్చున్నట్టూ, దాన్ని తను భయపెట్టకూడదన్నట్టూ మెల్లిగా నెమ్మదిగా నేలమీద చతికిలబడ్డాడు. యెరోష్కా నూమ తాగినప్పుడు అతని ప్రియమైన చోటు నేలే. ఒలేనిన్ చుట్టూతా చూసి కొంచెం వైన్ తెమ్మని కేకేసి రాసుకుంటూ వుండిపోయాడు. తనంతట తనే తాగడం యెరోష్కాకి విసుగనిపించింది. మాట్లాడాలనుకున్నాడు.

''కేతనధారి యింట్లో నిశ్చితార్థానికి వెళ్ళాను. రామ, రామ! వాళ్ళు పందులు! – ఛ, అసహ్యం! – నీ దగ్గరి కొచ్చాను.''

''ఆ బాలలైకా యెక్కడ సంపాయించావు?'' రాసుకుంటూనే అడిగాడు ఒలేనిన్.

''నది అవతల కెళ్ళాను, నేస్తం, అక్కడ సంపాదించాను దీన్ని'' జవాబిచ్చేడు చాలా నిదానంగా. ''యీ వాయిద్యంమీద మనకి అడ్డు లేదు. తాతార్ పాటలు గాని, కోసక్ పాటలు గాని పెద్దమనుషుల పాటలు గాని లేక సైనికుల పాటలు గాని నీ యిష్టం యేవైనా సరే.''

ఒలేనిన్ మళ్లీ అతనికేసి చూసి మందహాసం చేసి రాసుకుంటూ వుండిపోయాడు.

అతని చిరునవ్వు ఆ ముసలాడికి వూపు యిచ్చింది.

''రా, వదిలెయ్యి, నాయనా, వదిలెయ్యి!'' అన్నాడు అతను హఠాత్తుగా, ఖండితంగా. ''రా, నీకెవరో అన్యాయం చేసారు, కాని

---

* రష్యన్ జానపద సంగీత వాయిద్యం. – సం.

వాళ్ల నూనాన వాళ్లని వదిలెయ్యి, వాళ్లమీద ఉమ్మెయ్యి! రా, రాసీ రాసీ యేమిటి లాభం, ఆఁ, యేంటి లాభం?''

నేలమీద తన మందమైన వేళ్లతో కొడుతూ ఒలేనిన్‌ని అనుకరించ బోయాడు, తన వెడల్పాటి మొహాన్ని అసహ్యం వ్యక్తం చెయ్యడానికి వంకరగా తిప్పుతూ.

''ఆకుకీ పోకకీ అందకుండా రాయడంవల్ల యేంటి లాభం? మజా చెయ్యి, మనిషనిపించుకో!''

రాయడం అంటే అతని బుర్రలో వ్యాజ్యపరమైన మోసంతప్ప యింకో వూహ లేదు.

ఒలేనిన్ పగలబడి నవ్వాడు. యెరోష్కా కూడా అలాగే నవ్వాడు. వెంటనే నేలమీదనుంచి గెంతేసి, యెరోష్కా బాలలైకామీద తన నేర్పు ప్రదర్శించడం మొదలెట్టాడు. తాతార్ పాటలు పాడటం మొదలెట్టాడు.

''యెందుకయ్యా రాయడం, ప్రియ మిత్రమా! నే పాడేది విను, మెరుగు. నువ్వు చచ్చాక పాటలు వింటావా. యిప్పుడే హుషారు చెయ్యి!''

మొట్టమొదట తను అల్లిన పాటే, నృత్యం చేస్తూ పాడాడు.

ఆ, దీదిదీ దీదీదీ
మొదటి సారాళ్లతన్ని చూసినప్పుడు
వున్నాడెక్కడ అతగాడు?
సంతకాడ పాకలో వున్నాడు
అక్కడ సూదు లమ్ముతున్నాడు.

ఆ తర్వాత తన మునపటి సార్జంట్ మేజర్ స్నేహితుడి దగ్గర నేర్చుకున్న పాట పాడాడు:

గాఢమైన ప్రేమలో సోంవారం పడ్డాను
మంగళారం యేం లేదు హుస్సురన్డం తప్ప
బుధవారం ప్రేమంతా ఒలక బోశేసాను
గురువారం బదులు కోసం యెదురుచూశాను
శుక్రోరం సందెవేళ ఆలస్యంగా వచ్చింది
అప్పుడే అయ్యాయి ఆశలన్నీ భగ్నం!
శనివారం తీర్మానం చేసేసుకున్నాను
వీరుళ్ళా నా బతుకు చాలించుకోవాలని
కానీ నా జీవితాన ముక్తి కోసం
ఆదివారం అభిప్రాయం మార్చుకున్నాను.

మళ్ళీ పాడేడు:

ఆ, డీడీడీ డీడీడీ
మొదటి సారాళ్లాతన్ని చూసినప్పుడు
వున్నాడెక్కడ అతగాడు?

ఆ తర్వాత కన్ను గీటుతూ భుజాలెగరేస్తూ, లయబద్ధంగా కాళ్ళ తాటిస్తూ అతను పాడాడు:

నిన్ను ముద్దెట్టుకుంటాను, కౌగలించుకుంటాను,
యెర్రటి రిబ్బన్ను నీ చుట్టూ కడతాను,
నా బుల్లిచుల్లివని నిన్ను పిలుచుకుంటాను
ఓయ్! బుల్లిమల్లి సెప్పవే నాకు,
నేనంటే సత్తెంగా నీకు మనసేనా?

అతను యెంత ఆవేశపడిపోయాడంటే హఠాత్తైన వూపులో గది చుట్టూతా ఒక్కడూ నాట్యం చెయ్యడం మొదలెట్టాడు.

''దీదీదీ'' పాటల్లాంటివి – ''పెద్దమనుషుల పాటలు'' – ఒలేనిన్ కోసం పాడాడు. కాని యింకో మూడు లోటాల చిఖిర్ పడ్డాక పాత రోజులు గుర్తు కొచ్చి అచ్చమైన కోసక్ పాటలూ, తాతార్ పాటలూ పాడ్డం మొదలెట్టాడు. అతని కిష్టమైన పాటల్లో ఒకదాన్ని పాడే టప్పుడు మధ్యలో అతని గొంతు అకస్మాత్తుగా వణికింది. అతను పాడ్డం మానేసాడు. వూరికే బాలలైకాని మీటుతూ వుండిపోయాడు.

''ఓహ్, నా ప్రియమైన నేస్తం!'' అన్నాడతను.

అతని గొంతులోని కొత్తదనం ఒలేనిన్‌ని వెనక్కి చూసేటట్టు చేసింది. ఆ ముసలాడు యేడుస్తున్నాడు. అతని కళ్లల్లో నీళ్లు నిలిచాయి. ఓ కన్నీటి బిందువు చెంపలమీద జారింది.

''మీరు వెళ్లిపోయారు నా చిన్ననాటి రోజులూ, మళ్లీ యెన్నటికీ రారు!'' వెక్కుతూ చెప్పి ఆగాడు. ''తాగు, తాగవేం!'' చెవులు దిమ్మెలు పడేటట్టు అరిచాడు, కన్నీళ్లు తుడుచుకోకుండానే.

ఒక తాతార్ పాట అతన్ని మరీ కదిలించివేసింది. దాంట్లో మాటలు కొద్దిగానే వున్నాయి, కాని దాని అందం అంతా విచారకరమైన పల్లవిలో వుంది: ''ఆయ్ దాయ్, దాలాలాయ్!'' యెరోష్కా ఆ పాటలోని మాటల్ని అనువాదం చేసాడు: ''ఒక యువకుడు వూరినుంచి గొర్రెల్ని కొండల్లోకి తోలుకెళ్లాడు. రష్యన్లు వచ్చి వూరుని తగల పెట్టారు, మగాళ్లందర్నీ చంపేశారు, ఆడాళ్లందర్నీ బందీ చేశారు. ఆ యువకుడు కొండల్లోనుంచి తిరిగివచ్చాడు. వూరు వుండాల్సిన చోట మరు భూమి వుంది; అతని తల్లి లేదు, సోదరుల్లేరు, యిల్లు లేదు, ఒక చెట్టు మాత్రం నిటారుగా వుంది. ఆ యువకుడు ఆ చెట్టుకింద కూర్చుని యేడ్చాడు. 'నీ లాగే నేనూ యేకాకిగానూ.' అంటూ పాడటం మొదలెట్టాడు: 'ఆయ్, దాయ్, దాలాలాయ్!' '' ముసలాడు యీ రోదనాత్మక హృదయ విదారకమైన పల్లవిని యెన్నో సార్లు పాడాడు.

ఆ చరణం పూర్తి చెయ్యగానే యెరోష్కా గోడని వేలాడే తుపాకీని

హఠాత్తుగా లొక్కాని ముంగిట్లోకి ఒక్క ఉదుటున వెళ్లి రెండు గొట్టాలూ గాలిలోకి పేల్చాడు. అప్పుడు మొదలెట్టాడు యింకా దీనాలాపంగా, "ఆయ్, దాయ్, దాలాలాయ్, ఆఁ, ఆఁ —" ఆపుచేశాడు.

ఒలేనిన్ అతన్ననుసరించి గుమ్మంలోకి వెళ్లాడు. ఆ గుళ్లు దూసుకుపోయిన వేపు, ఆ నక్షత్రాకాశంలోకి మౌనంగా చూసాడు. కేతనధారి యింట్లో దీపాలు వెలుగుతున్నాయి. కంఠధ్వనులు వినిపిస్తున్నాయి. ఆడపిల్లలు గుమ్మం దగ్గరా, కిటికీల దగ్గరా మూగారు. యింట్లోకీ, అవతలి యింట్లోకీ, ముందుకీ, వెనక్కీ పరిగెడుతున్నారు. కోసక్కులు కొందరు యింట్లోనుంచి యివతలికి పరిగెత్తుకొచ్చి వెర్రిగా కేకలేస్తూ యెరోష్క మామ పాట పల్లని చరణాన్నీ అతని కాల్పుల్నీ ప్రతి ధ్వనించడం మొదలెట్టారు.

"నువ్వు నిశ్చితార్థం దగ్గర యెందుకు లేవు?" అడిగాడు ఒలేనిన్.

"పోనీ, వదిలెయ్యి! పోనీ, వదిలెయ్యి!" గొణిగాడు ఆ ముసలాడు. యేదో అతని మనస్సుకి కష్టం కలిగించిందనడం స్పష్టం. "వాళ్లంటే నాకు పడదు. ఆ మనుషులు! వెనక్కి యింట్లోకి రా. వాళ్ల సంబరం వాళ్లని యేడవనీ. మనం మనంతట సంబరం చేసుకుందాం."

ఒలేనిన్ లోపలికి వెళ్లాడు.

"లుకాష్క సంగతేమిటి? అతను సంతోషంగా వున్నాడా? నన్ను చూడ్డానికి రాడా?" అడిగాడతను.

"లుకాష్కయేనా? తన పిల్లని నీకప్పగిస్తున్నానని వాడికి అబద్ధాలు చెప్పారు" గుసగుసలాడేడు ముసలాడు. "కాని ఆ పిల్లేమిటి? కావాలనుకుంటే ఆ పిల్ల మనదే. సరిపడా సొమ్ము పడెయ్యి — అది మనదే. దాన్ని నీకు కుదిర్చేస్తాను. నన్ను నమ్ము. తప్పకుండా కుదిర్చేస్తా."

"వద్దు మామా, ఆమె నన్ను ప్రేమించకపోతే డబ్బేం చేస్తుంది? అలా మాట్లాడద్దు దయచేసి!"

"వాళ్లు మనమంటే యిష్టపడరు, నువ్వన్నా, నేనన్నా. మనం అనాథలం" హఠాత్తుగా అన్నాడు యెరోష్కా మామ, మళ్లీ యేడవడం మొదలెట్టాడు.

ఆ ముసలాడి మాటలు వింటూ, ఒలేనిన్ మామూలుకంటే యెక్కువ తాగాడు. "నా లుకాష్కా ఆనందంగా వున్నాడన్న మాట" అనుకున్నాడు; అయినా అతనికి యెందుకో విచారంగా వుంది. ముసలాడా రాత్రి యెంత తాగాడంటే నేలమీద పడిపోయాడు. తనకి సాయం చెయ్యడానికి వన్యూష సైనికుల్ని పిలవాల్సి వచ్చింది. ఆ ముసలాడ్ని అవతలకి యీడుస్తూ "ఛూ" అని ఉమ్మేసాడు. ఆ ముసలాడి ప్రవర్తన అతనికెంత కోపం తెప్పించిందంటే అతను ఫ్రెంచిలో యేదో ఒకటి చెప్పడం కూడా మర్చిపోయాడు.

## 29

అది ఆగస్టు నెల. రోజుల తరబడి ఆకాశం నిర్మలంగా వుంది. యెండ భరించలేనట్టుగా పేల్చేస్తోంది. ఉదయాన్నుంచే వేడి గాలి తిన్నెలమీదనుంచీ, రోడ్డుమీదనుంచీ యిసకని లేపి తుంగమీదకీ, చెట్లమీదకీ, గ్రామాలమీదకీ మోసుకుపోతోంది.

గడ్డీ చెట్లమీది ఆకులూ దుమ్ము కొట్టుకుపోయాయి; రోడ్లూ, యెండిపోయిన ఉప్పు పర్రలూ వూడ్చిపెట్టుకుపోతూ కాలికింద శబ్దం చేస్తున్నాయి. టెరెక్‌లో నీళ్లు యెప్పుడో తగ్గిపోయాయి. మిట్టల్లో నీళ్లూ వేగంగా మాయమైపోతున్నాయి. వూరి దగ్గర పశువుల తొక్కిడి తగిలి చెరువు బంక గట్లు ప్రత్యక్షమయ్యాయి. రోజంతా నీళ్లు చిందే చప్పుడూ స్నానాలాడే పిల్లల కేరింతాలూ వినిపిస్తాయి. మైదానాల్లోని యిసక తిన్నెలమీది గడ్డీ రెల్లూ యెండిపోతున్నాయి. పశువులు అరుస్తూ పగలు పొలాల్లోకి పరిగెత్తేవి. దూరపు రెల్లు

భూముల్లోకీ, పెరెక్ అవతల కొండల్లోకీ అడివి జంతువులు వలస పోయాయి. పల్లపు ప్రాంతాలమీదా, గ్రామాలమీదా దోమలూ, నుసుళ్లూ దట్టమైన మేఘాల్లా ముసురుకున్నాయి. హిమశిఖరాలు బూడిద రంగు పొగమంచుతో కప్పడి పోయాయి. గాలి పలచబడింది. ఉక్క. అబ్రెక్కులు లోతు లేని నదిని దాటారనీ, నది యివతలి పక్క తారాడుతున్నారనీ అనుకుంటున్నారు. ప్రతి సాయంత్రమూ సూర్యుడు ప్రకాశమానమైన యెర్రటి మంటతో అస్తమించేవాడు. సంవత్సరంలో చాలా పని ఒత్తిడిగా వుండే కాలమది. వూళ్లో వాళ్లంతా కర్బూజా తోటల్లోనూ, ద్రాక్షతోటల్లోనూ మూగేవారు. దట్టంగా, పచ్చగా అల్లుకు పోయిన తీగెలతో ద్రాక్షతోటలు చల్లగా చిక్కని నీడతో వుండేవి. ప్రతి చోటా పండి, భారంగా వుండే నల్లటి గుత్తులు వెడల్పాటి స్ఫటికంలాంటి ఆకుల మధ్యనుంచి తొంగిచూశాయి. నల్లని ద్రాక్షలు నిండా పేర్చిన బళ్లు తోటల్లోనుంచి కీచుమంటూ మట్టి రోడ్డుమీద కదిలాయి. ద్రాక్ష గుత్తులు చక్రాలకింద నలిగి దుమ్ములో పడి వున్నాయి. మొగపిల్లలూ ఆడపిల్లలూ ద్రాక్ష రసం మరకలున్న చొక్కాలూ పరికిణీలూ తొడుక్కుని చేతుల్లోనూ నోళ్లల్లోనూ ద్రాక్ష పళ్లతో తల్లుల వెనకాల పరిగెట్టారు. బలిష్ఠమైన భుజాలమీద ద్రాక్ష పళ్ళ బుట్టలు పెట్టుకుని చిరిగిన బట్టల కూలీలు రోడ్డుమీద ప్రవాహంలాగా వస్తూ తగుల్తూ వుంటారు. అలాగే కళ్ల దాకా రుమాళ్లు కట్టుకుని, నిండుగా ద్రాక్ష పళ్ళు నింపిన బళ్లకి కట్టిన యెద్దులని తోలుతూ వుండే కోసక్ ఆడవాళ్లు తగుల్తూ వుంటారు. వాళ్లకి తటస్థపడే సైనికులు ద్రాక్ష పళ్ళు అడుగుతారు. ఆ ఆడవాళ్ళు బళ్లాపకుండానే పైకెక్కి చేతులనిండా ద్రాక్ష పళ్ళు తీసుకుని ఆ సైనికుల కోటు జేబుల్లో పోస్తారు. కొన్ని యిళ్ల పరిసరాల్లో అప్పుడే పళ్లనుంచి రసం తియ్యడం మొదలెట్టారు. గాలి ఆ ద్రాక్ష తొక్కల వాసనతోటి నిండిపోయింది. ఆవరణల్లోని షెడ్లలో వున్న తొట్టెలు రక్తారుణంగా

కనిపిస్తున్నాయి. లాగులు పైకి మడిచి, ద్రాక్ష రసంతో కాళ్ళు మరకలైన నోగాయ్ శ్రామికులూ కనిపిస్తారు. గురగురలాడే పందులు ఆ ఖాళీ తొక్కలు మింగుతూ వాటిలో పొర్లాడుతున్నాయి. అవతలి యిళ్ళ చదునైన కప్పులన్నీ యెండలో యెండే నల్లని గుత్తులతో నిండిపోయాయి. కాకులూ కిచకిచలాడే పిట్టలూ ఆ కప్పులమీద గుంపుగా పోగై గింజలు యేరుకుంటూ ఓ చోటినుంచి యింకో చోటికి యెగురుతూ వుంటాయి.

సంవత్సర శ్రమ ఫలితాలు ఉల్లాసంగా పోగుచేస్తున్నారు. యీ సంవత్సరం ఆ ఫలితాలు మామూలు కంటే దివ్యంగానూ, పుష్కలంగానూ వున్నాయి.

పచ్చని గుబురు ద్రాక్షతోటల్లో, ద్రాక్ష తీగల సముద్రంలో అన్ని వైపులా నవ్వులూ, పాటలూ, ఉత్సాహమూ, ఆడవాళ్ల కబుర్లూ వినిపిస్తున్నాయి. వాళ్ల కాంతివంతమైన రంగుబట్టల మెరుపు కనిపిస్తోంది.

సరిగ్గా మిట్ట మధ్యాహ్నం వేళ తమ ద్రాక్షతోటలో శప్తాల పళ్ళ చెట్టు నీడలో, యెద్దులు విప్పిన బండికిందనుంచి మధ్యాహ్న భోజనం తీసుకుని కూర్చుంది మర్యాంకా. ఆమెకి యెదురుగా గుర్రం పట్టామీద కేతనధారి (అప్పుడే బడి నుండి తిరిగి వచ్చాడు) ఓ చిన్న కూజానుంచి నీళ్లు పోసుకుని చేతులు కడుక్కుంటూ కూర్చున్నాడు. అప్పుడే చెరువు నుంచి నేరుగా అక్కడికి వచ్చిన ఆమె తమ్ముడు వగురుస్తూ, తన చొక్కా పొడుగు చేతులతో ముఖం తుడుచుకుంటూ భోజనం కోసం నిరీక్షిస్తూ ఆతృతగా తల్లికేసీ, అక్కకేసీ చూసాడు. ఆమె తల్లి యెండకి నల్లబడిన బలమైన చేతుల రెట్టలు మడిచి ద్రాక్ష పళ్ళూ, యెండిన చేపలూ, గడ్డ మీగడా, రొట్టీ కురచ తాతార్ మేజామీద సర్దుతోంది. కేతనధారి చేతులు తుడుచుకుని, టోపీ తీసేసి ప్రార్థన చేసుకుని మేజా దగ్గరికి వెళ్లాడు. ఆ కుర్రాడు కూజా లాక్కుని తాగడం మొదలెట్టాడు. తల్లీ కూతురూ మేజా పక్క బస్కీ వేసి కూచున్నారు.

నీడలో కూడా భరించలేనంత వేడిగా వుంది. ద్రాక్షతోటమీద చేదు వాసన కమ్ముకుంది. అక్కడా అక్కడా వున్న ఖేరీ, శఫ్తాలు, మల్బెరీ చెట్ల అగ్రభాగాల్ని ఒకే రకంగా వూపుతూ వచ్చే వేడిగాలి చల్లదనాన్ని తేలేదు. కేతనధారి మరోసారి ప్రార్థన చేసి వెనకాల ద్రాక్ష ఆకులు కప్పిన చిన్న చిఖిర్ కూజా తీసుకున్నాడు. కూజామూతినుంచి తాగాక దాన్ని ఆ పెద్దావిడకి అందించాడు. అతని ఒంటిమీద చొక్కా తప్ప యేమీ లేదు. దానికి మెడ దగ్గర బొత్తాల్లేవు. అంచేత అతని కండ పుష్టిగల బొచ్చు ఛాతీ కనిపిస్తోంది. అతని నల్చని టక్కరి మొహం ఉల్లాసంగా వుంది. అతని మాటల్లో గాని, అతని వైఖరిలో గాని అతని మామూలు కపటత్వం కనిపించలేదు. అతను ఉల్లాసంగా నిష్కపటంగా వున్నాడు.

"పాక అవతల కాస్త యీ రాత్రికి లాగించేద్దామా?" అడిగాడతను, తడిగా వున్న గడ్డాన్ని తుడుచుకుంటూ.

"చూద్దాం, వాతావరణం బాగా వుంటే" అందామె. "దెమ్‌కిన్లు సగం కూడా లాగించలేదు" అందామె యింకా. "ఊస్తెంకా తనొక్కతే అక్కడ యీదుస్తోంది. నలిగిపోతోంది."

"వాళ్ల గురించి అంతకంటే యేమనుకుంటావ్?" అన్నాడా కేతనధారి గొప్పగా.

"యిదిగో, అమ్మడూ మర్యాంకా, కొంచెం తాగు!" అందా పెద్దావిడ, కూజా ఆ పిల్లకి అందిస్తూ. "దేవుడు మేలు చేస్తే పెళ్లినాడు విందుకి హాయిగా ఖర్చుపెట్టగలం" జతచేసింది ఆ పెద్దావిడ.

"యింకా యెప్పటి మాటోలే" అన్నాడు కేతనధారి మొహం చిట్లిస్తూ.

ఆ పిల్ల తల వాల్చుకుంది.

"యేం, అనుకుంటే తప్పేమిటి? నిశ్చయం అయిపోయింది. ముహూర్తమూ దగ్గర పడుతోంది" అంది పెద్దావిడ.

"యెప్పటి మాటో యిప్పట్నుంచీ ఆలోచనలు చెయ్యకు. యిప్పుడు పంట యింటికి చేరెయ్యాలి" అన్నాడు కేతనధారి.

''లుకాష్క కొత్త గుర్రం చూసారా?'' అడిగింది పెద్దావిడ. ''దీమ్త్రియ్ అంద్రేయిచ్ అతనికిచ్చింది పోయింది. దాన్ని బదలాయించేడు.''

''వుహు, చూళ్లేదు; కాని ఆ నౌఖరుతో మాట్లాడాను. తన యజమానికి మళ్లీ వెయ్యి రూబుళ్లు వచ్చాయని చెప్పాడు'' కేతనధారి అన్నాడు.

''ఐశ్వర్యంలో మునిగి తేలుతున్నాడు, అంతకంటే యింకో మాట లేదు'' అందా పెద్దావిడ.

కుటుంబం అంతా ఉల్లాసంగా సంతృప్తిగా వున్నారు.

పని చురుగ్గా సాగుతోంది. వాళ్లనుకున్న దానికంటే యెక్కువ పుష్కలంగానూ, దివ్యంగానూ వున్నాయి ద్రాక్షపళ్లు. భోజనాల తర్వాత మర్యాంకా యెద్దులకి కొంచెం గడ్డి వేసింది. తన బెష్మెత్‌ని తలగడలాగా చుట్టి చెమ్మగా తడిసిన గడ్డిమీద బండికింద ఒరిగింది. తలకి ఎర్రటి పట్టు రుమాలు చుట్టుకుంది. వెలిసిపోయిన నీలం రంగు గాగరా మాత్రం తొడుక్కుంది. అయినా భరించలేనంత వేడిగా అనిపించింది. ఆమె మొహం మంటగా వుంది. కాళ్లు యెక్కడ పెట్టుకోవాలో తెలీటం లేదు. ఆమె కళ్లు నిద్రతోటీ అలసటతోటీ మసకేసేాయి. ఆమె పెదాలు అప్రయత్నంగానే తెరుచుకున్నాయి. ఆమె వక్షస్థలం భారంగా గాఢంగా నిశ్వసిస్తోంది.

ఆ సంవత్సరంలోని పని రద్దీగా వుండే భాగం ఓ పక్షం రోజుల క్రితమే మొదలైంది. యిప్పుడా పిల్ల జీవితం యెడతెరిపి లేని భారమైన శ్రమతో నిండిపోయింది. తొలిపొద్దుతోనే లేస్తుంది. చన్నీళ్లతో ముఖం కడుక్కుంటుంది. రుమాలు కప్పుకుని చెప్పుల్లేకుండా పశువుల్ని మెయ్యడానికి పోతుంది. అప్పుడు హడావుడిగా చెప్పులు తొడుక్కుని బెష్మెత్ వేసుకుని చిన్న రొట్టె మూట తీసుకుని, బండికి యెద్దుల్ని కట్టి రోజంతా పని చేసేందుకు ద్రాక్షతోటలోకి పోతుంది. అక్కడ ద్రాక్షపళ్లు కోసి బుట్టల్లో మోస్తుంది. ఒక్క గంట విశ్రాంతీ,

విరామం అంతే. అలిసిపోకుండా, కళకళలాడుతూ ఎడ్లని పగ్గాలతో లాగుతూనో, పొడుగాటి కర్రతో తోలుతూనో సాయంత్రం వూళ్లోకి తిరిగివస్తుంది. పశువుల పని చూసాక వెడల్పాటి చొక్కా చేతిలో పొద్దు తిరుగుడు పువ్వుల గింజలు పోసుకుని వాటిని తింటూ మిగిలిన ఆడ పిల్లలతో కులాసాగా గడపడానికి వీధి మొగలోకి పోతుంది. ముంజీకటి పడగానే యింటికి వస్తుంది. తల్లీ, తండ్రీ, తమ్ముడూ, తనూ ఆ చీకటి అవతలింట్లో రాత్రి భోజనం చేస్తారు. ఆరోగ్యంగా నిశ్చింతగా యింట్లోకి వెళ్లి పొయ్యిమీద చపటా యెక్కి సగం మగతగా తమ బస మనిషి చెప్పే కబుర్లు వింటుంది. అతను వెళ్లీ వెళ్లగానే పక్కమీద వాలిపోయి గాఢంగా ప్రశాంతంగా పొద్దుటి దాకా నిద్ర పోతుంది. అలాగ రోజు తర్వాత రోజు గడిచిపోయింది. నిశ్చితార్థం నాటినుంచీ లుకాష్కని ఆమె చూళ్లేదు. వివాహం కోసం నిమ్మ ళంగా చూస్తూవుండేది. తమ బస మనిషికి ఆమె అలవాటు పడి పోయింది. అతని తదేక దృష్టి ఆమెకి హాయి నిచ్చేది.

## 30

యెండ తాపంనుంచి బయటపడే మార్గం లేకపోయినా, బండి చల్లని నీడలో దోమలు ముసురుకున్నా, తమ్ముడు పక్కన పొడుస్తూ వున్నా మర్యాంకా రుమాలు తలమీదకి లాక్కుని నిద్రకి ఉపక్రమించ బోతోంది. అప్పుడు, హఠాత్తుగా, వాళ్ల పొరుగింటి ఊస్తెంకా ఆమె దగ్గరికి పరుగెత్తుకుంటూ వచ్చి, బండికింద దూరి, ఆమె పక్కన వాలింది.

"పడుకోండి, అమ్మాయిలూ, పడుకోండి" అంది ఊస్తెంకా బండికింద తనకి సౌకర్యంగా చేసుకుంటూ. "ఓ క్షణం ఆగు" అరిచిందామె, "యిలాక్కాదు!" ఒక్క ఉదుట్న లేచి కొన్ని ఆకుపచ్చ

కొమ్మలు పీకి బండికి అటూ యిటూ వున్న చక్రాల్లో దోపింది. వాటి మీద బెష్మెత్ కప్పింది. మళ్లీ బండికిందకి దూరుతూ "నన్ను రానియ్యి" అని ఆ పిల్లాడికేసి అరిచింది. "ఓ కోసక్ వుండే చోటు యిదే నేంటి ఆడపిల్లలతోటి? అవతలికి ఫో!"

బండి కింద తన నేస్తంతో ఒక్కత్తీ వుండగానే ఊస్తెంకా తన రెండు చేతులూ ఆమె చుట్టూతా వేసి, దగ్గరగా అదిమి పట్టుకుని, బుగ్గలమీదా మెడమీదా ముద్దెట్టుకోవడం మొదలుపెట్టింది.

"బంగారు కొండా, బంగారు కొండా" అంటూనే వుంది, కీచు మంటూ, తేటగా విరిసే నవ్వుల మధ్య.

"నువ్విదంతా తాతనుంచి నేర్చుకున్నావేంటి? వదులు!" అంది మర్యాంకా పెనుగులాడుతూ.

వాళ్లిద్దరూ యెంత పగలబడి నవ్వారంటే మర్యాంకా తల్లి నోర్మూ సుకొమ్మని అరిచింది.

"నీకు కళ్లు కుడుతున్నాయేం?" అడిగింది మెల్లిగా ఊస్తెంకా.

"ఛీ, ఛీ! పడుకుందాం, రా, దేనికీ వచ్చావ్?"

కాని ఊస్తెంకా అంటూనే వుంది, "దేనికో చెబుతా, కొంచెం తాళు!"

మర్యాంకా మోచేతిమీద లేచి రుమాలు సరిజేసుకుంది.

"వూఁ, యేంటది?"

"మీ యింట్లో అద్దెకున్నాయన గురించి నాకొకటి తెలుసు!"

"తెలుసుకోడాని కేమీ లేదు" అంది మర్యాంకా.

"ఓ, కొంటె పిల్లా!" అంది ఊస్తెంకా మోచేత్తో ఆమెని పొడిచి నవ్వుతూ. "యేం చెప్పదు. అతను నీ దగ్గర కొస్తాడా?"

"వస్తాడు, వస్తే?" అంది మర్యాంకా హఠాత్తుగా సిగ్గుపడుతూ.

"నేనే వెర్రిపీనుగుని! అందరికీ చెప్పేస్తాను. నేనెందుకు నటించాలి?" అంది ఊస్తెంకా. ఆమె ఉత్సాహవంతమైన గులాబీ బుగ్గల మొహం

ఒక్కసారి చింతాక్రాంతం అయింది. ''నేనెవళ్ళకీ అపకారం చెయ్యటం లేదు, యేమంటావ్? నేనతన్ని ప్రేమిస్తున్నాను. అదే, వున్న విషయమంతా.''

''తాతననేగా నీ ఉద్దేశం?''

''ఆఁ!''

''కాని అది పాపం!''

''అబ్బా, మర్యాంకా! యింకా స్వేచ్ఛగా వున్నప్పుడు అవకాశం వాడుకోకపోతే ఆడపిల్లకి సరదా యెప్పుడుంటుంది? నేనో కోసక్కుని పెళ్ళాడితే నాకూ పిల్లలు పుడతారు, ఆ బాదరబందీ అంతానూ. యేం, నువ్వు యికాష్కని పెళ్ళాడితే ఆనందం అనే మాట నీ బుర్ర లోకి రాదు: యెంత సేపూ పనితోనూ, పిల్లలతోనూ సరిపోతుంది!''

''అలాగా! పెళ్ళయిన వాళ్ళా ఆనందంగా వుంటారు. అదేం పెద్ద తేడా వుండదు!'' మర్యాంకా శాంతంగా బదులు చెప్పింది.

''సరేగాని యిది చెప్పు. నీకూ యికాష్కకీ మధ్య యేం గ్రంథం నడిచింది?''

''యేం నడిచింది? అతను సంబంధం అడిగాడు. నాన్న ఓ యేడాది వాయిదా వేసాడు; యిప్పుడది నిశ్చయమైంది. ఆకురాలు కాలంలో పెళ్ళవుతుంది.''

''కాని నీకతనేం చెప్పాడు?''

మర్యాంకా మందహాసం చేసింది.

''యేం చెబుతాడు? నన్ను ప్రేమిస్తున్నానని చెప్పాడు. తనతోబాటు ద్రాక్షతోటల్లోకి రమ్మంటూ వుండేవాడు.''

''యేం పట్టువిడవని ఏకచూర్కుడు! నువ్వు వెళ్ళలేదు, కదూ? అతనెంత తెగువకాడు అయ్యాడు! యీ వూరికే మొనగాడు. సైన్యంలో కూడా మజాగా వుంటాట్ట! మొన్న మా కిర్క వచ్చాడు. 'యికాష్క యెలాంటి గుర్రం సంపాదించాడని!' అన్నాడు వాడు. కాని నేనను

కోవడం నువ్వంటే అస్తమానూ పడి ఛస్తాడని. యింకా యేంచెప్పాడేం?''

''అన్నీ తెలుసుకోవాలా నువ్వు?'' అంది మర్యాంకా నవ్వుతూ. ''ఓ రోజు రాత్రి నా కిటికీ దగ్గరికి తూలుతూ వచ్చాడు గుర్రంమీద; తనని లోపలికి రానియ్యమన్నాడు.''

''నువ్వు రానియ్యలేదా?''

''రానివ్వడమా, సరే! నేనో సారి ఓ మాట అన్నానూ అంటే ప్రాణం పోయినా సరే దానికి కట్టుబడివుంటాను'' అంది మర్యాంకా, గంభీరంగా.

''కాని వాడు భలేవాడ్లే! వాడు కావాలంటే యే పిల్లాకాదన్దు.''

''అలాగా, అయితే అతన్ని వెళ్లమను'' మర్యాంకా గొప్పగా అంది.

''అతనిమీద నీకు కనికరం లేదూ?''

''వుంది. కాని నేను చెత్తగా వుండనియ్యను. అది తప్పు.''

ఊస్తెంకా తటాల్న తన స్నేహితురాలి వక్షంమీద తల వాలేసింది. ఆమెని వాటేసుకుని అణుచుకున్న నవ్వుతో వూగిపోయింది. ''వెర్రి బాగుల్దానా!'' రొప్పుకుంటూ అరిచింది. ''నువ్వు ఆనందంగా వుండా లనుకోవూ?'' మర్యాంకాకి గిలిగింతలు పెట్టడం మొదలెట్టింది.

''ఏయ్, వదులు!'' అంది మర్యాంకా కీచుమని అరుస్తూ, నవ్వుతూ.

''యీ కుర్రముండలూ! యేం తుళ్లుతున్నారు! అలుపేనా లేదు!'' బండిలోనుంచి ఆ పెద్దావిడ నిద్రమత్తు గొంతుక వినిపించింది.

''నీకు ఆనందం అక్కర్లేదూ?'' రెట్టించింది ఊస్తెంకా మెల్లిగా, కొంచెం లేస్తూ. ''కాని నువ్వు అదృష్టవంతురాలివి. నీదీ అదృష్ట మంటే! వాళ్లు నిన్నెంత ప్రేమిస్తారు! నువ్వేమో ముల్లులా వుంటావు, అయినా నిన్ను ప్రేమిస్తారు. ప్చ్, నేనే నీ చోట్లో వుంటేనా యీ పాటికి మీ అద్దెకున్నాయన బుర్ర తిరిగిపోయి వుండేది! నువ్వు మా యింటి కొచ్చినప్పుడు అతన్ని గమనించాను. కళ్లతో నిన్ను మింగెయ్య బోయాడు. తాత నాకేం యిచ్చాడని! కాని మీ యింట్లో వున్నాయన

రష్యన్లందరిలోకీ స్థితిమంతుడట. అతని నౌఖరు చెప్పాడు. వాళ్లకి సొంత దాసులున్నార్ట."

మర్యాంకా నేలమీద ఆనుకుని లేచింది. ఓ క్షణం ఆలోచించి మందహాసం చేసింది.

"అతను, అంటే మా యింటో అద్దెకున్నాయన యేం చెప్పాడో తెలుసా?" అందామె గడ్డి పరకని కొరుకుతూ. "అతనన్నాడు, 'నాకు కోసక్ లుకాష్కలాగానో, మీ సోదరుడు లజూత్కలాగానో వుండాలని పిస్తాందని.' అతని ఉద్దేశం యేమై వుంటుందంటావ్?"

"ఆఁ, వూరికే యేదో బుర్రకి తోచింది చెప్పి వుంటాడు. మా మనిషి యేం చెప్పాడు కాదూ! పిచ్చోడేమో ననిపిస్తుంది!"

మడత పెట్టిన బెష్మెత్ మీద మర్యాంకా తల వాల్చింది. ఊస్తెంకా భుజంమీద చెయ్యివేసి, కళ్లు మూసుకుంది.

"అతనొచ్చి తోటలో పని చేద్దామనుకున్నాడివాళ. నాన్న అతన్ని రమ్మన్నాడు" అందామె కొంచెం సేపాగి. అప్పుడు నిద్రలోకి జారి పోయింది.

## 31

బండికి నీడగా వున్న భేరీచెట్టు వెనకనుంచి యెండ యివతలికి వచ్చింది. ఊస్తెంకా చుట్టేసిన కొమ్మల చాటునుంచి కూడా నిద్ర పోతున్న ఆ పిల్లల మొహాలు కందిపోయేటట్టు యెండ పేల్చేస్తోంది. మర్యాంకా లేచి తల చుట్టూ రుమాలు సవరించుకోవడం మొదలెట్టింది. చుట్టూతా చూసి, భేరీచెట్టు అవతల వున్న తమ బసలోని మనిషిని గమనించింది. అతను భుజాన్న తుపాకీ వేసుకుని తండ్రితో మాట్లాడుతూ వున్నాడు. ఆమె ఊస్తెంకాని పొడిచి, చిరునవ్వు నవ్వుతూ అతనికేసి చూపించింది.

"నిన్న వెళ్లాను నేను, ఒక్కటి దొరికితే ఒట్టు!" ఒలేనిన్

అంటున్నాడు, కొమ్మలగుండా మర్యాంకాని చూశాక, చుట్టూ అసహనంగా వెదుకుతూ.

‘‘అబ్బే, మీరు అలా ఆ దారిలో వెళ్ళాలి ప్రదక్షిణం చేసి. అక్కడ ఓ పాడు పడ్డ ద్రాక్షతోట వుంది, పనికిరానిదని పేరు. అక్కడెప్పుడూ కుందేళ్లు దొరుకుతాయి’’ అన్నాడు కేతనధారి మాటల ధోరణి మారుస్తూ.

‘‘యీ పని రద్దీ రోజుల్లో కుందేళ్ల కోసం వెదుకుతూ పోవడం భలే వుంది! మీరు కాస్త వచ్చి మాకు సాయం చెయ్యండి. ఆడపిల్లల్తో పాటు పన్చెయ్యండి’’ అంది పెద్దావిడ హుషారుగా. ‘‘ఏయ్, పిల్లలూ లేవండి!’’ ఆమె అరిచింది.

మర్యాంకా, ఊస్తెంకా బండికింద గుసగుసలాడుకుంటున్నారు. వాళ్లు తమ నవ్వును యెంత బలవంతంగానేనా సరే ఆపుకోలేకపోయారు.

ఒలేనిన్ లుకాష్కకి యాభై రూబుళ్ల గుర్రం యిచ్చిన సంగతి తెలిసాక, అతని యింటివాళ్లు అతనంటే మరీ ఆదరంగా తయారయారు. ఒలేనిన్‌తోటి తన కూతురికి పరిచయం పెరుగుతూ వుండటం కేతనధారికి మరీ సంతోషమైంది.

‘‘కాని నాకా పని చెయ్యడం యెలాగో తెలీదే’’ అన్నాడు ఒలేనిన్, ఆకుపచ్చ కొమ్మల గుండా బండికిందకి చూడకుండా వుండడానికి ప్రయత్నిస్తూ. అక్కడ నీలం గాగరాతోటీ, యెర్ర రుమాలుతోటీ వున్న మర్యాంకాని అప్పటికే గమనించాడు.

‘‘రండి, మీకు శప్తాల పళ్లు యిస్తా’’ అందా పెద్దావిడ.

‘‘పాత కాలపు కోసక్ ఆతిథ్యం, మా ముసల్దాని చాదస్తం’’ అన్నాడా కేతనధారి, తన భార్య మాటలు వివరించి వాటిని సరిదిద్దుతున్నట్టు. ‘‘రష్యాలో నేననుకోవడం అనాస పళ్లజామ్ లాంటి నిలవేసుకునేవి తినడం అలవాటైనట్టుగా శప్తాలు తినరేమో.’’

‘‘అయితే పాడుపెట్టిన ద్రాక్షతోటలో కుందేళ్లు వుంటాయంటారు?’’ అడిగాడు ఒలేనిన్. ‘‘నేనక్కడికి పోతాను.’’ కొమ్మల్లోకి ఓ సారి

అద్భుతగా చూసి, తన టోపీ యెత్తి అతను పచ్చని ద్రాక్ష వరసల్లోంచి మాయమైపోయాడు.

ఒలేనిన్ తన యింటివాళ్ల ద్రాక్షతోటకు మళ్లేటప్పటికి సూర్యుడు ద్రాక్షతోట కంచె వెనక మణిగాడు. సూర్యుని శిధిల కిరణాలు స్ఫటిక పత్ర సమూహంమీదనుంచి మెరుస్తున్నాయి. గాలి ఆగిపోయింది. ఒక చల్లని హాయి చుట్టూతా పరుచుకుంటోంది. యేదో సహజ ప్రేరణ ద్వారా ఒలేనిన్ దూరంనుంచే, మర్యాంకా నీలం గాగరాని, ద్రాక్ష తీగల వరసల్లో గుర్తించాడు. దారిలో ద్రాక్షపళ్లు యేరుకుంటూ ఆమెని సమీపించాడు. అలిసిపోయిన అతని కుక్క ముందే వెళ్లింది, నేలబారుగా వేళ్లాడే ద్రాక్ష గుత్తుల్ని తన తడి నోటితో లాక్కుంటూ.

ముఖం యెర్రబారి, రెక్కలు మడిచి, దుమాలు చుబుకం కిందికి లాక్కుని, మర్యాంకా గబగబా ద్రాక్ష గుత్తుల్ని కోసి బుట్టలోకి చేర వేస్తోంది. చేత్తో పట్టుకున్న ద్రాక్ష తీగని వదలకుండా ఆమె అతని కేసి చక్కని మందహాసం చెయ్యడానికి ఆగి, మళ్లీ తన పని ప్రారంభించింది. ఒలేనిన్ దగ్గరకు వచ్చాడు. చేతులు ఖాళీగా వుండటానికని తుపాకీ భుజంమీద వేళ్లాడేసుకున్నాడు. "మిగతావాళ్లేరి? దేవుడు తోడా నీకు. నువ్వు వంటరిగా వున్నావా?" అందామనుకున్నాడు. కాని ఆ మాట అన్లేదు, నిశ్శబ్దంగా టోపీ పైకెత్తాడు. మర్యాంకాతో యేకాంతంగా వున్నప్పుడు అతనికి యిబ్బందిగా అనిపించింది. కాని తను ఉద్దేశ్యపూర్వకంగా బాధపడాలన్నట్టు ఆమె దగ్గరికి వెళ్లాడు.

"అలా మీరు తుపాకీతో ఆడాళ్లని కాల్చేస్తారేం?" అంది మర్యాంకా.

"ఊహుఁ, నేను వాళ్లను కాల్చను."

వాళ్లిద్దరూ మాట్లాడకుండా వుండిపోయారు. కొంచెం సేపాగాక ఆమె అంది:

"మీరు సాయం చెయ్యాలి నాకు."

అతను చాకు తీసుకుని మౌనంగా గుత్తులు కొయ్యడం ఆరంభించాడు.

ఆకులకింద మందమైన గుత్తిని అందుకున్నాడు. అది మూడు పౌన్ల బరువుంటుంది. ఆ గుత్తిలో ద్రాక్షలు యెంత యిరుగ్గా పెరిగాయంటే చోటులేక ఒరుసుకుని తప్పబై పోతున్నాయి. దాన్ని మర్యాంకాకి చూపించాడు.

''అన్నిటినీ కోసెయ్యాలా? యిది మరీ పచ్చిగా లేదూ?''

''యిలా యివ్వండి.''

వాళ్ల చేతులు రాసుకున్నాయి. ఒలేనిన్ ఆమె చెయ్యి పట్టుకున్నాడు. ఆమె మందహాసం చేస్తూ అతనికేసి చూసింది.

''త్వరలోనే నీ పెళ్లి అయిపోతుంది కదూ?'' అన్నాడు.

ఆమె జవాబివ్వలేదు. చిరునవ్వు లేని కళ్లతో పక్కకి మళ్లింది.

''నువ్వు లుకాష్కని ప్రేమిస్తున్నావా?''

''ఆ సంగతి మీకెందుకు?''

''అతనంటే అసూయ పడుతున్నా.''

''ఆఁ, కబుర్లు!''

''లేదు, నువ్వు నిజంగా సౌందర్యరాశివి!''

ఆ మాట అన్నందుకు వెంటనే సిగ్గు పడిపోయాడు. ఆ మాటలు అంత చవకబారుగా అనిపించాయి. అతని మొహం యెర్రబారింది. యేం చెయాలో తోచక వివశుడైపోయి ఆమె రెండు చేతులూ లాక్కున్నాడు.

''నేనెలాంటి దాన్నైనా మీదాన్ని కాదు. యెందుకు యెగతాళి చేస్తారు?'' అంది మర్యాంకా. కాని అతను తనను యెగతాళి చెయ్యడం లేదని ఆమెకి స్పష్టంగా తెలుసునని ఆమె చూపు చెబుతూనే వుంది.

''యెగతాళి చెయ్యడమా? నీకు తెలిసే వుంటే అసలు నేనెంత యిదిగా....'' ఆ మాటలు యింకా చవకబారుగా కనిపించాయి. అతనికి అనిపించిన భావంతోటి యింకా తక్కువ తూగాయి అవి. అయినా అన్నాడు, ''నీ కోసం యేమన్నా చేస్తాను'' అని.

''నన్ను వదిలెయ్యండి, మీరో మొండిఘటం!''

కాని ఆమె ముఖం, కళకళ్లాడే కళ్లు, ఉబికివచ్చే వక్షోజం, పొంకమైన

కాళ్ళు పూర్తి భిన్నమైందాన్ని చెప్పాయి. తను అన్న మాటలన్నీ యెంత క్షుద్రంగా వున్నదీ ఆమె గ్రహించిందని అతనికి అనిపించింది. ఆమె ఆ బాపతు ఆలోచనలకి అతీతమనీ అనిపించింది. అతను చెప్ప దలచుకున్నదంతా యెప్పట్నుంచో ఆమెకి తెలుసనీ అనిపించింది. అయినా అతను తనకి చెప్పలేకపోతున్నాడనీ, కాని యెలా చెబుతాడో విందామని ఆమె అనుకుంటున్నట్టూ అనిపించింది.

''ఆమె యెలా వుందో అదే కదా నేను చెప్పదలచుకున్నది, ఆమెకి తెలియకుండా యెలా వుండగలదు? కాని ఆమె అర్థం చేసుకో దలచుకోలేదు, బదులు చెప్పాలనుకోవడం లేదు'' అనుకున్నాడు.

''ఓహోయ్!'' ద్రాక్ష తీగల వెనకనుంచి ఊస్తెంకా కంఠం ఖంగుమని పిలిచింది. మళ్లీ ఆ కీచుమనే నవ్వు. ''వచ్చి నాకు సాయం చెయ్యండి ద్మీత్రియ్ అంద్రేయిచ్. నేను ఒక్కత్తెనీ వున్నాను'' అని ఆమె అరిచింది, తన గుండ్రటి అమాయికపు మొహం ద్రాక్ష తీగల్లోనుంచి యివ తలికి పెడుతూ.

ఒలేనిన్ మాట్లాడనూలేదు, వున్న చోటునుంచి కదలనూలేదు. మర్యాంకా కోస్తూనే వుంది, కాని ఆగి ఆగి ఒలేనిన్‌కేసి చూసింది. అతనేదో చెప్పబోయాడు, కాని ఆగాడు. భుజాలు యెగరేసి, తుపాకీ దట్టి వూపి, పెద్ద అంగలతో ద్రాక్షతోటలోనుంచి నడిచివెళ్లిపోయాడు.

## 32

అతడు ఒకటి రెండు సార్లు ఆగాడు, మర్యాంకా ఊస్తెంకాల గలగల నవ్వు వింటూ. వాళ్లిద్దరూ చేరి యేదో అరుస్తున్నారు. ఆ సాయంత్రమంతా ఒలేనిన్ అడివిలో వేటాడుతూనే గడిపాడు. సాయం సంధ్య వేళ ఒట్టి చేతుల్తో యింటికి చేరాడు. ముంగిలి దాటుతూ వుండగా అవతలి యింటి తలుపు తీసివుండటం, నీలం గాగరా బయటికి

కనిపించడం చూశాడు. వన్యూష‌ని గట్టిగా పిలిచాడు, వాళ్లకి తను వచ్చానన్న విషయం తెలియజెయ్యాలని. అప్పుడు గుమ్మందగ్గర తన యథాస్థానంలో కూలబడ్డాడు. అతని యింటివాళ్ళు అప్పటికే ద్రాక్ష తోటనుంచి తిరిగివచ్చారు. వాళ్లు అవతలి యింట్లోంచి యివతలకి వచ్చి యింట్లోకి వెళ్లారు, కాని అతన్ని రమ్మనలేదు. మర్యాంకా గేటులోనుంచి రెండు సార్లు బయటికి వెళ్లింది. ఆ సందె చీకట్లో ఆమె తనకేసి చూసినట్లనిపించింది. ఆమె ప్రతి కదలికనీ ఆత్రుతగల నేత్రాలతో అనుసరిస్తూనే వున్నాడు. కాని ఆమెని సమీపించాలని నిర్ధారణ చేసుకోలేకుండా వున్నాడు. ఆమె యింట్లోకి మాయమవగానే అతను గుమ్మం వదిలి యివతలికి వచ్చి ముంగిట్లో అటూ యిటూ పచారు చెయ్యడం మొదలెట్టాడు. కాని మర్యాంకా యింకా బయటికి రాలేదు. ఒలేనిన్ ఆ రాత్రి అంతా ముంగిట్లో గడిపాడు. వాళ్ల యింట్లోనుంచి వచ్చే ప్రతి శబ్దాన్నీ వింటూ. వాళ్లు సాయంత్రం మాట్లాడుకోవడం, రాత్రి భోజనాలు చెయ్యడం, పక్కలు వేసుకోవడం, పడుకోవడం గమనించాడు. మర్యాంకా దేన్ని చూసో నవ్వడం విన్నాడు, అలాగే ప్రతీదీ క్రమేపీ సద్దు మణగడమూ విన్నాడు. కేతనధారీ, అతని భార్యా కొంచెం సేపు మెల్లిగా మాట్లాడారు. యెవరో వూపిరి పీలుస్తున్నారు. ఒలేనిన్ తన యింట్లోకి వెళ్లాడు. వన్యూష ఆ బట్టలతోటే పడుకున్నాడు. ఒలేనిన్‌కి అతనంటే అసూయ వేసింది. మళ్లీ ముంగిట్లో పచార్లు చెయ్యడం మొదలెట్టాడు, అస్తమానూ యేదో జరుగుతుందని యెదురుచూస్తూ. కాని యెవరూ రాలేదు, యెవరూ కదల్లేదు. అతను ముగ్గురు మనుషులు వూపిరి పీలుస్తూ వుండటం మాత్రం విన్నాడు. అతనికి మర్యాంకా శ్వాస తెలుసు. దాన్ని విన్నాడు, తన గుండె కొట్టుకోవడమూ విన్నాడు. వూళ్లో ప్రతీదీ సద్దుమణిగింది. కృష్ణపక్ష చంద్రుడు ఆలస్యంగా ఉదయించాడు. గాఢ ఉచ్ఛ్వాసంచేసే పశువులు, అవి పడుకున్నప్పుడూ,

నెమ్మదిగా లేచినప్పుడూ, దొడ్లో యింకా స్పష్టంగా కనిపిస్తున్నాయి. ''నాక్కావలసిందేమిటి?'' కోపంగా ఒలేనిన్ రసకి తానే ప్రశ్నించుకు న్నాడు. కాని ఆ నిశీధి మనోహరత్వంనుంచి విడిపోలేకపోయాడు. అక స్మాత్తుగా అతని యింటివాళ్ల యింటిలో నేల కిర్రుమనడమూ, అడు గుల చప్పుడూ స్పష్టంగా విన్నట్టు అనుకొన్నాడు. తలుపు దగ్గరికి దూసుకువెళ్లాడు. కాని మామూలు శ్వాస శబ్దం తప్ప మళ్లీ అంతా నిశ్శబ్దం. దొడ్లో గేదె దీర్ఘ నిశ్వాసం చేసి, మళ్లీ కదిలింది. కాళ్లమీద లేచింది. తోక ఆడించింది. పొడి మట్టినేలమీద, స్థిరంగా దడదడ పడ్డ చప్పుడైంది. మళ్లీ అది మసక వెన్నెల్లో నేలమీద పడుకొంది. అతను అనుకున్నాడు: ''నేనేం చెయ్యాలి?'' పోయి పడుకోవాలని గట్టిగా తీర్మానించుకున్నాడు. కాని మళ్లీ శబ్దాలు విన్నాడు. అతని వూహలో, వెన్నెల మసక రాత్రిలో యువతికి వస్తూన్న మర్యాంకా విగ్రహం నిలిచింది. మళ్లీ అతను కిటికీ దగ్గరికి పరిగెత్తాడు. మళ్లీ అడుగుల చప్పుడు విన్నాడు. ప్రభాత సమయానికి ముందు మాత్రమే అతను ఆమె కిటికీ దగ్గరికి వెళ్లి, తలుపు తోశాడు, ద్వారందగ్గరికి పరిగెత్తేడు. యీసారి అతను నిజంగా మర్యాంకా అడుగుల చప్పుడూ, నిట్టూర్పూ విన్నాడు. గడియ పట్టుకుని తట్టాడు. చెప్పుల్లేని కాళ్లు జాగ్రత్తగా ద్వారబంధం సమీపించేటప్పుడు నేల కిర్రుమనే చప్పుడే చెయ్య లేదు దాదాపు. గడియ టక్కుమంది. తలుపు కిర్రుమంది. మర్యాంకా రూపం గుమ్మంలో ప్రత్యక్షమైనప్పుడు మరువం, గుమ్మడి వాసనలు అతను గమనించాడు. ఆ వెన్నెల్లో ఆమెని ఒక్క క్షణం మాత్రమే అతను చూశాడు. ఆమె తలుపు ఫెడీల్మని వేసి యేదో గొణుగుతూ, మెల్లిగా మళ్లీ వెనక్కి పరిగెత్తింది. ఒలేనిన్ మెల్లిగా తలుపు తట్టడం మొదలెట్టాడు, కాని జవాబు లేదు. కిటికీ దగ్గరికి పరిగెత్తి మళ్లీ విన్నాడు. హఠాత్తుగా గింగుర్రెత్తే, కీచుమనే మనిషి గొంతుకలోటి అదిరిపోయాడు.

''అద్భుతం!'' తెల్ల టోపీ పెట్టుకున్న కొంచెం చిన్న యువ కోసక్, ముంగిట్లో అడ్డంగా ఒలేనిన్‌కేసి వస్తూ అన్నాడు. ''నేసంతా చూశాను.... అద్భుతం!''

ఒలేనిన్ నజార్కాని గుర్తుపట్టేడు. మాట్లాడకుండా వుండిపోయాడు, యేం చెయ్యాలీ, యేమనాలీ తోచక.

''అద్భుతం! నేను వెళ్లి కార్యాలయం దగ్గర చెపుతా. వాళ్ల నాన్నతో చెబుతా! అద్భుతమైన కేతనధారి కూతురు! ఒకడు చాల్లేదు ఆమెకి.''

''యేం కావాలి నీకు, యేం కావాలి నీకు'' అన్నాడు ఒలేనిన్.

''యేమీ లేదు, వూరికే కార్యాలయం దగ్గర చెబుతా.''

నజార్కా చాలా గట్టిగా మాట్లాడాడు. కావాల్సికే అలా చేసాడని తెలుస్తూనే వుంది. ''గడుసైన కేడెట్, కదా!''

ఒలేనిన్ వణికాడు, పాలిపోయాడు. ''యిలా రా, రా!'' అతను ఆ కోసక్కుని చేత్తో గట్టిగా పట్టుకుని, తన యింటిదాకా లాక్కుపోయాడు. ''యేమీ జరగలేదు. ఆమె నన్ను లోపలికి రానివ్వలేదు. నాకే దురుద్దేశమూ లేదు. ఆమె మంచి పిల్ల — ''

''ఆ గొడవలోకి వెళ్లద్దు మనం — ''

''సర్లే యేమయితేనేం, నేను నీకోటి యిస్తాను. కొంచెం ఆగు!''

నజార్కా యేమీ మాట్లాడలేదు. ఒలేనిన్ యింట్లోకెళ్లి ఓ పది రూబుళ్ల నోటు తెచ్చి ఆ కోసక్కుకి యిచ్చాడు.

''యేం జరగలా, అయినా నాదే తప్పు. అంచేత యిది యిస్తున్నా! దేవుడిమీద ఒట్టు, యెవరికీ తెలియనివ్వకు, యేవంటే యేం జరగలేదు.''

''మీకు సంతోషం కలుగు గాక!'' అన్నాడు నజార్కా. నవ్వుతూ వెళ్లిపోయాడు.

దొంగిలించిన గుర్రాన్ని దాచడానికి చోటు చూడమని లుకాష్కా

చెప్పిందానివల్ల నజార్కా ఆ రాత్రి వూళ్ళోకి వచ్చాడు. తన యింటికి అలా పోతూ, పదధ్వనులు విన్నాడు. మర్నాడు పొద్దున్న పటాలంలోకి వెళ్ళాక తన మిత్రుడికి గొప్పలు చెప్పాడు. తను యెంత తెలివిగా పది రూబుళ్ళు లాగేసిందీ చెప్పాడు.

మర్నాడు ఉదయం ఒలేనిన్ తన యింటి వాళ్ళని కలిసాడు. రాత్రి జరిగిన గొడవలేమీ వాళ్ళకి తెలియవు. అతను మర్యాంకాతో మాట్లాళ్ళేదు. అతనికేసి చూసినప్పుడు ఆమె కొంచెం నవ్వింది అంతే. ఆ మర్నాడు రాత్రి కూడా అతను నిద్రలేకుండానే గడిపాడు వృథాగా ముంగిట్లో తిరుగుతూ. ఆ తర్వాత రోజు అతను కావాల్సికే వేటలో గడిపాడు. ఆ సాయంత్రం బెలేత్స్కీని చూడ్డానికి, తన ఆలోచనలనుంచి పారిపోడానికి, వెళ్ళాడు. తనంటేనే అతనికి భయం వేసింది. యిక ముందు తన యింటివాళ్ళ దగ్గరికి పోకూడదని ఒట్టు పెట్టుకున్నాడు. ఆ మర్నాడు రాత్రి సార్జెంట్ మేజర్ అతన్ని లేపాడు. అతని పటాలం తక్షణం దాడికి వెళ్ళాలనే ఆజ్ఞ వచ్చిందట. అలా జరిగినందుకు ఒలేనిన్ చాలా సంతోషపడ్డాడు. మళ్ళీ ఆ వూరికి తిరిగి రాకూడదని అనుకున్నాడు.

ఆ దాడి నాలుగు రోజులు సాగింది. కమాండర్ ఒలేనిన్ బంధువు. అతన్ని చూడాలనుకున్నాడు. సిబ్బందితో వుండిపోడానికి ఒలేనిన్‌కి అనుమతి యిచ్చాడు, కాని ఒలేనిన్ అక్కర్లేదన్నాడు. ఆ వూరికి దూరంగా తనుండలేనని తెలుసుకున్నాడు. అంచేత వెనక్కి తిరిగి వెళ్ళడానికి అంగీకరించవలసిందని అడిగాడు. దండయాత్రలో పాల్గొన్నందుకు అతనికి సైనిక శిలువ వచ్చింది. దాన్ని అంతకు ముందు అతనెంతగానో కోరుకున్నాడు. యిప్పుడు అదంటే ఉదాసీనంగా వున్నాడు. ఉద్యోగంలో ప్రమోషన్‌పట్ల యింకా ఉదాసీనంగా వున్నాడు. దానికింకా ఆజ్ఞా పత్రం రాలేదు.

వన్యూషతో కలిసి యే ఆపత్తూ లేకుండా మిగిలిన పటాలంకంటే

కొన్ని గంటలు ముందుగానే అతను మళ్లీ సైనిక చౌకీకి తిరిగివచ్చాడు. ఆ సాయంత్రమంతా గుమ్మందగ్గరే గడిపాడు, మర్యాంకాని చూస్తూ. మళ్లీ ముంగిట్లో, గమ్యరహితంగా, ఆలోచనారహితంగా రాత్రంతా పచార్లు చేశాడు.

## 33

మర్నాడు అతను లేచేటప్పటికి పొద్దెక్కింది. అతని యింటివాళ్ళు వెళ్లిపోయారు. అతను వేటకి వెళ్లలేదు. ఓ పుస్తకం తీసుకున్నాడు. గుమ్మందగ్గరికి వెళ్లాడు. అంతలోనే మళ్లీ యింట్లోకి వచ్చాడు. పక్కమీద వాలాడు. అతనికి వంట్లో బాగా లేదనుకున్నాడు వన్యూష.

ఒలేనిన్ సాయంత్రానికి లేవాలని నిశ్చయించుకుని లేచాడు. రాసుకోవడం మొదలెట్టాడు. బాగా సాయంత్రందాకా రాస్తూనే వున్నాడు. ఓ ఉత్తరం రాశాడు గాని పోస్టు చెయ్యలేదు, యెందుకంటే తనేం చెప్పదలచుకున్నదీ యెవరికీ అర్థం కాదని అతనికి అనిపించింది; దానికి తోడు తను తప్ప యింకెవరూ అర్థం చేసుకోవడం అనవసరమూనూ.

యిదీ అతను రాసింది.

''నాకు రష్యానుంచి అనుశోక పత్రాలు వస్తున్నాయి. నేనిక్కడ నాశనమైపోతాననీ అడవుల్లో భూస్థాపితమైపోతాననీ వాళ్ల భయం. వాళ్లు నన్ను గురించి అంటారు: 'వాడు మోటుగా తయారవుతాడు; కాలంతోటి మారకుండా ప్రతి విషయంలోనూ వెనకబడిపోతాడు; తాగుడికి బానిసైపోతాడు. వాడో కోసక్ పిల్లని పెళ్లిచేసుకుంటాడేమో కూడా యెవరికి తెలుసు.' పదేళ్లు కాకసస్‌లో పనిచేసిన యెవడేనా తాగి చచ్చేనా పోతాడు లేదా నీతి మాలిన దాన్ని పెళ్లేనా ఆడతాడని జనరల్ యెర్మోలొవ్ వూరికే చెప్పలేదు. యెంత ఘోరం! జమీందారిణి 'బ' భర్తనో రాజాస్థానపు ఉద్యోగినో మా ప్రాంతపు మార్షల్‌నో

సైతం అయ్యో మహదానందం పొందగలిగి వుండి కూడా నన్ను నేను నాశనం చేసుకోవడం నాకు తగదు. అబ్బా, యెంత అసహ్యంగా దీనంగా కనిపిస్తారు మీరందరూ నాకు! మీకు ఆనందమంటే యేమిటో తెలీదు, జీవితమంటే యేమిటో తెలీదు! జీవితాన్ని సహజసిద్ధమైన సౌందర్యంలో ఆస్వాదించాలి! నా ముందు ప్రతి రోజూ నేను యేం దర్శిస్తున్నానో చూసి అర్థం చేసుకోవాలి యెవరేనా; యెన్నటికీ సమీపించలేని ఆ హిమశిఖరాలు, సృష్టికర్త హస్తాలనుంచి రూపు తీసుకున్న ఆదిమనిత ఆదిమ సౌందర్యంలో అలరారే ఒక రాజతేజస్సు గల స్త్రీ; అప్పుడు అర్థమవుతుంది యెవరు పతనమవుతున్నారో యెవరు నిజంగా బతుకుతున్నారో, యెవరు వృథా జీవనులో — మీరో, నేనో. మీ భ్రమల్లో మీరు నాకు యెంత అసహ్యకరంగా, దీనంగా కనిపించేదీ మీకు తెలిసేవుంటే! నా యింటికి, నా అడవులకి, నా ప్రేమకి బదులుగా ఆ కచ్చేరీలూ, సుగంధతైలాలు రాసుకుని జుట్టుని దొంగ ఉంగరాలు తిప్పుకునే ఆడాళ్లూ, అసహజంగా యికిలించే పెదాలూ, దాచిపెట్టుకుని నీరసంగా వంకర్లు పోయిన అవయవాలూ, యెందుకొచ్చిన పీడరా అన్నట్టుండే అతిథుల గది సంభాషణలూ — ఆ మాటకే అవి తగవు — నా మనసులో చిత్రించుకున్నప్పుడు భరించలేనంత వికారంగా అనిపిస్తాయి నాకు. అప్పుడు ఆ మొద్దు మొహాలూ, ‘అది సర్లే, నేను ధనికురాలినైనా నువ్వు నాదగ్గరికి రావచ్చు’ అంటున్నట్టు చూపులు కనిపించే వయసొచ్చిన స్థితిమంతురాళ్లూ — కుర్చీలని సర్దడాలూ, మళ్లీ సర్దడాలూ, సిగ్గుమాలిన పెళ్లి వ్యవహారాలూ, ఆదీ అంతంలేని ప్రలాపాలూ, నటనలూ, ఆ నియమాలూ — యెవరితో కరచాలనం చెయ్యాలో, యెవరికేసి తల పంకించాలో, యెవరితో మాట్లాడాలో (యిదంతా ఉద్దేశ్యపూర్వకంగా, అదేదో తప్పనిసరి అన్న నమ్మకంతో చెయ్యడం), తరతరాలుగా రక్తంలోపాకే అడ్డులేని ఆ వెగటూ, నా కళ్ల ముందు దర్శనమిస్తాయి. యీ ఒక్క సంగతీ అర్థం

చేసుకుని, నమ్మడానికి ప్రయత్నించండి; సత్యమూ, సౌందర్యమూ యేమి టైందీ చూసి అర్థం చేసుకోవాలంటే మీరు. మీరనేదీ, అనుకొనేదీ, మిమ్మల్ని గురించీ నా గురించీ మీ కోరికలన్నీ కూడా ముక్కలుగా మట్టి కొట్టుకుపోతాయి!

''ఆనందమంటే ప్రకృతితో కలిసివుండటం, ప్రకృతిని చూడ్డం, ప్రకృతితో మాట్లాడ్డం. 'వాడా మాటకొస్తే ఓ సామాన్య కోసక్ పిల్లని పెళ్లి కూడా చేసుకోవచ్చు (అన్యాయం ప్రతిహతమగుగాక), నాగ రిక సమాజానికి పూర్తిగా దూరమైపోవచ్చు.' వాళ్లు పాపం నా గురించి యెంతో సానుభూతితో అనడం నేను వూహించగలను! కాని నేను కోరేదేమిటంటే ఆ మాటకి మీ అర్థంలోనే 'పూర్తిగా నాశన మైపోవడం'. ఒక సామాన్య కోసక్ పిల్లని పెళ్ళాడాలని కోరుకుం టున్నాను. కాని నేను సాహసించలేను, యెందుకంటే అది నా యోగ్యతకి మించిన ఆనంద శిఖరం.

''నేను మొట్టమొదటి సారి ఆ కోసక్ పిల్ల, మర్యాంకాని, చూసి మూణ్ణెల్లు అయింది. నేను వదిలిపెట్టి వచ్చిన ప్రపంచం తాలూకు ఉద్దేశాలూ, దురభిప్రాయాలూ నాలో యింకా మాసిపోలేదు. నేనీ స్త్రీని ప్రేమించగలనని అప్పట్లో విశ్వసించలేదు. ఆకాశమూ, పర్వ తాలూ నన్ను ముగ్ధుణ్ణి చేసినట్టే ఆమె సౌందర్యమూ ముగ్ధుణ్ణి చేసింది. యెందుకంటే ఆమె వాటంతటి సౌందర్య పూరితమైంది. తర్వాత నా జీవితానికి ఆమె సౌందర్య దర్శనం ఒక అవసరం అయిందని కనిపెట్టాను. నేనామెని ప్రేమించడం లేదా అని నన్ను నేను ప్రశ్నించు కున్నాను. కాని నేను వూహించుకున్న ప్రేమలాంటిదేమీ నాలో కనిపించ లేదు. నాది యేకాంత వ్యాకులతా కాదు, వివాహాపేక్షా కాదు, నిర్లిప్తా నంద ప్రేమా కాదు, నేననుభవించినలాంటి శారీరకమైన వాంఛగలది అసలే కాదు. ఆమెని చూడ్డమూ, ఆమె కంఠం వినడమూ, ఆమె

చేరువలో వుందని తెలుసుకోవడమూ మాత్రమే నాకు అవసరం, ఆనందం కలగకపోయినా కనీసం నేను శాంతిగా వుండటానికి.

''ఓ సాయంత్రం సమావేశంలో నేనామెని కలుసుకుని, స్పృశించిన తర్వాత ఆ స్త్రీకీ నాకూ మధ్య తెంచరాని అజ్ఞాత బంధం వుందని, నేను పెనుగులాడలేని బంధం వుందని నాకనిపించింది; అయినా నేను పెనుగులాడాను. నన్ను నేను ప్రశ్నించుకున్నాను: 'నా జీవితపు గాఢాపేక్షల్ని యెన్నటికీ అర్థం చేసుకోలేని స్త్రీని ప్రేమించడం సాధ్యమా? వూరికే ఆమె అందం కోసం ప్రేమించడం, ఒక శిలా విగ్రహాన్ని ప్రేమించడం సాధ్యమా?' కాని నేను నా అనుభూతుల్ని నమ్మలేక పోయినా అప్పటికే ఆమెను ప్రేమించాను.

''ఆ సాయంత్రం తర్వాత, నేను ఆమెతో మొదటి సారి మాట్లాడిం తర్వాత, మా సంబంధాలు మారాయి. అంతకు ముందు ఆమె నాకు యెంతో దూరమైన, అయినా దివ్యమైన, బాహ్య ప్రకృతిలో ఒక వస్తువు; కాని అప్పట్నుంచి మనిషైంది. ఆమెని కలుసుకోవడం, మాట్లాడ్డం, యెప్పుడేనా ఆమె తండ్రికి సాయం చెయ్యడానికి వెళ్లడం, సాయంత్రాలు పూర్తిగా వాళ్లతో గడపడం మొదలెట్టాను. యీ సన్నిహిత పరిచయంలో కూడా ఆమె పరిశుద్ధంగానే, చేరరానిదిగానే, దివ్యమైందిగానే నా కళ్లకు కనిపించింది. ఆమె అస్తమానూ అదే శాంతంతో, హుందాతనంతో, ఉల్లాసపూరిత ఉదాసీనతతోనే బదులు చెప్పేది. అప్పుడప్పుడు స్నేహంగా వుండేది. కాని సామాన్యంగా ఆమె ప్రతి చూపూ, ప్రతి మాటా, ప్రతి కదలికా, యీ ఉదాసీనతనే వ్యక్తం చేసేది — తిరస్కారంగా కాదు గాని సమ్మోహింపచేసేటట్టూ, వలపింపచేసేటట్టూ. ప్రతి రోజూ పెదాలమీద తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో నేను నా వంతు నటించ ప్రయత్నించేవాణ్ణి. ఉద్రేకాల హింసతోటీ, మనసులో కామనతోటీ నేనామెతో పరిహాసంగా మాట్లాడేవాణ్ణి. నేను నటిస్తున్నానని ఆమెకి తెలుసు. కాని నా కళ్లలోకి సూటిగా చూసేది,

ఉల్లాసంగా, జేలగా. ఆ పరిస్థితి భరింప శక్యం కాకుండా తయారైంది. ఆమెని మోసం చెయ్యకూడదనుకున్నాను. నేను అనుభవించిందీ, అనుకున్నదీ అంతా ఆమెకి చెప్పాలనుకున్నాను. విపరీతంగా కలవరపడ్డాను. నా ప్రేమని గురించి చెప్ప మొదలెట్టినప్పుడు మేం ద్రాక్షతోటలో వున్నాం. నేను యిప్పుడా మాటలు గుర్తుచేసుకుంటే నాకు సిగ్గనిపిస్తోంది. సిగ్గు యెందుకంటే నేనామెతో మాట్లాడే సాహసం చెయ్యకుండా వుండాల్సింది. యెందుకంటే అలాంటి మాటలకి, ఆ మాటలు వ్యక్తం చెయ్యదలచుకున్న భావానికి, ఆమె అతీతంగా యెక్కడో యెత్తులో వుంది. నేనింక చెప్పలేదు. కానీ ఆ రోజునుంచీ నా పరిస్థితి భరింప శక్యం కాకుండానే వుంది. మా ముందటి తేలిక సంబంధాలు మా యిద్దరి మధ్యా కొనసాగించి యింకా పతనమైపోవాలని నేను అనుకోలేదు. అదే సమయంలో ఆమెతోటి సవ్యమైన సాఫీ సంబంధాల స్థాయికి నేనింకా చేరుకోలేదనీ నాకనిపించింది. నిస్పృహతో నన్ను నేను ప్రశ్నించుకున్నాను 'నేనేం చెయ్యాలి?' అని. నేనామెని మూర్ఖపు కలల్లో వూహించుకునేవాణ్ని, కాసేపు వుంపుడుకత్తెగా, కాసేపు భార్యగా. కాని ఆ రెండు భావాలూ చిరాకులో తోసేసేవాణ్ని. ఆమెని కాముకురాలుగా చేసుకోవడం మహాఘోరం. అది హత్యా సదృశం. యిక్కడ మా ఆఫీసరు ఒకాయన పెళ్లాడిన కోసక్ స్త్రీలాగా దీమ్త్రియ్ అంద్రేయిచ్ ఒలేనిన్ భార్యగా, నాగరికత గల స్త్రీ లాగా, ఆమెని మార్చేసుకోవడం యింకా ఘోరం. లుకాష్క లాగా కోసక్‌ను కాగలిగితే గుర్రాలు కాజేసి చిఖిర్ తాగి పోలిపోతాను, వూగిపోయే పాటలు పాడతాను. మనుషుల్ని చంపి, తాగినప్పుడు ఆమె కిటికీ గుండా లోపలికి పోయి ఆ రాత్రి నేనెవరూ యేమిటీ అన్న ఆలోచన లేకుండా గడపగలిగితే, అప్పుడంతా మరోలా వుంటుంది. అప్పుడు ఒకళ్లనొకళ్లం అర్థం చేసుకుంటాం. నేను ఆనందంగా వుండవచ్చును.

''అలాంటి జీవితంలోకి పడదామని ప్రయత్నించాను. కాని నా

బలహీనతలూ, కృత్రిమత్వమూ గురించి యింకా యెక్కువ యెరుకలో వున్నాను. సంక్లిష్ట, వక్ర, వికారపూరిత గత జీవితాన్ని మరిచిపో లేకపోయాను. నా భవిష్యత్తు యింకా నిరాశామయంగా కనిపించింది. ప్రతి రోజూ నా ముందు ఆ సుదూర హిమ పర్వతాలు వున్నాయి, యీ దివ్యమైన ఆనందభరిత స్త్రీ వుంది. యీ ప్రపంచంలో నాకు వుండగల యేకైక ఆనందం నాకు లభించదు. యీ స్త్రీని నేను పొందలేను! నా స్థితిలో మహా భీకరమైంది, అయినా అత్యంత మధుర మైంది, యేమిటంటే నేనామెను అర్థంచేసుకుంటాను, కానీ ఆమె నన్ను యెన్నటికీ అర్థం చేసుకోదు అని నాకనిపించడం. అంటే ఆమె తక్కువ స్థాయిదని కాదు; తద్భిన్నంగా ఆమె నన్ను అర్థం చేసుకో గూడదు. ఆమె ఆనందంగా వుంది. ప్రకృతిలాగా వుంది: యేకరీతిగా, నిదానంగా, అహంకారంగా. యిక నేనో, నీరస వికార జీవిని, ఆమె నా వికారాలూ, వ్యథలూ అర్థంచేసుకోవాలని కోరుతూ! రాత్రి నిద్ర పోలేదు, గమ్యం లేకుండా ఆమె కిటికీకింద కాలం గడిపాను, నాకేం జరుగుతోందో నాకే ఆజ లేకుండా.

''పద్దెనిమిదిన మా పటాలం దాడికి బయల్దేరింది, మూడ్రోజులు వూరినుంచి దూరంగా గడిపాను. నేను విచారంగా, ఉదాసీనంగా వున్నాను. పటాలంలో వుండే మామూలు పాటలూ, పేకాటలూ, మద్య వినోదాలూ, బహుమతుల్ని గురించిన సంభాషణలూ యెప్పటికంటే అసహ్యకరంగా అనిపించాయి నాకు. నిన్న యింటికి తిరిగివచ్చాను, ఆమెనీ, నా నివాసాన్నీ, యెరోష్కా మామనీ చూశాను. నా వసారాలో నుంచి హిమ పర్వతాలకేసి చూశాను. యెంతటి శక్తిసంతమైన నూతన ఆనందానుభూతి నన్ను ఆవహించిందంటే నాకు అంతా అర్థ మైంది. యీ స్త్రీని నేను ప్రేమిస్తున్నాను. నా జీవితంలో మొదటి సారిగా, ఒకేఒక్క సారిగా నిజమైన ప్రేమని నేను అనుభవిస్తు న్నాను. నాకేం సంభవించిందో నాకు తెలుసు. యీ అనుభూతితో

నేను భ్రష్టుడి నవుతానని నేను భయపడను. నా ప్రేమంటే నేను సిగ్గుపడను, నేను గర్విస్తున్నాను. నేను ప్రేమించడం నా దోషం కాదు. నా యిష్టానికి వ్యతిరేకంగా అది వచ్చింది. నా ప్రేమనుంచి ఆత్మపరిత్యాగం ద్వారా పారిపోవాలని ప్రయత్నించాను, ఆ కోసక్ లుకాష్కా మర్యాంకాల ప్రేమలో ఆనందం కల్పించాలని ప్రయత్నించాను. కాని తద్వారా నా సొంత ప్రేమనీ, అసూయనీ రేపానంతే.

''యిది ఆదర్శప్రాయమైన ప్రేమ కాదు. ఉదాత్త ప్రేమ అని పిలిచేదీ కాదు. దాన్ని యింతకు ముందే నేనెరుగుదును. నీ ప్రేమనే నువ్వు గొప్ప చేసుకుని, నీ ఉద్రేకాలకి ఆధారభూతమైంది నీలోనే వుందనుకుని ప్రతీదీ నువ్వే చేసుకునే లాంటి తరహా బంధం కాదు యిది. అదీ నేననుభవించిందే. యిది భోగకాంక్ష అసలే కాదు. దానికంటే భిన్నమైంది. నేను బహుశా ఆమెలో ప్రకృతిని ప్రేమిస్తున్నాను, ప్రకృతిలో సౌందర్య సమన్వితమైన దానంతటి మూర్తినీ ప్రేమిస్తున్నాను. అయినా నా యిచ్ఛానుసారంగా నేను నడవడంలేదు. అదేదో ప్రాకృతిక శక్తి నాద్వారా ప్రేమిస్తోంది. భగవంతుని ప్రపంచమంతా, ప్రకృతి అంతా, యీ ప్రేమని నా ఆత్మలో నింపుతోంది, 'ఆమెని ప్రేమించు' అంటోంది. నేనామెని నా మనసుతో ప్రేమించడంలేదు, నా భావనతో ప్రేమించడంలేదు, నా సర్వ జీవంతోటీ ప్రేమిస్తున్నాను. ఆమెని ప్రేమిస్తూ పరమేశ్వరుని ఆనందమయ ప్రపంచంలో అఖండమైన భాగం అయినట్టుగా నాకు నేనే భావిస్తున్నాను.

''నా నూతన విశ్వాసాల గురించి ముందే రాశాను. వాటిని నా యేకాంత జీవితం నాకు తెచ్చిపెట్టింది. యెంత శ్రమతో అవి నాలో రూపుదాల్చాయో, యెంత ఆనందంతో వాటిని సఫలీకృతం చేసుకున్నానో, ఒక నవ్యజీవిత విధానం నా ముందు విస్తరించుకుంటూ వుందని గమనించానో, యెవరికీ తెలీదు; ఆ విశ్వాసాలకంటే మరేదీ

నాకు ప్రియమైంది లేదు... మరి యిప్పుడు... ప్రేమ వచ్చింది. ఆ విశ్వాసాలు గాని, వాటి కోసం చింతించడాలు గాని మిగల్లేదు.

"అలాంటి యేకపక్ష, ఉదాసీన, అభౌతిక మానసిక స్థితిని నేను గొప్పగా యెంచగలగడమన్నది నమ్మడం కూడా నాకు కష్టమే. ప్రయాస భరితమైన ఆ అంతర్గత క్షోభనంతటినీ సౌందర్యం వచ్చి చెల్లా చెదురు చేసింది; అదృశ్యమైందాని కోసం యే విచారమూ లేదు! ఆత్మపరిత్యాగం అనేదంతా చెత్త, అసంబద్ధమూనూ. అది అహంకారం, అల్పమైన దురదృష్టంనుంచి పారిపోవడం, పరుల ఆనందంపట్ల అసూయనుంచి విముక్తి. 'పరుల కోసం బతుకు, మేలు చెయ్యి!' — యెందుకు? నా హృదయంలో నాపట్ల మాత్రమే ప్రేమ వున్నప్పుడు, ఆమెని ప్రేమించాలనే కోరికా, ఆమెతో కలిసి ఆమె జీవితాన్ని జీవించాలనే కోరికా వున్నప్పుడు అలా యెందుకు చెయ్యాలి. పరుల కోసం కాదు, లుకాష్క కోసం కాదు యిప్పుడు నేను ఆనందం కోరేది. నేనిప్పుడు పరుల్ని ప్రేమించడం లేదు. పూర్వం యిది పాపం అని నేను చెప్పుకుని వుండేవాణ్ణి. ఆమె యేమౌతుంది, నాకేమౌతుంది, లుకాష్క యేమౌతాడు? అనే ప్రశ్నలతో నన్ను నేను చిత్రహింసలు పెట్టుకునేవాణ్ణి. యిప్పుడు నేను పట్టించుకోను. నా యిచ్ఛా పూర్వకంగా నేను బతకడం లేదు. నన్ను నడిపించేది, నాకంటే శక్తివంతమైంది యేదో వుంది. నేను బాధపడుతున్నాను. కానీ యిదివరకంతా నేను నిగత జీవుణ్ణి. యిప్పుడు మాత్రమే నేను జీవిస్తున్నాను. యీ రోజు నేను వాళ్ళింటికి వెడతాను, ఆమెకి ప్రతిదీ చెప్పేస్తాను!"

## 34

యీ ఉత్తరం రాసింతర్వాత, ఆ సాయంత్రం బాగా పొద్దుపోయాక, ఒలేనిన్ తన యింటివాళ్ళ యింట్లోకి వెళ్ళాడు. పట్టువాయులు విప్పుతూ పొయ్యి వెనకాల బల్లమీద కూచుంది పెద్దావిడ. తలకేమీ చుట్టుకో

కుండా వున్న మర్యాంకా, కొవ్వొత్తి వెలుతురులో కుట్టుకుంటూ కూర్చుంది. ఒలేనిన్‌ని చూడగానే ఆమె యెగిరి, రుమాలు తీసుకుని, పొయ్యి దగ్గరికి పోయింది.

''అమ్మా, మర్యాంకా, మాతో కాసేపు కూర్చోవూ'' అంది తల్లి.

''ఉహుఁ, తలకేం చుట్టుకోలేదు'' అంటూ పొయ్యిమీదికి ఎగిరింది.

ఓ మోకాలూ, తీనెమీదనుంచి వేలాడే యింకో అందమైన కాలూ మాత్రం ఒలేనిన్ చూడగలిగాడు. అతనా పెద్దావిడకి టీ యిచ్చి మర్యాద చేశాడు. ఆమె తన అతిథికి గడ్డ మీగడ యిచ్చి మర్యాద చేసింది. మర్యాంకాని పంపి దాన్ని తెప్పించింది. కాని పళ్లెం మేజామీద పెట్టి, మర్యాంకా మళ్లీ పొయ్యిమీదికి యెగిరింది. ఒలేనిన్ తనమీద ఆమె చూపులు వున్నట్టు మాత్రం గమనించాడు. వాళ్లు యింటి గొడవలు మాట్లాడుకున్నారు. ఉలీత్కా హుషారెక్కిపోయి ఆతిథ్య పార వశ్యంలో తేలిపోయింది. ఒలేనిన్‌కి వూరేసిన ద్రాక్ష పళ్లూ, ద్రాక్ష పళ్ల కేకూ, తన కున్నదాంటో యెంతో మేలైన వైనూ తెచ్చిపెట్టి తినమనీ, తాగమనీ, పల్లెటూరి జనాల మోటు పద్ధతిలో, అయినా సగర్వమైన ఆతిథ్యంతో, బలవంతం చేసింది. అలాంటి ఆతిథ్యం తమ కాయకష్టంతో తిండి పండించుకునేవాళ్లలోనే కనిపిస్తుంది.

మొదట్లో తన మోటుతనంతో ఒలేనిన్‌ని ఆశ్చర్యపరిచిన ఆ పెద్దా విడ, కూతురిపట్ల తన అమాయిక అపేక్షతోటి యిప్పుడు తరచూ కదిలించివేసింది.

''ఆఁ, మేం యిప్పుడు అసంతృప్తిగా గొణుగుతూ దేవుణ్ణి నిందిం చనవసరం లేదు. భగవంతుడి దయవల్ల యేదో ప్రతీదీ యింత వుంది. సరిపడా చిఖిర్ ఆడుకున్నాం, జాగ్రత్త చేసుకున్నాం. మూడు, నాలుగు పీపాల వైన్ అమ్ముకున్నా యింకా తాగడానికి సరిపడా వుంటుంది. మమ్మల్ని వదిలివెళ్లిపోవాలని తొందరపడకండి. పెళ్లప్పుడు మనమంతా సరదాగా కాలక్షేపం చేద్దాం.''

“పెళ్లెప్పుడు?” అడిగాడు ఒలేనిన్, హఠాత్తుగా ముఖం యెర్ర బడ్డట్టు అతనికే అర్థమైంది. అతని గుండె బాధగా ఆగి, ఆగి, కొట్టు కుంటున్నట్టు వుంది. పొయ్యిమీద కదలికనీ, గింజలు కొరుకుతున్న శబ్దాన్నీ విన్నాడు.

“వచ్చే వారం జరగాలి. మేం అంతా సిద్ధంగానే వున్నాం” నిష్కృష టంగా, మెల్లగా ఒలేనిన్ అక్కడ లేనట్టే అందా పెద్దావిడ. “నేను మర్యాంకాకి ప్రతీదీ సిద్ధంచేశాను. దాని అంతస్థుకి తగ్గట్టే పంపుతాం. ఒక్కటే సవ్యంగాలేంది. మా లుకాష్క అదుపులేకుండా పోతున్నాడు, మరీ అడ్డూ అదుపూ లేకుండా! తన కొంటె చేష్టలు మానుకోలేదు. మొన్న పటాలంనుంచి ఓ కొసక్ వచ్చి చెప్పాడు, యితను నోగాయ్‌కి వెళ్లాట్ట.”

“పట్టుబడకుండా జాగ్రత్తగా వుండాలి” అన్నాడు ఒలేనిన్.

“అం, అదే నేననేదినీ. ‘జాగ్రత్త, యకాష్క కొంటెతనం పోకు’ అంటాను. సర్లే, సహజంగానే ఉడుకు రక్తంవాడు, సాహసంగా వుండా లనుకుంటాడు. కాని ప్రతీదానికీ సమయం, సందర్భం వుంటాయి కదా. మాటకి, మీరు దేన్నైనా పట్టుకున్నారు, లేకపోతే కాజేసారు, ఒక అబ్రేక్కుని చంపేరు! మీరు ఘోష్టైనవారు! కాని మీరు అంతటితో సర్దుకుపోవాలి. లేకపోతే చిక్కు వస్తుంది.”

“అవును, నేనతన్ని ఒకటి రెండు సార్లు సైన్యదళంలో చూశాను; యెప్పుడూ మజా చేస్తూ వుండేవాడు; యింకో గుర్రం అమ్మేశాడు” అన్నాడు ఒలేనిన్. పొయ్యికేసి చూశాడు.

ఓ జత పల్లని కళ్లు అతనికేసి చూసి మిణుకుమన్నాయి కఠినంగా, విరోధంగా కూడా. అతను తనన్న దానికి సిగ్గుపడ్డాడు.

“అయితే యేం? అతనెవరికీ అపకారం చెయ్యలేదే? అతని డబ్బుతో అతను కులాసాగా గడుపుకుంటున్నాడు” అంది మర్యాంకా తల్లి.

కాళ్ళు కిందికి దించి పొయ్యిమీదినుంచి గెంతింది. షెడ్డీల్మని తలుపు మూసేసి అవతలికి వెళ్ళింది.

ఆమె యింట్లో వున్నంత సేపూ అతనామెని కళ్ళతోనే అను సరించాడు. అప్పుడు తలుపుకేసి చూసి ఆగాడు, ఉలీత్కా చెప్పేది యేమీ పటించుకోకుండా.

కొన్ని క్షణాల తర్వాత యెవరో అతిథులు వచ్చారు: ఉలీత్కా సోదరుడైన ముసలాయన, యెరోష్కా మామతో కలిసివచ్చాడు. వాళ్ళ తర్వాత మర్యాంకా, ఊస్తెంకా వచ్చారు.

''యేమండోయ్, బాగున్నారా? యింకా ఆటవిడుపేనా యేంటి?'' కీచుమంది ఊస్తెంకా, ఒలేనిన్‌కేసి తిరిగి.

''ఆఁ! యింకా ఆటవిడుపే'' అన్నాడతను. యెందుకనో తెలియ కుండానే సిగ్గుగా, యిబ్బందిగా బాధపడ్డాడు.

వెళ్ళిపోవాలనుకున్నాడు. కాని వెళ్ళలేకపోయాడు. మాట్లాడకుండా కూచోడమూ అసాధ్యంగా వుంది. ఆ ముసలాడు కొంచెం మద్యం అడిగి అతన్ని బతికించాడు. వాళ్ళిద్దరూ కొంచెం తాగారు. ఒలేనిన్ యెరోష్కాతోటి తాగాడు, ఆ రెండో కోసక్‌తోటీ, మళ్ళీ యెరోష్కాతోటీ తాగాడు. తాగే కొద్దీ అతని హృదయం బరువెక్కుతోంది. ఆ ముస లాళ్ళిద్దరూ హుషారెక్కిపోయారు. ఆ ఆడపిల్లలు పొయ్యిమీదికి యెక్కి గుసగుసలాడుకుంటూ, ఆ మగాళ్ళకేసి చూస్తూ వున్నారు. వాళ్ళు పొద్దుపోయేదాకా తాగుతూనే వున్నారు. ఒలేనిన్ మాట్లాడలేదు, కాని మిగతా వాళ్ళకంటే యెక్కువ తాగాడు. ఆ కోసక్కులు అరుస్తు న్నారు. ఆ పెద్దావిడ వాళ్ళనింక యెక్కువ చిఖిర్ తాగనియ్యలేదు. వాళ్ళని వదిలించుకోవాలని ప్రయత్నించింది. ఆడపిల్లలు యెరోష్కా మామని చూసి నవ్వారు. వాళ్ళంతా కలిసి గుమ్మం దాటి పోయేటప్పటికి పది దాటిపోయింది. ఒలేనిన్ యింట్లో మజా కార్యక్రమం పూర్తి చేసుకోవాలని ఆ ముసలాళ్ళు వాళ్ళంతటా వాళ్ళే వెళ్ళారు. ఊస్తెంకా

యింటికి వెళ్ళిపోయింది. యెరోష్కా ఆ ముసలి కోసక్కుని వన్యూష దగ్గిరికి తీసికెళ్ళాడు. ఆ పెద్దావిడ అవతలి ఇంటిని శుభ్రం చేసి రావడానికి బయటికి వెళ్ళింది. మర్యాంకా ఒక్కత్తే యింట్లో వుండి పోయింది. యేదో అప్పుడే మెలుకువ తెచ్చుకున్నట్టుగా, ఒలేనిన్ ఒక్కసారి నవనవలాడుతూ, ఉత్సాహంగా వున్నట్టు అనుకున్నాడు. ప్రతిదీ అతను గమనించాడు. ముసలాళ్ళని ముందు పోనిచ్చి, మళ్ళీ వెనక్కి తిరిగాడు. మర్యాంకా పడకకి తయారవుతోంది. ఆమె దగ్గిరికి వెళ్ళాడు. యేదో చెప్పాలనుకున్నాడు గాని గొంతు పెగల్లేదు. ఆమె అతన్నుంచి దూరంగా మంచంమీద ఓ మూల పద్మాసనం వేసి కూర్చుంది. వెర్రెత్తి బెదిరిపోయిన కళ్ళతో అతనికేసి చూసింది. ఆమె స్పష్టంగా అతనంటే భయపడింది. ఒలేనిన్ అది చూశాడు. అతను బాధపడ్డాడు. తనమీద తనకే సిగ్గేసింది. కాని అదే సమయంలో, తను ఆమెలో కనీసం ఆ అనుభూతినైనా రెచ్చగొట్టానన్న గర్వమూ, సంతోషమూ కలిగాయి

''మర్యాంకా, నామీద నీకు దయలేదా? నేను నిన్నెంత ప్రేమిస్తు న్నానో చెప్పలేను'' అన్నాడతను.

ఆమె యింకా అటు జరిగిపోయి అంది: ''తాగి చెప్పే మాటలు వినాలి!... నానుంచి మీకేం రాదు!''

''ఛ, ఛ, తాగిన మాటలు కాదు, లుకాష్కాని పెళ్ళాడద్దు. నేను పెళ్ళాడతా నిన్ను.''

యీ మాటలన్నాక అతననుకున్నాడు ''నేనేమంటున్నాను'' అని. ''యిదే మాట రేపు చెప్పగలనా? ఆఁ, చెప్పగలను. నేను చెప్పగలననే ధీమా నాకు వుంది, యిప్పుడే యీ మాట మళ్ళీ అంటా'' ఓ అంతర్వాణి బదులు చెప్పింది.

''నన్ను పెళ్ళి చేసుకుంటావా?''

ఆమె అతనికేసి గంభీరంగా చూసింది. ఆమె భయం పోయినట్టే వుంది.

''మర్యాంకా, నాకు మతిపోతోంది. నేను నేను కాను. నువ్వేం చెబితే అది చేస్తాను'' పిచ్చిగా మృదువైన మాటలు వాటంతట అవే అతని నోట్లోంచి వచ్చాయి.

''మీరు వదిరేది దేన్ని గురించి?'' ఆమె అడ్డం వచ్చింది, తటాల్న తనకేసి చాచే అతని చెయ్యి పట్టుకుని. ఆమె అతని చేతిని తోసెయ్యలేదు, కాని తన బలిష్ఠమైన కఠినమైన వేళ్లతో దృఢంగా నొక్కింది.

''పెద్దమనుషులు కోసక్ పిల్లల్ని పెళ్లాడతారా? వెళ్లిపొండి!''

''కాని నువ్వు పెళ్లాడతావా? ప్రతీదీ....''

''అయితే మనం లుకాష్కని యేం చెయ్యాలి?'' అందామె నవ్వుతూ.

ఆమె పట్టుకున్న చేతిని లాగేసుకున్నాడతను. ఆమె పడుచు శరీరాన్ని గాఢంగా కాగలించుకున్నాడు. ఆమె లేడి పిల్లలా యెగిరి, వట్టి కాళ్లతోటే వసారాలోకి పారిపోయింది. ఒలేనిన్‌కి మత్తు విడింది. తనపట్ల తనకే భయం వేసింది. ఆమెలో పోల్చుకుంటే తను వర్ణించలేనంత దుర్మార్గంగా వున్నట్టు అతనికి అనిపించింది. అయినా తను అన్నదానికి ఒక్క క్షణం కూడా విచారించకుండా యింటికి పోయాడు. తన గదిలో తాగుతూ వున్న ఆ ముసలాళ్లకేసి పిసరేనా చూడకుండా పక్క మీద వాలి యెంతో కాలంగా లేనంతటి గాఢంగా నిద్రపోయాడు.

## 35

ఆ మర్నాడు పండగ. సాయంత్రం గ్రామస్థులంతా సూర్యాస్తమయ కాంతిలో మెరిసిపోతూ వుండే పండగ బట్టల్తో వీధుల్లో చేరారు. ఆ రుతువులో మామూలుకంటే యెక్కువ వైన్ ఉత్పత్తి అయింది. జనం పనుల్లోనుంచి తెరిపిన పడ్డారు. ఒక నెల రోజుల్లో కోసక్కులు దండయాత్ర ఆరంభిస్తారు. చాలా యిళ్లలో పెళ్లిళ్ల ప్రయత్నాలు జరుగుతున్నాయి.

కోసక్ గ్రామ కచేరీకి దగ్గర, ఆ రెండు దుకాణాలకీ ముందున్న చౌకులో, జనం పోగయారు. ఆ దుకాణాల్లో ఒకదాంట్లో మిఠాయిలూ, గుమ్మడి గింజలూ, యింకోదాంట్లో రుమాళ్లూ, నూలు అద్దకం బట్టలూ అమ్ముతారు. కచేరీ భవనం మెట్ల అరుగుమీద లేత బూడిద రంగు కోట్లూ, నల్ల కోట్లూ తొడుక్కున్న ముసలాళ్లు కొంత మంది కూర్చునీ, కొంతమంది నుంచునీ వున్నారు. ఆ కోట్లకి బంగారు జరీగాని, మరే రకమైన అలంకారంగాని, లేవు. యువతరంకేసి హుందా అయిన నిబ్బరంతోటి చూస్తూ కొత్తకాలం గురించీ, యువజనం గురించీ, గ్రామ వ్యవహారాల గురించీ, గతించిన రోజుల గురించీ వాళ్లలో వాళ్లు ఆచితూచి మాట్లాడుకుంటున్నారు. వాళ్లసక్కనుంచి వెడుతూ స్త్రీలూ, ఆడపిల్లలూ ఆగి అభివందనపూర్వకంగా తలలు వంచేరు. యువ కోసక్కులు గౌరవ పురస్సరంగా తమ నడకని తాపీ చేసి, నెత్తిమీది టోపీలు కొంచెం యెత్తి పట్టుకునేవారు. ముసలాళ్లు అప్పుడు మాట్లాడ్డం మానేసేవాళ్లు. వాళ్లలో కొంతమంది, వెడుతూ వుండే వాళ్లని తీక్ష్ణంగానూ, కొందరు దయతోనూ చూశారు, వాళ్లు టోపీలు తీసి మళ్లీ పెట్టుకునేవాళ్లు.

కోసక్ ఆడపిల్లలు యింకా తమ ఖోరొవోద్‌లు* మొదలెట్టలేదు. కాంతివంతమైన రంగులు గల బెష్మెత్‌లు తొడుక్కుని తలమీద తెల్ల రుమాళ్లు కళ్లమీదదాకా లాక్కుని నేలమీదో యిళ్ల అరుగులమీదో యేటవాలుగా పడే సూర్య కిరణాలు తగలకుండా నీడలో వాళ్లు గుంపులుగా కూర్చుంటారు. ఖంగుమనే కంఠాల్తో నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటూ వుంటారు. చిన్న కుర్రాళ్లూ, బాలికలూ చౌకులో ఆడుకుంటూ యెత్తుగా నీలాకాశంలోకి బంతి యెగరేసి అరుస్తూ,

---

*ఆడపిల్లలు గుండ్రంగా చేరి చుట్టూ తిరుగుతూ, పాటలు పాడ్డం. — సం.

కేకలేస్తూ పరిగెడతారు. వయసొచ్చిన పిల్లలు నాట్యం చెయ్యడం అప్పుడే ప్రారంభించారు, మెరుగ్గా తమ సన్నని కీచు గొంతుకలతో పాడుతున్నారు. గుమాస్తాలు, సైన్యంలో లేని కుర్రాళ్ళు గాని, సంతక్కి యింటికొచ్చిన వాళ్ళు గాని కళకళలాడే మొహాల్తోటీ చక్కని తెలుపు రంగుని గానీ, యెరుపు రంగుని గానీ బంగారు జరీ అంచు సర్కేషియన్ కోట్లు వేసుకొని చెయ్యీ చెయ్యీపట్టుకుని యిద్దరేసీ ముగ్గురేసీ కలిసి ఒక గుంపు అమ్మాయిలనుంచి యింకో గుంపు అమ్మాయిల దగ్గరికి వెళ్లి ఆగుతూ వాళ్లతో వేళాకోళాలాడుతూ సరసాలాడుతూ తిరుగుతారు. ఆర్మీనియన్ దుకాణదారుడు, చక్కని నీలం గుడ్డ బంగారు అంచుకోటు తొడుక్కుని, తెరిచిన తన దుకాణం తలుపు దగ్గర నుంచుంటాడు. అందులోనుంచి మెరిసిపోయే రంగులున్న రుమాళ్ళు, పడతలు పెట్టి, రాశిగా కనిపిస్తాయి. అతను ప్రాగ్వణిక్కుల అహంతో, కాతాదార్ల కోసం చూస్తూ వుంటాడు. టెరెక్ అవతలనుంచి తిరణాల చూద్దామని వచ్చిన యిద్దరు చెప్పాల్లేని యెర్రగడ్డం చెచెన్లు ఓ మిత్రుడి యింటిబయట గొంతు కూర్చున్నారు. గ్రామస్థులని చూస్తూ నిశ్చింతగా చిన్న పైపులు పీలుస్తూ, మధ్యలో ఉమ్మి లేస్తూ, ఒకళ్లతో ఒకళ్లు గబగబా కంఠ్యాక్షర భాషణతో విశేషాలు చెప్పుకున్నారు. యెప్పుడేనా రోజువారీ పనిలో కనిపించే సైనికుడు పాత ఓవర్‌కోటు తొడుక్కుని ఆ మిసమిసలాడే బట్టల గుంపుల మధ్యలో వెళ్లేవాడు. అక్కడా అక్కడా మజాచేసుకుంటూ కైపెక్కిన కోసక్కుల పాటలు అప్పటికే వినిపించేవి. యిళ్ళన్నీ తాళాలు పెట్టి వున్నాయి; వసారాలన్నీ ముందు రోజే శుభ్రంగా కడిగేసారు. ముసలి స్త్రీలు కూడా వీధుల్లోకి చేరారు. వీధులన్నీ గుమ్మడి గింజల తొక్కల తోటీ, పుచ్చ గింజల తొక్కలతోటీ గలీజుగా వున్నాయి. గాలి వెచ్చగా, నిశ్చలంగా వుంది. ఆకాశం నిర్ఘనంగా, నిర్మలంగా వుంది. యిళ్ల కప్పుల కవతల, యిప్పుడింకా చెమ్మగా వున్నట్టు కనిపించే కాంతిలేని తెల్లని

పర్వత శ్రేణి అస్తమయ సూర్యుని కాంతిలో మెరుపెక్కుతూ వుంది. అడపాదడపా నది అవతలి వేపునుంచి ఫిరంగి పేలిన సుదూర ధ్వని వచ్చింది. కాని గ్రామంమీద, ఒకదానితో ఒకటి కలిసి, పండుగ నాటి ఉత్సాహపూరిత ధ్వనులు మోగిసాయి.

మర్యాంకాని చూసే ఆశతోటి ఆ ఉదయమంతా ఒలేనిన్ ముంగిట్లో అటూ యిటూ పచార్లు చేస్తూనే వున్నాడు. కాని ఆమె తనకున్న దాపుడు బట్టలు కట్టుకుని చర్చికి ప్రార్థనకి వెళ్లింది. తర్వాత, ఓ మట్టి అరుగుమీద, మిగతా పిల్లల్తో గింజలు కొరుకుతూ కూచుంది. మళ్లీ తన నేస్తాలతో కలిసి ఒకో సారి యింటికి పరిగెత్తేది. ప్రతిసారీ తన బస మనిషికేసి దయాన్వితమైన చూపు విసిరేది. తమాషాగా ఆ పిల్లని పిలవడానికి, అదీ మిగతా వాళ్ల ముందు, ఒలేనిన్‌కి భయమైంది. తను ముందు రోజు రాత్రి ఆమెకి చెప్పదలచుకుని మొదలెట్టింది పూర్తి చేద్దామనీ, ఆమెనుంచి కచ్చితమైన సమాధానం రాబట్టాలనీ అనుకున్నాడు. ముందునాటి సాయంత్రం లాంటి యింకో క్షణం కోసం చూశేడు. కానీ ఆ క్షణం రాలేదు. యీ అనిశ్చిత స్థితిలో యింక యెంత మాత్రమూ వుండలేననుకున్నాడు. ఆమె మళ్లీ వీధిలోకి పోయింది. కొంచెం సేపు ఆగిం తర్వాత అతనూ బయటికి వెళ్లాడు. తను యెక్కడికి పోతున్నదీ తెలియకుండానే అతను ఆమెని అనుసరించాడు. మెరిసిపోయే సిల్కు బెష్మెత్ తొడుక్కుని ఆమె కూర్చున్న మూలనుంచే అతను వెళ్లాడు. వ్యధాకులిత హృదయంతో తన వెనక నుంచి వచ్చే అమ్మాయిల నవ్వు విన్నాడు.

చౌకుకి తిన్నగా బెలేత్‌స్కీ యిల్లు కనిపిస్తుంది. ఒలేనిన్ దాన్ని దాటుకుంటూ పోయేటప్పటికి అతన్ని పిలుస్తూ వున్న బెలేత్‌స్కీ కంఠం వినిపించింది, ''లోపలికి రా'' అని. అతను లోపలికి వెళ్లాడు.

కాసేపు అవీ యివీ మాట్లాడుకున్నాక వాళ్లు యిద్దరూ కిటికీ వార కూర్చున్నారు. ఆ తర్వాత కొంచెం సేపటికే యెరోష్కా వచ్చి

కలిశాడు. అతను కొత్త బెష్మెత్ తొడుక్కున్నాడు. వాళ్ల పక్కన నేలమీద కూలబడ్డాడు.

''అదుగో, అక్కడ, అది గొప్పోళ్ల జట్టు'' అన్నాడు బెలేత్స్కీ మందహాసంతో, తన సిగరెట్‌లోటి వో మూల వున్న ధగధగ మెరిసే గుంపుని చూపిస్తూ. ''మా పిల్లా అక్కడే వుంది. కనిపిస్తోందా? ఎరుపు రంగు బట్టలు. ఆమె తొడుక్కున్నది కొత్త బెష్మెత్. యేం ఖొరొవోద్ మొదలెట్టరేం?'' అని అరిచాడతను, కిటికీలోనుంచి యువతలికి వంగుతూ ''కొంచెం సేపాగు, చీకటి పడ్డాక మనమూ వెడదాం. అప్పుడు వాళ్లని ఊస్తెంకా యింటికి పిలుద్దాం. వాళ్లకో విందు యేర్పాటు చెయ్యాలి మనం!''

''ఊస్తెంకా యింటికి నేనూ వస్తాను'' అన్నాడు నిశ్చయమైన కంఠంతో ఒలేనిన్. ''మర్యాంకా వస్తుందా అక్కడికి?''

''ఆఁ, వస్తుంది, తప్పకుండా రా!'' అన్నాడు బెలేత్స్కీ యేమాత్రం ఆశ్చర్యం లేకుండా. ''కానీ అది బొమ్మల్లోలాగా అందంగా లేదూ?'' అన్నాడతను, నానావర్ణ శోభితమైన సమూహాల కేసి చూపిస్తూ.

''అవును, చాలా!'' ఒలేనిన్ వూఁ కొట్టేడు, యేం పట్టనట్టు కనిపించాలని ప్రయత్నిస్తూ. అతనింకా అన్నాడు, ''జనమంతా అకస్మాత్తుగా తృప్తిపడిపోయి హుషారుగా వుంటారెందుకనోననే ఆశ్చర్యం కలిగిస్తాయి నాకిలాటి తిరణాళ్లు. మాట వరసకి, యివాళ యీ నెల పదిహేనో తేదీ కాబట్టి ప్రతీదీ పండగలా వుంది. కళ్లు, మొహాలు, కంఠాలు, కదలికలు, బట్టలు, గాలీ, సూర్యుడు కూడా అన్నీ పండగ రకంగా వున్నాయి. కాని రష్యాలో మనకి యిక యే పండగలూ లేవు!''

''అవును'' అన్నాడు బెలేత్స్కీ. అతనికి అలాంటి ఆలోచనలు నచ్చవు. ''సరే కాని, నువ్వు తాగడం లేదేం పెద్దాయనా?'' అన్నాడు యెరోష్కకేసి తిరిగి.

యెరోష్కా ఒలేనిన్‌కేసి కన్ను గీటాడు బెలేత్‌స్కీని చూపిస్తూ. ''హే, అతను, నీ కునాక్, గర్వపోడు'' అన్నాడు.

బెలేత్‌స్కీ గ్లాసు యెత్తాడు.

''అల్లా బిర్దీ!'' అన్నాడు గ్లాసు ఖాళీ చేస్తూ. (''అల్లా బిర్దీ'' అంటే ''దేవుడిచ్చాడు'' అనేది కలిసి తాగేటప్పుడు, కాకేషియన్లలో ఆచారంగా అనే నాందీ వచనం.)

''సావ్ బుల్'' (''నీ ఆరోగ్యం కోసం'') అని యెరోష్కా మంద హాసం చేస్తూ జవాబిచ్చి, గ్లాసు ఖాళీ చేశాడు. ''దీన్ని పండగంటావా?'' అన్నాడు ఒలేనిన్‌కేసి తిరిగి, లేస్తూ. కిటికీలోంచి యివతలికి చూశాడు. ''యిదేం పండగయ్యా! ఆ రోజుల్లో వాళ్లు మజా చెయ్యడం చూడాలి! ఆడాళ్లు బంగారు జరీ సరఫాన్ల*తో బయటికి వచ్చేవాళ్లు. రెండు వరసల కాసుల పేర్లు వాళ్ల మెళ్లలో వేలాడేవి. నెత్తిమీద బంగారు గుడ్డ జరీరుమాళ్లు. వాళ్లు అలా వెడుతూ వుంటే వాళ్ల బట్టలు యెంతగానో రెపరెపలాడేవి. ప్రతీ ఆడమనిషీ ఓ యువరాణీలా వుండేది. ఒక సారి వాళ్లు యివతలికి వచ్చేవాళ్లు, మొత్తం మంద అంతా; పాటలు మొదలెట్టేవాళ్లు హోరెత్తిపోయేటట్టు. రాత్రంతా మజా చేస్తూనే వుండేవాళ్లు. కోసక్కులు ఓ పీపా ముంగిట్లోకి దొర్లించుకొచ్చి తెల్లరేదాకా తాగుతూనే వుండేవాళ్లు, యింకో సారి చేతుల్లో చేతులు కట్టుకుని వూరంతా విహరించేవాళ్లు. యెవళ్లు కనిపించినా కూడా తీసుకుపోయేవాళ్లు. యింటింటికీ వెళ్లేవాళ్లు. ఒకో సారి వరసగా మూడ్రోజులు మజా చేసేవాళ్లు. మా నాన్న యెలా యింటికి వస్తూ వుండేవాడంటే — నాకింకా గుర్తు — ముఖం జేవురించి, ఉబ్బిపోయి, నెత్తిమీద టోపీ వుండేది కాదు, ప్రతీదీ పోగొట్టేసుకునేవాడు. వూరికే

---

* రవికపైన భుజాలదగ్గర తాళ్లతో కట్టి తొడుక్కునే గౌను లాంటిది. — సం.

వచ్చేసి పడిపోయేవాడు. యేం చెయ్యాలో అమ్మకి తెలుసు. ఆయనకి తెలివి రప్పించడానికి తాజా చేపగుడ్లు, కొంచెం చిఖిర్ తెచ్చిపెట్టేది. అప్పుడు టోపీ కోసం వెతుకుతూ వూరంతా పరుగు. రెండ్రోజులు నిద్రపోయేవాడు! అప్పట్లో మనుషులు అలా వుండేవాళ్లు. కాని యిప్పుడు, యిదేమిటీ వీళ్లు?''

''సరే, బాగానే వుంది కాని, సరఫాన్లు తొడుక్కున్న ఆడపిల్లలు వాళ్లంతట వాళ్లే మజా చేసుకునే వాళ్లా?'' అడిగాడు బెలేట్స్కీ.

''అక్కడికి వాళ్లే మజా చేసుకునేటట్టు! ఒకోసారి కోసక్కులు కాలినడకనో గుర్రాలమీదో వచ్చి అనేవాళ్లు: 'మనం ఖోరొవోద్ చెదరగొట్టేద్దాం' అని. వాళ్లు వెళ్లేవాళ్లు. కాని ఆడపిల్లలు బడితెలు అందుకునేవాళ్లు. ష్రోవ్‌టైడ్ పండగ నాడు ఓ పడుచువాడు గుర్రంమీద దౌడు తీస్తూ వచ్చేవాడు. కాని ఆడపిల్లలు వాడి గుర్రాన్ని బడితెతో కొట్టేవాళ్లు. వాణ్ణీ కొట్టేవాళ్లు. కాని వాడు చొచ్చుకు పోయేవాడు, మనసైన దాన్ని పట్టేసుకుని యెత్తుకు పోయేవాడు. ఓహ్!... యెంత సరసం చేసేవాడు దాన్ని! ఆఁ, ఆ రోజుల్లో పిల్లలు అచ్చం రాణీలే!''

## 36

సరిగ్గా అప్పుడు యిద్దరు వ్యక్తులు పక్క వీధిలోనుంచి చౌకులోకి స్వారీ చేసుకుంటూ వచ్చారు. ఒకడు నజార్కా, రెండో వాడు లుకాష్కా. బలిష్ఠంగా వున్న యెరుపూ గోధుమ రంగు కబర్దా గుర్రంమీద కొంచెం పక్కకి ఒరిగి కూర్చున్నాడు లుకాష్కా. ఆ గట్టి రోడ్డుమీద మెల్లగా తన అందమైన ముఖాన్నీ చక్కగా మెరిసే జూలునీ అటూ యిటూ వూపుతూ అది మెల్లిగా అడుగేసింది. ఒరలో బాగా యిమిడిన తుపాకీ, వెనకాల పిస్తోలూ, జీను వెనక మడిచి పెట్టిన పై అంగీ, లుకాష్కా ప్రశాంతమైన స్థలంనుంచి గానీ, చేరువలో వున్న స్థలంనుంచి

గానీ రాలేదని తెలియచేసాయి. కొంచెం ఓరగా గుర్రంమీద కూర్చున్న షోకైన పద్ధతీ, కమ్చీతో గుర్రం కడుపుకింద అతను తాకే నిర్లక్ష్యమైన కదలికా, మరీ ముఖ్యంగా అతని అర్ధ నిమీలిత శ్యామల నయనాలూ, అతను చుట్టూ చూసినప్పుడు అవి మెరవడమూ అన్నీ యౌవనం తాలూకు యెరుకగల శక్తినీ, ఆత్మవిశ్వాసాన్నీ వ్యక్తం చేశాయి. అతని కళ్లు ఓ పక్కనుంచి యింకో పక్కకి దృష్టి సారిస్తూ వుంటే "యిలాంటి ఫస్టైన కుర్రాణ్ని యెప్పుడేనా చూశారా?" అంటున్నట్టు వున్నాయి. వెండి వస్తువులూ అలంకారాలూ వున్న ఆ గుర్రమూ, ఆయుధాలూ, అందమైన ఆ కోసక్కూ చౌకులో అందరి దృష్టినీ ఆకర్షించారు. పీలగా, పొట్టిగా వున్న నజార్కా అంత డాబైన బట్టలు వేసుకోలేదు. ముసలాళ్ల దగ్గర్నుంచి వెళ్లేటప్పుడు లుకాష్కా ఆగి అంటకత్తెర వేయించుకున్న తన నల్లని నెత్తిమీదనుంచి ఉంగరాల తెల్లని గొర్రెబొచ్చు టోపీ యెత్తి పట్టుకున్నాడు.

"సరే గాని, చాలా నొగాయ్ గుర్రాలు యెత్తుకుపోయావేంటి నువ్వు?" అడిగాడో సన్నపాటి ముసలతను, లుకాష్కాకేసి ముఖం చిట్లిస్తూ.

"నువ్వు లెక్కెట్టావేంటి, తాతా, అడుగుతున్నావ్?" బదులు చెప్పాడు లుకాష్కా, మళ్లిపోతూ.

"అదంతా బాగానే వుంది కాని నువ్వా కుర్రాణ్ణి తీసికెళ్లక్కర్లేదు" ఆ ముసలాడు గొణిగాడు, యింకా నల్లగా మొహం చిట్లించుకుంటూ.

"ఓర్నీ యీ ముసలి పీనుక్కి ప్రతిదీ తెలుసు" గొణుక్కున్నాడు లుకాష్కా. అతని ముఖం చింతాకులితమైంది. కాని అప్పుడు ఓ మూల చాలామంది కోసక్ అమ్మాయిలు నుంచొని వుండటం చూసి గుర్రాన్ని అటు మళ్లించాడు.

"యేం పిల్లలూ, బాగున్నారా?" అతను తన బింకమైన ఖంగుమనే గొంతుకతో అరిచాడు, ఒక్కసారిగా గుర్రాన్ని అదుపుచేస్తూ. "నేను

లేకుండానే ముసలాళ్లై పోయారేంటే దొంగ భడవల్లారా!'' అతను నవ్వాడు.

''ఓయ్, లుకాష్కా, రా, రా, గుండులాంటి కుర్రాడా!'' ఆ హుషారైన గొంతుకలు వంతపాడాయి. ''డబ్బు మూటలు బాగా తెచ్చావేంటి? అమ్మాయిలకి కాసిని మిఠాయిలు కొనిపెట్టు!... చాలా రోజులుంటావా? నిజమే, చాలా రోజులైంది నిన్ను చూసి....''

''నజార్కా, నేనూ ఓ రాత్రి సరదా చేసిపోదామని యెగిరొచ్చాం'' జవాబిచ్చేడు లుకాష్కా, తన కమ్చీ యెత్తి అమ్మాయిలకేసి తిన్నగా స్వారీ చేస్తూ.

''పాపం, మర్యాంకా నిన్ను పూర్తిగా మర్చిపోయింది'' మర్యాంకాని మోచేత్తో పొడుస్తూ, కీచుమని పగలబడి నవ్వుతూ, అంది ఉస్తెంకా.

మర్యాంకా గుర్రంనుంచి కొంచెం దూరం జరిగి మెడ వెనక్కి వాలేసి, తన మెరిసే కళ్లతో నిబ్బరంగా ఆ కోసక్‌కేసి చూసింది.

''నిజమే, యెన్ని రోజులైంది అయినా మచ్చాలేవు! యేంటిది, నీ గుర్రంకింద తొక్కేస్తావా మమ్మల్ని?'' అందామె పొడిగా. పక్కకి మళ్లింది.

లుకాష్కా ప్రత్యేకంగా హుషారుగా కనిపించాడు. అతని వదనం సాహసంతోటీ, సంతోషంతోటీ మెరిసిపోతోంది. మర్యాంకా నిరాదర సమాధానంతోటి అతను స్పష్టంగానే దిమ్మ తిరిగిపోయాడు. అకస్మాత్తుగా కనుబొమలు ముడుచుకున్నాడు.

''నా గుర్రం రికాబులమీదనుంచి పైకెక్కు, నిన్ను కొండల్లోకి తీసుకుపోతాను, పిల్లా!'' హఠాత్తుగా అన్నాడతను, తన మబ్బు వూహలు చెదరగొట్టుకోడానికా అన్నట్టు. గుర్రాన్ని ఆ పిల్లలమధ్య అటూ యిటూ నడిపించాడు. మర్యాంకాకేసి వంగి అతను రహస్యంగా అన్నాడు: ''నేన్నిన్ను ముద్దెట్టుకుంటా, ఓహ్, యెలా ముద్దెట్టుకుంటానుకున్నావ్!...''

అతని కళ్లతో మర్యాంకా కళ్లు కలిసాయి. ఆమె హఠాత్తుగా చికాకుపడిపోయి, వెనక్కి అడుగేసింది.

''ఓయ్, నీకేం పొయ్యే కాలం! నా కాళ్లు తొక్కేస్తావ్'' అందామె. తన చక్కని కాళ్లకేసి చూసుకుంది. వాటికి బిగులైన లేత నీలం రంగు మేజోళ్లు వున్నాయి. యెర్రటి కొత్త చెప్పులు సన్నని వెండి జడ అల్లికతో అందంగా వున్నాయి.

లుకాష్కా ఊస్తెంకాకేసి తిరిగాడు. చేతుల్లో బిడ్డని పెట్టుకున్న ఆడమనిషి పక్కన చేరి మర్యాంకా కూలబడింది. ఆ చంటిపిల్లాడు ఆమెకేసి తన బొద్దు చేతులు చాచాడు. ఆమె నీలం బెష్మెత్‌నుంచి వేలాడే కాసుల పేరు పట్టుకున్నాడు. మర్యాంకా ఆ పిల్లాడికేసి వంగి, కనుకొలకుల్లోనుంచి లుకాష్కాకేసి చూసింది. లుకాష్కా తన కోటుకింద వున్న నల్లని బెష్మెత్ జేబునుంచి ఓ మూట మిఠాయిలూ, గింజలూ తీశాడు.

''యిదిగో, యివి మీకందరికీ యిస్తున్నా'' ఊస్తెంకాకి ఆ మూట యిస్తూ, మర్యాంకాకేసి మందహాసం చేస్తూ, అన్నాడతను.

మళ్లీ ఆ పిల్ల మొహంలో చికాకు భావం గోచరించింది. ఆమె సొగసైన కళ్లమీద పొగమంచు పొగయినట్టు అయింది. పెదాల చివర దాకా రుమాలు లాక్కొని ఆ పిల్లాడి ముద్దొచ్చే ముఖంమీద తల ఆనించింది. ఆ పిల్లాడు యింకా హారం పట్టుకునే వున్నాడు. హఠాత్తుగా ఆ పిల్లాడిని మర్యాంకా ఆతురంగా ముద్దెట్టుకోవడం మొదలెట్టింది. ఆ పసివాడు ఆమె యెత్తైన వక్షాన్ని తన చిన్ని చేతులతో తోసేశాడు. తన బోసి నోటిని తెరిచి పెద్దగా కేరింతాలు కొట్టాడు.

''పిల్లాణ్ణి నలిపేస్తున్నావు నువ్వు!'' అందా పిల్లాడి తల్లి, వాణ్ణి పక్కకి తీసేసుకుంటూ. బెష్మెత్ వదులు చేసుకుంది, ఆ పసివానికి పాలివ్వడానికి. ''పోయి ఆ కుర్రాడికి స్వాగతం చెప్పు, మంచిది.''

''యిదిగో, గుర్రాన్ని కట్టేసి వస్తా యిప్పుడే, నజార్కా నేనూ

తిరిగివస్తాం. రాత్రంతా మజా చేద్దాం'' అన్నాడు లుకాష్కా, గుర్రాన్ని కమ్చీతో అదిలించి, ఆడపిల్లల దగ్గర్నుంచి వెళ్లిపోతూ. పక్క వీధిలోకి మళ్లి అతనూ, నజార్కా పక్కపక్కనే వున్న రెండిళ్ల దగ్గరికి వెళ్లారు.

''హమ్మయ్య, మొత్తానికి వచ్చాం, సరే. ఒరేయ్, తొందరగా తెములుచ్చుకుని రా!'' అన్నాడు లుకాష్కా పొరుగు యింటి ముందు గుర్రం దిగిన తన మిత్రుడితోటి. అప్పుడు అతను గుర్రాన్ని జాగ్రత్తగా తన యింటి గేటు దగ్గరికి నడిపించుకెళ్లాడు.

''ఏయ్, స్టెప్కా!'' తన మూగ అక్కని పిలిచాడు. ఆమె మిగతా వాళ్లలాగే సొగసుగా బట్టలేసుకుంది. అతని గుర్రాన్ని అందుకోడానికి వీధిలోనుంచి వచ్చింది. గుర్రాన్ని గడ్డి దగ్గరకి తీసుకు పొమ్మనీ, జీను విప్పద్దనీ ఆమెకి సౌంజ్ఞలు చేశాడతను.

ఆ మూగపిల్ల తన మామూలు కూని ధ్వనులు చేసి పెదాలు చప్పరించింది, ఆ గుర్రంకేసి చూపిస్తూ దాన్ని మూతిమీద ముద్దు పెట్టుకుంది. దానర్థం ఆమె గుర్రమంటే యిష్టపడిందనీ, అది చాలా భేష్షైన గుర్రమనీ.

''అమ్మా, యెలా వున్నావ్? యిదేంటీ నువ్వింకా బయటికి వెళ్లలేదు?'' యథాస్థానంలో తుపాకీని పట్టుకుని, వసారా మెట్లెక్కుతూ, కేకేశాడు లుకాష్కా.

అతని తల్లి తలుపు తెరిచింది. ''నువ్వా నాయనే! నువ్వొస్తావని నేనసలు చూళ్లేదు, అనుకోలేదు. అదేమిటీ కిర్కా నువ్వు రావన్నాడు'' అందామె.

''కొంచెం చిఖిర్ తెచ్చిపెట్టమ్మా. నజార్కా వస్తాడిక్కడికి. మేం మజా చేసుకుంటాం.''

''యిప్పుడే తెస్తా, లుకాష్కా, యిప్పుడే తెస్తా'' అందా పెద్దావిడ. ''మన ఆడపిల్లలంతా సంబరంగా వున్నారు. మన మూగపిల్ల కూడా వెళ్లిందనుకుంటాను.''

ఆమె తాళాలు తీసుకుని అవతలి యింటికి హడావుడిగా వెళ్లింది.

నజార్కా గుర్రాన్ని కట్టేసి, భుజంమీదనుంచి తుపాకీ తీసేసి లుకాష్కా యింటికి వచ్చి, లోపలికి వెళ్ళాడు.

## 37

తల్లి చేతిలోనుంచి చిఖిర్‌తో నిండా నింపిన కప్పు తీసుకుని వంచిన తల దగ్గరికి యెత్తుతూ "నీ ఆరోగ్యంకోసం!" అన్నాడు లుకాష్కా.

"యిదేం బాగా లేదు, బుర్లాక్ తాత యేమన్నాడో విన్నావా 'చాలా గుర్రాలు కొట్టేశావేం్రటా?' అతనికి తెలిసినట్టుంది" అన్నాడు నజార్కా.

"ముసలి పీనుగ!" అన్నాడు లుకాష్కా. కొంచెం సేపటికి, "పోనిద్దూ, దానితో యేం గాని!" అన్నాడు తల వూపుతూ. "యీ పాటికి నది కవతల వుంటాయి, పోయి చూడు."

"అయినా యిది మంచి పరిస్థితి కాదు."

"కాకపోవడమేమిటి? రేపటికి కొంచెం చిఖిర్ పట్టుకెళ్లు. తర్వాత యేం వుండదు. యిప్పుడు మజా చేసుకుందాం. ఊఁ, తాగు!" ముసలి యెరోష్కా ఆ మాట అనే రీతిలో అరిచాడు లుకాష్కా. "వీధిలోకి ఆడపిల్లల దగ్గరికి పోయి మజా చేద్దాం. నువ్వెళ్లి కొంచెం తేనె తీసుకురా. పోనీ వద్దులే, నేను మా మూగదాన్ని పంపిస్తా. పొద్దుటి దాకా మజా చేద్దాం!"

నజార్కా చిరునవ్వు నవ్వాడు. "యిక్కడ చాలా సేపుంటామా?"

"కొంచెం సరదా తీరేదాకా. పోయి కొంచెం వోడ్కా పట్రా. యిదిగో డబ్బు."

యామ్కా దగ్గర్నుంచి వోడ్కా తేవడానికి విధేయంగా పరిగెత్తాడు నజార్కా.

వేట కోసం చూసే పక్షుల్లాగా, యెరోష్కా మామా, యెర్గుషోవ్ యెక్కడ మజా జరుగుతోందో పసికట్టి ఒకళ్ల తర్వాత ఒకళ్లు, యిద్దరూ మత్తుగా తూలుతూ ఇంట్లోకి వచ్చారు.

"యింకో సగం కడవ తెచ్చిపెట్టు" లుకాష్కా తల్లిని కేకేశాడు, వాళ్ల అభివాదానికి జవాబుగా.

"యేరా అబ్బాయ్, యెక్కడ కొట్టేశావ్ వాటిని, దొంగవెధవా, చెప్పు!" అరిచాడు యెరోష్కా. "నువ్వు భలే వాడివిరా. నువ్వంటే నాకిష్టం!"

"యిష్టమే, ఆఁ...." అన్నాడు లుకాష్కా నవ్వుతూ. "కేడెట్ల దగ్గర్నుంచి ఆడపిల్లలకి మిఠాయిలు మోసుకుపోతున్నావ్! యేహ్, నువ్వు, ముసలి...."

"ఛ, ఛ, అబద్ధం, అబద్ధం!... ఓహ్! మర్కా" ఆ ముసలాడు పగలబడి నవ్వాడు. "ఆ దొంగ ముండా కొడుకు నన్ను యెంత పీడించాడని. 'బాబ్బాబు, అది యేర్పాటుచెయ్యి' అన్నాడు. నాకో తుపాకీ యిస్తానన్నాడు. కాని, వుహుఁ. నేను యేర్పాటుచెయ్యగలిగివుండే వాణ్ణనుకో, కాని నువ్వంటే యిది నాకు. సరే చెప్పు యెక్కడికెళ్లావ్?" ముసలాడు తాతార్‌లో మాట్లాడ్డం మొదలెట్టాడు.

లుకాష్కా వెంటనే జవాబు చెప్పాడు. యెర్గుషోవ్‌కి తాతార్ రాదు. మధ్యమధ్యనో రష్యన్ మాట మాత్రం అనేవాడు.

"నే చెప్పేదేమిటంటే అతను గుర్రాల్ని తోలేశాడు. నాకది ఖాయంగా తెలుసు" అన్నాడతను రూఢిగా.

"గిరీ, నేనూ కలిసే వెళ్లాం (గిరీఖాన్‌ని 'గిరీ' అనడం, కోసక్ వ్యూహకి సాహస చిహ్నం). నది అవతల అతగాడు తనకి మైదానమంతా తెలుసనీ నేరుగా తీసికెడతాననీ డచ్చాలు కొడుతున్నాడు. కాని రాత్రి చీకటిగా వుంది. పాపం, గిరీ దారి తప్పాడు. యెటూ పోలేక సుళ్లు తిరగడం మొదలెట్టాడు. వూరు కనిపించదు. అదీ సంగతి.

మేం కుడివేపు చాలా దూరం పోయి వుండాలి. అర్ధ రాత్రిదాకా తచ్చాడు తూనే వున్నాం. అదృష్టం బావుండి అప్పుడు కుక్కల అరుపులు విన్నాం.''

''దద్దమ్మలు!'' హుంకరించాడు యెరోష్క మామ. ''మేమూ మైదానంలో దారి తప్పేవాళ్లం. యెవరు తప్పరు? కాని నేను ఓ గుట్ట యెక్కేసి ఒంటరిగా వున్న తోడేల్లాగ అరిచేవాణ్ని. యిలాగ!'' అతను చేతులు నోటిమీద పెట్టుకుని, తోడేళ్ల మంద యేక కంఠంతో అరుస్తున్నట్టు అరిచాడు. ''కుక్కలు వెంఠనే మొరిగేవి.... అంతే, కానీ — అవి దొరికాయా?''

''మేం వాటిని త్వరగా నడిపించుకుపోతే! నజార్కని కొంత మంది నోగాయ్ ఆడాళ్లు దాదాపు పట్టేసుకున్నారు.''

''పట్టుకున్నారూ?'' అన్నాడు అప్పుడే తిరిగివచ్చిన నజార్క, చిన్న బుచ్చుకుంటూ.

''మళ్లీ గుర్రాలమీద స్వారీ చేసుకుపోయాం. మళ్లీ గీరీ దారి తప్పేడు. మమ్మల్ని దాదాపు యిసక దిబ్బల్లో దించాడు. టెరెక్ దగ్గరికే వెడుతున్నాం కదా అని మేమనుకున్నాం. కాని అంత సేపూ దాన్నుంచి దూరంగా పోతూనే వున్నాం!''

''నక్షత్రాల్ని బట్టి వెళ్లి వుండాల్సింది'' అన్నాడు యెరోష్క మామ.

''అదే నేననేదీనీ'' మధ్యలో అన్నాడు యెర్గుషోవ్.

''ఆ, వెళ్లాల్సిందే అంత చీకటిగా వుంటే; చుట్టూతా చూసీ చూసీ తెగ ప్రయత్నించాను.... ఆఖరికి కళ్లెం ఓ గుర్రంమీద పడేసి నా గుర్రాన్ని వదిలేసాను — అదే మమ్మల్ని బయటపడేస్తుందని; అదేం చేసిందనుకున్నారు! నేలకేసి ముక్కుతో ఒకటి రెండు సార్లు బుస కొట్టింది, ముందుకు దౌడు తీసింది, తిన్నగా మమ్మల్ని వూళ్లోకి తీసుకు వచ్చింది. అది తీసుకురావడం అదృష్టమైంది, యెందుకంటే తెల్లవార బోతున్నది. వాటిని అడివిలో దాచడానికి బొటాబొటీగా వ్యవధి దొరికింది. నది అవతలినుంచి నగీమ్ వచ్చి వాటిని తీసుకుపోయాడు.''

యెర్మొషేన్ తల సంకించాడు. ''సరిగ్గా నేచెప్పేదే, మంచి తెలివిగా వుంది. వాటికి బాగా ముట్టిందా మీకు?''

''అంతా యిక్కడే వుంది'' అన్నాడు లుకాష్క జేబు తడుతూ.

అప్పుడే అతని తల్లి గదిలోకి వచ్చింది. లుకాష్క తను చెప్పేది పూర్తి చెయ్యలేదు.

''తాగండి!'' అతను అరిచాడు.

''ఆఁ, గిర్చిక్మూ, నేనూ ఓ రోజు రాత్రి బాగా పొద్దు పోయాక బయల్దేరాం....'' యెరోష్క మొదలెట్టాడు.

''ఓహ్, చిరాకు. నువ్వు చెప్పేదానికి తెగూ తెంపూ వుండదు'' అన్నాడు లుకాష్క. ''నే పోతున్నా'' తన కప్పు ఖాళీ చేసి, పటకా బిగించుకుని అతను బయటికి వెళ్ళిపోయాడు.

## 38

లుకాష్క వీధిలోకి వెళ్ళేటప్పటికే చీకటి పడింది. ఆ శారద రాత్రి చలిగా, నిశ్శబ్దంగా వుంది. చౌకుకి ఓ పక్కన పెరిగిన శ్యామలమైన, బూడుగ చెట్ల వెనకనుంచి అధిరోహిస్తున్నాడు బంగారు పూర్ణ చంద్రుడు. వెలపలి యిళ్ల పొగ గొట్టాల్లోనుంచి పొగ లేచి వూరంతా కమ్మింది, పొగమంచుతో కలిసిపోతూ. అక్కడక్కడ కిటికీల్లో దీపాలు ప్రకాశిస్తున్నాయి. పిడకల వాసనతోటీ, ద్రాక్షతుక్కు వాసనతోటీ, పొగమంచు వాసనతోటీ గాలి నిండి పోయింది. గొంతుకల, నవ్వుల, పాటల, గింజలు కొరకడాల ధ్వనులు పగలు వున్నట్టే కలగాపులగంగా వున్నాయి కాని యిప్పుడింకా స్పష్టంగా వున్నాయి. యిళ్ల పరిసరాల్లో, కంచెల దగ్గరా తెల్లటి రుమాళ్లు, టోపీల గుంపులు చీకట్లో మెరుస్తున్నాయి.

చౌకులో దీపాలు వెలుగుతూ తెరిచివున్న దుకాణ ద్వారం ముందు

కోసక్ పురుషుల, ఆడపిల్లల నల్లని తెల్లని ఆకారాలు చీకటి గుండా గోచరమవుతున్నాయి. దూరంనుంచి దగ్గరగా వుండే వాళ్ల పాటలూ, నవ్వులూ, సంభాషణలూ వినిపించాయి. ఆడపిల్లలు ఒకళ్ల చేతులు ఒకళ్లు పట్టుకొని దుమ్మునిండిన చౌకులో మెత్తగా అడుగులు వేస్తూ వృత్తాకారంగా తిరుగుతున్నారు. ఓ పల్చటి పిల్ల, వాళ్లందర్లోకీ సామాన్యంగా వున్న పిల్ల, రాగం ఆలాపించింది:

అడవి అవతలనుంచి శ్యామలాటవినుంచి
హరిత వనములనుంచి, నీడ నెలవులనుంచి
వచ్చారు వచ్చారు యువకులిద్దరు, మంచి ఉల్లాసవంతులు
సాహసోపేతులూ, చక్కనీ వాళ్లూ
యిద్దరూ పెళ్లవని బ్రహ్మచారోళ్లూ
నడిచారు నడిచారు యిద్దరూ కలిసి,
అంతలో ఆగేడు ప్రతిఒకడు నిలిచి.
వాళ్లు నిలిచేరంత మొదలయ్యెజగడం!
అంతలోనే వచ్చె కన్నె పడుచొకతె;
వస్తూనే అన్నది యిద్దర్ని చూసి:
''మీలోన ఒక్కరికి నే చెందుతాను''
సుందరాకారుడే పొందె నా సుందరిని,
బంగారు కురులున్న సొగసైన వాడే!
కుడిచెయ్యి ఆమెదీ యెంతో తెల్లనిదీ
అద్దాని నాతడూ తన చేతితో పట్టి
నేస్తాలు చూడగా నడిపించుకెళ్లాడు!
అన్నాడు అతగాడు వాళ్లతో యిట్లా
''మీలోన యెవరైన మీ జన్మలోన
నా భార్య అంతటి సుందరిని చూశేర?''

ముసలమ్మలు పాటలు వింటూ, చుట్టూతా నుంచున్నారు. చిన్న పిల్లలు చీకట్లో ఒకళ్ల నొకళ్లు తరుముకుంటూ పరిగెత్తారు. ఆడ పిల్లలు చుట్టూ తిరుగుతూ వుంటే మగాళ్లు మధ్యమధ్య వలయాన్ని ఛేదిస్తూ, లోపలికి వెళ్తూ, వాళ్లని పట్టుకుంటూ దగ్గర్లో నుంచున్నారు. గుమ్మం దగ్గరకీ నీడలో సర్కేషియన్ కోట్లూ గొర్రెబొచ్చు టోపీలూ తొడుక్కుని నుంచున్నారు బెలేత్‌స్కీ, ఒలేనిన్ యిద్దరూ. కోసక్కుల మాదిరిగా కాకుండా సన్నని స్పష్టమైన కంఠంతో వుంది వాళ్ల సంభాషణ తీరు, అక్కడి వాళ్ల దృష్టిని తాము ఆకర్షిస్తున్నామన్న గుర్తింపుతో.

యెర్ర బెష్మెత్ తొడుక్కున్న బొద్దు ఊస్తెంకా, కొత్త బెష్మెత్, గాగరా తొడుక్కున్న రాజఠీవిగల మర్యాంకా చెయ్యీ చెయ్యీ పట్టుకుని వలయంలో కదిలారు. ఊస్తెంకానీ, మర్యాంకానీ యెలా పట్టుకోవాలా అని బెలేత్‌స్కీ, ఒలేనిన్ చర్చించుకుంటున్నారు. ఒలేనిన్ యేదో సరదా కోసం చూస్తున్నాడని బెలేత్‌స్కీ అనుకున్నాడు. తన అదృష్టం అటో యిటో తేలిపోతుందని ఒలేనిన్ అనుకున్నాడు. ఆ రాత్రే యెలాగైనాసరే తను మర్యాంకాని యేకాంతంగా చూడాలనీ, ఆమెకి ప్రతీదీ చెప్పెయ్యాలనీ ఆమె తన భార్య కాబోయేదీ లేనిదీ అడిగెయ్యాలనీ అతను అనుకున్నాడు. ఆ ప్రశ్నకి జవాబు "కాదు" అని యెప్పుడో వచ్చినా, తను అనుకున్నదంతా ఆమెకి చెప్పెయ్యగలననే ఆశించాడు, ఆమె తనని అర్థం చేసుకుంటుందనీ ఆశించాడు.

"ముందే యెందుకు చెప్పలేదు నాకు? నీకా యేర్పాటు చెయ్యడానికి ఊస్తెంకాని పట్టేవాణ్నిగా? నువ్వెప్పుడూ యింతే, చిత్రంగా...." బెలేత్‌స్కీ అన్నాడు.

"యేం చెయ్యాలి?... ఓ రోజున, త్వరలోనే, యీ సంగతంతా నీకు చెబుతా. యిప్పుడు మాత్రం యెలాగైనా సరే, ఆమె ఊస్తెంకా యింటికి వచ్చేటట్టు చెయ్యి."

''సరేలే, అదెంత పని! యేం మర్యాంకా, నువ్వు 'సుందరా కారుడి' వశమౌతావా, బుకాష్కక్కాకుండా?'' అన్నాడు బెలేత్స్కీ మర్యాద కోసం మర్యాంకాతోటి మొదట. కాని యే జవాబూ రాకపోయే సరికి ఊస్తెంకా దగ్గరికి వెళ్ళి మర్యాంకాని తనతో యింటికి తీసికెళ్ళమని ప్రాధేయ పడ్డాడు. తను చెబుతున్నది కటాకటీగా పూర్తి చేసే వ్యవధిలోపునే మళ్ళీ పాట అందుకుంది. ఆడపిల్లలు ఒకళ్ళ నొకళ్ళు వలయం చుట్టూ లాక్కోవడం మొదలెట్టారు. వాళ్ళు పాడారు:

తోటలు, తోటలు దాటి
విహరించాడో యువకుడు,
వీధుల్లోనూ విపణుల్లోనూ
మొదటి సారిగా వెడుతూ
దక్షిణ హస్తం బలిష్ఠమైనది
ఉల్లాసంగా వూపాడు.
పట్టు దట్టీ పెట్టిన టోపీ
రెండవ సారి వూపాడు.
మూడో సారటు పోతూ పోతూ
కదలకుండ నుంచున్నాడు
వెళ్ళకుండగా వున్నాడు.
యీ సారతను పోలేదు.
సొగసుకాడుగా అయ్యేడు
''నీతో కొంచెం మాట్లాడ్డానికి
వద్దామని అనుకున్నాను.
నాతో తోటకి షికారు కోసం
రావెందుకనే ప్రియురాలా?
రా, మరి, చెప్పూ, ప్రియురాలా

నేనంటే సురి తిరస్కారమా?
తర్వాతెప్పుడో నీవే తెలుసుకు
మతికి తెచ్చుకుని విచారించెదవు.
మనసిచ్చేందుకు త్వరలోనే
నేనే నీకడ కొస్తాగా
మనకిద్దరికీ పెళ్లయ్యాకా
యేడుస్తావే నా మూలంగా!''
యేం చెప్పాలో తెలిసినప్పటికి
కాదనే ధైర్యం లేదాతన్ని!
అబ్బే, కాదనే ధైర్యం లేదు!
తోటలోనికి షికారు కెళ్లా
నా వాడిని నే కలిసేటందుకు
మనసైనోడికి వందన మిడితిని
వంగేటప్పుడు యెలాగు పడెనో
రుమాలు నాది నేలబడింది.
అది వున్న చోటనే చూశాడు
చేత్తో పైకి తీశాడు
''కరుణించి తీసుకో దీన్ని నానుంచి
తీసుకో దీన్ని నీ తెల్లనీ చేత్తో
తీసుకుంటే నీకు వలపు వున్నట్టు.
నామీద నీ వలపు తెలసవే నాకు
నేనేమి యిచ్చేది నీకు ప్రియురాలా!
ప్రియురాలి మురిపెమ్ము తీరగా నేను
శాలువా బహుమాన మివ్వదలచాను
ముద్దులైదూ బదులు పుచ్చుకుంటాను.''

లుకాష్క, నజార్క వలయంలోకి చొచ్చుకుపోయారు. ఆడపిల్లల మధ్యలో తిరగడం మొదలెట్టారు. చేతులు వూపుకుంటూ వలయం మధ్యలో నడుస్తూ వంత అందుకుని పాట్లంలో కలిసాడు లుకాష్క.

''వూఁ, యెవరో ఒకళ్ళు రండి!'' అన్నాడు. లోటిపిల్లలు మర్యాంకాని తోశారు, కాని ఆమె వలయంలోకి పోలేదు. కలకల నవ్వులూ, చరుపులూ, ముద్దులూ, గుసగుసలూ, పాటతో కలిసిపోయేయి. ఒలేనిన్ పక్కనుంచి పోతూ, లుకాష్క ఆదరంగా తల వూపాడు.

''డ్మిత్రియ్ అంద్రేయిచ్! ఓ సారి చూడ్డానికి వచ్చారా?'' అన్నాడు.

''వూఁ'' అన్నాడు ఒలేనిన్ పొడిగా, నిశ్చితంగా.

బెలేత్స్కి వంగి, ఉస్తెంకా చెవిలో యేదో గుసగుసలాడాడు. తను చుట్టు తిరిగి వచ్చేదాకా జవాబిచ్చే వ్యవధి లేకపోయింది ఆమెకి. అప్పుడంది, ''అలాగే మేం వస్తాం.''

''మర్యాంకా కూడానా?''

ఒలేనిన్ మర్యాంకాకేసి వంగాడు. ''నువ్వు వస్తావా? తప్పకుండా, రా. వూరికే, ఒక్క నిముషం. నేను నీతో తప్పకుండా మాట్లాడాలి.''

''మిగతా పిల్లలు వస్తే నేనూ వస్తా.''

''నేనడిగిందానికి జవాబు చెప్పవూ! నువ్విప్పుడు ఉల్లాసంగా వున్నావు కదా'' అన్నాడామెవైపు వంగుతూ.

ఆమె అతన్నుంచి దూరం వెళ్ళిపోయింది. ఆమెని అనుసరించాడు:

''చెప్తావా?''

''యే ప్రశ్నకి?''

''నేను మొన్న అడిగిందానికి. నువ్వు నన్ను పెళ్ళాడతావా?'' అన్నాడు ఒలేనిన్ ఆమె చెవి దగ్గరికి వంగి.

మర్యాంకా ఓ క్షణం ఆలోచించింది. ''చెబుతాలెండి'' అంది, ''యీ రాత్రి చెబుతా.'' ఆ నిశీధిలో ఆ యువకుడికేసి తిరిగిన ఆమె కళ్ళు ప్రకాశమానంగా, ఆదరంగా మెరిసాయి.

అతనింకా ఆమె ననుసరించే వున్నాడు. ఆమె చేరువగా వుండటం అతనికో ఆనందం.

లుకాష్కా పాట పాడటం ఆపకుండానే హఠాత్తుగా ఆమె చెయ్యి గట్టిగా పట్టుకుని ఆమె వున్న చోటునుంచి ఆడపిల్లల వలయం మధ్యలోకి లాగాడు. ఒలేనిన్‌కి ''ఊస్తెంకా యింటికి రా'' అని చెప్పే వ్యవధే వుండింది. అతను తన మిత్రుడి దగ్గరకి అడుగేసాడు. పాట అయిపోయింది. లుకాష్కా పెదాలు తుడుచుకున్నాడు. మర్యాంకా పెదాలు తుడుచుకుంది. వాళ్లు ముద్దుపెట్టుకున్నారు. ''ఉహుఁ, ఉహుఁ, ముద్దు లైదూ!'' అన్నాడు లుకాష్కా. నృత్యగీత తాళం పోయి వాగుడూ, నవ్వులూ, తరుముకోడాలూ వచ్చాయి. బాగా తాగినట్టు కనిపించిన లుకాష్కా ఆడపిల్లలకి మిఠాయిలు పంచిపెట్టాడు. ''అవి అందరికీనీ!'' అన్నాడతను గొప్పగా, హాస్యకరంగా జాలి పుట్టించే స్వోత్కర్షతోటి. ''కాని సైనికుల వెనకాల పోయే యెవరేనా వలయంలోంచి పోవాలి!'' అన్నాడు వెంటనే, ఒలేనిన్‌కేసి కోప దృష్టితో చూస్తూ.

ఆడపిల్లలు అతని దగ్గర్నుంచి మిఠాయిలు లాక్కున్నారు. నవ్వులాడుకుంటూ వాటి కోసం వాళ్లలో వాళ్లు పెనుగులాడారు. బెలేత్‌స్కీ, ఒలేనిన్‌లు పక్కకి మళ్లేరు.

తన దాతృత్వానికి సిగ్గుపడుతున్నట్టు లుకాష్కా టోపీ తీసేసి, చొక్కా చేత్తో నుదురు తుడుచుకుంటూ మర్యాంకా ఊస్తెంకాల దగ్గరికి వచ్చాడు. ''చెప్పు ప్రియురాలా, నేనంటే మరి తిరస్కారమా'' అన్నాడు, వాళ్లప్పుడే పాడిన పాటలోని మాటల్తో. మర్యాంకాకేసి కోపంగా చూసి ఆ మాటలు రెట్టించాడు, ''నేనంటే మరి తిరస్కారమా? మనకిద్దరికీ పెళ్లయ్యాకా యేడుస్తావే నా మూలంగా!'' అన్నాడు, ఊస్తెంకానీ మర్యాంకానీ కలిసి కౌగలించుకుంటూ. ఊస్తెంకా పట్టు విడిపించుకుని పోయి, చెయ్యి సాచి అతని వీపుమీద యెలాంటి దెబ్బ చరిచిందంటే ఆమె చెయ్యి నెప్పిపట్టింది.

''సరే, యింకో వంతు వేస్తారా?'' అడిగాడతను.

''మిగతా పిల్లలు కావాలంటే. కాని నేనింటికి పోతున్నా. మర్యాంకా కూడా వస్తోంది'' జవాబిచ్చింది ఊస్తెంకా.

మర్యాంకా చుట్టూ చెయ్యి వేసి ఆమెని గుంపులోనుంచి ఓ యింటి చీకటి మూలకి తీసుకుపోయాడు లుకాష్క.

''వెళ్లద్దు, మర్యాంకా. ఆఖరు సారి సరదా చేసుకుందాం, రా. యింటికెళ్లి పో. నే వస్తా నీ దగ్గరికి'' అన్నాడు.

''యింటి దగ్గరేం చెయ్యాలి నేను? పండగంటే హుషారుగా వుండటానికే. నేను ఊస్తెంకా యింటికెడుతున్నాను'' బదులిచ్చింది మర్యాంకా.

''నేను నిన్ను పెళ్లాడతాను, అయినా, తెలుసా?''

''సరే, ఆ సమయం వచ్చినప్పుడు చూద్దాం'' అంది మర్యాంకా.

''అయితే వెడుతున్నావన్న మాట'' అన్నాడు లుకాష్క కఠినంగా. ఆమెని దగ్గరగా ఒత్తుకుని బుగ్గమీద ముద్దుపెట్టుకున్నాడు.

''ఇదిగో, వొదిలిపెట్టు! నన్ను విసిగించకు.'' అతని చేతుల్లోనుంచి విదిలించుకుంటూ వెళ్లిపోయింది మర్యాంకా.

''ఓ పిల్లా, అది ముదురుతుంది'' అన్నాడు లుకాష్క దూషణగా. తల ఆడిస్తూ కదలకుండా నుంచున్నాడు. ''యేడుస్తావే నా మూలంగా....'' ఆమెనుంచి మళ్లిపోతూ మిగతా పిల్లలకేసి అరిచాడు: ''సరే, యిప్పుడింకో పాట చూద్దాం!''

అతనన్న మాట మర్యాంకాకి చిరాకూ భయమూ తెప్పించినట్లైంది. ఆమె ఆగింది. ''యేమిటి ముదురుతుంది?''

''అది!''

''యేది?''

''నువ్వు బసలోని సైనికుడితో స్నేహం చేసి, నన్ను లక్ష్యపెట్టక పోవడం!''

''నాకిష్టమైనంత కాలం లక్ష్యపెడతాను. నువ్వేం నా అబ్బవీ,

అమ్మవీ కాదు. యేమిటి నువ్వు కోరేది నానుండి? నా యిష్టం వచ్చిన వాళ్లని లక్ష్యపెడతాను!''

''అలాగే, అలాగే....'' అన్నాడు లుకాష్కా. ''కాని గుర్తుంచుకో!'' దుకాణం దగ్గరికి వెళ్లాడు. ''యేం పిల్లలూ!'' అరిచాడు. ''యేం ఆగేరు? ఆడండి. నజార్కా! యింకొంచెం చిఖిర్ తెచ్చిపెట్టు.''

''సరే, వాళ్లొస్తారా?'' బెలేత్స్కీని సంబోధిస్తూ అడిగాడు ఒలేనిన్.

''సరాసరి వచ్చేస్తారు. రా, పోదాం, మనం విందు యేర్పాటు చెయ్యాలి'' జవాబిచ్చేడు బెలేత్స్కీ.

## 39

బెలేత్స్కీ యింటినుంచి మర్యాంకానీ, ఊస్తెంకానీ అనుసరించి ఒలేనిన్ బయటపడేటప్పటికి రాత్రి చాలా పొద్దుపోయింది. తన ముందు ఆ చీకటి వీధిలో ఆ పిల్ల తెల్లటి రుమాలు మెరవడం చూశాడు. బంగారు చంద్రుడు మైదానంమీదకి దిగిపోతున్నాడు. వెండి పొగమంచు వూరిమీద కమ్ముకుంది. అంతా నిశ్చలంగా వుంది. యెక్కడా దీపాల్లేవు. తిరిగి వెళ్లిపోయే యువతుల పదధ్వనులు మాత్రమే విని పిస్తున్నాయి. ఒలేనిన్ గుండె వేగంగా కొట్టుకుంది. చెమ్మగా వున్న రాత్రి గాలి, మంటగా వుండే అతని వదనాన్ని చల్లబరిచింది. అతను ఆకాశంకేసి చూశాడు. మళ్లీ తను అప్పుడే వదిలిపెట్టి వచ్చిన యింటి కేసి చూశాడు. కొవ్వొత్తి అప్పటికే ఆరిపోయింది. మళ్లీ తిరిగి వెళ్లిపోతున్న పిల్లల ఛాయలు చీకట్లో పరీక్షగా చూశాడు. పొగ మంచులో తెల్లని రుమాలు అదృశ్యమైంది. ఒంటరిగా వుండటానికి అత నికి భయమైంది; అతనంత ఆనందంగా వున్నాడు. గుమ్మంలోనుంచి దూకి ఆ పిల్లల వెనక పరిగెత్తాడు.

''హుష్, యేంటది, యెవరేనా చూస్తారు....'' అంది ఊస్తెంకా.

''ఫరవాలేదు!''

ఒలేనిన్ మర్యాంకా దగ్గరికి పరిగెత్తి కెళ్ళి ఆమెని కౌగలించుకున్నాడు. మర్యాంకా అభ్యంతరం పెట్టలేదు.

''యిప్పటిదాకా ముద్దెట్టుకున్నది చాల్లేదా?'' అంది ఊస్తెంకా. ''పెళ్ళి చేసుకుని అప్పుడు ముద్దెట్టుకోండి. కాని యిప్పటి మట్టుకి కొంచెం తాళండి.''

''సెలవ్, మర్యాంకా. మీ నాన్నకి రేపొచ్చి చెప్తాను. నువ్వేం చెప్పద్దు.''

''నేనెందుకూ చెప్పడం!'' అంది మర్యాంకా.

ఆ యిద్దరు పిల్లలూ పరిగెత్తారు. ఒలేనిన్ యేం జరిగిందీ ఆలోచిస్తూ ఒక్కడూ నడుస్తూనే వున్నాడు. ఆ సాయంత్రమంతా ఆమెతో యేకాంతంగా పొయ్యి దగ్గర ఓ మూల గడిపాడు. ఊస్తెంకా ఒక్క క్షణం కూడా యిల్లు వదిలి వెళ్ళలేదు. మిగతా పిల్లల తోటీ, బెలేత్స్కీతోటీ అంత సేపూ అల్లరిగా ఆడుతూనే వుంది. ఒలేనిన్ మర్యాంకాతో మెల్లిగా మాట్లాడేడు.

''నన్ను పెళ్ళాడతావా?'' అడిగాడతను.

''మీరు నన్ను దగా చేస్తారు'' ఆమె ఉత్సాహంగా, మెల్లగా బదులు చెప్పింది.

''కాని నన్ను ప్రేమిస్తున్నావా? నీకు పుణ్యముంటుంది, చెప్పు.''

''నేనెందుకు ప్రేమించనూ మిమ్మల్ని! మీకు మెల్ల కన్ను లేదుగా?'' అంది మర్యాంకా నవ్వుతూ. ఆమె దృఢమైన చేతులు అతని చేతుల్ని నలిపాయి.

''యెంత తెల్లటి మృదువైన చేతులు మీవి — మీగడలా వున్నాయి'' అంది.

''నేను నిజంగా అడుగుతున్నాను, చెప్పు నన్ను పెళ్ళాడతావా?''

''యెందుకు చేసుకోనూ, నాన్న ఒప్పుగుంటే?''

''సరే, గుర్తుంచుకో నన్ను దగా చేస్తే పిచ్చెక్కిపోతాను. రేపు

మీ అమ్మకీ నాన్నకీ చెబుతా. నేనే వచ్చి నిన్ను చేసుకుంటానని అడుగుతా.''

మర్యాంకా తటాల్న సగలబడి నవ్వింది.

''యేమిటి సంగతి?''

''యెంతో తమాషాగా వుంది!''

''యిది నిజం! నేనో ద్రాక్షతోటా, యిల్లూ కొంటా. నన్ను కోసక్‌గా నమోదు చేయించుకుంటా.''

''సరాయి ఆడాళ్ళమ్మట తిరిగారో జాగ్రత్త. అల్లాంటివంటే నాకు మంట.''

సంతోషంగా యీ మాటలన్నీ పునశ్చరణ చేసుకున్నాడు ఒలేనిన్. వాటి తలపు అంతట్లోనే బాధ, అంతట్లోనే అంత సంతోషం కలిగించి అతనికి వూపిరాడనియ్యలేదు. బాధ యెందుకంటే అతనితో మాట్లాడుతున్నప్పుడు యెప్పటిలాగానే నిబ్బరంగా ఆమె వుండటం. ఆ కొత్త పరిస్థితుల్లో కూడా ఆవేశంగా వున్నట్టు కనిపించలేదు. ఆమె అతన్ని విశ్వసించనట్టూ, భవిష్యత్తు గురించి ఆలోచించనట్టూగానే వుంది. ఆ క్షణం మట్టుకే ఆమె అతన్ని ప్రేమించినట్టనిపించింది. అతనితో కలిసిన భవిష్యత్తు ఆమె మనసులో లేనట్టు అనిపించింది. అతను ఆనందంగా వున్నాడు, యెందుకంటే ఆమె మాటలు నిజంగానే కనిపించాయి, ఆమె తనది కావడానికి ఒప్పుకుంది.

''అవును'' అనుకున్నాడు. ''ఆమె పూర్తిగా నాది అయినప్పుడు మాత్రమే ఒకళ్ల నొకళ్లం అర్థం చేసుకుంటాం. అలాటి ప్రేమకి మాటల్లేవు. దానికి ఒక జీవిత కాలం కావాలి — పూర్తి జీవిత కాలం. రేపు అంతా స్పష్టమైపోతుంది. యిలా వుండనింక; రేపు వాళ్ల నాన్నకీ, బెలెత్‌స్కీకీ, వూరంతటికీ అన్నీ చెప్పేస్తాను.''

రెండు నిద్రలేని రాత్రుళ్ల తర్వాత ఆ పండగ పూట లుకాష్కా యెంత తాగాడంటే, అతని జీవితంలో తాగిం తర్వాత లేచినడవలేక పోవడం అది మొదటి సారి. అంచేత యామ్కా యింటిదగ్గరే పడుకున్నాడు.

# 40

మర్నాడు మామూలు కంటే పెందరాళే లేచాడు ఒలేనిన్. వెంటనే తన ముందున్న పనేమిటో గుర్తు చేసుకున్నాడు. ఆమె ముద్దులూ, ఆమె మోటు చేతుల ఒత్తిడీ, ''యెంత తెల్లని చేతులు మీవి'' అన్న ఆమె మాటలూ సంతోషంగా గుర్తు చేసుకున్నాడు.

తటాలున లేచి, మర్యాంకాని తనకిచ్చి పెళ్ళిచెయ్యమని అడగడానికి, వెంటనే యింటాయన దగ్గరికి వెళ్ళాలనుకున్నాడు. సూర్యుడు యింకా ఉదయించలేదు. కాని వీధిలో యెప్పుడూ లేనంత హడావుడిగా వుంది. జనమంతా మాట్లాడుకుంటూ, నడుస్తూనో గుర్రాలమీదో తిరుగుతున్నారు. సర్కేషియన్ కోటు మీదేసుకుని వేగంగా గుమ్మంలోకి వచ్చాడు. యింటివాళ్ళు యింకా లేవలేదు. అయిదుగురు కోసక్కులు గుర్రాలమీద పోతూ వాళ్ళలో వాళ్ళు గట్టిగా మాట్లాడుకుంటున్నారు. వెడల్పాటి వెన్ను వున్న కబర్దా గుర్రంమీద లుకాష్క ముందు వెడుతున్నాడు. ఆ కోసక్కులంతా కలిసే మాట్లాడుకుంటూ అరుస్తూ వుండటంతోటి వాళ్ళేమనుకుంటున్నారో కచ్చితంగా గ్రహించడం అసాధ్యంగా వుంది.

''యెగువ మజిలీకి నడవండి'' ఒకడన్నాడు.

''జీను తగిలించు, మమ్మల్ని అందుకో, త్వరగా'' అన్నాడింకొకడు.

''మరో గేటుగుండా వెడితే దగ్గర!''

''యేమిటి నువ్వు మాట్లాడేది?'' అరిచాడు లుకాష్క. ''మధ్య గేటు ద్వారా వెళ్ళాలి మనం, ఆఁ?''

''అవును అదే దగ్గర'' అన్నాడో కోసక్. అతను దుమ్ము కొట్టుకుపోయి వున్నాడు. చెమటలు కక్కే గుర్రంమీద స్వారీ చేస్తున్నాడు.

ముందు రోజు రాత్రి తాగుడుకి లుకాష్క ముఖం జేవురించి

ఉబ్బింది. అతని టోపీ నెత్తిమీద వెనక్కి తోసేసి వుంది. అతను, ఒక ఆఫీసరైనట్టుగా, సాధికారంగా మాట్లాడాడు.

"యేమిటి సంగతి? యెక్కడికి పోతున్నారు?" అడిగాడు ఒలేనిన్, కష్టంమీద ఆ కోసక్కుల దృష్టినాకర్షించి.

"అబ్రేక్కులని పట్టుగోడానికి పోతున్నాం. వాళ్లు యిసక దిబ్బల వెనక్కాల దాంకున్నారు. యిప్పుడే బయల్దేరతాం. యింకా మాకు సరిపడా మనుషుల్లేరు" ఆ కోసక్కులు అరుస్తూనే వున్నారు. వీధుల్లో వాళ్లు స్వారీ చేసుకుపోతూ వుంటే యింకా మనుషులు వాళ్లతో చేరుతూనే వున్నారు. తను వెనక వుండిపోవడం బాగుండదని ఒలేనిన్‌కి అనిపించింది; అదీగాక త్వరలోనే తిరిగి వెనక్కి వచ్చెయ్యొచ్చునని అనుకున్నాడు. బట్టలు వేసుకుని తుపాకీ నింపుకుని గుర్రంమీదికి యెగిరాడు. వన్యూష దానికి, కొంచెం అటూ యిటూగా జీను బాగానే వేసాడు. ఒలేనిన్ ఆ కోసక్కుల్ని గ్రామద్వారం దగ్గర దాటేడు. ఆ కోసక్కులు గుర్రాలు దిగి, వాళ్లు తెచ్చుకున్న చిన్న పీపాలోని చిఖిర్ ఓ కొయ్య పాత్రలో నింపి దాన్ని ఒకళ్ల కొకళ్లకి అందించుకుంటూ తమ దండయాత్ర విజయవంతం గావాలని తాగారు. వాళ్లలో షోకుగా వేషం వేసుకున్న ఓ కుర్ర కేతనధారి కూడా వున్నాడు. అతను వూళ్లో వుండటం తటస్థించింది. అతను ఆ తొమ్మండుగురు కోసక్కులకీ నాయకత్వం వహించాడు. ఆ కోసక్కులంతా మామూలు సైనికులు. ఆ కేతనధారి ఆజ్ఞాపించే అధికారి వాటం తెచ్చిపెట్టుకున్నా, వాళ్లు లుకాష్క మాటనే మన్నించారు.

వాళ్లు ఒలేనిన్‌ని అసలు పట్టించుకోలేదు. అంతా గుర్రాలెక్కి బయల్దేరిపోయాక ఒలేనిన్ ఆ కేతనధారి దగ్గరకి వెళ్లాడు. యేం జరుగుతున్నదీ అడగడం మొదలెట్టాడు. ఆ కేతనధారి, మామూలుగా ఆదరంగా వుండేవాడైనా, అప్పుడు మాత్రం అతన్ని విశేషమైన అనుగ్రహంతో చూశాడు. యెంతో ప్రయాసమీద యేం జరుగుతోందీ

అతన్నుంచి రాబట్టాడు ఒలేనిన్. అ[బేక్కులని వెదకడానికి పంపిన వేగుల వాళ్ళు వూరికి అయిదారు మైళ్ల దూరంలో యిసక దిబ్బల వెనకాల యెంతో మంది కొండవాళ్లని చూడ్డం తటస్థించిందట. ఆ అ[బేక్కులు ఓ గుంతలో దాంకుని కాల్పులు జరిపారట. తాము లొంగిపోయేది లేదని [ప్రకటించార్ట. యిద్దరు కోసక్కులతో వేగు చూసే అధికారి, అ[బేక్కులని కనిపెట్టి వుండటానికి దిగడి పోయి, ఒక కోసక్ని సహాయం పట్టుమ్మని పంపించాడు.

సూర్యుడు అప్పుడే ఉదయిస్తున్నాడు. [గామానికి మూడు కోసుల అవతల పచ్చిక మైదానం అన్ని వేపులకీ వ్యాపించి వుంది. యెండి పోయి, యేకరీతిగా వుండి, పశువుల అడుగుల జాడలతో వున్న విచారం కలిగించే మైదానం తప్ప యేమీ కనిపించడం లేదు. అక్కడా అక్కడా ఓ పిడికెడు యెండిన గడ్డి చదునైన చోట్ల కురుచ రెల్లూ, అరుదుగా మనుషులు నడిచిన కాలిబాటలూ, ఆ దిఙ్మండలంపై మసకగా కనిపించే సంచార నోగాయ్ తెగ మకాములూ తప్ప యేమీ కనిపించడం లేదు. నీడ పట్టులేకపోవడం, ఆ స్థలపు కాఠిన్యం కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి. పచ్చిక మైదానంమీద సూర్యుడు యెప్పుడూ యెర్ర గానే ఉదయిస్తాడు, యెర్రగానే అస్తమిస్తాడు. హోరుగాలి వున్నప్పుడు యిసక మేటలు ఓ చోటునుంచి యింకో చోటికి లేచిపోతూ వుంటాయి. ఆ ఉదయంలాగా నిశ్చలంగా వున్నప్పుడు, యే కదలికా శబ్దమూ ఛిన్నం చెయ్యలేని ఆ నిశ్శబ్దం చిత్రంగా కొట్టవచ్చినట్టు కనబడు తుంది. సూర్యుడు ఉదయించినా, ఆనాటి పొద్దుట ఆ మైదానం నిశ్చ లంగా, జడంగా వుంది ఓ చిత్రమైన శూన్య, మార్దవ అనుభూతి వ్యాపించింది. యేదీ కదల్లేదు. గుర్రాల అడుగుల చప్పుళ్లూ, గుర్రాల బుసలూ తప్ప యేమీ వినిపించడం లేదు. అవైనా త్వరలోనే మాయమై పోతున్నాయి. దాదాపు యేమీ మాట్లాడకుండానే పోతున్నారా మనుషులు. కోసక్కులెప్పుడూ తమ ఆయుధాల్ని అవి గణగణమనిగాని, టకటకమని

గాని శబ్దం చెయ్యకుండా సర్ది పెట్టుకుంటారు. గణగణ మోగే ఆయుధాలు కోసక్కులకి ఘోరమైన అవమానం. వూళ్ళో కోసక్కులిద్దరు వీళ్లని అందుకుని యేదో మాట్లాడారు. లుకాష్క గుర్రం తడబడనేనా తడబడింది, గడ్డిలో దాని కాళ్ళు చిక్కుకునేనా చిక్కుకుపోయాయి. దాంతోటి ముందుకు పోకుండా మొండికెత్తింది — అది కోసక్కులకి దుశ్శకునం. యిలాంటి సందర్భంలో అది మరీ ముఖ్యమైంది. మిగతా వాళ్ళు వెనక్కి చూశారుగాని మళ్లిపోయారు, యేం జరిగిందో గమనించకుండా వుండటానికి ప్రయత్నించారు. లుకాష్క కళ్లేలు లాగాడు, తీవ్రంగా చిట్లించుకున్నాడు, పళ్ళు బిగపట్టాడు. తల మీదనుంచి కమ్చీ ఝుళిపించాడు. అతని మేలైన కబర్దా గుర్రం ఓ కాలి మీంచి యింకో కాలిమీదకి చిందులు తొక్కుతూ యే కాలు ముందు వెయ్యాలో తెలియక రెక్కలు తగిలించుకుని యెగిరిపోదామా అని చూస్తున్నట్టు కనిపించింది. కాని లుకాష్క కమ్చీతోటి దాని నున్నటి పార్శ్వాన్ని ఒక సారి, రెండు సార్లు, మూడు సార్లు కొట్టాడు. కాని ఆ గుర్రం పళ్ళు యికిలిస్తూ తోక చాపుతూ బుసకొడుతూ, వెనక కాళ్లమీద నడిచి, కొన్ని అడుగులు మిగతా వాటినుంచి దూరంగా పోయింది. ''ఆహాః! యేం జాతి అశ్వం!'' అన్నాడు కేతనధారి. ''గుర్రం'' అనకుండా ''అశ్వం'' అనడం ప్రత్యేకమైన పొగడ్తని తెలియజేసింది.

''సింహం లాంటి గుర్రం'' మిగిలిన వాళ్లలో ఒకడు, ఓ ముసలి కోసక్, ఒప్పుకుంటున్నట్టన్నాడు.

ఆ కోసక్కులు నిశ్శబ్దంగా స్వారీ చేసుకుపోయారు. కాసేపు మంద గమనంతోటే, కాసేపు కదం తొక్కుతూనూ. వాళ్ల కదలికలోని ప్రశాంతతనీ గంభీరత్వాన్నీ ఒక క్షణకాలం భగ్నం చేసినవి, యిలా మార్పులున్న సందర్భాలే.

అలా నాలుగు కోసులు వెళ్లినా, వాళ్లకి ఓ అరకోసెడు దూరంలో బండిమీద నెమ్మదిగా కదులుతూ వున్న నోగాయ్ గుడారం తప్ప, యేం

తగల్లేదు. ఓ నోగాయ్ కుటుంబం మైదానంలోని ఓ చోటునుంచి యింకో చోటుకి పోతోంది. ఆ తర్వాత వాళ్లకి యెత్తైన చెక్కి ళ్లున్న చిరిగిన బట్టల నోగాయ్ స్త్రీలు యిద్దరు తటసన్థడ్డారు. వాళ్లు వీపులకి కట్టుకున్న బుట్టల్లో మైదానంమీద సంచరించే పశువుల పేడని పోగుచేసుకుంటున్నారు. ఆ కేతనధారికి వాళ్ల భాష సరిగా రాకపోయినా వాళ్లని ప్రశ్నించ ప్రయత్నించాడు. కాని వాళ్లకి అర్థం కాలేదు. వాళ్లు భయపడిపోయి ఒకళ్ల నొకళ్లు ఆందోళనతో చూసు కున్నారు.

లుకాష్కా వాళ్ల దగ్గరికి చేరి, గుర్రాన్నాపి, వెంటనే మామూలు అభివాదం చేసాడు. ఆ నోగాయ్ స్త్రీలు హమ్మయ్య అనుకుని అతని తోటి ఒక సోదరునితో మాట్లాడినట్టు చనువుగా మాట్లాడారు.

''అయి, అయి, కొప్ అబ్రేక్'' అన్నారు వాళ్లు యేడుపు మొహం తోటి, ఆ కోసక్కులు పోయే దారి చూపిస్తూ. వాళ్లేం చెబుతున్నదీ ఒలేనిన్‌కి అర్థమైంది: ''చాలా మంది అబ్రెక్కులు.''

యిలాంటి జట్టీ చూసి వుండకపోవడం వల్లా, యెరోష్కా మామ చెప్పిందాన్ని బట్టే వాళ్లని గురించిన అభిప్రాయం యేర్పాటు చేసుకుని వుండటం వల్లా, ఒలేనిన్ ఆ కోసక్కులకు వెనకబడకుండా, మొత్తం అంతా చూడాలనుకున్నాడు. ఆ కోసక్కులకేసి మెప్పుగా చూశాడు. తన అభిప్రాయాలు యేర్పాటు చేసుకోడానికి జాగ్రత్తగా వాళ్లని చూశాడు, వాళ్ల మాటలు విన్నాడు. తన కత్తీ, నిండుగా వున్న తుపాకీ తనతో తెచ్చుకున్నా ఆ కోసక్కులు తనని తప్పించుకుంటు న్నారని గమనించి తను దాంతో యే సంబంధమూ లేకుండా వుండిపోదామనుకున్నాడు. యేమంటే అతని సాహసం, అతను తన దళంతో వెళ్లినప్పుడే, రుజువైంది కాబట్టీన్నీ, అతను మహదానందంగా వున్నాడు కాబట్టీన్నీ. హఠాత్తుగా దూరంనుంచి ఓ తుపాకీ కాల్పు వినిపించింది. ఆ కేతనధారికి ఆవేశం అందుకుంది. ఆ కోసక్కులకి

యెలా విభజించుకోవాలో, యే వేపునుంచి సమీపించాలో ఆజ్ఞలు జారీ చేసేస్తున్నాడు. కాని ఆ కోసక్కులు లుకాష్కా చెప్పేదే వింటూ అతనికేసే చూస్తూ కేతనధారి ఆజ్ఞలనేమీ లెక్కపెట్టినట్లు కనిపించ లేదు. లుకాష్కా వదనమూ విగ్రహమూ శాంతంగా, గంభీరంగా వున్నాయి. అతను గుర్రాన్ని కదను తొక్కించేడు. దాన్ని మిగతావాళ్లు అందుకోలేకపోయారు. కళ్లు లగ్నంచేసి అతను ముందుకే చూస్తూ వున్నాడు.

''అడుగో, గుర్రంమీద ఓ మనిషి'' అన్నాడు తను కళ్లెం లాగుతూ, మిగతా వాళ్ల సరసన వుంటూ.

ఒలేనిన్ పరిశీలనగా చూసాడు కాని యేం కనిపించలేదు. ఆ కోస క్కులు యింకో క్షణంలో యిద్దరు స్వారీ చేస్తున్న వాళ్లని ప్రత్యేకించి చూసి తిన్నగా వాళ్లకేసే మెల్లిగా వెళ్లారు.

''వాళ్లేనా అబ్రేక్కులు?'' ఒలేనిన్ అడిగాడు.

ఆ కోసక్కులతనికి జవాబివ్వలేదు. ఆ ప్రశ్న వాళ్లకి అర్థరహితంగా కనిపించింది. గుర్రాలమీద నది దాటి వచ్చే సాహసం చెయ్యడానికి అబ్రేక్కులు చవటలై వుండాలి.

''అదిగో, నేస్తం రోడ్కా అయివుంటాడు మనకి సైగచేస్తూ'' అన్నాడు లుకాష్కా, గుర్రంమీది మనుషులకేసి చూపిస్తూ. వాళ్లిప్పుడు స్పష్టంగా కనిపిస్తున్నారు. ''చూడండి, యిటే వస్తున్నాడు.''

కొన్ని క్షణాలకి తేలిపోయింది వాళ్లిద్దరూ కోసక్కులేనని. ఆ అధి కారి లుకాష్కా దగ్గరికి వచ్చాడు.

## 41

''వాళ్లు జాగా దూరంగా వున్నారా?'' లుకాష్కా అడిగిందల్లా అదే. సరిగ్గా అప్పుడే వాళ్లు తీక్ష్ణమైన పేలుడు విన్నారు ఓ ముప్పై అడుగుల దూరంనుంచి. ఆ అధికారి సన్నగా చిరునవ్వు నవ్వాడు.

''అది మన గూర్కా. గురిపెట్టకుండా వేటాడుతున్నాడు'' అన్నాడతను ఆ కాల్పు వచ్చిన దిశగా తల ఆడిస్తూ.

కొద్ది అడుగులు యెదరికి వెళ్లాక వాళ్లు ఓ యిసక తిన్నె వెనకాల కూర్చుని తుపాకీ నింపుకునే గూర్కాని చూశారు. పొద్దుపుచ్చడానికతను అబ్రేక్కులతోటి కాల్పులు సాగిస్తున్నాడు. వాళ్లు యింకో యిసక తిన్నె వెనకాల వున్నారు. ఆ వేపునుంచి ఓ గుండు సర్‌మని వచ్చింది. కేరసధారి తెల్ల మొహం వేసి గందరగోళపడిపోయాడు. లుకాష్క గుర్రం దిగాడు. కళ్లేలు యింకో కోసక్కుకి పడేసి గూర్కాకేసి నడిచాడు. ఒలేనిన్ కూడా గుర్రం దిగి, కిందికి వంగుతూ లుకాష్కని అనుసరించాడు. వాళ్లింకా గూర్కాని చేరలేదు రెండు గుళ్లు మీదినుంచి దూసుకుపోయాయి. లుకాష్క నవ్వుతూ ఒలేనిన్ కేసి, వెనక్కి చూశాడు, కొంచెం వంగాడు. ''జాగ్రత్తగా చూడండి, లేకపోతే వాళ్లు మిమ్మల్ని చంపేస్తారు, డ్మిత్రియ్ అంద్రేయిచ్'' అన్నాడతను. ''మీరు వెళ్లిపోవడం మంచిది. యిది మీరుండే చోటు కాదు.''

కాని అబ్రేక్కులని చూడాలని ఒలేనిన్ తీర్మానించుకున్నాడు. ఆ గుట్ట వెనకాల ఓ రెండు వందల అడుగుల దూరంలో టోపీలూ తుపాకీలూ కనిపించాయి. హఠాత్తుగా ఒక పొగ తెర వచ్చింది. మళ్లీ ఓ గుండు దూసుకుపోయింది. కొండ దగ్గర బాడవమీద దాంకున్నారు అబ్రేక్కులు. వాళ్లున్న స్థావరంమీదనే ఒలేనిన్ దృష్టి అంతా లగ్నమై వుంది. వాస్తవానికి అది మిగతా మైదానంలాగానే వుంది. కాని అబ్రేక్కులు అక్కడ వుండటం వల్ల మిగిలిందాని కంటే వేర్పాటై ఒక ప్రత్యేకమైన లక్షణం సంతరించుకున్నట్టు కనిపించింది. అబ్రేక్కులు ఆలంబనం చేసుకోడానికి తగ్గ చోటేననిపించింది ఒలేనిన్‌కి. లుకాష్క తన గుర్రం దగ్గరికి వెళ్లాడు. ఒలేనిన్ అతన్ని అనుసరించాడు.

''మనం ఓ గడ్డి బండి సంపాదించాలి. లేకపోతే వాళ్లు మనల్ని

చంపేస్తారు. అదుగో అక్కడ గుట్ట వెనకాల ఓ నోగాయ్ బండి వుంది, నిండా గడ్డితోటి'' అన్నాడు లుకాష్క.

కేతనధారి అతను చెప్పింది విన్నాడు. అధికారి ఒప్పుకున్నాడు. గడ్డి బండిని తెచ్చారు. ఆ కోసక్కులు దాన్ని వెనకాల పట్టుకుని ముందుకు తోశారు. ఒలేనిన్ ఓ గుట్టమీదకి స్వారీ చేసుకుపోయాడు. అక్క ణ్ణుంచి ప్రతీదీ కనిపించింది. ఆ గడ్డి బండి ముందుకొచ్చింది, ఆ కోసక్కులు దాని వెనకాల గుమిగూడారు. వాళ్లు ముందుకు వెళ్లారు, కాని ఆ చెచెన్లు — వాళ్లు తొమ్మండుగురు — వరసగా మోకాళ్లు కలేసి కూర్చున్నారు. వాళ్లు కాల్చలేదు.

అంతా నిశ్శబ్దంగా వుంది. అకస్మాత్తుగా చెచెన్ల వైపునుంచి ఓ విషాద గీత ధ్వని, యెరోష్క మామ ''ఆయ్, దాయ్, దలాలాయ్'' బాప తుది వచ్చింది. తాము పారిపోలేమని చెచెన్లకి తెలుసు. పారిపోవాలనే కోరిక రాకుండా వుండాలని వాళ్లు మోకాలూ మోకాలూ పట్టీతో కట్టేసి తుపాకులు సిద్ధంగా వుంచుకుని మృత్యుగీతం పాడుతున్నారు.

గడ్డి బండి వెనకాల కోసక్కులు యింకా యింకా దగ్గరికి వచ్చారు. యేక్షణంలోనేనా కాల్పులు మొదలవుతాయని ఒలేనిన్ అనుకున్నాడు. కాని ఆ నిశ్శబ్దాన్ని అబ్రేక్కుల విషాద గీతం మాత్రమే భంగం చేసింది. హఠాత్తుగా పాట ఆగిపోయింది; తీక్ష్ణమైన తుపాకీ చప్పుడు వినిపిం చింది. ఓ గుండు బండి ముందు తాకింది. ఆ చెచెన్ల తిట్లూ, కేకలూ నిశ్శబ్దాన్ని భగ్నం చేశాయి. గుండు తర్వాత గుండు వచ్చే సింది. గుండు తర్వాత గుండు బండిని కొట్టుకుంటున్నాయి. కోసక్కులు కాల్చలేదు. యిప్పుడు అయిదడుగుల దూరంలో మాత్రమే వున్నారు.

యింకో క్షణం గడిచింది. ఆ కోసక్కులు ఒక్క కేకతోటి బండి రెండు వేపులనుంచీ బయటికి పరిగెత్తారు — లుకాష్క ముందున్నాడు. ఒలేనిన్ కొన్ని కాల్పులు మాత్రమే విన్నాడు, అప్పుడు అరుపులూ,

మూలుగులూ విన్నాడు. పొగ, రక్తం కనిపించినట్లైంది అతనికి. గుర్రాన్ని వదిలేసి తానేం చేస్తున్నదీ తెలియకుండానే కోసక్కులకేసి పరిగెత్తాడు. బీభత్సం అతన్ని అంధుణ్ణి చేసినట్లనిపించింది. యేదీ వివరం తెలుసుకోలేకపోయాడు. కాని అంతా అయిపోయిందని గ్రహించాడు. తెల్లగా పాలిపోయిన లుకాష్కా గాయపడ్డ చెచెన్‌ని చేత్తో పట్టుకుని అరుస్తున్నాడు. "వీణ్ణి చంపద్దు, వీణ్ణి ప్రాణంతోటే తీసికెడతా!" లుకాష్కా చంపిన సోదరుణ్ణి తీసికెళ్లిన య్యెర్ర జుట్టు వాడే ఆ చెచెన్. లుకాష్కా అతని చేతులు కట్టేస్తున్నాడు. తటాల్న ఆ చెచెన్ చేతులు విదిలించుకుని, రివాల్వర్ పేల్చాడు. లుకాష్కా పడిపోయాడు, పొట్టలో నుంచి రక్తం కారడం మొదలైంది. అతను యెగిరాడు కాని మళ్లీ పడిపోయాడు, రష్యన్‌లోనూ తాతార్‌లోనూ శాపనార్థాలు పెడుతూ. అతని బట్టలమీదా, కిందా యింకా యింకా రక్తం కారడం కనిపించింది. కొంతమంది కోసక్కులు అతనికేసి పరిగెత్తారు, అతని పటకా వదులుచెయ్యడం మొదలెట్టారు. వాళ్లలో ఒకడు, నజార్కా, సాయం చెయ్యబోయి, కాసేపు తొట్రుపడ్డాడు, తన ఒరలో కత్తి పెట్టుకోలేకపోయాడు. అది సరిగా పట్టడం లేదు. కత్తి వాదర రక్తసిక్తం అయిపోయింది.

య్యెర్రటి జుట్టూ, కత్తిరించిన మీసాలూ వున్న ఆ చెచెన్లు కాల్చబడ్డారు, తునాతునకలుగా చీల్చబడ్డారు. లుకాష్కాని కాల్చిన వాడొక్కడే, చాలా చోట్ల గాయపడిగా జీవంతో వున్నాడు. గాయపడిన డేగలాగా రక్తసిక్తం అయిపోయి (అతని కుడి కంటి కిందనుంచి రక్తం కారుతోంది), పాలిపోయి, నల్లబడిపోయి, వికటమైన కళ్లతోటీ, బిగించిన పళ్లతోటీ, చేతిలో బాకుతో నక్కి కూచ్చున్నాడు. చుట్టూ చూశాడు, యింకా తనని తాను రక్షించుకోడానికి తయారయి. కేతనధారి పక్కనుంచి పోతున్నట్టుగా అతని దగ్గరికి కెళ్లాడు. తటాల్న

అతని చెవిమీద కాల్చాడు. ఆ చెచెన్ లేచాడు గాని అప్పటికే మించి పోయింది. అతను కూలిపోయాడు.

ఆ కోసక్కులు భారంగా గాలిపీలుస్తూ ఆయుధాలు పోగుజేసుకుంటూ ఆ శవాల్ని లాగారు. ఆ చెచెన్లలో ప్రతి ఒక్కడూ మనిషే, ప్రతి ఒక్కడికీ సొంత వ్యక్తిత్వ కవళిక వుంది. లుకాష్కాని బండి దగ్గరికి మోసుకుపోయారు. అతను రష్యన్‌లోనూ, తాతార్‌లోనూ శాపాలు పెడుతూనే వున్నాడు.

''ఊహుం నువ్వూరుకో, నేను వీణ్ణి చేతుల్తో పీకపిసికి చంపేస్తా. అనాసెనీ!'' గింజుకుంటూనే అరిచాడతను. కాని త్వరలోనే, అరవ లేనంత నీరసపడిపోయాడు.

ఒలేనిన్ యింటికి వెళ్ళిపోయాడు. లుకాష్కా చనిపోతున్నాడనీ, కాని నది అవతలినుంచి వచ్చిన తాతార్ ఒకడు అతన్ని మూలికలతో బాగుచెయ్యడానికి పూనుకొన్నాడనీ, సాయంత్రం అతనికి తెలిసింది.

ఆ శవాల్ని గ్రామ కచేరీకి తీసుకువచ్చారు. స్త్రీలూ, చిన్న పిల్లలూ వాటిని చూడ్డానికి మూగారు.

ఒలేనిన్ తిరిగి వచ్చేటప్పటికి చీకటి పడుతోంది. అది చూసిం తర్వాత అతను స్థిమిత పడలేకపోతున్నాడు. కాని రాత్రి అయేవేళకి ముందు రోజు సాయంత్రం నాటి జ్ఞాపకాలు మనసులోకి ముసురుకుంటూ వచ్చాయి. కిటికీలోంచి చూశాడు. మర్యాంకా యింటికీ దూళ్ళశాలకీ మధ్య అటూ యిటూ తిరుగుతూ, యేవేవో సద్దుతోంది. ఆమె తల్లి ద్రాక్షతోటలోకి వెళ్ళింది. తండ్రి గ్రామ కచేరీకి వెళ్ళాడు. ఆమె పని పూర్తయేదాకా ఒలేనిన్ ఆగలేదు. ఆమెని కలుసుకోడానికి అవతలికి వెళ్ళాడు. ఆమె యింట్లో వుంది. ఆమె వీపు ఒలేనిన్ కేసి వుంది. ఆమె సిగ్గుపడుతోందని అనుకున్నాడు ఒలేనిన్.

''మర్యాంకా'' పిలిచాడతను. ''మర్యాంకా, నేను లోపలికి రానా?''

ఆమె తటాల్న తిరిగింది. ఆమె కళ్ళలో కనిపించీ కనిపించని కన్నీటి

జాడ వుంది. ఆ విచారంలో కూడా ఆమె ముఖం అందంగా వుంది. ఆమె అతనికేసి నిశ్శబ్దపు తీవితో చూసింది.

ఒలేనిన్ మళ్ళీ అన్నాడు: "మర్యాంకా, నేను వచ్చి...."

"మా మానాన మమ్మల్ని వదిలిపెట్టండి!" అందామె. ఆమె వదనం మారలేదు, కాని చెంపలమీదనుంచి కన్నీళ్లు జారిపోయాయి.

"దేనికి యేడుస్తున్నావ్? యేమిటిది?"

"యేమిటిదా?" ఆమె కటువైన గొంతుకతో రెట్టించింది. "మా కోసక్కుల్ని చంపేసారు. అదే యేమిట్నిందీని."

"లుకాష్కాయేనా?" అన్నాడు ఒలేనిన్.

"వెళ్ళిపొండి! యేం కావాలి మీకు?"

"మర్యాంకా!" అన్నాడు ఒలేనిన్, ఆమెని సమీపిస్తూ.

"నానుంచి యెన్నటికీ మీరేమీ పొందలేరు!"

"మర్యాంకా, అలా అనొద్దు" ఒలేనిన్ ప్రాధేయపడ్డాడు.

"అవతలికి పొండి. మీరంటే నాకు అసహ్యం!" అరిచిందా పిల్ల, కాలితో నేలమీద కొడుతూ. అతనికేసి బెదిరిస్తూ వెళ్ళింది. ఆమె ముఖంలో యెంతటి అసహ్యం, ఘృణీకారం, కోపం వ్యక్తం అయాయంటే ఒలేనిన్ తనకిక ఆశలేదని తటాల్న గ్రహించాడు. ఆమెని మొదటిసారి చూసినప్పుడు ఆమె దుర్లభమైందని తనకి కలిగిన భావన పూర్తిగా నిజమనీ అర్థమైంది.

ఒలేనిన్ యింకేం మాట్లాడలేదు, కాని యింట్లోంచి బయటికి వెళ్లిపోయాడు.

## 42

యింటికి తిరిగి వచ్చింతర్వాత రెండు గంటలు కదలకుండా పక్క మీద పడుకున్నాడు. అప్పుడు పటాలం కమాండర్ దగ్గరికి వెళ్లి సిబ్బందితో చేరడానికి అనుమతి తీసుకున్నాడు. తన యింటాయనతో

పద్దులు పరిష్కారం చేసుకురమ్మని వన్యూషని పంపి, యెవరి దగ్గరా సెలవు తీసుకోకుండానే అతని పటాలం బస చేసిన దుర్గం దగ్గరికి పోవడానికి సన్నాహాలు చేసుకున్నాడు. అతన్ని సాగనంపడానికి వచ్చింది ఒక్క యెరోష్కా మామే. వాళ్లు ఒక సారి తాగారు, రెండో సారి తాగారు, మళ్లీ యింకో సారి తాగారు. మళ్లీ మాస్కోనుంచి తను వచ్చేసిన నాటి రాత్రి లాగానే మూడు గుర్రాల బండి వాకిలి దగ్గర నిరీక్షిస్తూ వుంది. అప్పటిలాగా ఒలేనిన్ తనలో తాను తర్కించుకో లేదు. యిక్కడ తను అనుకున్నదీ చేసిందీ ''అది కాదు'' అనుకోలేదు. మళ్లీ ఒక కొత్త జీవితానికి ఆశా పెట్టుకోలేదు. యెన్నడూ లేనంత అధికంగా మర్యాంకాని అతను ప్రేమించాడు. ఆమె తనని యెన్నటికీ ప్రేమించదని తెలుసుకున్నాడు.

''మంచిది, సెలవ్, నాయనా!'' అన్నాడు యెరోష్కా మామ. ''నువ్వు దండయాత్రకి వెళ్లినప్పుడు పెద్దవాళ్లు దగ్గర పెట్టుకో, నా మాటలు విను – ముసలాడి మాటలు. దాడిలో వున్నప్పుడు గాని, అలాంటప్పుడు గాని (నీకు తెలుసుగదా నేను ముసలి పీనుగనని, నాలుగూ చూసినవాణ్ణి) వాళ్లు కాల్పులు మొదలెడితే చాలా మంది వున్న గుంపులోకి పోకు. మీరున్నారేం, మీకు భయం కలిగిందీ అంటే మూకుమ్మడిగా యింకా దగ్గరై పోవాలని చూస్తారు. యెంత యెక్కువ మంది వుంటే, అంత సంబరం అని మీరనుకుంటారు. కాని అక్కడ్నే వుంది దరిద్రమంతా! వాళ్లెప్పుడూ సమూహంకేసి గురిపెడతారు. నేనున్నానా, నేనెప్పుడూ మిగతా వాళ్లనుంచి దూరం పోయేవాణ్ణి. ఒఖ్ఖణ్ణే వెళ్లేవాణ్ణి. నేనెప్పుడూ గాయపడలేదు. అయినా జీవితంలో యెన్ని చిత్రాలు చూశాను!''

''కాని నీ వీపుమీద తుపాకీ గుండు పడిందిగా'' అన్నాడు వన్యూష గది ఖాళీచేస్తూ.

''అది ఆ కోసక్కుల వేళాకోళం'' అన్నాడు యెరోష్కా.

''కోసక్కులా? అదేమిటి?'' అడిగాడు ఒలేనిన్.

''ఓ, అదా! మేం ఒక సారి తాగుతున్నాం. ఓ కోసక్ వాంక సీత్కిన్‌కి హుషారెక్కింది. అంతే మరి, ధన్! పిస్తోలుతోటి నాకొకటి పడేశాడు, సరిగ్గా యిక్కడ.''

''అరె, దెబ్బ తగల్లా?'' అడిగాడు ఒలేనిన్. ''వన్యూషా, త్వరగా తెమల్చాలి మరి'' అన్నాడింకా.

''తొందరేంటి? నన్ను చెప్పనీ దాని గురించి.... వాడలా నన్ను ధన్‌మని కొట్టేటప్పటికి, ఆ గుండు యెముకని విరగ్గొట్ట లేదు, చిక్కుకుంది. అంచేత నేనన్నాను: 'నన్ను చంపేవ్, తమ్ముడూ. యేం చేశావ్, హే? కాని నిన్ను పోనివ్వను! నువ్వు నాకో కడవ యిప్పించాల్సిందే!''

''సర్లే, దెబ్బ తగల్లేదా?'' ఒలేనిన్ మళ్లీ అడిగాడు, సరిగా ఆ కథ వినకుండానే.

''యెహే, నన్ను చెప్పనీ. వాడో కడవ యిచ్చాడు; అది తాగాం. కాని రక్తం కారిపోతూనే వుంది. గది అంతా రక్తం చిందిపోయింది. అప్పుడు తాత బుర్లాక్ అన్నాడు: 'యీడు దసువు చాలిస్తాడు. ఓ సీసా తియ్యటి వైన్ యిప్పించు, లేకపోతే నిన్ను అప్పగించేస్తాం!' దాంతోటి వాళ్లింకా సరుకు తెచ్చారు. మేం తాగీ తాగీ – ''

''కానీ పెద్ద దెబ్బ తగిలిందా?'' ఒలేనిన్ మళ్లీ అడిగాడు.

''దెబ్బా! అడ్డం రాకు, నాకిష్టం వుండదు. నన్ను చెప్పనీ. తెల్లవారేదాకా తాగీ తాగీ తాగుతూనే వున్నాం. నేను పొయ్యిమీదెక్కి పడుకున్నాను, చెడతాగేసి. పొద్దున్నే లేచి చూద్దును కదా నిటారుగా నిలబడ్లేకపోయాను – ''

''యెక్కువ నెప్పిగా వుందుండా?'' రెట్టించాడు ఒలేనిన్, తన ప్రశ్నకి ఆఖరికి జవాబు వస్తుందని అనుకుంటూ.

‘‘నెప్పిగా వుందన్నానా? నెప్పి వుందని అనలేదు, కాని నిటారుగా నిలబడలేకపోయాను, నడవలేకపోయాను.’’

‘‘ఆఁ! అయితే మానిపోయిందన్న మాట?’’ అన్నాడు ఒలేనిన్. అతను నవ్వలేనంత విచారంగా వున్నాడు.

‘‘అది మానిపోయింది. కాని గుండు వుంది యింకా. యిదిగో తడిమి చూడు!’’ చొక్కా యెత్తి బలిష్ఠమైన వీపుని చూపించాడు. అక్కడ యెముక దగ్గరసా ఓ గుండు చేతికి తగులుతుంది.

‘‘చూడు యెలా దొర్లుతుందో’’ అన్నాడతను, ఆ గుండుతోటి ఆటవస్తువులో లాగా ఆడుకుని ముచ్చటపడుతూ. ‘‘చూడు యిప్పుడు వెనక వుంది.’’

‘‘మరి లుకాష్కా, అతనికి నయమవుతుందా?’’ అడిగాడు ఒలేనిన్.

‘‘దేవుడికి తెలియాలి! వైద్యుడు లేడు. డాక్టరు కోసం వెళ్లారు.’’

‘‘యెక్కణ్ణుంచి తీసుకొస్తారు? గ్రోజ్నియానుంచా?’’ అడిగాడు ఒలేనిన్.

‘‘లేదు, నాయనా, నేనే జార్నైవుంటే మీ రష్యన్ డాక్టర్ల నందర్నీ యెప్పుడో ఉరితీయించేసి వుండేవాణ్ణి. కొయ్యడమే వాళ్లకి తెలిసిందంతా! మా కోసక్ బక్లాషెవ్ వున్నాడు; వాడింక మనిషి కాడు, వాడి కాలు తీసేసారు! అంటే వాళ్లు వెధవలని తెలుస్తోంది! బక్లాషెవ్ దేనికి పనికొస్తాడిప్పుడు? లేదు, నాయనా, కొండల్లో వున్నారు అసలు డాక్టర్లు. నా మిత్రుడొకడుండే వాడు, గిర్చిక్ అని. అతనికి దండ యాత్రలో ఛాతీమీద, అంటే యిక్కడ గాయమైంది. యేం, మీ డాక్టర్లు ఆశ వదిలేసుకున్నారు. కాని కొండల్లోనుంచి ఒకడొచ్చాడు, అతనికి నయం చేశాడు! వాళ్లకి ఓషధులు తెలుసు, నాయనా!’’

‘‘ఆపు, చెత్తంతా’’ అన్నాడు ఒలేనిన్. ‘‘కేంద్ర కార్యాలయంనుంచి నేను డాక్టర్ని పంపడం మంచిదేమో.’’

‘‘చెత్తా!’’ అన్నాడు ముసలాడు అనుకరించి వెక్కిరిస్తూ. ‘‘తెలివి

తక్కువవాడా, తెలివి తక్కువవాడా! చెత్త! నువ్వు డాక్టర్ని పంపు తావు! — మీ వాళ్ళు నయం చెయ్యగలిగితే, కోసక్కులూ, చెచెన్లూ వైద్యం కోసం మీ దగ్గరికే వచ్చేవాళ్ళు. కాని జరిగేది యేమిటంటే మీ ఆఫీసర్లూ, కల్నల్లూ కొండల్లోకి పంపుతారు డాక్టర్ల కోసం. మీ వాళ్ళంతా దగాకోర్లు, దగాకోర్లు.''

ఒలేనిన్ జవాబివ్వలేదు. అతను అనుమానం లేకుండా ఒప్పు కున్నాడు. తను గతంలో బతికేండీ, యిప్పుడు తిరిగి వెళ్ళేదీ అయిన ఆ ప్రపంచంలో అంతా దగాయే.

''లుకాష్క యెలా వున్నాడు? నువ్వు చూడ్డానికి వెళ్ళావా?'' అడిగాడతను.

''చచ్చిపోయినట్టు పడివున్నాడు. తినడు, తాగడు. వోడ్కా ఒక్కటే తాగుతాడు. కాని వోడ్కా తాగినంత కాలం ఫరవాలేదు. ఆ కుర్రాణ్ణి పోగొట్టుకోవడం నాకు బాధగా వుంటుంది. ధైర్యమైన కుర్రాడు — సాహసికుడు, నాలాగా. నేనూ ఓ సారి అలాగే చచ్చిపోతూ వున్నాను. ముసలమ్మలు అప్పుడే శోకన్నాలు తీసేశారు. నా తల నిప్పుల్లో వున్న ట్టుంది. నన్ను దేవుడి బొమ్మందగ్గర పెట్టేశారు కూడానూ. అలా పడి వున్నాను. నాపైన పొయ్యిమీద కూర్చుని చిన్న డోలు కొట్టేవాళ్ళు, యింతకంటే పెద్దగా లేదు, డప్పులు కొట్టేశారు. నేను వాళ్ళకేసి అరిచాను, వాళ్ళింకా గట్టిగా కొట్టేరు.'' (ఆ ముసలాడు నవ్వాడు) ''ఆడాళ్ళు పురోహితుణ్ణి తీసుకువచ్చారు. నన్ను పూడ్చెయ్యడానికి తయార వుతున్నారు వాళ్ళు. వాళ్ళన్నారు 'యితను క్షుద్రమైన విశ్వాసరహితుల్తో కలిసి అపవిత్రం అయిపోయాడు; ఆడాళ్లతో తిరిగాడు; మనుష్యుల్ని చంపేడు; ఉపవాసం వుండలేదు; బాలలైకా వాయించేవాడు. నీ పాప నివేదనం చేసుకో' అని. అంచేత నేను పాప నివేదనం మొదలెట్టాను. 'నేను పాపంచేశాను' అన్నాను. పురోహితుడేం చెప్పినా గానీ అదే జవాబి చ్చాను, 'నేను పాపం చేశాను.' నా బాలలైకా గురించి అడగడం

మొదలెట్టాడు. 'యేదీ ఆ శనిగొట్టు వాయిద్యం?' అడుగుతాడతను. 'నాకు చూపించి విరగ్గొట్టెయ్యి.' 'కాని నా దగ్గర లేదు,' అన్నాను నేను. దాన్ని నేనే అవతలి యింట్లో ఒక వలలో దాచేశాను. దాన్ని కని పెట్టడం వాళ్లవల్ల కాదని నాకు తెలుసు. అంచేత వాళ్ళు నన్ను వదిలేశారు. అంతా చేసి నేను గండం గడిచి బయటపడ్డాను. అప్పుడు మళ్లీ నా బాలలైకా అందుకున్నాను — ఆఁ, యేమిటీ చెబుతున్నానూ?''

అతను కొనసాగించాడు. ''నే చెప్పింది విను. మిగతా వాళ్లనుంచి దూరంగా వుండు, లేకపోతే నువ్వు వట్టి పుణ్యానికి చచ్చిపోతావు. నువ్వంటే నాకు యిది, అదీ సంగతి. నువ్వు తాగేవాడివి — నువ్వంటే నా కిష్టం! నీలాటి వాళ్లు గుట్టలమీదకి స్వారీ చేసుకుపోవాలంటే యిష్ట పడతారు. యిక్కడో హదుండేవాడు, రష్యానుంచి వచ్చాడు. అతగాడు అస్తమానూ గుట్టమీదికి పోవడమే — వాటిని 'చిన్న కొండలు' అని పిలిచేవాడు. లేకపోతే అలాంటి దేదో చిత్రమైన పేరు. యెప్పుడు గుట్ట కనిపించినా పైకెక్కేసేవాడు. ఓ సారి అలా పైకంటా గుర్రంమీద వెళ్లిపోయాడు. మహా ముచ్చట పడిపోయాడ్లే, కాని ఓ చెచెన్ అతన్ని కాల్చి చంపేశాడు! తుపాకీ కుదురునుండి యెంత బాగా కాలుస్తారు వాళ్ళు, ఆ చెచెన్లు! వాళ్లలో కొంతమంది నా కంటే బాగా గురి చూసి కొడతారు. యెవడేనా అలా నిష్కారణంగా చచ్చిపోవడం నా కిష్టం వుండదు. ఒకో సారి మీ సైనికులకేసి చూసి ఆశ్చర్యపడే వాణ్ణి. యేం తెలివితక్కువతనం మీకు! అలా పోతూ వుంటారు, పాపం వెర్రి వాళ్ళు, అంత గుంపుగా. కోట్లకి యెర్రటి మెడపట్టీ కూడా కట్టుకుంటారు! దెబ్బ తగలకుండా యెలా వుంటుంది! ఒకడు ఛస్తాడు వాణ్ణి పక్కకి లాగేస్తాడు, యింకోడొస్తాడు అక్కడికి! యేం తెలివితక్కువతనం!'' తల వంకేస్తూ ఆ ముసలాడు రెట్టించాడు. ''చెదిరిపోయి ఒకొక్కళ్లే వెళ్లకూడదూ? మీరు అలా వెళ్లండి, వాళ్ళు మిమ్మల్ని కొట్టలేరు. అది మీరు చెయ్యాల్సింది!''

“మంచిది, వుంటా. సెలవ్ మామా, దేవుడు దయ తలిస్తే మళ్లీ కలుద్దాం” అన్నాడు ఒలేనిన్, లేచి నడవలోకి వస్తూ.

నేలమీద కూర్చున్న ఆ ముసలాడు లేవలేదు.

“అదేనా సెలవు చెప్పే పద్ధతి? వెర్రివాడా, వెర్రివాడా!” అరవసాగాడు మొదలెట్టాడు. “అయ్యోరామా, మనుషులకేం దాపురించింది! మనం స్నేహంగా వున్నాం, దగ్గర దగ్గర ఓ యేడాది స్నేహంగా వున్నాం. యిప్పుడు సెలవ్ అని అలా వెళ్లిపోతాడు! యేముందీ నాకు నువ్వంటే యిష్టం. నువ్వంటే నా కెంత జాలి! నువ్వు యెంత దిక్కుమాలిన పక్షిలా యెప్పుడూ ఒంటరిగా వున్నావు. యెవరూ నిన్ను ప్రేమిస్తున్నట్టు లేదు. ఒకో అప్పుడు నాకు నిద్రపట్టదు నీ గురించి ఆలోచిస్తూ వుంటే. నువ్వంటే నాకు బాధ. ఆ పాటలో అన్నట్టు!

యిది చాలా కష్టం సోదరా,
పరాయి దేశంలో బతకడం!

నీ విషయంలోనూ అంతే.”

“సరే, సెలవ్” అన్నాడు ఒలేనిన్ మళ్లీ.

ఆ ముసలాడు నుంచుని చెయ్యి చాచాడు. ఒలేనిన్ దాన్ని ఒత్తి, వెళ్లిపోడానికి వెనక్కి తిరిగాడు.

“యేదీ, నీ మొహం, యిలా!” ఆ ముసలాడు ఒలేనిన్ తలని రెండు బలిష్ఠమైన చేతుల్తోటే పట్టుకుని మూడు సార్లు తన తడి పెదాల్తోటి, మీసాల్తోటే ముద్దుపెట్టుకున్నాడు. యేడవడం మొదలెట్టాడు.

“నేను నిన్ను ప్రేమిస్తున్నాను, సెలవ్!”

ఒలేనిన్ మజిలీ బండిలోకి యెక్కాడు.

“సరే, అలాగేనా నువ్వు పోవడం? నిన్ను జ్ఞాపకం వుంచుకోడానికి నాకేదేనా యియ్యి. ఓ తుపాకీ యియ్యి! నీకు రెండెందుకు?” అన్నాడు ముసలాడు, నిష్కపటంగానే వెక్కుతూ.

ఒలేనిన్ ఓ తుపాకీ తీసి అతని కిచ్చాడు.

''ఆ ముసలాడికి యెన్నిచ్చేరు!'' గొణిగాడు వన్యూష. ''వాడికెప్పుడూ సంతుష్టి లేదు. అసలైన ముసలి బిచ్చగాడు. వాళ్లంతా అంతే, వంకర మనుషులు'' అన్నాడతను ఓవర్ కోటు కప్పుకుంటూ, బండిలో తన చోట్లో కూర్చుంటూ.

''నోర్ముయ్యెహే, పందీ!'' అరిచాడు ముసలాడు నవ్వుతూ. ''యేం పిసినారి మనిషి!''

మర్యాంకా దూళ్లశాలలోనుంచి యివతలికి వచ్చింది. ఉదాసీనంగా బండికేసి చూసింది. వందనం చేస్తున్నట్టు వంగి, యింటికేసి వెళ్లింది.

''లాఫీల్!''* అన్నాడు వన్యూష కన్ను గీటుతూ. వెకిలిగా పగలబడి నవ్వాడు.

''పోనీయ్!'' ఒలేనిన్ కోపంగా అరిచాడు.

''సెలవ్, నాయనా, సెలవ్! నిన్ను మర్చిపోను'' యెరోష్క అరిచాడు.

ఒలేనిన్ వెనక్కి చూశాడు. యెరోష్క మామ మర్యాంకాతో మాట్లాడుతున్నాడు, స్పష్టంగా అతని విషయాల గురించే. ఆ ముసలాడుగాని, మర్యాంకాగాని ఒలేనిన్‌కేసి చూళ్లేదు.

---

* ఆడది (ఫ్రెంచి). — సం.

## పాఠకులకు మనవి

ఈ పుస్తకాన్ని గురించిగానీ, దీని అనువాదాన్ని గురించిగానీ మీ అభిప్రాయాలనూ మీ సలహాలనూ మా భావిప్రచురణల సహాయార్థం మాకు పంపండి. మా చిరునామా:

Raduga Publishers
17, Zubovsky Boulevard
Moscow, USSR

కోసక్కులు: యిప్పటికీ ఆశ్విక నైపుణ్యానికీ, వీరత్వానికీ పేరుగాంచిన రష్యన్ తెగ. సచ్ఛిక మైదానాల్లో, రష్యన్ సామ్రాజ్య సరిహద్దుల్లో స్వేచ్ఛాయుత జీవితాన్ని కాంక్షించిన వాళ్ళు, జార్ చక్రవర్తుల నుంచి, తమ సరిహద్దు రక్షణ సేవలకి గుర్తింపుగా కొన్ని హక్కులు, ముఖ్యంగా స్వతంత్ర ప్రతిపత్తిని పొందిన వాళ్ళు. అప్పట్లో రష్యా సరిహద్దు కాకసస్‌లో వుండేవాళ్ళు.

టాల్‌స్టాయ్ కాకసస్‌లోని ఒక కోసక్ గ్రామంలో జీవించి కొన్ని సైనిక దండయాత్రల్లో పాల్గొన్నాడు. ఈ అనుభవం తను రచించిన "కోసక్కులు" నవలలో ప్రతిబింబించింది. ఈ నవలను ఆయన పదేళ్ళ (1853–1862) రాశాడు. దానిలో మనిషి నిజమైన విలువను గురించీ, సామాన్య ప్రజల జీవితపు సౌందర్యమూ నిర్మలినత్వమూ గురించీ కవితాత్మకంగా చిత్రించాడు. కులీన సమాజపు అసత్యపూరితమైన, వంచనాత్మక జీవితాన్ని విమర్శించాడు. నవలా నాయకుడు ఒలేనిన్‌లో టాల్‌స్టాయ్ యీ తన మనోభావాల్ని రసవత్తరంగా రంగరించాడు.